# నివేదిక.

తతి రామకథాసుధామృతమునఁ, దృతీయమగు సంపుటంబి ♦ దియు నోఁగి ముద్రా
పితమయ్యె దీనసస్కృ, త్ప్రాప్రాసుల చిత్తములకుఁ ♦ దృప్తి కలుగుతఁగ.

కాలస్థితిఁ బట్టియునే, నీలో నొనరించినట్టి ♦ ఋణమట్లులుంటఁగ
నాలుగవ సంపుటమ్మున, కాలస్యమ్మగును నాలు ♦ గైదు నెలలోఁగఁ.

మీఁతఁకేఁదోడ్పడి మొదమని, నాతరమునఁ దప్పకున్న ♦ నరవరులను నే
నీతూరి సంపుటమ్మున, ఖ్యాతుల నొనరింతు విడుతు ♦ నవముల గోడవల్.

సత్యప్రతిజ్ఞుఁడనయని, యత్యయమేనాఁడు లేని ♦ యచ్చటు జేరఁగ
బ్రీత్యయమున మెట్టుకుమ, పత్యముఁగనినట్టి ఫలముఁ ♦ బడయుము తండ్రీ.

కృతిపతి పరమేశానుఁడు, కృతివర్ణితయశులు జాన ♦ కీరఘునాథుల్
కృతిహేతువులలశివులుం, గృతికర్తజనకుఁ సునన్నుఁ ♦ గృతిఁ జేయరెటుల్.

ఇట్లు,
తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రి.

ఆదిమకాండమంతమగు నంతకు నెంత నొసంగె సంబున
స్మోదగు భాతి కాకృతియ నేత్రిసువర్వ మొనర్చుచుండ నీ
మీఁదటి కాండముల్భవద మేయశరీరము భావబద్ధమ
ర్యాదముఁ జూపునింకఁ గృత రామకథా౽మృత సద్గురూత్తమా.

శిష్యుఁడు,
పరిమి వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి,
చందవోలు.

శ్రీ శివాయగురవేనమః

# విషయసూచిక.

# ప్ర క ట న.

—o—

## శ్రీరామకథా౽మృతగ్రంథమాల.

ఇందు శ్రీరామకథా౽మృతమను గ్రంథరాజము ప్రధానమగుట దీనికీనామధేయముకలిగెను. తద్గ్రంథరాజము వాల్మీకి రామాయణమెల్ల గ్రహించి యధ్యాత్మ రామాయణానుసరణమున శ్రీరామునియందుఁ బరతత్త్వమును సమర్థించుచు భక్త్యావేశము శ్రావక శ్రోతృజనంబులకు మిగులనుట్టిపడ ప్రాచీనకవిస్వాభావికశైలిఁ బ్రణయింపఁబడియె. నయ్యది ప్రశస్తములైన పత్రములమీఁద ముద్రించి యైదు సంపుటములుగ నేర్పరుపఁబడుచున్నది.

ఆగ్రంథముతోఁడ మఱికొన్ని తత్కవికృతములగు కృతులును నిఁకఁగొన్ని తత్పుత్ర విరచితములును మొత్తము పదిపొత్తము లీగ్రంథమాలయందు వెలువడును.

ఇరువదిరూప్యములు గ్రంథదిదృక్షచేఁగాని గ్రంథోద్ధరణబుద్ధిచేఁగాని సమర్పించువారలకుఁ బైగ్రంథమాలయందు ముద్రితములగు పొత్తములెల్లఁ బ్రత్యర్పితములగును. కేవలప్రధానగ్రంథమును మాత్రమపేక్షించినఁ బదేనురూప్యములు మాగ్రంథమాలకు సాయమొనర్పవలయును. బుధులిద్దాని సంగ్రహించుకొనుట యందు సాదరులయ్యెదరుగాత.

వలయువారు :—

తాడేపల్లి బాలకోటీశ్వరశాస్త్రి.
చందవోలు,
గుంటూరు మండలి.

అనికాని —

తాడేపల్లి సత్యనారాయణశాస్త్రి,
నిడుబ్రోలు,
గుంటూరు మండలి.

అనికాని వ్రాయవలయును.

శ్రీ శివాయ గురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## అరణ్యకాండము.

---

### ప్రథమాశ్వాసము.

---



మద్బృహదారణ్యక
సీమామహిమాఢ్యమౌని ♦ సేవితపదవీ
భూమానందరసోజ్జ్వల
ధామాక్షరతత్త్వదీప! ♦ తాత్త్వికరూపా! ౧

ఆ॥ అవధరింపు మట్టు ♦ లానతి వేఁడంగఁ, గూర్పఁ దొడఁగెఁ బతియుఁ ♦ గూర్పు వచన
రచన ధాత్రిఁ దేనె ♦ రహిఁ రాముచరిత మూ, టించి మేలిరుచులఁ ♦ నించుచుండ.

క॥ మహిళావతంసమా విను, మహిరాజతనయాను చరిత ♦ మమృతభరిత మౌ
నహ మనుచు జరామృత్యువి, రహముం బొనరించు నమ్మి ♦ రహిఁ సేవింపన్. ౩

—♦ శ్రీరాముఁ డత్రిమునివల్ల సెలవుఁ గొనుట ♦—

ఉ॥ ఆమెయి నత్రిమౌనిమహి ♦ తాశ్రమసీమను నాఁటిరాత్రియున్
రామయుఁ దమ్ముఁడుం గొలువ ♦ రాముఁడు రాణ దలిర్ప నిల్చి సు
త్రామనుతుండు ముచ్చటలఁ దద్దయుఁ జేలుచు వారిఁ దేర్చుచున్
శేముషి వొంగ వేఁకువయుఁ ♦ జేరఁగ రాఁ గృతనిత్యకృత్యుఁడై. ౪

ఆ॥ సూర్యమండలమ్ము ♦ సొచ్చి వెల్వడు నట్టి
మేటితేజ మచటు ♦ మేల్మి నూప
వింత యగుచు నెగడు ♦ విధ మెఱింగిరి వారు
బ్రాహ్మలక్ష్మి యనుచుఁ ♦ బ్రథితవిభవ

—♦ రాముఁడు తాపసాశ్రమముఁ బ్రవేశించుట ♦—

సీ॥ ఆశ్రావయ ముఖోక్త ♦ లభ్యాస మొనరించి, పలుకు శుకాదుల ♦ పలుకుబడులు
నిత్యసేవాగతా ♦ నిమిషాంగనాబృంద, మంగళగీతికా ♦ మంజిమములు
బలిహోమసంప్రీతి ♦ పన్నయాజకక్లృప్త, సామవాదాత్మప్ర ♦ సాదనములు
స్వాధ్యాయగోష్ఠులఁ ♦ జర్చించు సద్బ్రహ్మ, చారుల బ్రహ్మఘో ♦ షప్రసక్తు
లొక్కమొగి శ్రవణానంద ♦ మొలయఁ జేయ
సత్యలోకంబె యిదియు ని ♦ స్సంశయముగ
ననుచు రాముఁడు ధనువు వి ♦ జ్యం బొనర్చి
యందుఁ జొరఁబాఱె నిత్యశు ♦ ద్ధాంతరంగ. ౧౮

ఆ॥ సర్వలోకభూత ♦ జాతశరణ్యాలు, కుశసమిత్ప్రశస్తి ♦ గుంభయుతలు
వేదవేదికాని ♦ విష్టలు సంమృష్ట, చత్వరలుగఁ ♦ బర్ణశాల లొప్పె. ౧౯

క॥ మ్రానికొనల నసియాడుచు, జానగు ఫలపుష్పములకుఁ ♦ జా టొనరింపన్
బూనినగతి యన కనియెడు, మానితవల్కలము లధిపు ♦ మలయించె నుమా!

క॥ వేర ముడిఁగి యొం డొంటిం, దోరముగాఁ బెరసి తిరుగు ♦ ధూర్తమృగపశు
స్వారసికతఁ గని మెచ్చిరి, ధీరతములు వార లిమ్ము ♦ తీ రని సుదతీ! ౨౧

క॥ అచటి తపస్స్వాధ్యాయ, ప్రచయం బయ్యజ్ఞమూర్తి ♦ భావంబున స
ర్వచరాచర సంతుష్టిం, బచరింపం జాలు ననఁగఁ ♦ బరఁగె సురాజ్ఞీ! ౨౨

క॥ మెచ్చుచు వార లెనయుచో, వచ్చిరి తాపసులు భాను ♦ వైశ్వానరభా
భ్యుచ్ఛ్రయులు తా రొనర్చిరి, హెచ్చుగఁ బాద్యాదికార్చ ♦ లిందునిభాస్యా!

ఆ॥ సకలలోకహితుఁడు ♦ సర్వాత్ముఁ డగు రాము
పాదపద్మములకుఁ ♦ బ్రణతు లగుచుఁ
బాపకోపములు ప్ర ♦ వర్తిఁ దజ్జలము గ్ర
హించి రెట్టిపదవి ♦ నెంచిరొక్కొ.. ౨౪

తే॥ ఆంతరజ్ఞానసంపన్ను ♦ లామహాత్ము, లాహరి పమభ్యుదితు విధు ♦ వట్లు సీత
[illegible] శేషభూతుఁగా ♦ లక్ష్మణునిఁ ద, లంచి సుప్రీతు లైరి వి ♦ రించివినుత.

ఆ॥ రూపసంహననని ♦ రూఢిసౌహార్దమా, ర్దవసుసౌమ్యవేష ♦ తలను రాము
నందుఁ గాంచి తపసు ♦ లాశ్చర్యరసమగ్ను, లైరి నిర్నిమేషు ♦ లయిరి సుదృశ!

క॥ అందఱుఁ గొని చని విడుదుల, యందు నిలిపి రామదేవు ♦ నభ్యంతరశా
లం దేవపీఠమున నిడి, ప్రహ్వముగ నిట్లనిరి మునులు ♦ పురుహూతనుతా! ౨౭

— ♦ మునులు శ్రీరాముని బూజించుట ♦ —

చ॥ ఇవె ఫలపుష్పమూలతతు ♦ లియ్యవె మేలికొలంకు లాకుటిం
డ్లివె యవె పుష్పవాటీరములు ♦ నీయవె యాశ్రమభూము లిన్నియున్
న్నవవిదితంబులే భువన ♦ నాయక! నీయవె కావె యొడ్లు మే
మవుదుమె భార మన్యులదె ♦ సాదరత న్మము నిచ్చ లోమఁగన్. ౨౮

ఆ॥ లోకు లెందు నృపులు ♦ లోకపాలాంశచే, నర్థిఁ బ్రోవ జన్మ ♦ మందువారు
లందు రంతెకాక ♦ యఖిలేశుఁడవ యిట్లు, జనన మంది తీవు ♦ జనశరణ్య!

క॥ గురుఁడవు దండధరుఁడ వీ, శ్వరుఁడవు నవు నీవు ధర్మపాలుఁడ వన నా
గరుఁడవుగా నేమి విపిన, చరుఁడవు గా నేమి సకల ♦ సంయమివంద్యా! ౩౦

క॥ పతి వీ వని నీదెస శా, సితి బలువిడి యొందు మఱచి ♦ జితకామక్రో
ధత గర్భభూతులమగా, గతి వేఱొకఁ డగునె మమ్ముఁ ♦ గావఁగ దేవా! ౩౧

తే॥ త్వద్విషయవాసులగు జను ♦ ల్తావకీను
లింతయును నీకు విషయంబ ♦ కొంత యునఁగ
నేల యస్మత్కృతార్చన ♦ లెనసి చూడ్కి
మాదెసఁ బొసంగ మమ్మేల్చు ♦ మనుపుమయ్య! ౩౨

మ॥ అనుచున్ గన్నుల హర్షపూర మొలుకన్ ♦ హాయిం గనం గంటి మం
చనవద్యోల్మను లమ్మహామహున క ♦ ర్ఘ్యార్చల్ ప్రసంగించి ర
వ్వనితారత్నముతో సహాదరునితో ♦ వా రిచ్చు సత్కారముల్
గొని మెచ్చె న్రఘురాముఁ డందఱ సుధా ♦ కల్యావిహారోచితా! 33

తే॥ అమ్మొయినిఁ బ్రీతిగృహము ప్రి ♦ త్యాశ్రమంబు
గాఁ గలుగుచోటు లన్నియుఁ ♦ గలయఁ గాంచి
యాదరం బొప్ప నవ్వారి ♦ కథయ మొసఁగి
నాఁటి కచ్చో నిలిచె లోక ♦ నాథుఁ డజిత!

ఉ॥ భానునిభుండు భానూదయ, మా నాలోకముఁ గాంచి ♦ యభ్యుదితమై [illegible]
శ్రీ నలరి కాల్యవిధుల, న్నానుగఁ బొనరించి ప్రాని ♦ మంజలి [illegible]

తే॥ వారి నామంత్రితులఁ జేసి ♦ వార లనుప
నమ్మహారణ్యమార్గమ్ము ♦ నధిగమించి
యనుజుఁ గనుఁగొని రాముఁ డి ♦ ట్లనెఁ దదీయ
గర్భమునఁ జొచ్చుతఱిఁ జిద్వి ♦ కాసమహిత ! ౩౬

మ॥ ఇది ఘోరం బెడయాని వృక్షములతో ♦ సింహామృగవ్యాఘ్రము
ఖ్యదురాసాద సమస్తజంతుతతితో ♦ గ్రవ్యాదనవ్యాధనం
సద నిస్సంవిధభావవర్తనలతో ♦ సన్మార్గగమ్యంబుగా
క దెస ల్గ్రమ్మి నిరాకరించెడు న్స ♦ ద్దార్గత్యైకమత్యంబునన్. ౩౭

ఆ॥ కాన దృఢవివేక ♦ మూని సంసృతి నట్లు, దీన మెలఁగవలయు ♦ దీప్తశరుల
మగుచు మనకు నడుమ ♦ నవనిజ జీవేశ్వ, రాంతరస్థమాయ ♦ యనఁ బొసంగ.

మ॥ అనిభాషించుచు సార్ధయోజనము వా ♦ రయ్యోజనం దిట్టలై
చని కల్హారఘనాబ్జోత్పలోత్పల వన ♦ చ్ఛాయాప్తిసుస్వాచ్ఛహం
సనిరాతంకరసాధ్య యౌ సరసి నో ♦ జం గాంచి కాంచీనితం
బనికాకాంచితచక్రసైకతతల ♦ ప్రాకామ్య మీక్షించుచున్. ౩౯

—♦ సీతారామ లక్ష్మణులకుఁ ద్రోవలో విరాధుఁ డగపడుట ♦—

ఆ॥ చేరనరిగి తారు ♦ తీరమ్మున జలావ, తార మొనసి శుద్ధ ♦ తమము జలముఁ
గ్రోలి తనిసి సమను♦కూలతరుచ్ఛాయ, మొనసి సేదఁ దేర్చు♦కొనుచు నుండ.

సీ॥ కొన్ని మానిసిపీనుఁ♦గుల గ్రుచ్చి యెత్తిన, పెనుశూల మొకఁ డంస♦మున నమర్చి
శార్దూలమహిషాది ♦ జంతుసంతానంబు, గుదిగూర్చికొని చేతి ♦ కొనకుఁ దార్చి
నమలి యుంచిన యాంత్ర♦నాళమ్ము మొత్తమ్ము, నుమియు నౌద్ధత్యప్ర♦యుక్తిఁ బేర్చి
దంష్ట్రల నొక యట్టఁ♦దాటించి రస మాని, తలయెమ్ములును బెడ♦తల వెలార్చి
మిత్తిపై మిత్తి యిది యన ♦ మేను పెంచి
యట్టహాసంబు లెడనెడ ♦ నొక లెడలఁ
జేయ ఖిడిగుబ్బిల్లు మిణుఁగురు ♦ లెసదర డాయ
వచ్చె నొక పెద్దరాకాసి ♦ వారి గోరి ! ౪౧

క॥ వానిఁ గని రామచంద్రుం, డానెఱిఁ దనయనుజుఁ గాంచి ♦ యన్నా ! యడె న్వ
ర్భానుభగిది నరుదెంచెడుఁ, దా వలతిం బోఁడు వీఁడు ♦ దాఁకెడుఁ బెలుచన్.

ఆ॥ ఎదిరిమీఁతె మెడద ♦ నిడు మనబోంట్లకుఁ, దప్ప దిట్టి కష్ట ♦ దశ లెయుకప్డుఁ
గపటు మెంచువారి ♦ గతిఁ దోఁ డగు విధి, యొప్పు నప్రమాద ♦ యుక్తి తమకు.

క॥ మెలఁకువ మెలఁగు మొకఁట నే, యలఁతం బాటింపకుము దు ♦ రంతుని వీనిం
బొలియించు నెటఁ దలఁపు మి, య్యిలానుతం జేర్పఁ బ్రోవ ♦ నేమఱకు మిఁక౯.

క॥ అని జనకనందినిం గని, యనఘమతీ! నీవుఁగల్క ♦ మందక నిలువం
జను నన లక్ష్మణుఁ డిట్లనె, మనువంశభవప్రధాన ♦ మణితో రమణీ!

ఆ॥ అన్న! తలఁకు గలదె ♦ యానాఁటి కోపంబు, దానుకుచున్న దివుడు ♦ దోసఁగువీని
పైని నున్నయంత ♦ పరఁగించువాఁడ నీ, తగినప్రాభవమునఁ ♦ దారసిలుము.

—♦ శ్రీరామ విరాధ సంవాదము ♦—

మ॥ అనుచుం డా వారెదిరింప నున్నతఱి వాఁ ♦ డామృత్యు వామాంసభో
జనుఁ డాచెట్ట యుగాంతభైరవసమ ♦ స్యం బ్రోద్ధతారావగుం
భనవోల్లాసము భీషణంబుగఁ దనర్పం ♦ దోన త్రోఁ తెంచి యి
ట్లనె రామాధిపుఁ గాంచి పిల్చనఁ గలా ♦ వ్యాసంగవశ్యాత్ముకా! ౪౭

ఆ॥ మీర లెవ్వ రేమి ♦ మెయి నిట్టు లిక్కనఁ, జొచ్చినార లింత ♦ సొబగుకాంత
కాలమృత్యు విచటఁ ♦ గాన్పించె నీకఁ దల, దాఁచికొనఁగఁ దగిన ♦ తావు గలదె.

ఉ॥ నాతి రొకర్తుతో నడుమ ♦ నారలచీరెలు గట్టి పెంజడల్
బ్రాఁతిగఁ జుట్టి వి ల్లొకఁడు ♦ పట్టకపట్టి యరణ్యసీమల
న్నీతిమె యిట్లు నెట్టుటయు ♦ నేస్త మొకించుక జీవితేచ్ఛతో
నేతఱిఁ గల్గదో వెడఁగు ♦ లిప్పటి కైతిరొ మాట లేటికి౯. ౪౮

క॥ మెత్తని కబళము లీకిరియు, హత్తించిన విధిన పొగడ ♦ నగు నా కిఁక మీ
రిత్తరుణి నొసఁగి పోదురొ, యిత్తురొ మీ దేహములను ♦ రహి న్మొత్తముగ౯.

ఆ॥ తెలుపుఁ డనిన నిట్టి ♦ తెఱవు తెక్కలికాఁడ, వెవఁడ వోరి! నోటి ♦ కెక్కగాని
కాఱు లఱచెదవు వి ♦ కారమ్ము లిన్నియుం, జక్కపఱుతు నింక ♦ జక్కనిలుము.

ఆ॥ భానువంశజులము ♦ పఙ్క్తిరథాత్మజ, న్మలము తండ్రి యాజ్ఞ ♦ మునులు కోర
నిన్నుఁబోఁటివారి ♦ నేలకుఁ గూలకుఁ, జేర నిచటు ద్రొక్కి ♦ నార మనిన. ౫౨

క॥ రాముని మినుకుల కులుకుచు, నేమేమీ యింతపనికి ♦ నీ రరుజేరం
గామితములు నెరవేరవె, పా మలుకు నె కప్ప నోటి ♦ పలుకుబడులకు౯. ౫౩

క॥ పేరు విరాధుం డందురు, నేర మనక మునిజనముల ♦ నెత్తురుగోలం
గా రావు లేక మెలఁగెద, గారాముఁ గన్నవారి ♦ కలిమి వెలయఁగ౯. ౫౪

తే॥ అశతకరిద జనని జ ♦ యాహ్వయుండు, జనకుఁ డే బ్రహ్మవరశక్తిఁ ♦ జాత్రు లేని
వాఁడనై వాడవాడల ♦ వరుసఁ బెట్టి, తిరుగుచున్నాఁడ బలయుక్తి ♦ కేటవడఁగ.

క॥ మున్నే తెలిపితి వినరో, కన్నియ నిడి చనుఁ డటంచుఁ ♦ గాదన కేలా
తిన్నని నుడు లాడఁగఁ దన, కిన్నేలఁ దేఁ గొనంగ ననుచు ♦ నెత్తిన కినుకన్. ౨౬

ఆ॥ కువలయాక్షి నొడిచి ♦ కొని పోవ నుంకింప, నామె చెదరి కురరి ♦ యట్లు లుంగు
సూప రాముఁ డడరి ♦ సునిశితశరములు, గ్రొచ్చె వాని మేను ♦ గ్రచ్చి చనఁగ.

—♦ రామలక్ష్మణులు విరాధునితోఁ బోరుట ♦—

ఉ॥ దానికిఁ గోపగించి వసు ♦ ధాసుత డించి విదీర్ణజంతు సం
తానవసాంత్రనాల ముప ♦ దంశితమానికపాల మగ్ర సం
దానితవైరివీరజన ♦ తాశవజాలము శూల మెత్తి య
ద్దానవుఁ డేగుదెంచె హరిఁ ♦ దాఁకి జయించెద నంచు నుగ్రతన్. ౨౮

క॥ దాశరథు లిరువు రాదు, ష్టాశరు తలఁ బరసి కదిసె ♦ నంతకుఁ డని శా
తాశుగముల ముంచి రనీ, కాశప్రతిభావిశేష ♦ కలన దలిర్పన్. ౨౯

క॥ జృంభించిన వాని సమా, రంభంబున మేన నుండి ♦ రాలెఁ దెరలి యా
దంభమున దైత్యుచే టనఁ, గుంభినిఁ బడు నుల్క లనఁగఁ ♦ గొనకొని ములుకుల్.

ఆ॥ అస్త్రవిదుఁడు రాముఁ ♦ డయ్యోగడం బెంచి, బాణయుగ్మమున వి ♦ భాసురమున
నసుర చేతి శూల ♦ మాఱడివోవ ఖం, డించి వైచె సురలు ♦ మించి పొగడ.

ఆ॥ కులిశసార మదియుఁ ♦ గూలె వజ్రాహత, మైన మేరుశిఖర ♦ మట్లు వహ్ని
కీల లాకసమున ♦ గిరికొని తోఁట్తోన, వ్రాలఁ బుడమి పైన ♦ రాలకేశి. ౩౨

—♦ విరాధుండు రామలక్ష్మణుల నెత్తికొని పోవుట ♦—

క॥ తెరలక పై కుఱికెడు నా, సురు బాహుల గ్రొచ్చి రంత ♦ సొలయక వాఁ డ
య్యిరువుర మూఁపున నిడికొని, సరభసుఁడై పఱచె నబ్జ ♦ జాతసమర్చ్యా!

ఆ॥ సీత చెన్ను దొఱఁగి ♦ జేజేలకును మ్రొక్కి, దొడరి దనుజనాథ! ♦ విడువు మనుచు
వేఁడె వాని మోడి ♦ పీడ కవ్వారిఁ గొం, పోవుచుండె వాఁడు ♦ పుణ్యచరిత! ౩౪

క॥ ఓడకు మిదె మే లని సై, దోడున కెఱఁగించి విభుఁడు ♦ ధూర్తుని భుజ మ
ప్డూడఁ బొడిచె ఖడ్గంబునఁ, దోడన జో డడఁచె నొండు ♦ దొలఁగ సుశీలా!

ఆ॥ పుడమి నిలిచి రంతఁ ♦ బోక వాఁ డడరి రా, నఱికె నొక్కదొడ్డ ♦ నారసమునఁ
దత్పదద్వయమ్ము ♦ దయితుండు భూజయు, సురలు భువిని దివినిఁ ♦ జొక్క పొగడ.

క॥ జాలు నులియ వాఁ డవనిం, గూలియుఁ బొలియకయ గొండ ♦ గుహఁ బోలిన నో
రాలలితుల మ్రింగ నెటో, పోలు ననుచుఁ దెఱచి సెలఁ ♦ [illegible]

ఆ॥ వీఁ డవధ్యుఁ డనుచు ♦ విశ్వాత్ముఁ డవ్వానిఁ, గాలఁ జేత నులుమ ♦ గా సుమిత్ర
పుత్త్రుఁ డట్లు చేయఁ ♦ బొలిసియుఁ బొలియంగఁ, బోక వదరుచుండ ♦ బుద్ధిఁ దలఁచి.

—♦ రామలక్ష్మణులు విరాధుని గర్తమునఁ బూడ్చుట ♦—

క॥ మెడఁ ద్రొక్కి కంఠనాళము, వెడలించుచు గర్త మిప్పు ♦ డే త్రవ్వినఁ బోఁ
బడ నైతు ననిన ననుజుఁడు. కడునిడు పగు నొక్క కంద ♦ కం బొనరించెన్. ౧౯

క॥ అం దారక్కసు మే నిడి. పొందామరబొడ్డువేల్పు ♦ పూరించె శిలల్
పొందించె లక్ష్మణుం డట, బృందారకకుసుమవృష్టి ♦ పెనుపొందఁ జెలీ! ౨౦

ఆ॥ సీత చేర వచ్చి ♦ చేచేత మగని నె, మ్మేను నిమిరి వక్ష ♦ మూన బిగ్గఁ
గౌఁగిలించి మఱఁదిఁ ♦ గాఁగలవాఁడవ, పో యటంచుఁ బొగడెఁ ♦ బుష్పగంధి!

—♦ విరాధుండు దివ్యపురుషుఁడై రాముని వినుతించుట ♦—

క॥ ఆదనుజు మేను వెలువడి, యాదటఁ బలుతేజ మొక్క ♦ యంబరచరుఁడై
మోద ముదంచితముగ సీ, తాదయితుం జేరి నిలిచెఁ ♦ దాత్పర్యమునన్, ౨౨

క॥ అంబరమణి డంబు విభూ, షాంబరముల యింబు సుంద ♦ రాకారంబున్
శంబరరిపు మార్చున యా, డంబర మిది యనఁగ నవ్యో ♦ డం బొడసూపన్. ౨౩

క॥ అందఱు వానిం గనుఁగొను, చుం దనరెడు ముదము తోడి ♦ చొప్పున నిలువన్
డెందము రామపదాబ్జం, దిందిర మై నెగడుగను ధృ ♦ తిం బరవశుఁడై. ౨౪

ఆ॥ ఆనతార్తిహరు ద ♦ యాకరు నాభవ, బంధమోచనైక ♦ బంధు రామ
చంద్రుఁ జక్కఁ గాంచి ♦ సాగిలపడి మ్రొక్కి, దోసిలొగ్గి పలుకు ♦ దొట్రుపడఁగ.

తే॥ పలికె శ్రీరామ! సంఫుల్ల ♦ పద్మనేత్ర!
మహితసర్వాంగసుందర ♦ మంగళాకృ
తీ! జనించితె ననుఁబోఁటి ♦ తెఱఁగుమాలి
పడెడు తొడుసులఁ గావ నె ♦ పమ్ము నెఱయ. ౨౬

క॥ కానని వారలఁ గానవు, కానని కా న్పనసినావు ♦ కానల మెలఁగం
గా ననివార్యత మెయికొన, గా ననిచితి మంచిచెడ్డ ♦ గని పాలింపన్. ౨౭

ఉ॥ ఏనును దేవసంభవుడ ♦ నే యయి తుంబురుసంజ్ఞ నొప్పఁగా
జానగు తీరుఁ దేజుఁ దగఁ ♦ జారుశరీరుఁడనై మదంబునన్
జాన నొకర్తుకం గొని వి ♦ చారవిదూరుఁడ నాట కారణం
బైన యతాత్ముఁ డొక్కఘను ♦ డల్గి శపింప నిరస్తభాగ్యతన్. ౨౮

తే॥ రక్కసుండ నైతిఁ దపము క♦రం బొనర్చి, యజు వరంబున నఖిలశ♦స్త్రాస్త్రవధ్య
తం గడసి చేయరాని కృ♦త్యములు సేసి, నేఁటి కిటు కడతేఱితి ♦నీ శరమున. ౭౯

తే॥ నీవుగా కొండు గడపంగ ♦ నేర్చునయ్య!
నన్ను వైష్ణవధామమ్ము ♦ నను బొసంగి
యన్నియు నెఱింగి యిమ్మెయి ♦ నసదు గాని
బలముఁ జలమును నెఱపితి ♦ ప్రధనమునను. ౮౦

క॥ మును మోహము పైకొన మే, నని యే నని తెలియ నిప్పు ♦ డఘహర! సీత
త్త్వనిరూఢిం గనఁగంటిని, దనుధారులఁ బ్రోచుదొరవు ♦ తథ్యమటంచున్.

ఆ॥ కాంచెఁ గడుపు చల్ల ♦ గాఁ దల్లి కౌసల్య
ని న్నటంచు జనకు ♦ నిష్ఠగన్న
కలిమి యీమె యంచుఁ ♦ గలికి సుమిత్ర యీ
యన్నఁ గనియె ననియుఁ ♦ నెన్నఁ గంటి. ౮౨

ఉ॥ ఇంక భవత్పదాబ్జయుగ ♦ మే భవబంధముఁ బాప నామదిం
బొంకముగా నిలం గలుగు ♦ పోఁడిమి చొప్పడుఁగాత వాణి యే
వంకకుఁ బోక త్వన్మనుజ ♦ పంబున నెక్కునుఁగాత కర్ణముల్
శంకరకీర్తితాత్మకృతి ♦ సారరసాయన మందుఁగావుతన్. ౮౩

ఆ॥ కరుణ కలద కాదె ♦ కల్యాణగుణధామ!, నిన్నుఁ బొగడు నేర్పు ♦ నీపదార్చ
నమునఁ దవులు వంద♦నకృతిపాటవమును. గూర్చుమయ్య! నాదు♦కోర్కె నెగడ.

క॥ రామ! రఘురామ! సీతా, రామా! యభిరామ! యాత్మ ♦ రామా రచితో
ద్దామ సపత్నవిరామా!, నామనవిని విని మనుపుము ♦ నతసుత్రామా! ౮౫

ఆ॥ నీకు వందనములు ♦ నిర్మలజ్ఞానమూ, ర్తీ! ప్రసన్నహృదయ! ♦ తేర్చుమయ్య!
ననుఁ బ్రపన్ను నింక ♦ నాకలోకము సేర, నాన సేసి యఘము ♦ లదరి చెదర.

—♦ రాముఁడు వాని నుడులు మెచ్చి వరము లిచ్చుట ♦—

క॥ మాయ ననుఁ జుట్ట కెడలఁగఁ, జేయుము తండ్రీ! యనంగ ♦ సీతావిభుఁ డిం
కేయఘములుఁ బొరయవు లె, మ్మోయీ! యజితుఁడవ యెందు♦నుజ్జ్వలకీర్తిన్.

క॥ భాసిల్లెదు మద్భక్తి ప్ర, యాసపడినఁ గాని దొరక ♦ దది కదిసిన మా
యాసంసృతి సంభవములు, దోసము లవ్వారిఁ బొరయ♦దొరఁకొన వనఘా! ౮౮

ఆ॥ నాదు దర్శనమున ♦ నలి వాసె ముక్తుండ, వైతి పొమ్మనంగ ♦ నాతఁ డంత
రంగ మలరఁ బొంగి ♦ యఖిలార్థసంసిద్ధి, కైన తీర్థ మనుచు ♦ నంఘ్రియుగము.

ఆ॥ మొనసి మ్రొక్కి రామ ! ♦ మునినంద్యనామ ! యి
త్రోవ యోజనార్థ ♦ దూర మొనసి
నీదు రాకఁ గోరు ♦ నియతాత్ము శరభంగు
నరయఁ గాంచి పూజ ♦ లందుమయ్య ! ౯౦

—♦ రాముఁడు శరభంగమహాముని యాశ్రమసమున నిగుగుట ♦—

కం॥ అని తెలిపి వాఁ డరిగె న, య్యనఘులు మువ్వురుఁ దదాశ్ర ♦ మాంగణము చేరఁ
జని రవ్వల నవ్వలనునఁ, గనరాని వికాస మొకఁడు ♦ గనుపట్టు సఖీ ! ౯౧

సీ॥ కడలెల్లఁ గడ కొత్తి ♦ గడవ మేకొనువృత్తిఁ, బొలుపారు నా తేజ ♦ మ్మోఁదివని దు
వెలుఁగులో వెలుఁగన్న ♦ వెరవొప్పఁ దన్మధ్య, మందుఁ గాంచును తేరు ♦ గొంచు వెలయుఁ
బుష్పకంబని యెన్నఁ ♦ బోవంగ నంతలో, బూరుహత్కృతి యుండుఁ ♦ బావమని మించు
దివ్యుఁడంచు నొకింత ♦ తేటిచూచెడునంత, ఛత్రచామరశోభ ♦ బాదుఁదు ల్లలయు
ఘనుఁడె యానాఁగ సురసిద్ధ ♦ మునులు బలసి
కొలుచు నమ్మేటి విభవమ్ము ♦ క్రొత్తసేయ
నిందుఁడే యనన్నై తిరిద ♦ శేందుఁ డమ్మ
హామునీంద్రునిఁ జేరంగ ♦ నరుగుటయును. ౯౨

కం॥ వింత యనుచుఁ దమ్ముఁడుఁ దన, కాంతయుఁ గన రామవిభుఁడు ♦ గల్యాణగుణా
భ్యంతరుఁడు వారి కిట్లనె, మంతనమున సంతసమున ♦ మలయుచుఁ గనుఁడీ ! ౯౩

చ॥ వయసునఁ దెల్పి తేటల న ♦ వారితవైభవయుక్తిఁ దేజన
న్మయికొను లక్షణంబుల న ♦ మేయగుణాకరుఁ డింద్రుఁ డంచు ని
శ్చయ మొదవె న్మహామహుని ♦ సంయమిఁ గన్గొనవచ్చినాడు సేఁ
డయము ఫలించె నిందఱకు ♦ హాయిగ నిమ్మహిాత్మ్ముఁ గాంచుటన్. ౯౪

కం॥ ఒక్కింతసేపు నిలిచినఁ, జక్కఁగనం గనియు నచటి ♦ జాడ లరసియున్
దక్కిన మిముఁగాని చనియెద, నిక్కరణిన పొసఁగుమునుల ♦ యిక్క లెనయుఁగన్.

చ॥ అనుచుఁ బరిక్రమించు తఱి ♦ నాసురమండలభర్త మౌనితో
నన మునివర్య ! రాముఁ డదె ♦ యాశ్రమమున్ జెరయంగ వచ్చువాఁ
డనుపహితాఖిలార్థు నిపు ♦ డాతనిఁ గన్గొన సిగ్గు దోఁచెడిన్
బనివినువాఁడ నామహిాతు ♦ పంపున నాదట రమ్ము సమ్మతిన్. ౯౬

—♦ శరభంగమహాముని యింద్రునిఁ బనిచి రాము నెదుర్కొనుట ♦—

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ నమరేంద్రుఁ బనిచి శ్రీ, రాము ధృతజటాభి ♦ రాముఁ గాంచి
యవనిజాతతోడ ♦ ననుజునితోడ న, మ్మానసీయు నేఁడి ♦ మమత నెఱయ. ౯౭

వ॥ అమ్మువ్వురం దోడితెచ్చి యాశ్రమమధ్యప్రదేశంబునం బ్రవేశోత్సవంబు సంధా
నించి పూజించి తపోధనవరేణ్యుండు సంతుష్టాంతరంగుం డగుచుఁ బ్రణిధాన
ప్రణిహితాంజలిబంధుండై మహితాదరంబునం గొలుచు నత్తఱి శరీరప్ర
యాణముం గూర్చి ముచ్చటించిన నమ్మాయామానుషవేషధారింగని నాజటాధారి
యిట్లనియె. ౯౮

క॥ నను బ్రహ్మలోకమునకుం, గొని చన నరుదెంచె నతఁడు ♦ కోవిదనుత! యే
నెనయుదు నే పరమాతిథి, నినుఁ గొల్వక నీదుపనుపు ♦ నెఱిఁ గన కొఱఁటన్.

వ॥ చిరంతనతపఃప్రభావ సముపార్జితంబు లగు బ్రాహ్మ్యనాకపృష్ఠ్యాది సకల పుణ్య
లోకంబులు సమర్పించువాఁడ నీయందుఁ జేర్చు నవి యెల్ల ముక్తాస్ఫోటంబునం
బడు జలబిందువు లెల్ల మౌక్తికంబు లగు తెఱంగున నక్షయంబులై భాసిల్లు నని
మఱియు నిట్లనియె. ౧౦౦

ఆ॥ నిన్నదం దలంచి ♦ నీనామమంత్ర మా, వర్తనమునఁ గూర్చి ♦ వారకే ని
రీక్షణం బొనర్చి ♦ యిమ్మెయిఁ గనఁగంటి, తఱిఁ దనర్చు నీదు ♦ దర్శనంబు.

వ॥ ఇంక నన్నెకొఱంతలుం బొరయనేరవు నాపొనర్చు విధానంబున కానతి సేయవే
యనిన శ్రీరాముండు స్మేరవదనుండై యిట్లనియె. ౧౦౨

ఆ॥ ప్రగ్రహింపవాఁడ ♦ నెల్లపున్నెంబులఁ, దఱి నొసంగువాఁడఁ ♦ దరణి జలము
లట్లు పీల్చి యొసఁగఁ ♦ డా సమయప్రాప్తి, వాని శుద్ధములుగ ♦ వఱలఁజేసి.

వ॥ మహానుభావా! యపవర్గంబు చూఱఁగొంటి వింక నీయిచ్చవచ్చిన యెల్ల మెలఁగు
మనిన జీర్ణత్వక్కునురగం బట్లు లమ్మౌను విసర్జింపం దలంచి శరభంగుఁ డభంగు
రంబుగా జ్వలనంబుం బ్రజ్వలింపం జేసి యుద్ధానికి నిఖిలసంస్కారంబులుం
బొనరించి సకలధర్మంబులు నప్పరమేశ్వరునందు సమర్పణంబు గావించి విరక్తుం
డయ్యుం దదేకరక్తుండై సీతాలక్ష్మణసమేతుండు నప్రమేయగుణాకరుండు నగు
నద్దేవుని వలగొని సభక్తిస్నేహంబగు విశేషంబు దనుపారం గేల్మోడ్చి యక్ష్యాభి
ముఖ్యంబు నలువొంద నమందానందంబున నిట్లనియె. ౧౦౪

—♦ శరభంగమహాముని యగ్నిప్రవేశము సేయుచు రాముఁ బ్రార్థించుట. ♦—

ఉ॥ కన్నులు చల్లనయ్యె నినుఁ ♦ గాంచినయప్పుడె రామచంద్ర! నీ
వున్నతలంబు నిర్మలమ ♦ హో! సురభిత్వము సద్దయార్ద్రభా
వోన్నతియు న్నుతింపఁ ♦ దరమో ధర మోపితి పాద మింతకా
కిన్నెఱి నేగుదొంతె స్మరి ♦ యించిన యంతన పున్నెమంతయో.

—♦ శ్రీరాముఁడు మునుల యాశ్రమము లెల్లఁ ద్రొక్కిచూచుట. ♦—

తే॥ ఒక్కయాశ్రమముననుండ♦నొదిగియొక్క, రాత్రియింతురుమా చోట♦నసుగిడంగఁ
బోలదే యని యుత్కంఠ♦వొసఁగ వారి, పున్నె మేమని వచియింతుఁ♦బుణ్యపుఁబోడి!.

చ॥ కనుఁగొనువారు పున్నెముల ♦ కొల మిదే యని యెన్నువారు ని
ర్ధనులు తపోధను ల్గొను సు ♦ తారఁపుఁ బెన్నిధి యంచు నుబ్బువా
రనయముఁ బాపనాశనస ♦ మర్ధము తీర్ధము గంటి మింక నే
మనియెదువారు నైరి ముని ♦ లద్దియపో సుఖ మన్న నద్రిజా!. ౧౨౮

మ॥ మృగబాధల్ దనుజాధమవ్యధలుఁ బో ♦ మిన్నంది కర్మందులొ
ప్పఁగ నానందమయుండు రాముఁ డ డవిం ♦ బాలించె నీర్ద్రదు నా
నగు నేం డ్లమ్మెయిఁ ద్రొక్కి చూడని పొల ♦ మ్మొ లేదు నైరస్యమొ
మొగియంబో దను వాదము ల్సెలఁగ స ♦ మ్మోదప్రభావోదయా! ౧౨౯

తే॥ వనవిహారంబు సలుపుచు ♦ వచ్చివచ్చి, తపసు లొనరించు పూజలఁ ♦ దనిసితనిసి
యమ్మహాత్ముల సూక్తుల♦కలరియలరి, రామవిభుఁ డొప్పె నచట మ♦రాళగమన!

మ॥ తల లెమ్ము ల్పరిశుష్కగాత్రితతులుం ♦ దార్కాణగాఁ గానన
మ్ములఁ గాన్పింప దయామయుం డడుగఁగా ♦ మొమోట యింకేల యం
చలఘు ల్మౌనులు విన్నవించి రివె మా ♦ యయ్యా జనస్థానగు
ల్మాలదిండు లొనరించు దుండగము లా ♦ క్రొద్దుగ్ సముద్దండతల్. ౧౩౧

క॥ దక్కిన తపసులఁ బోనీ, రెక్కరణిన యేని మెలఁగ ♦ నెంచరు వా రీ
ది క్కెనయు మౌనిమండలిఁ, జిక్కిన దీజనమె యిపుడు ♦ సీతారామా!

ఆ॥ నిష్ఠఁ బాయలేమి నెఱదిక్కి యికొక్కన, నిలిచినార మెదిరి ♦ నేర మెంచి
కొంత వారణమ్ము♦గొనకొను బ్రాహ్మ్యవ్రతే, జమ్ము వమ్ముగాఁగ♦ జరుపుకొనుచు.

క॥ నేఁటికిఁ గంటిమి నీకృప, మాటికిఁ బొగడితిమి నీదు ♦ మహిమ వితర్కం
బేటి కిహాము పరమును నొ, చోటుల మముఁ బ్రోవ నెట్లు ♦ చూచెదొ రామా.

క॥ అని వాకు మొఱవెట్టఁగ, వినిరాముఁడు కరుణ వెల్లి ♦ విరియ నపుడె నె
ట్టనఁ బ్రతిన నెఱపె నే న, ద్దనుజుల వధియింతు ననుచు దాక్షిణ్యనిధీ! ౧౩౪

క॥ శరచాపఖడ్గతూణీ, ధరులై రాక్షసవినాశ ♦ తత్పరతం గ్రు
మ్మరుచున్నవారి నిర్మల, తరభావం బరయ నెఱయు ♦తలఁ పొలయంగన్. ౧౩౬

—♦ సీత శ్రీరాముని యభిప్రాయం బెఱుఁగఁదలచి ప్రశ్నించుట ♦—

క॥ మంతనమున సీతాసీ, మంత్రిని రఘురాముఁ జేర ♦ మది సన్నుతి నా
సంతసము దొనుకనిట్లనె, నంతర్ముఖపూజ్యసన్మ ♦ హాసామ్రాజ్యా! ౧౩౭

సీ॥ తలఁగు ధర్మపుమాటఁ♦దప్పులుమానిసి కొంటివి, కెడయనీయకు మొప్పు♦ నెడయకుండ
ననృతోక్తి యన్యదా ♦ సక్తి విధిగాని, పరహింస సేఁత నాఁ ♦ బరగు నవియు
మొదలి రెండును నిన్ను♦మొనయవు సత్యసం, ధుఁడ వేకపత్నీవ్రతుఁడవు నగుట
శస్త్రపాణిత్వంబు ♦ జటిలమై మేకొంటి, వది కృత్యమో కాదో ♦ యరయరాదు.

రాజ్య మన్యాని దన్యో దు♦రంబునాక
యొడ్డ నూరక వధియించు♦టొప్పునెట్లు
తపసుల పోలమ్ముఁ గాపాడఁ ♦ దలఁప వేనిఁ
గాచికొనియుండ నగుఁ గల ♦ కాల మనఘ! ౧౩౮

క॥ మునిచరితమునను మెలఁగుట, యును బాల్యమె దానిఁ దలఁగ♦ నుభయచ్యుతి నె
ట్టనఁ గనుట యగునో యలనో, యనవద్యగుణా! యెఱింగి ♦ యగు వర్తింపన్.

తే॥ దహనుఁ జెందగ నింధన ♦ తనులపోల్కి, క్షత్రజాతి నెదుట విండ్లు♦శరము లున్నఁ
దేజ మతిమాత్ర మగుఁ గాని♦ శరలఁబోదు, దాన నొడ్డకుఁ గీ డొంటుఁ♦దారసిల్లు.

చ॥ కలఁడు తపస్వి యొక్కరుఁడు ♦ కాననసీమను గందమూలముల్
ఫలములుఁ దించు నిష్ఠనుయిఁ ♦ బాపము వంకకుఁ బోక సత్వముం
దలఁగక వృద్ధకాలమును ♦ దాఁ గడుపం గని యిందుఁ బోర్వ కొ
క్క లసదసి స్పృశించి చని ♦ కొన్నన నాతనిఁ గాంచి మెచ్చుటన్. ౧౪౧

క॥ నీయొద్ద నుసిచికొమ్మని, ధీయుతుఁ డాఖడ్గ మొసఁగి ♦ దేవనగిరికిం
బోయిన నాన్యాసం బెడఁ, బాయ కతఁడు తెలివిమెయిన ♦ పరఁగుచు నుండెన్.

ఆ॥ కొంతకాలమునకుఁ ♦ గ్రూరత వాటిల్ల, నెదుటపడిన వాని ♦ నెల్లఁ జునిమి
యోగనిష్ఠకలిమి ♦ నొందవంగ నగు గతి, సడఁగి నిరయవసతి ♦ నొడిచికొనియె.

క॥ ఎక్కడ శస్త్రము ధాత్రిము, నెక్కడ వనమును దపంబు ♦ నెల్ల యొకచోసుగా
దక్కన వన వలనుపడునే. తక్కొరులకు వ్యసని యేనిఁ ♦ దానును జెడఁడే. ౧౪౪

తే॥ దేశధర్మ మొడయమేసి ♦ తెరువువట్టి, సారిది వర్తిల్లు నతఁడు సు ♦ శ్లోకుఁ డగును
పునరయోధ్యాగమం బెట్లు♦పొనరుపడునొ. నాఁటి కేనాఁటివృత్తియు♦ననుచు నధిప!

ఉ॥ అన్నిటి నర్తమామలకు ♦ నక్షయమా ధృతిఁ గూర్చుదాన నై
తన్నని సేవ లే నెఱప ♦ దేవవిభుత్వము తోడిపాటి య
భ్యున్నతిఁ గంటి వీడితి మ ♦ హోజ్జ్వల సన్నియ ప్రసక్తి సం
పన్నతఁ గోరఁగావలదె ♦ పావన మాత్మసుఖంబు పొల్పడన్. ౧౪౬

తే॥ ధర్మసారమ్ము జగమర్థ♦తతియుసుఖము, ధర్మువునగాంచునగుఁ [illegible]
గాననియమమ్ము లెడపక♦కార్శ్యమొంది, తైనవన సర్వ నెఱపంగ♦నగు [illegible] !

క॥ కాన నకారణకృత్యం, బూని పరుల హింస సేయు ♦ టొప్పదు [illegible] ౧౪౮
చేను మదిఁ దలఁతు నిట్లను, నానేరమి సైపవలయు ♦ నాథ ! [illegible]

క॥ గురుభక్తివశతఁ గరుణా, పరత విధిజత నుదార ♦ భాషణము స
ద్వరణీయగుణత సీతో, సరిరాఁగలవార లెవరు ♦ జగతి సతీ ! ౧౪౯

ఆ॥ ఏను విన్నవింతు ♦ నిట్లని శాసించు, దానఁగాను [illegible] ♦ [illegible]
మైన దారితల స ♦ మాశ్రయింపంబోలుఁ బ్రాణనాథ ! [illegible] ♦ [illegible].

ఆ॥ అనుచు భర్తృభక్తి ♦ యనురూపముగఁ బల్కు-
పలుకు లెడఁద మెచ్చి ♦ భరతుభ్రాత
యన్నియును నెఱింగి ♦ యద్దేవితో ననె
వింత నేర్మి నెఱయ ♦ విశ్వవంద్య ! ౧౫౧

—♦ శ్రీరాముఁడు సీతపలుకులకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

సీ॥ హితము తథ్యముఁ గాఁగ♦నెలమి భాషించితి,వదె కాఁద [illegible]♦[illegible]
ధర్మనిర్ణయమునఁ ♦ దవులు వికల్పంబు, లతిసూక్ష్మములు [illegible] ♦ [illegible]
క్షత్రియుండై పుట్టి♦శరచాపములఁ బట్టి, యార్తనాదము విని ♦ [illegible]
శరణాగతత్రాణ ♦ సమధికం బగు పుణ్య, మొందు ముజ్జగము ♦ [illegible]

పాలఁతి! పాలదిండిపోఁతులు ♦ పాదివి నిచ్చ
లుఱక దపసులఁ బొలియించు ♦ చున్నవార
లనిన ననుబోఁటికి సహించి ♦ యలఁతిఁ బోవ
వచ్చునే జీవితం బైన ♦ వదలవలదె ౧౫౨

చ॥ తపములు జన్నము ల్సెఱుపఁ ♦ దాపసుల న్వధియింప నింక నే
యపకృతులం బొనర్ప నెను ♦ కంజ మొకింతయు లేని చెట్టల
న్నృపవరపుత్రి ! గెంటుపని ♦ నీదె కదయ్య ! యనాథు లట్టు లీ
మపగతరక్షణత్వగతి ♦ కొదుమటయ్య ! యటంచు వేఁడఁగన్. ౧౫౩

క॥ విని యయ్యలార ! యిట్లనఁ జనునే సిగ్గొదవె యేన ♦ చనుదెంచి పను
ల్గని పాలరింపకునికి కిం, క నుపేక్షకుఁ జొత్తునే సు ♦ ఖం బరయుదునే. ౧౫౪

వ॥ అని యవ్వారి నెల్ల నల్లన నూరడించి. ౧౫౫

క॥ ఏను బ్రతిజ్ఞ నొనర్చితిఁ, బూనిక రక్కసుల నెల్లఁ ♦ బొరిగొందు నటం
చానియతి మాన నిఁక మి, న్నేనియుఁ క్షి నొఱిగిన న్మ♦హీతనుజాతా! ౧౫౬

తే॥ మాటకై వనవాసమ్ము ♦ మలయఁ బూంటి, యట్లు సేసి యుండఁగ నీడ ♦ నగుదు నన్నుఁ
బున్న మని యున్న యిఁకఁ బూ ♦ బోఁడి తనకు, నింతమాత్రన తీఱునే ♦ యెల్లబరువు.

తే॥ ఇష్టసంగతి త్వరవ మెయిం ♦ జఱిఁగి తాక, యూఱ్ఱ యింతు రె యున్వార ♦ లలఁతివారె
తపసులపోక సహింపక ♦ తారసిల్లు, నాపదల నెల్ల నోర్చెద ♦ రవనితనయ. ౧౫౮

తే॥ ధర్మసంస్థాపనమున కీ ♦ తరము వారు. జనన మందుట యిదియె ని ♦ శ్చయము సుమ్ము
బ్రహ్మసత్త్వంబు ప్రేఁ గాఁపు ♦ పనికిఁ గాక, కాల్పనే క్షత్రజాతి యే ♦ కాలమునను.

క॥ అలినీలాలక! యుప్పని, పిలువక మును దర్పమేలి ♦ బిరు దనసి పద
మ్ముల్ఁ బడి వేఁడినఁ గాదనఁ, గలనే శిలనేసియు న్వి ♦ కారము గలదే. ౧౬౦

సీ॥ చిచ్చు పెట్టువాఁడు విషదాయి ♦ క్షేత్రదార
హారులు ఘాతుకుఁ డఖిలస్వ ♦ హార్తసీర
లెడుగుపడఁ జాతి వధియించఁ ♦ జేసి వారి
పాపమునఁ దానుఁ బొసు భవ్య ♦ భావములఁ బొ. ౧౬౧

క॥ ఏ నిందుల కై పోషమితిఁ, గానఁ దలంచి యిఁకఁ జనదు ♦ కాననసీమ
న్నానాసత్త్వవినాశము, మానుగ నాపాలఁబడె ని ♦ మంత్రిత మగుచున్. ౧౬౨

ఆ॥ ఏతనుగలఫుచాలు ♦ శ్రేయసీరత్నంబ, వగుదువిట్టులాడి ♦ తనుచు మెచ్చి
నాఁడ సాధ్వాభిజాత్య ♦ నందితగుణయోగ, మరసిస్వరసభావ ♦ మచ్చుపడఁగ. ౧౬౩

క॥ అని పలికిన నాయమ ముద, మునఁ బొదలఁగ గాడికొనుచు ♦ మునినాడి సుతీ
క్ష్ణునిఁ గాంచఁగఁ గుతుకము మది, నినుమడిగాఁ జనిరి వార ♦ లేణాంకముఖీ!

ఆ॥ ధర్మభృత్ప్రధానుఁడు ♦ తాపసి యెడుకొక్కఁడుగా, ధనుపహాఁగ దాగ ♦ మతిశయిల్ల
ననుచు సతినితోడ ♦ నానాలతాద్రుమ, కుసుమసీయకమును ♦ ములఁ గనుచు.

ఉ॥ ఘోరము మార్గము న్నడచి ♦ ఘోరముగా నడిమిన్ను నందమో
దారి వెలుంగుచున్న యటి ♦ దాటితల న్నమ దున్మనస్కులై
సారసకైరవోల్లసిత ♦ సౌరభసంపదుదార మొక్క కా
సారము నీరపూరరస ♦ సారవిశిష్టగుణాప్రిచారమున్. ౧౬౬

ఉ॥ ఆంతరతుష్టికిం దగిన ♦ యట్టులు శోభితసృష్టిఁ గాంచ నౌ
నంతఁ దదంతరాంతరము ♦ నం దరయంబడె సౌధసార మి
ట్టింతలు సేయుసే వెలయు ♦ నేనియు రన్యము కాక శ్రావ్యమే
వింతలు గావె యంచు రస ♦ విస్ఫురితగేయనిబంధనోన్నతుల్. ౧౬౭

మ॥ పలుకు ల్ప్రాంతల నౌచితీకలనకుఁ ♦ భంగంబు వాటిల్లఁగా
జ్జ్వలరాగోన్నతి నీరువోదు రసభా ♦ వప్రక్రియ ల్మానిచ
ప్పలుకుం దౌయ్యలి యిన్నిసంపదలకు ♦ న్నాట్యంగాపు గాకున్న ని
ల్లలయింపంగల గీత మున్నె యని వా ♦ రేకాగ్రత న్నిల్వఁగన్. ౧౧

క॥ ఆర్యనుతుఁడు రాఘవుఁ డా, శౌర్యత్రిక మొలయు తెలుపు ♦ దానిసమగు ని
ర్ధార్య మొనరింపు మన నౌ, దార్యము పెను పొంద ననెను ♦ నిం దొం గానన్.

—♦ మాండకర్ణి చరితము ♦—

తే॥ ఇదియు బంచాప్సరస్సర ♦ స్సిచట మున్ను
మాండకర్ణి యనం దగు ♦ మహితుఁడొక్క
తపసి పదివేల యేం డ్లంటఁ ♦ దప మొనర్చె
వాయుజలభక్షుఁడై యని ♦ వార్యశౌర్య! ౧౨౦

సీ॥ అగ్ని మున్నగు వేల్పు ♦ లందఱు గుమిగూడి, యాలోచన మొనర్చ ♦ నతనిఁజేరఁ
తఱి వేచి యిం దొక్క ♦ తల మాక్రమింపంగఁ, దలఁచెఁబో కాకున్న ♦ దానిఁగని యి
తపమున నిట్లని ♦ తద్దయు మఘవున. కెఱిఁగించి యట్లన ♦ నాతఁడంగ
వా రచ్చరల మేలి ♦ వరవర్ణినులఁ బంప. నైదుగు రవ్వాగ ♦ లరుగుదెంచి

మచ్చికలు సూపి మునివృత్తి ♦ మలయఁజేసి
మెచ్చు లెనయించి యాతని ♦ మెచ్చువడసి
ముచ్చు లే మిమ్ముఁ బాసి ని ♦ మునమ యేని
బ్రిదుక ననిపించి రోరామ! ♦ ప్రథితనామ! ౧౨౧

క॥ వారలతో నీనాఁటికి, వారని కుతుకమున మౌని ♦ వరుఁ డిసరసిలో
నేరిమి నిర్మించిన సిం, గారఁపు గని మేడలో సు ♦ ఖస్థితి నుండున్. ౧౨౨

చ॥ మెలఁతల భూషణధ్వనులు ♦ మేలిమివాద్యరవమ్ములాటపా
టల నెఱియాఱజమ్ములును ♦ డంబగు శంబరవైరి బీర ము
వ్వలనున నెల్లవేళల న ♦ వార్యత నెక్కొనుచుంటఁ దెల్పు ని
ప్పొలమునుఁ దత్ప్రభావమునఁ ♦ బూజ్యతఁ గాంచె నరేంద్రచంద్రమా! ౧౨౩

తే॥ అనుచుఁ దెలిపిన సంతస ♦ మ్మబ్బి మెదను
బెనఁగొనఁగఁ దీర్ఘ రాజమ్ముఁ ♦ బెరసి స్నాన
పానము లొనర్చి మునివరుఁ ♦ బనిచి యరిగి
రచటు సేరంగ భవ్య భా ♦ వానుషంగ! ౧౨౪

క॥ వెండియు నమ్మునిశశి నీ, యండఁ గనంగంటి నంటి ♦ వఖిలేశ్వర ! నీ
దండఁ బెరయఁ గాదే యిం, దుండవలసె నని సుధాస ♦ ముచితాలాపా ! ౧౮౫

వ॥ అని యిట్లు లొండొండ సరససల్లాపంబులం బెనుచుచు భక్తివిశేషోత్కంఠితలోచ
నుండై యయ్యగస్త్యశిష్యవరేణ్యుండు నిండుమనంబున రామా ! గిక్కోవి
రామా ! మామకీనసుకృతంబు లెల్ల నీకే సమర్పించినాడ భవదీయాశ్రయణంబు
దక్క నొండు గతి యే నొల్ల చిరకాలమునుండియుఁ దావకీననామము స్మ
జపించుచు భవద్దాసానుదాసుండనై నీదు సుచరిత్రమ్ములు వినుచుఁ ద్వదీయ
కల్యాణగుణంబు లెల్లప్రొద్దులం గొనియాడుచు ననితరసుఖోదయమ్మునఁ బ్రవ
ర్తిల్లుచున్నవాఁడ నవధరింపుము. ౧౮౬

—♦ సుతీక్ష్ణుఁడు రాముని స్తోత్రము సేయుట ♦—

తే॥ ఓయనంతగుణా ! యప్ర ♦ మేయ! ధరణి. జామనోహర ! వారవిధ ♦ సంస్తుతాంఘ్రి!
రామ ! నామాభిరామ ! సు ♦ త్రామవినుత !, పావితాఖిలలోకసం ♦ భావితాత్మ ! ౧౮౭

క॥ భవసింధుతరణమునకుఁ, భవదంఘ్రిసరోజ మెన్నఁబడెఁ బోతముగా
నవలంబనంబు మా కదె, నవరణ పొనరించు మోహ ♦ జనితాంధ్యంబుల్. ౧౮౮

ఉ॥ నీ కయి నీవ వచ్చితివి ♦ నిర్మలభావతఁ బ్రోవ నెంచి నే
నేకటఁ బుత్రదారగృహ ♦ హేయభవాంధువునందుఁ గూలి యా
పోక నె పోయి పోయి మల ♦ పుద్గలపిండము డెంద మాంధ్యవుం
జోఁకున వృత్తి పాశములు ♦ చుట్టి తెరల్పఁ గలంగు చుండఁగన్. ౧౮౯

సీ॥ ఎల్లభూతంబుల ♦ యెడఁదల నుండియు, నెడఁదల నుండు ని ♦ న్నెఱుఁగకున్న
నీమంత్రనిరతుల ♦ నియతిఁ బ్రోచెద వన్య, నిరతుల నల్లంతె ♦ నిలిచి కాంతు
వధికారులేని నె ♦ య్యమునఁ బ్రబోధింతు, వధికారులైనఁ జ ♦ య్యన నడంతు
వడర నీయవు స్వభ ♦ క్తాళిపై నిజమాయ, నిజమా యభక్తుల ♦ నిలువరింతు

మాయచేఁ జుట్టి సంసార ♦ మగ్నులుగఁ బొ
నర్తు వింతలు వింతలే ♦ నర్తకుఁడవు
కపటనాటకమునను జ ♦ గమ్ము లొకట
ముంపఁ దేల్పంగ నగుచు ని ♦ ర్మోహ మొలయ. ౧౯౦

ఆ॥ ఎంత చేసికొనిన ♦ నంతియ ఫల మన్న, నెటికిఁ గూర్తుఁ బెట్టిఁగి ♦ నిన్ను వలచి
తలఁచి కొలుచువారి ♦ తాత్పర్య మీవ మై, ననిచి ప్రోతు లోక ♦ నాథ ! యెపుడు

చ॥ జలకలశంబులం దరణి ♦ సంగతుఁడైనటు లెన్నిరూపులన్
వెలయుఁడు నీవు నట్టి పలు ♦ వేసములం గొని సృష్టిపుష్టిసం
కలనములం బొనర్చు మొన ♦ గాడవు ధాతృహరీశమూర్తివ్య
స్తులు నిజమాయ నుప్పతిలఁ ♦ బొల్చిటి యేకత పాయ కుండఁగన్. ౧౯౧

ఆ॥ ఒకరహాస్య మభవ ♦ యుద్వృత్తినేని స, ద్వృత్తినేని నెడఁదఁ ♦ బెరలనీక
నిన్నుఁ గట్టి నైచు♦నియతాత్ము ధన్యునిఁ, జేయఁ జూతువా యు♦పాయమునను.

తే॥ నీదు దివ్యపదాబ్జంబు ♦ నేఁడు గంటి
నిఁక తమఃపరపారస్థ ♦ మిఁక యలభ్య
మెల్లనాఁటికిఁ బద్వృత్తి ♦ నెనసియునఁ బ్ర
పన్నులకు మాత్ర మెప్పుడుఁ బ్ర ♦ సన్నమగుట ౧౯౩

సీ॥ నాభాగధేయంబ ♦ ననిచె నివ్విధ రామ, రూపింపరాకయు ♦ రూప మెనసి
మాయావిడంబన♦చాయ నెకొన్నుఁగాక, పురుషోత్తమత దెసఁ♦బొరుపు గొనదు
కందర్పకోటిప్ర♦కామత్వమున మించి, సీతాసమేతమై ♦ చెలువు గాంచి
శరచాపములు బూని ♦ సదయార్ద్రహృదయమై, స్మితచారువదనల ♦ క్ష్మీవిశిష్ట
మప్రమేయ మనంతక ♦ ల్యాణగుణక
మంచితాజినవల్కాంబ ♦ రాఢ్య మచిత
సుందరేందీవరద్యుతి ♦ యప్రధృష్య
మును నగుచుఁ గన్నులలరఁ ద ♦ మ్ముఁడును గొలువ. ౧౯౪

ఆ॥ కాంతు నపుడు దేశ ♦ కాలాద్యవధిశూ, న్యంబు చిత్ప్రకాశ ♦ మనుచు వేద
సార మరసి యీని ♦ సరణి నెఱుంగ ని, శ్చలయి నాదు మదిని ♦ నిలుచుఁగాత.

క॥ ఏ నొల్ల నింక నెపియు ర, మానాయక! యివ్వలనున ♦ మనుపవె యన నీ
తానాథుఁ డలరి యిట్లనె, మానుగ స్మితరుచులు తమము ♦ మాయింపంగన్.

——♦ శ్రీరాముఁడు సుతీక్ష్ణమునికి వరము లొసఁగుట ♦——

తే॥ ఎవ్వి యొసఁగినఁ గొనువాఁడ ♦ విచ్చువాఁడ, నెద్ది కోరిన నందియ♦ మేల యింక
నిర్మలము నీదు చిత్తమ్ము ♦ నియతి గెల్చి, నాడ వఖిలమ్ము నీసొమ్ము ♦ నంద్యచరిత!

క॥ మద్భక్తిపరుఁడ వీ వని, చిద్భామానందమయునిఁ ♦ జేయఁగ వల నే
సద్భావనఁ దోఁచితి నీ, హృద్భవనమున న్వసింతు ♦ నింకఁ ద్వదిచ్ఛన్. ౧౯౬

తే॥ నాదు మంత్ర ముపాసించు♦నంద్యగుణులు, నన్నె శరణని నెమ్మది♦నమ్మి కొలుతు
రేనుఁదద్వృత్తి నేమఱ♦కెనసియుందు, నందియము లేక వారి హృ♦న్మందిరముల.

ఆ॥ ఇట్టి స్తోత్రమెవ్వ ♦ రిచ్ఛమై నిచ్చలుఁ, జదువువార లరసి ♦ సంతసమున
వారు నట్టిఘనులు ♦ వారక మల్లోక, సుఖముఁ గాంచి మోదమొదవ ♦ ముక్తి గాంచు.

క॥ నాయెడ భక్తి బెనుచు నిజ, మాయాబంధము దరల్చి ♦ మస్మరియు నెలా
శ్రీయుతుఁ బొనర్చి నరుని, శ్రేయసపదవికి నధిపుఁ ♦ జేయు మునీంద్రా! ౨౧౧

ఆ॥ నీవు నన్నుఁ దలచుఁ ♦ నెఱి సర్వసంగవి, ముక్తిఁ గాంచితయ్య! ♦ మునవయు మిం
నంతమున మదీయ ♦ మైన సాయుజ్యంబు, సందియంబు లేదు ♦ సంయమీంద్ర!

క॥ అనఁ దద్వాగమృతఝర, మ్మునఁ దోఁగి సుఖార్ణవమున ♦ మునసి సియమి గా
మునిఁ దోడివారిఁ బూజిం, చెను ముని సుకృతి మిం ప యుసి ని ♦ తిష్టచరణా!

ఆ॥ కడపె నచటఁ గొంత ♦ కాలమ్ము రఘువంశ, భూషణమ్ము మునులు ♦ పూర్ణకాముడగుచు
చేరి కొలుచుచుండ ♦ సీతతో ననుజుని, తోఁ బ్రశస్తిగోడఁ ♦ దోయజాక్షి! ౨౧౪

క॥ ఆదట నొకనాఁ డాఘనుఁ, డాదయితుఁడు తపసిఁ గాంచి ♦ ఘనాదరమున స
మ్మోదముఁ బెనఁగొన నిట్లనె, వేదప్రసాదనిత్య ♦ విహారశీలా! ౨౧౫

—♦ శ్రీరాముఁ డగస్త్యదర్శనార్థ మరుగుచుఁ దోవలోఁ దగ బ్రాహ్మణులఁ జూచుట. ♦—

చ॥ అనఘ! భవద్గురు న్సురవ ♦ రాఢ్యచిర మహాత్మ్ము నగస్త్యముని చా
దుద్రినిఁ గనఁ గోరుచు న్మదిని ♦ రూఢతఁ దన్మయమై చెలంగెదన్
జనియెద మయ్యెడ న్నిలిచి ♦ సారతరోక్తులు వించు మేను గా
ర్చిన విధికి న్ఫలంబు గన ♦ శ్రీకర మన్వయముం బొనర్పఁగన్. ౨౧౬

మ॥ అనిన న్మౌనివరేణ్యుఁ డిట్టు లనె మే ♦ లయ్యా మదీయాశయం
బును నమ్మౌఁ దులకించుచున్నయది యి ♦ మ్మౌం జూపి తీ వంతలోఁ
జనకా నేనును వత్తు నెల్లి సుజన ♦ శ్లాఘ్యుం దయామూర్తి నా
ఘను దర్శింప భజింప నెమ్మనములోఁ ♦ గౌతూహలం బయ్యెడిన్. ౨౧౭

క॥ తడ వయ్యె నామహాత్ముఁ గని, పొడ వయ్యె న్గోర్కి గుమియుఁ ♦ బోవుద మని యా
జడదారి స్వస్త్యయన మట్టు, నడిపెను మఱునాఁటి యుదయ ♦ నంబునఁ దగుగన్!

ఉ॥ ఆమెయి నందఱుం గదలి ♦ యాశ్రమము న్విడనాడి ప్రాంగణా
రామవిహారము న్నెఱపు ♦ రాణ మహచ్చరితప్రశంసలన్
సేమము యోగముం బడయఁ ♦ జేయఁగఁ జాలు ప్రసిద్ధసిద్ధభూ
భూమహితప్రసంగములఁ ♦ బొం పెద నింపఁ దొడంగి రంగనా! ౨౧౯

తే॥ అట్టు లన్యోన్యసంభాష ♦ ణానుమోద, సంగతి చెలంగఁ దొడరి యో ♦ జనచతుష్ట
యంబుఁ గడచిరి కడచిక్కి ♦ ప్రాంచితప్ర, పంచితవనస్థలి యొకండు ♦ వడయఁ గనిరి

క॥ మునికులతిలకుఁడు రఘురామ, ముని నుడిఁ గొని మహిమ నన్నఁ ♦ బోలిన యనుజ
న్ముని పురావాసం బిది యని, మునుకొని నద్దాని విభవ ♦ మునువివరింపన్. ౨౧౧

సీ॥ మును గాంచినవియును ♦ మొనయ నౌ నవియును, ఫలభారనమ్రము ♦ లౌ పాదపములు
పరిపక్వపిప్పలీ ♦ పరిమళ మ్మొదఁ గొని, యందిచ్చుచున్న వాఁ ♦ డనిలుఁ డిటఁగి
నై సూర్యమణిదళ ♦ వర్చస్కములు దర్భ, లవె యూన శేషమ్ము ♦ లనువుపడెడు
ధూమమండలి దివిఁ ♦ దోలకేగు వేదిస్థ, మగ్నిఁ బేర్కొనుచు నీ ♦ లాభ మట్టు
లెందు నిర్మలతీర్థమ్ము ♦ లెనసి స్నాతులై ద్విజాతికుమారు లి ♦ య్యాదనునందుఁ
దారు వెంచిన తీవెల ♦ తరుల పూవు, లల్లన గ్రహించుచున్నవా ♦ రనఘ! కంటె.

క॥ పోసిన ధనగానుగె యవి, వీసరవోవని తపమ్ము ♦ విధ మొకఁగింపన్
భాసిల్లెడుఁ బెనుగొండల, తో సరిగా నింధనములు ♦ ధుతాగ్నిఖుర్రిచ గురూ! ౨౧౩

తే॥ పుణ్యునకిగ్గురుఁడు పూజ్యుఁడు ♦ భూరిమహిముఁ,
డన్నయంగెలు గలఁడితఁ ♦ డలఘుచరితుఁ
డవ్వలను గాంచికొనక యూరి ♦ యున నగస్త్య
భ్రాత యని పిల్వ నేమి న ♦ పంబు గాను! ౨౧౪

ఉ॥ రమ్యతటీనికము ల్వనులు ♦ రాణ దలిర్పఁ దపస్థలమ్ము ప్రా
థమ్యమును సూప నేసి యువుఁ ♦ బొర్కొసి యయ్యపి యెల్ల నెల్లెడన్
స్వామ్యపరాజితత్వ మన ♦ సంగతిమ్మె దనరంగ నొప్పు నో
సౌమ్య! మహాత్ముఁ డితఁ డని ♦ పాటు సుర ల్మునులు న్నుతింపఁగన్. ౨౧౫

ఆ॥ ఇంతవట్టు వీర ♦ లంతకు నేనియు, లెక్క సేయ రెంత ♦ రక్కసులను
గాని తపమువంకఁ ♦ గలిగెడు దాక్ష్యమ్ము, కలిమిఁ బరిగణింపఁ ♦ గడఁగుచుండ్రు

క॥ ఎంతకు నేనియుఁ జాలియు, శాంతి మెయి న్నీదు రాకఁ ♦ జర్చింపుచు ని
ట్లింతకు నిలిచెన గీడెన, సంతసమే చాలు జన్మ ♦ సాఫల్య మిడన్. ౨౧౬

ఆ॥ అనుచు నొడువు లెటిన ♦ సుగ్రీవముగర్భుఁబు, సొచ్చి మునివరేణ్యుఁ ♦ జూచి మ్రొక్కి
రమ్మహాత్మ్ముఁ డలరి ♦ యందఱఁ బూజించె, రవియు నస్తగిరి శి ♦ రమున మెఱసె.

క॥ అంబరమణి యన్నగశీ, ర్షంబున నలువొందు నపుడ ♦ సాంధ్యకృత్యముల వం
కం బరఁగె వ్యగ్రభావము, శంబరరిపుజేతృవిహిత ♦ సత్తుల కౌకటన్. ౨౧౯

క॥ ఎడఁ జని యూవాసమ్ములఁ, బడయఁ దొడరు నీడజములు ♦ ప్రాజనువుల ప్రా
వడులఁ దగు పలుకుఁబలులం, గడకొలుపుచుఁ జాలు దెంచెఁ ♦ గంజదళాక్షీ! ౨౨౦

క॥ సమయము దోసం బిచ్చటఁ, దమ మడరం జేయఁ జూడఁ ♦ దద్వేదిత చం
ద్రముఁ డరుదెంచెఁ బ్రబుద్ధత, కమత్త్య లుప్పొంగఁ బెంచి ♦ తాకారగుణా!

తే॥ తొవలు దమ్ములతోడఁ దో ♦ ర్తోడఁ బెంపు
గనుట నచ్చోట సరసులఁ ♦ గలసి మెలసి
యుంట నెవ్వేళ వెలయుచు ♦ నుండుఁగాని
పవలు రే లని భేదమ్ము ♦ పట్టువడదు. ౧౨౧

ఆ॥ సామిధేని శక్తి ♦ సంపదనో కాల, మహిమనో ప్రసక్తి ♦ నహిమకిరణు
కిరణసంక్రమణము ♦ పరఁగుటనో హుత, వహుఁడు ప్రజ్వలించి ♦ నలరు నిచట

క॥ స్వాహాకారము లొప్పఁగ, నీహావిరహితులు తపసు ♦ లిడి గనలుసిఁడు
దాహుతులు పరోపకృతుల్, స్వాహంకారసువిదూరు ♦ లై నెగడొందన్.

క॥ పొలఁతియు ననుజుఁడు రా రఘు, కులప్రదీపకుఁడు సమను ♦ కూలతఁ గృత్య
మ్ములు దీర్చి కులపతిం గని, యల రెఁ దదీయార్చనముల ♦ నగవంశమణీ !

సీ॥ మాపాలిభాగ్య మా♦ మరభూజమున పంట, కామధేనువు పాడి♦కలిమి యనుచు
నీనాఁట మముఁ గాంచ ♦ నేతెంచితే భక్త, వాత్సల్య మింగొలే ♦ వరద! యనుచు
కలుకుటాలును ముండ్లు♦ గాసిసేయవె మేలి, చరణాబ్జముల స్వర్గ♦జనని! యనుచు
వత్స జానకి కూడి ♦ వచ్చెనే మృదులాంగి, కలితప్రజానురా ♦ గమున ననుఁ
దమ్ముడును రావలెనె యిట్టి ♦ దళ నటంచు
నెంచి ఫలమూలముల నేర్చ ♦ రించి యప్ప
నంబు పొనరించి యమ్మౌని ♦ ననుచు వేడ్క
జరిపె వరివస్య హరికి స్త్రీ ♦ జనలలామ ! ౧౨౬

తే॥ నాఁటిరే యట్లు చన మఱు ♦ నాఁటి యుదయ
మునఁ బ్రభాతవిధులఁ దీర్చి ♦ ముద మెలర్ప
మౌనివరుఁ గాంచి సెల వీవె ♦ మహితచరిత !
యన్న సేవింప నన్న నం ♦ యమివిభుండు. ౧౨౯

క॥ నాతండ్రి! పోయిరమ్మా!, నాతరమా కా దనంగ ♦ నాయొక్కని సా
మ్మా తనపదివేనా ళ్లిటు, లీతలఁపున మమ్ముఁ బ్రోచు ♦ టెడపక మనుమా !

తే॥ సీతరమువారిలోఁ గీర్తి♦నెగడు మన్న, యనుచు దీవించి యనుపంగ♦నంత సంత
రంగ ముప్పొంగ వింజ మొ♦క్కడచు చుట్టు, మల్ల తపసిని గనఁబోయి♦రవల నవల.

—♦ శ్రీరాముఁ డగస్త్యభ్రాత యనుజ్ఞ గొనిపోవుచుండ సుతీక్ష్ణుఁ డగస్త్యచరితంబు జెప్పుట. ♦—

క॥ దారితలనె వినిచెఁ దమో, దారి తలఁ పెఱింగి మౌని ♦ తచ్ఛిష్యుఁడు తి
ద్దారితవారితవార్తలఁ, దా రితరులు మే లనంగఁ ♦ దరుణీమణిరో! ౧౩౦

ఆ॥ అమ్మహాత్ముఁ డన్న ♦ నారక్కసుఁడు మిట్టి, పడుచు నోరు దెఱచి ♦ పైకొనంగ
నీరులోని యగ్గి ♦ నీరు గావించె న, య్యాత్మనిఁ గోపవహ్ని ♦ మౌనివరుఁడు. ౨౫౦

క॥ దిగ్గన నుడిఁబడి వాఁ డటు, మ్రిగ్గిన సుర లలరి పూని ♦ మండలపతిపై
సద్గుణనిధిపైఁ గురిసిరి, ప్రగ్గె నెఱియ నలరు లుత్స ♦ వ పర్వతమునన్. ౨౫౧

ఆ॥ తపమునరికిఁ జెన్ని ♦ ధ్యానంబు దాక్ష్యంబు, నెలవు నిలయు మెల్ల ♦ కళల కలిమి
కాత్మ త్రిష్వసన్మ ♦ హాస్పద మమ్ముని, నియతి నీయెఱుంగ ♦ నిదియె రామ!

క॥ ఇదె చేరవచ్చితిమి త, త్పద మాశ్రమవరము పులుఁగు ♦ పలుకుల వగునన్
విదితము లగుచున్నవి గిరిత్రి, పదపీఠధ్వవ్యధన్మ ♦ పద్ధతు లనఘా! ౨౫౩

మ॥ అని యీరాబోధగుణంబు బోధహారు బో ♦ ధాత్ముం బ్రబోధించుచున్
జనఁ జూపట్టె సగస్త్యమౌని వన మా ♦ చారప్రచారాంచితా
వన ముద్యత్సకలర్తుశోభ సకలా ♦ వ్యాఖ్యాత దేవాధిభూ
వన ముఖ్యాగతలోకపావనము దీ ♦ వ్యద్ధ్యాన మన్వారికిన్. ౨౫౪

—♦ అగస్త్యాశ్రమ వర్ణనము ♦—

సీ॥ మృదుదళమ్ములతోడి ♦ మొలఁకున శోభిల్లు, తనులతాలలితవ ♦ ర్తనము గాంచి
ఫలసుమసన్నమా ♦ పత్రిభాసురతరు, నరసమంచత్ప్రభా ♦ వము దలంచి
రోమంథవిస్మృతి ♦ గూఢమౌ మృగాల స్నేహంబు, శాంతనిష్టమ్మృగప్ర ♦ చార మెంచి
ప్రసితవల్కలతోగ ♦ పట్టుపృథ్వస్వక, శ్రీకలాస్ఫురణంబు ♦ చిత్తగించి
తెఱఁగు లెఱుక పఱుచు ♦ ద్విజసూక్తు లాలించి
కుశపు గని తొలఁగని ♦ దృష్టి మించి
రాముఁ డలరె నలరి ♦ గాంచె సౌమిత్రియు
సంతతాత్మ సుఖని ♦ రంతరముగ. ౨౫౫

క॥ దేవర్షిబ్రహ్మర్షులు, సేవింపఁగ బ్రహ్మసదము ♦ సిరి దనరు కలా
శ్రీవిలసనమున నందన, మేనలనుననేనిఁ బోల ♦ దిద్దాని నన్. ౨౫౬

ఆ॥ అమ్మునీంద్రు పదము ♦ నం దడుగిడ నాజ్ఞఁ, గానినఁ గాక యింత ♦ గూడ దనెడు
రాము మత మెఱింగి ♦ రహిఁ సుతీక్ష్ణమహర్షి, గురునిఁ జేర నరిగెఁ ♦ గువలయాక్షి!

క॥ ఆలోనాలోకార్ఘ్య, మాలోకననిపుణుఁ డిట్టు ♦ లని వేడ్కఁ దదీ
యాలోకనపరు లగు హరి, కాలోకకు ననుజునకు న ♦ మంజసయుక్తిన్.

ఆ॥ మిత్తి గెలిచి జగము ♦ మేలున కియ్యాశ, నిలిచె నాశ యెల్ల ♦ నెఱిఁ దెరల్చి
యాత్మనిష్టుఁ డిమ్మ ♦ హామహుం డితనిఁ, బోల నొండు గలఁడె ♦ భువనములను.

ఉ॥ ఈఘను చేరికం గనిమె ♦ నీదిశ దక్షిణ నాఁ బ్రసిద్ధి శాం
తౌఘయు నయ్యె నియ్యెడ దు ♦ రాత్ములు గానరు కాంచు దృష్టియుఁ
మోఘమె కాని యేఫలిత ♦ ముం గనజాలదు త్రాసయుక్తి స్థై
త్యౌఘ మడంగి యున్నటి దు ♦ రాగ్రహాముం బరఁగింప దెంతయుఁ. ౨౬౦

సీ॥ దీర్ఘాయువు విహ్వాని ♦ దితిజులఁ గాల్చి, చ్ఛఖిలార్చితుఁడు సుజ♦నాభిరతుఁడు
సేవించుకొందురు ♦ జేజేలు సిద్ధులుఁ, బరమర్షు లీసిద్ధ ♦ పదముఁ జేరి
ధర్మసంపాదన ♦ తత్పరు లీయెడ, నివసింతు రమ్మెను ♦ నియతి దనర
జీవింపఁ జిచ్చట్టు ♦ జెనసి మృషావాది, కాముకుండు శఠుండు ♦ ఘాతుకుండు
నిందు మేను దొఱఁగి ♦ యేప్రాణి యేనియుఁ
బొందు తలఁపు నొందు ♦ పుణ్యలోక
మెల్ల తపసి గుమికి ♦ నిమ్మైన తలకట్టు
నాయ మగు తపః ప ♦ రాయణంబు. ౨౬౧

క॥ ఇమ్మగు సుకృతమ్మునఁ గల, యి మ్మెనసితి మింకఁ గొఱఁత♦యెందును గనఁ బో
మిమ్మహి వనవాసము శే, షమ్ము గ్రమింపం దలంతు ♦ సౌజన్యనిధీ! ౨౬౨

ఆ॥ కూర్తు నా యెడంద ♦ గూరిమి గలఁడు నా, యెడ నితండు శ్రేయ♦మెల్లగతులఁ
బొనరఁ జేయఁ జాలుఁ♦బుణ్యాత్ముఁ డిమ్మెయి, వారి కొందు మేలు♦దారి వింద.

క॥ అను నెడ నవ్వారు ముదం, బును మొనయుచు నుండ నరిగి ♦ ముని హానివగే
ణ్యునిఁ గాంచె సద్గురూత్తం, సు నితాంతదయాపరీతు ♦ శుభగుణనిరతుఁ.

—♦ సుతీక్ష్ణుఁడు శ్రీరామాగమనవార్త యగస్త్యునకుఁ జెప్పుట. ♦—

సీ॥ తపమునఁ బరకాష్ఠ ♦ దనరంగఁ దనరంగ, మంది వేఁడెడు వారి ♦ నరసికొనుచు
వరగుణం బాగ్నేయ ♦ శరణంబు శరణంబు, గా నున్నశిష్యుల ♦ కలిమిఁ గనుచు
ననిచిన సద్భక్తు ♦ లను వార లను వారఁ, జెనయుము హ్లాదయ ♦ స్థితి కలరుచు
రామమంత్రార్థసా ♦ రము నించు రమ మించు, వేడ్కఁ రసాంచిత♦విస్మృతికిఁ జుచు.
బ్రహ్మసామ్రాజ్యపదపట్ట ♦ భద్రిభద్రి
వేషగుణ వేదపదపీన ♦ పీనవిధి వి
శేష తేజోనిధిముఖప్ర ♦ సిద్ధి సిద్ధి
దొలఁకఁ బులకించు నమ్మహా ♦ త్మునకు మ్రొక్కి. ౨౬౩

ఆ॥ బ్రహ్మమూర్తి! యిదె ప్ర♦పంచావనము వొంది, రాముఁ డనుజుతోడ♦రమణితోడ
నాశ్రమాంతసీమ ♦ సలరుచు నున్నవాఁ, డానకై త్వదర్చ ♦ నార్థి యగుచు.

మ॥ అను నంతం దన యంతరంగమున సొం ♦ గాకాశగంగాచిరం
గని మేల్మే లని కూడి యాడ నరశే ♦ కా దంటినే నామనం
బున నున్నంతలు దోఁచె జాగు తగునే ♦ పొం డింతలోఁ దోడితెం
డు నవీనాభ్యుదయంబ యిందఱకు నె ♦ ట్లు న్భాగ్యయోగంబునన్. ౨౬౭

క॥ రావలెఁబో యొకయెడ నిలఁ, గావలెనే మమ్ముఁ జూచు ♦ కలిమి కనుజల్
కావలెనే మాసుకృతము, తేవలెనే యింతప్రొద్దుఁ ♦ దేఁకువ వెలయన్. ౨౬౮

మ॥ అని యానందమయాత్ముఁడై పొదలుచో ♦ నాశిష్యరత్నంబుతో
ననువౌ వర్గము సేరి రాఁ జని మహా ♦ త్మా! రామ! నీవారు నీ
వనివార్యుల్ గదె రావె తండ్రి! యనుచున్ ♦ హాయిం గనం గాంచుచున్
గొని తెచ్చె న్మహిమోత్సవార్మికలనా ♦ కూలంకషత్వస్థితిన్. ౨౬౯

వ॥ ఆశ్రమప్రవేశ మనుసంధానించి యించు వేడుకమయిం దత్తత్ప్రదేశంబుల విశేషంబుల నెల్ల నామూలాగ్రంబుగా వివరించి తెలుపుచు మఱియు గ్రహప్రతివేశంబులనందగు బ్రహ్మస్పదంబును వీతిహోత్రశరణంబును విష్ణుపదంబును మహేంద్రమండపంబును రవిసోమమండలంబులును భగవద్వేరధాతృవిధాత్రనిలానంతగాయత్రీవసువరుణకార్తికేయధర్మాఖ్యస్థానంబులును నదసీయమాహాత్మ్యమ్ములును వేర్వేర నుగ్గడించుచు సముద్భూతప్రభూతహర్షు లగు నవ్వారలం గొనిచను నయ్యవసరంబున. ౨౭౦

—♦ అగస్త్యుఁడు రాము నెదుర్కొనుట ♦—

ఆ॥ అగ్నిహోత్రహోమ ♦ మాచరించి సమంచి, తార్ఘ్యపాత్రహస్తుఁ♦డై తనర్చి
మౌనిమండలీస♦మావృతుం డగుచు రా, ముని మునీంద్రుఁ డెదురు♦కొనెఁ బురంధ్రి!

శా॥ తేజోరాశివిశేషదృశ్యకలనా ♦ దివ్యప్రభావాఢ్యు న
య్యాజప్రోద్భవు సానుజు న్సహామహీ ♦ జానంతకల్యాణస
ర్వ్యాజస్ఫూర్తిని గన్నులారఁ గని తా ♦ నవ్వాఁగు, నవ్వారిగా
నోజస్మిఱిక మీఱు తృప్తిఁ గని రా ♦ యుష్మన్నిజానాధనా! ౨౭౧

ఆ॥ అంతలోనె రాముఁ ♦ డతివతో ననుజుతో, నందరాని ఫలమొ ♦ యన్నె నందు
కొనుఁ డటంచుఁ గూర్మి♦గొనకొన సాష్టాంగ, వినతిఁ గూర్చె మునికి♦విశ్వవంద్య!

ఉ॥ వారును నట్లొనర్ప ముని ♦ వారని కౌతుక మూఱి వీరు నా
వారని బంధుయోగ మని ♦ వార్యముగా ననువార రండు న
న్నారయవచ్చినారె శుభ ♦ మా సుఖ మంచితమా యటంచు నా
తారకనామ రాము నము ♦ దారత మీఱఁ గదించెఁ గౌఁగిటన్. ౨౭౨

తే॥ అగ్నిపరిచర్య జరిపి రా ♦ నయ్యె జాల, మట్లుగా కరుదేర మే ♦ లనువుపడదు
నీ వతిథిమాత్రుఁడవె జగ ♦ న్నేత వఖిల, కర్మసాక్షి వదియు భవ♦త్కలనగాదె.

ఆ॥ ఎంత మంచి కాల ♦ మేమందు నాభాగ్య, మిట్టి యతిథి యెవరి ♦ కెన్నఁ డబ్బు
ఫలముఁ గంటిఁ గాదె♦భవముఁ గాంచిన నాఁటి, కలిమి కెల్ల నిదియ♦కలిమిగాఁగ.

క॥ అని ముచ్చటలాడుచుఁ దన, త్తను సంగతిఁ బులక లొదవఁ ♦ దపహార్ఘ జలం
బను వరయుచుండ వారలఁ, గొని చనె నంతర్గృహమున ♦ కు న్మునివంద్యా!

క॥ పూజించెఁ బూజనీయునిఁ బూజితు లగు తోడివారిఁ ♦ బుణ్యోదయు వి
భ్రాజితుఁడు తపోధనుఁడు స, మాజమువా రెలమిఁ గన స♦మాహితుఁ డగుచున్

ఆ॥ ఇష్టభోజనముల♦నెలయించి వరయోగ, మిదియె యనుచు నోడివి♦యెల్లవారు
సంతసింప రాము♦సంతసమునఁ గని, పలికె దోసి లొగ్గి ♦ భాసురాంగి! ౨౭౯

క॥ శశినిభముఖ! కలత్రత్వము, విశదము గావించువాఁడ ♦ విధి పేడఁ గుభా
రశమకృతికి నాఁ డీవు క. లశాబ్ధికడ వల్లె యనిన ♦ లా గే వింటే. ౨౮౦

—♦ అగస్త్యుఁడు భోజనాద్యనంతరము శ్రీరాముని తత్త్వము ప్రకటించుట ♦—

ఆ॥ నాఁటఁగోలె నీవు ♦ నామరూపమ్ము లే, దెపుడఁ దలంచుచుంటి ♦ యే తపమ్ము
గాఁగ నుంటి వీరుఁ ♦ గలసి యున్నటిఁ దోడి, వారుగానికిక్షు ♦ వఱలుచుండ.

సీ॥ ఎక్కటి నీ వుందు ♦ వెల్లసృష్టికిముందు, నిర్వికల్పసమాధి ♦ నిష్ఠ దనర
ననుపాధికుఁడవై త్వ♦దాశ్రియత్వద్విష, యయు మహామాయ నా♦నై యొక ర్తు
నిజశక్తి నిర్గుణు♦ని న్నావరించుట, నప్రాకృతునిగ వే ♦ దాంతవేత్త
లరసికందురు దాని ♦ నందురు మూలప్ర, కృతి యని కొందఱు ♦ కెలని యోగ
మాయ యందు రదియు ♦ మలసి సంసృతిబంధ
మై యవిద్య నాఁగ ♦ నై బహూర్త
లందు క్షోభమాణ ♦ యై మహత్తత్త్వంబు
గను స్వసన్నిధాన ♦ కలన రామ! ౨౮౨

ఆ॥ నీప్రకాశ మచట ♦ నెఱయ నహంకార
మమ్మహత్సతార్థ ♦ మందుఁ బొడము
నదియు మాయ గొనము ♦ లంది సాత్త్వికము రా
జసము తామసమను ♦ సంజ్ఞ లెనయు ౨౮౩

ఆ॥ తామసమున సూక్ష్మ♦తన్మాత్రభూతముల్, స్థూలభూతములును♦పొదిఁ దోచు
నింద్రియములు రాజ♦సేచ్ఛ జనించు నా, రెండు సాత్త్వికమున♦నుండు నెగియు.

ఆ॥ ఎల్లసూక్ష్మములును ♦ నెససిన యచ్చోటు, లింగదేహ మనంబడి ♦ యిలఁ స్థూల
భూతసంగ్రహమునఁ ♦ బుట్టి విరాట్టను, రంగ నగుఁ జరాచ ♦ రము జగంబు.

క॥ మాయాగుణభేదంబున, నాఁడు జగత్సర్గనావ ♦ నాంతేచ్ఛాల సీ
కా యజహరిరుద్రాఖ్యల, మేయప్రాభవము దాన ♦ మేకొనె నభవా! ౧౦౬

తే॥ జాగరస్వప్నసుప్తులు ♦ సంభవించు, మాయను గుణముల బుట్టిన ♦ మూఁడవస్థ
లిన్నిటికిని విలక్షుండ ♦ వీవు రామ!, చిన్మయుండ నవ్యయుండవు ♦ స్థిరత వెలుఁగుచుందువు.

క॥ మాయాకృతి సృష్టిక్రియ, నీయంగీకారమునను ♦ నగడుటచే ని
న్నాయదనున గుణవంతుండని, పో యంటురు దాన్నిగాన ♦ పోదలిక ననఘా!

సీ॥ అదియు విద్య యవిద్య ♦ యని ద్వివిధాకృతి, వెలయు నివృత్తిప్ర ♦ వృత్తు లనఁగ
నా రెంటి మార్గంబు ♦ లనుసరించుఁ దద్భక్తి, నిరతులు వేదాంత ♦ నిష్ఠులునగు
వారలు మొదలింటి ♦ వరుసన నిన్నుఁ జేర, ముక్తు లౌదురు వారి ♦ మునయముఁజొంద
సంసృతిబంధంబ ♦ సారు లన్యు లవిద్యఁ, బడి నిత్యసంసార ♦ బద్ధు లౌదు
రమృతమయుఁడు విద్య రూపించ ♦ ననదుగాఁగఁ
దోఁపఁ జేతలంపులు ♦ దొరకొనంగఁ
జెరుచు రేనాఁటికిని ముక్తిఁ ♦ గాదనిని
యఘవినాశి తమ్ము ముంపన ♦ య్యథము లధిప! ౧౦౯

ఆ॥ వేయు నేల రామ! ♦ వివరింతు నాకన్న, యుంతపట్టు నఱ ♦ నానురక్తి
కన్న లేమ వేఱు ♦ గతి యన్యుదయ యున్న, నరుఁడు గాంచు ముక్తి ♦ నంద్యపదవి.

మ॥ సమచిత్తు ల్వీర తేషము ల్వినిహతా ♦ శాపాశులుగా శాంతిదాం
తిమనస్కారసమేతు లాత్మారాములు ♦ స్నిగ్ధభక్తులు న్నిత్యని
ర్మములుం ద్వత్పరసత్కథల్ వినిని ♦ ర్మాయ లున్నసన్మిత్రుల్
యమముఖ్యార్థ్యులు నాఁగ నోప్పునవు దే ♦ వా! సజ్జను ల్సాధులున్. ౧౧౧

ఆ॥ సాధుసంయమమ్ము ♦ సమకూరె నేనిఁ దద్వ, త్సంగ మొదవుఁ దత్క ♦ థాశ్రవణము
నందు రతియుఁ బొసఁగు ♦ నందు భవద్భక్తిఁ, గనుఁ బ్రబోధ మవలఁ ♦ గాంచు ముక్తి.

తే॥ కాన నీపయిఁ బ్రేమల ♦ తుణప్రవృత్తి, యొక్కనాఁడును దలఁగక ♦ యుండుగాత
తనకుఁ ద్వద్భక్తులం దెప్డుఁ ♦ దప్పులు పీడ, రాని దన నప్పుఁగాఁవుత ♦ రాఘవేంద్ర.

క॥ చిరకాలాచరితతప, శ్చరణ మిదే శరణ మని ప్ర ♦ శంసించె భవ
చ్చరణార్చఁ గూర్చి యట్లే, శరణ్యుఁడవు గావె రామ! ♦ చర్చింపంగన్. ౧౧౪

ఆ॥ ఏది యెట్టులైన ♦ నేమి జానకితోడ, నెలయు మయ్య! నాదు ♦ హృదయపీఠి
నాస్మరణమె నన్న♦నాయాసమున భవా, ర్ణవముఁ గడవఁ బెట్టు♦రహిఁ దనర్చు.

క॥ అని పొగడిన మునిఁగని మీా, యనుమతి మెయి నన్నియును స♦మగ్రము లగు మీా
కనరానిది కొనరానిది, యును గలదే యనిన నతిస ♦ ముత్సుకుఁ నగుచున్.

-♦ అగస్త్యుఁడు శ్రీరామునకు దివ్యచాపశరాసిశరధుల నొసంగి రాక్షససంహారముంగూర్చి బోధించుట♦-

ఆ॥ ఇది సమృద్ధరూప ♦ మిక్ష్వాకుకులదీప!, కార్ముకంబు విశ్వ ♦ కర్మనిర్మి
తంబు వైష్ణవంబు ♦ తపనీయమణిరత్న, భూషణోజ్జ్వలంబు ♦ పూజితంబు. ౨౯౭

క॥ ఈశరము బ్రహ్మదత్తం, బీశరధులు రెండు నక్ష ♦ యేషువు లివి ము
న్నాశరుల ద్రుంచి జయ మిడె, శ్రీశుఁడు గొని వాసవునక ♦ ధీశత నెలయన్.

క॥ ఈయసియు నట్లమోఘ మ, మేయగుణం బిన్ని నీదు ♦ మే లరసి యిడ
న్నాయెద్ద నునిచె నింద్రుం, డోయధిపా! గొనుము గెలుపు ♦ మురుతరశక్తిన్.

ఆ॥ అడిచిపడెడు దర్ప ♦ మడర నెల్లెడ దైత్య, మండలంబు నీదు ♦ మర్మ మరయు
వలనె యింక భూమి♦భరముఁ బాపఁ దలంచి, తది పొనర్పు మొంటి♦నడుగ నేల.

తే॥ అనుచు నవి యెల్ల హరికి ♦ సమర్పణంబు, నేసి నిశ్శేషచులుకిత ♦ సింధునాథ
జలభరుం డిట్టు లనె సంప్ర♦సాదభరిత, మానసముఖాబ్జుఁడై పూజ్య♦మానచరణ॥

సీ॥ పరితుష్టి నొందితిఁ ♦ బడతి తమ్ముఁడు నీవు, నాయింటి కేతెంచు ♦ నయముఁగాంచి
బడలితి రిందఱుఁ ♦ బరువంపు టిగురులు, గసిగంబె నడుగులు ♦ కాననగతి
లలితాంగి యిద్దేవి ♦ లావఱఁ జొక్కెడు; నిట్టికష్టము లెన్నఁ ♦ డెఱుఁగ దబల
తన కరుంధతి సాటి♦యనవచ్చుఁ గా కొడ్డ, కనయ మే యిమ్మొయి♦ననిచి సులగఁ
గానఁ బతిదేవతామణి ♦ కలికిమిన్న
లోకమున తరబడి గాదు ♦ లోల లగుచు
ననుసరింతుర్ సుఖస్థితి ♦ యమ రెనేనిఁ
దలఁతు రెడయుంగ నిక్కట్టు ♦ దవిలెనేని. 30౨

తే॥ మెఱుఁగుఁదీఁగెల సడి నొంట ♦ మెలపుగాంతుర్,
ములుకు లట్టులు తైక్ష్ణ్య ♦ మును వహింతుర్
పవనగరుడప్రసక్తిని ♦ జవన లౌదు
రందుర్ గాన నియమవృత్త ♦ మద్భుతంబు 303

క॥ ఎల్లయలంకారమ్ముల, కిల్లుగ నలువొందె నాదు ♦ నిక్క సుమిత్రా
ఫుల్లాబ్జాక్షి కొడుకు నీ, విల్లలితాంగియును ద్రొక్క ♦ నీనాఁ డనఘా! 30౪

ఆ॥ నిలుపుమయ్య నీదు ♦ నెల విది నీయిచ్చ, వచ్చినన్నినాళ్ళు ♦ వనితతోడ
దమ్ముఁగుఱ్ఱతోడఁ♦ ద్వద్భజనమునఁ గా, లముఁ గ్రమింతు మిట్టి♦క్రమము నెఱయ.

— ♦ శ్రీరాముఁడు ముని వీడ్కొనుట. ♦ —

చ॥ అను నెడ రాముఁ డిట్టు లనె ♦ నంజలిఁ గూర్చి మహాత్మ వహ్నిక
ల్పుని నినుఁ జేరి కొల్వఁ దలఁ ♦ పు ల్ఫలియించు మనుష్యకోటి కం
చనుటయు నబ్రమే నిలుతు ♦ మమ్మొయి నిమ్మహితాశ్రమమ్ము గా
కనువగు నొక్కతావు గని ♦ యానతి సేయుము సమ్మదమ్మునన్. ౩౦౬

ఆ॥ పావనాత్మ! నీదు ♦ భావమ్ము గైకొన్న, యెలమి నెచ్చ గంటి ♦ మింతకన్నఁ
గలదె శుద్ధధర్మ ♦ కలన మాకాంచిన, భవము ఫలము సిద్ధిఁ ♦ బడసి వెలసె.

మ॥ ఫలమూలాంబుసమగ్రతాకలన మై ♦ భాసిల్లు నే సీమ యా
విలభావం బనరాని యన్నెలవున ♦ న్వేశ్మంబు నిర్మించి యా
వల నావంతయుఁ జింత లేక నిల భ ♦ వ్యశ్రీలకుం దానకం
బలఁతిం బోక లభించుఁ ద్వాదృశసమా ♦ ప్లోదోదయ మ్మెమ్మెయిన్. ౩౦౮

ఆ॥ అనిన సంతసించి ♦ యంతలు సేయంగఁ, దలఁచి యిచ్చ నిట్లు ♦ దరలివచ్చి
నాడ వనెడు మేలి ♦ జాడఁ గన్గొంటి నా, తపము పేరి త్వద్ద్వ ♦ తమున రామ!

ఉ॥ ఇచ్చట నిల్వ మాటి నిపు ♦ డే యటఁబొమ్మని సమ్మతింప నా
కిచ్చ జనించెఁ ద్వచ్చరిత ♦ మెవ్వని కెట్టు లెఱుంగఁగా నగున్
బొచ్చెము లేక నిన్నుఁ గని ♦ భూపతి గాంచె యయాతి భాతి సం
విచ్చతురానుభావ్యగతి ♦ విచ్చెఁ దమం బఖిలాస్త్రకోటికిన్. ౩౧౦

తే॥ నీప్రతిజ్ఞాతకాలమ్ము ♦ నియతి నెఱయ, నయ్యె నయ్యెడ నివసించు♦మయ్య యెద్ది
యెల్లకృతిసిద్ధులకు మూల♦మే యనంగ, నగునొ యద్దాని దెలఁగేను♦నరయువాఁడ

ఆ॥ అని ముహూర్తమాత్ర ♦ మాధ్యాన మొనరించి, ధర్మతత్త్వసంవి ♦ ధాననిపుణుఁ
డనియెఁ దపసి తండ్రి! ♦ యదె ఫలమూలోద, కాఢ్యమైన కాన♦ నాంతరమ్ము.

క॥ పంచవటీసంజ్ఞితము ప్ర, పంచావనచతుర యదియు ♦ బహుమృగసంభా
రాంచితము పుణ్యతీర్థము, మించు న్గోదావరీస ♦ మీపగ మగుచున్. ౩౧౩

తే॥ రహిఁ బొనర్చు వివిక్తమ్ము ♦ రమ్యతలము, నగుచు సీతామహాదేవి♦యంతరాత్మ
కచటునకు దీనికి ద్వియోజ♦నాంతరమ్ము, గలదు కమలాకరవికాస♦కలనఁ దనరు.

మత్తకోకిల॥ నిత్యపుష్పితకాననం బగు ♦ నీకు నాకును సన్నిధి
ప్రత్యయం బొనఁగూర్చుచుండును ♦ భావిభావరసోచితం
బత్యయంబు లడంపఁ జాలుదు ♦ వన్న! యచ్చట నున్న సం
ప్రత్యభిజ్ఞుఁడ వైన నీనుడి ♦ భాసిలు న్వరమా సడిన్. ౩౧౭

పృథ్వి॥ మధూకవనమాలికా ♦ మహి యదే కనుంగొంటివే
విధుప్రతిభటాననా! ♦ వెలయు దానిక య్యుత్తరా
పథం బగు పథంబు సు ♦ ప్రథము మఱ్ఱి లక్ష్యంబుగా
విధింపు పయనం బట ♦ న్విదితమా గిరిప్రాంతతన్. ౩౧౮

క॥ ఆపంచవటీస్థలమునఁ, గాపుర మొనరింపుమయ్య! ♦ కలమట్టునకుం
దాపసులు గొలువ వత్తురు, శ్రీపతి వీ వనుచు నిచ్చఁ ♦ జెలఁగెదు మదితోన్.

ఆ॥ అని యగస్త్యముని స ♦ మాఖ్యాన మొనరింప. విని జగన్మయుండు ♦ విశ్వసించి
యధికభక్తి నెఱఁగి ♦ యామంత్రణము సేసి, తరలె నతఁడు వనువఁ♦దరళనయన!

—♦ శ్రీరాముఁ డగస్త్యు సెలవుఁగొని పంచవటి కేగుట. ♦—

క॥ అమ్మును లుదకాంతమ్మున, నమ్మాత మనరాని యొక్క ♦ జతనమ్మున నొ
క్కమ్మొడి నిలఁబడి చూడఁగ, నమ్మొయి వీడ్కోలు సూపి ♦ రగకులభూషా!

క॥ సన్నద్ధు లగుచు వడి న, య్యన్నయుఁ దమ్ముఁడును ♦ నడిచి యంతరమున సం
పన్నయయి మహిజ రా న, భ్యున్నత మహాస్థలము సేరి ♦ రుడురాజముఖీ! ౩౨౦

—♦ శ్రీరామునకు జటాయువు కనఁబడుట. ♦—

వ॥ మధ్యమార్గంబున నలువొందు న్యగ్రోధవృక్షంబున సుమహాకాయుండును నతి భీమపరాక్రముండు నగు నొక్క సుపర్ణజాతి పక్షివరేణ్యుం గాంచి రాక్షసుం డగునేమొకో యని శంకించి నీవెవ్వండ వోరీ! యని యవ్వీర లడిగిన నప్పతత్త్రి వంశాభరణంబు వారి చరిత్రం బెల్ల నారసి సౌమ్యస్నిగ్ధమధురం బగు వాచారంభంబున వత్సా! యని రామునిం బేర్కొని వాత్సల్యంబు పెను పొంద గుణాంబుధీ! యేను నీతండ్రికిం బ్రియసఖుండను గాని యన్యుండఁ గాను దయార్ద్ర దృష్టుల నింపు నింపవే యనవుడు నమ్మహానీయుండు పితృపదశ్రవణంబున నవ నవోన్మిషచ్చిత్తవర్తనుండై యాతని సంభావించి యన్నా! నీదు కులగోత్రనామ ధేయంబు లెఱిఁగింపవే యనిన నాతండు వల్లె యని యిట్లనియె. ౩౨౧

—♦ జటాయువు వృత్తాంతము. ♦—

క॥ భద్రముఖా! తెలిపెద ని, ర్నిద్రరఘూత్తంసకులము ♦ ణివి నీ కిట న
క్షుద్ర మగు సంగ్రహమున స, ముద్రితము మదన్వయంబు ♦ మూలం బెల్లన్.

వ॥ భూతసృష్టిముఖంబునఁ గర్దముండును విక్రీతుండును శేషుండును సంశ్రయుండును బహుపుత్రుండును స్థాణువు మరీచియు నత్రియుఁ గ్రతుపులస్త్యాంగిరసులును ప్రచేతసుండును బులహుండును దక్షుండును వివస్వంతుండును నరిష్టనేమియుఁ గాశ్యపుఁడు ననం బ్రజాపతు లావిర్భవించి రందు దక్షున కఱువండ్రు కూఁతులు పొడమి రందదితియు దితియు దనువును గాలికయుఁ దామ్రయుఁ గ్రోధవశయు మనువు ననలయు ననువార లెనమండ్రం గాశ్యపుఁడు ప్రతిగ్రహించి ప్రజాసర్గంబున సుసమాహితలై తన్ను భజియింపుఁ డనిన నం దదితి దితి కాళికలు తన్మనస్కలు భక్తియుక్తలు నై సేవించుకొని రన్యలు సామాన్యవృత్తి వర్తిల్లి రం దదితియం దాదిత్యవసురుద్రాదులును దితియందు దైత్యులును జనించి యెల్లభువనంబులం బాలింపం జాలిరి దను వశ్వగ్రీవాదిందములను గాళిక నరకకాలకులను గనిరి క్రౌంచియు భాసియు శ్యేనియు ధృతరాష్ట్రియు శుకియు నను కన్యకలం దామ్ర గనియె నందుఁ గ్రౌంచి యులూకాదులను భాసి భాసంబులను శ్యేని శ్యేనగృధ్రప్రముఖంబులను ధృతరాష్ట్రి హంసచక్రవాకవర్గంబులం బ్రసవించిరి శుకికి నతపుష్టి నతకు వినత సుతి యయ్యె మఱియుం గ్రోధవశకు మృగియు మృగమందయు హరియు భద్రమదయు మాతంగియు శార్దూలియు శ్వేతయు సురభియు సురసయుఁ గద్రువయు నను పదుగురు ముదితలొదవి రందు మృగికి సర్వమృగంబులును మృగమందకు ఋక్షసృమరచమరంబులును హరికి హయవానరులును గలిగిరి. భద్రమదకు నిరావతి యను పుత్త్రిక యొక్కర్తుక జనించె నద్దాని గర్భంబున నైరావతం బను మహాగజం బుద్భవించె. మాతంగికి మాతంగమ్ములును శార్దూలికి శార్దూలగోలాంగూలమ్ములును శ్వేతకు దిశాగజమ్ములును నపత్యమ్ములయ్యె సురభికి రోహిణియు గంధర్వియు నన నిరువురు పుత్త్రిక లుదయించి రందు రోహిణి గోమాతయు గంధర్వి యశ్వమాతయు నైరి. సురస నాగంబులను గద్రువ పన్నగంబులను సంతానంబులుగాఁ బడసిరి. మొదలింటి యెనమండ్రలోని మను వను నది మనుష్యులను ననల యను నాపె మహావృక్షంబులను గాంచి రివ్విధంబున నఖిలచరాచరభూతసృష్టి సంభవించె. ౬౩

— ♦ అరుణ గరుడోపాఖ్యానము. ♦ —

సీ॥ శుకి పౌత్త్రి వినతయు ♦ సురస సోదరి కద్రు, వనువార లిరువురు ♦ హాస్యమునకు
నింద్రహయముఁ గాంచి ♦ యెల్ల దెల్పని యోర్తు, తోఁక నల్లయటంచుఁ ♦ దోడరి యోర్తు
సాఁగి పందెమ్ములు ♦ చఱచి యొండొరులకు, దాస్యమ్ము పణముగాఁ ♦ దవులు కొలిపి
యిరువు రేరం గని ♦ తెల్లి చూత మటంచుఁ, గద్రువ తన మాట ♦ కల్లయౌట

వ॥ పదంపడి యమ్మహాత్ముండు గరుడుండు జగదీశు వాసుదేవుని సేవించి తదీయాను గ్రహంబునం దద్వాహనంబై కరంబు డంబు మీఱె. 330

ఆ॥ రాఘవాన్వవాయ ♦ రత్నంబ! యయ్యరు, ణుంత శ్యేని యను పొ ♦ లంతియందుఁ గాంచె స్వానుభావ ♦ సంచితతనుల మ, మ్మరుణుఁ డిరువురను స ♦ మగ్రబలుల.

వ॥ సంపాతి యనువాఁ డగ్రజుం డేను గొండొక జటాయు వనెడువాఁడ నొక్కకారణంబున నన్నయు నేను భిన్నపదస్థులమై యొండొరుల వార్త లరయం గానక యుండి పొండునకీ యండనై వేఁచి యున్న నన్నుఁ గొండొక కాలంబునకు మీ తండ్రి దశరథసార్వభౌముండు నిండు చెలిమి మేకొనంగై కొని తనయంతవానిగా సంభావించి గారవించుచునుండె. నియ్యది నాదు వృత్తాంతంబు. 332

ఆ॥ అమ్మహాను భావుఁ ♦ డరిగె నే నుంటి మా, యయ్యలార! కన్ను ♦ లార మిమ్ముఁ గంటి గంటలేని ♦ కలిమి గైకొంటి నా, వంటి సుకృతి గలఁడె ♦ వసుధలోన.

వ॥ అని నెయ్యంబు తియ్యంబుగాఁ బలికి యప్పతంగపుంగవుం డయ్యాజితనయాగ్రణి హితనయాగ్ర్యమణి నల్లనం గనుంగొని. 334

ఆ॥ అన్న! మీరు లిమ్మ ♦ హారణ్యమున వసి, యింప వచ్చినార ♦ లింతితోడ గమ్ముసురక్కసులకుఁ ♦ గాపురం బిప్పొలం, బట్లుగాన నొక్కఁ ♦ డడుగువాఁడ.

క॥ పోకున్న యుండెద మీరే, వాడ కరిగిరేని వచ్చు ♦ వల నరయుచు నే వాఁడుఁ గనువిచ్చి చూచుట, కోడఁగ నాబలిమికలిమి ♦ యొప్పారంగన్. 336

— ♦ శ్రీరాముఁడు జటాయువుసాయము నంగీకరించుట. ♦ —

ఆ॥ అనువు పడున దేని ♦ నంగీకరింపఁగ, నగు నటన్న నింత ♦ కధిక మైన మేలు గలదె ♦ మేకొనఁగంటి మిం, తండ్రిచెలిమిగూర్చు ♦ తత్ఫలమున.

క॥ అని యాతనిఁ దోడ్కొని యటుఁ, జని వాఁ డౌకఁగించుచుండ ♦ జనకుని వార్త ల్విని సంతసమునఁ బొదలుచు, మొనసిరి పంచవటిఁ జేర ♦ ముగ్ధమృగాక్షీ!

ఆ॥ అరులఁ గాల్పు చిచ్చో ♦ యన రాముఁ డప్పొటు, సేరి మెఱసె మిత్త్ర ♦ సిద్ధి కొసరు గాఁగ లక్ష్మణుండు ♦ కడలేని గొనముల, ప్రో వెడమ్ము పడని ♦ ప్రోవు నెఱప.

క॥ దండఁ గల కొండచఱియల, నుండ ఖగేంద్రున కనుజ్ఞ ♦ యొసఁగి కడఁగి య య్యండజవాహనుఁ డనుజుని, దండిమగనిఁ గాంచి పలికె ♦ ధరవంశమణీ!

క॥ అని తెలిపిన రాముని శా, సనము శిరమ్మున ధరించి ♦ సౌమిత్రి పుర
స్సొనరించెను మనువంశా, మ్మున కలనల చాౌ ప్పెలర్ప ♦ మునివంద్యపదా !

సీ॥ కల మృత్తికల గోడ ♦ కా ప్రొక్కి ఘట్టించి, స్తంభము ల్భిత్తిక ♦ ల్సంఘటించి
యాశమీశాఖల ♦ నగు దూలము లమర్చి, యుపకరణమ్ము ల ♦ ట్లొనరుపతిచి
వంశాస్తరణములు ♦ న్వైణవమ్ములు గాఁగ, మొగకొల్పి దృఢపాశ ♦ ముల బిగించి
శరకాశకుశపత్రి ♦ సంఛాదనమ్మును, మొనయించి వాకిళ్లు ♦ తనరఁ దార్చి
చదురు లరుగులు గదులు పూ ♦ జాగృహములు
సముపహితములుగా నేర్మి ♦ సంతరించి
సంస్కృతిస్మృతిప్రసంగ మ్మె ♦ సంగఁ బర్ణ
శాల సువిశాలఁ గూర్చె ని ♦ క్ష్వాకుకులుఁడు. ౩౫౧

క॥ తతలక్షణపదము సమీ, కృతతల మతిరమ్యమును సు ♦ కీర్తితమును నై
వ్రతభాస్కవిధిసంప, త్ప్రితతి యనం దనరి పత్ర ♦ భవనం బొప్పెన్. ౩౫౨

క॥ అలఘుబలవిక్రముఁడు వాఁ, డలరుచు గౌతమిని స్నాతుఁ ♦ డై నళినములున్
ఫలములుఁ గొని తెచ్చి సదన, బలిపూజావిధు లొనర్చె ♦ భవ్యవిలాసా. ౩౫౩

—♦ లక్ష్మణుఁడు నిర్మించిన పర్ణశాలం గాంచి సీతారాము లానందించుట ♦—

తే॥ అన్న ! గనుఁగొనుమన్న మి ♦ న్నంది దాని
యందమును జందమును మేల్మి ♦ యనఘతయును
నొలఁతుకయుఁ గాంచి మే లెంచి ♦ మించి యనుజుఁ
గౌఁగిటఁ గదించి పలికె శ్రీ ♦ కాంతుఁ డజిత ! ౩౫౪

తే॥ భావమును గృతమును ధర్మ ♦ పద్ధతియును
నిక్కమయి తెలియఁగువార లి ♦ య్యలను గలరె
ధన్యుఁ డయ్యెను నినుఁ గాంచి ♦ దశరథుండు
సత్యసంధుం డనెడు వార్త ♦ జగతి తెలియ. ౩౫౫

క॥ సంతోషించితి వత్సా !, సంతత మీభక్తి యే పొ ♦ సఁగుఁగావుత మి
ట్లింతకు నాయిడినది సు, స్వాంతం బాలింగనప్రి ♦ చారమె సుమ్మీ. ౩౫౬

ఆ॥ అట్లు రాముఁ డనఁగ ♦ నవనిజ దీపింప, దాసకృతుల కింత ♦ దలఁచి పొగడ
నేల యనుచు వారి ♦ కెలఁగె వాఁ డవ్వార, లాదరించి రతని ♦ ననఘమూర్తి !

క॥ మందిరశరణుఁడు త్రిజగ, న్మందిరుఁ డటు సురల మునుల ♦ మనుపఁగ మహిజా
క్షేందిరతో నయ్యటవీ, మందిరమున నుండె నాస ♦ మయమున మహితా !

ఆ॥ జాగరూకుఁ డైన ♦ శౌరిఁ గొల్వఁగ వత్తు, రెటులొ నెల్లవారి ♦ దేని యుపకా
కేనుఁ దగఁ బ్రయంచు ♦ నేతెంచె హేమంత, మంతరంబుఁ గాంచి ♦ యనలసనయు

—♦ హేమంతర్తు వర్ణనము ♦—

సీ॥ వడకించెఁ బడతులఁ ♦ వలను బాసితి మని, యాహిమాన్గ్నులు గాని ♦ యట్టివారిఁ
జుళుకించె ఝరుల భా ♦ సురములౌ జలముల, నల్లనల్లనఁ జేరి ♦ యొగ్గినదమునఁ
బలికించె నేమన్క ♦ పట్టుగట్టులు హిమ, వంతమును గ్గ వంచుఁ ♦ బట్టు పట్టి
నడికించెఁ దీర్ఘ ము ♦ న్న నెగించుకొని పోవు, మనుజుల నిల్లెన్ను ♦ మనసు నేసి
యెంతకుం జాల మేను హే ♦ మంత మొక్కఁ
డైన ముజ్జగముల మంతు ♦ మామతించు
మిందు మాపాఁడె జాబిల్లి ♦ యినుని తెల్వఁ
గాంచుఁ డని వీఁచు నమ్మంచు ♦ గాలి వాలి. ౩౬౧

క॥ కుంపటి యీసంసారము, దింపితి మని మురియువారు ♦ దేశ లగుదు నా
తెం పెనయు లేనివారును, గుంపటి యొండొకఁ డెన్ను ♦ కొని రెల్లజనుల్. ౩౬౨

ఆ॥ ఒంటి కేమి పండు ♦ పంట లింటికిఁ జేర్చి, గంటఁ బాప నేర్చు ♦ నిల్పగలదు
కంటివిందు నేలఁ ♦ గావించు నిధి యింత, కంటు మేలి నాటి యొు ♦ నేగదం సెలవు.

క॥ బంతులు చేమంతులు నిను, మంతయు నెడ యీరాక ఘ్రాణ ♦ లందచున్ననేకల్
గొంత కొలంత దొలఁగె హే, మంతర్తువు కలవునందు ♦ సుమాభ్యాసన్న స్తే.

శా॥ అక్కాలంబున గౌతమీనదికి స్నా ♦ నార్థంబు సీతాన్వితో
దృక్కాంతుం డనుజుండు భావినియు న ♦ ర్థం దోడ నేతేరఁ బ్రా
గ్దిక్కాదిత్యుఁడు నేరరాకమును దీ ♦ ధత్యోఘ మర్దేవు తా
దృక్కృత్యంబు సమర్థత న్నెఱపఁ బ్రీ ♦ తిం గూర్చుచుం బాపుచోన్. ౩౬౪

క॥ అన్నఁ గని తమ్ముఁ డి ట్లను, నన్నా! నీమనమునకు స ♦ మాస్వాదకమౌ
సన్నుత మగు సమయం బా, సన్నం బైనది ప్రశస్తి ♦ సంవలితముగన్. ౩౬౫

తే॥ దేని కలిమి వత్సర మెల్ల ♦ దీప్త మగునో, త్వన్మనసీమణి కది యలం ♦ కార మిదునో
యట్టి హేమంత మీయెడ ♦ నరుగుదెంచె, నీప్రసాదంబుఁ గాంచ నో ♦ నెఱి యెఱింగి.

సీ॥ మంచు గ్రమ్మెడు నన్న ♦ మాట యొక్కఁడె కాని, సస్యశాలిని యయ్యె ♦ క్ష్మావధూటి
జలము లత్యంతశీ ♦ తలములే యగుఁగాని, వరణీయుఁ డగు హవ్య ♦ వాహనుండు
చలియోట కింట భూ ♦ జను లుందు రనికాని, దండయాత్రఁ జరింత్రు ♦ ధరణిపతులు
సారసరసలబ్ధి ♦ సన్నంబె యాఁగాని, సంపూర్ణ మహా గోర ♦ సపరిచార

మరయు నేలోపమును లేని ♦ దని యొకండు
గలదె గుణవృద్ధి గని దానిఁ ♦ గప్పి పుత్త్రు
రెల్ల సంపదలకు నిది ♦ హేతుభూత
మౌటఁ గాదె ప్రతిపత్రిశం ♦ సార్హ మయ్యె. ౩౧౭

తే॥ ఆగ్రయణము లొనర్చెద♦రాహితాగ్ను, లెల్ల దేవర్షి పితృపూజ♦ లెలయుచుండు
జనపదములొప్పెడుఁ గలాప్ర♦చారములను, మంగళాశంస లెల్లెడ♦మలయునిపుడు,

తే॥ ఎండ పూర్వాహ్ణమున నింత ♦ యొఱుకపడదు
స్పర్శసుఖ మిదు నదె నడి ♦ జాము వేళ
నరుణపాండుర మగుచు సా ♦ యాహ్నమునను
గనులపండువు ఘటియింపఁ ♦ గాఁ గడంగు. ౩౧౮

తే॥ స్వకము సౌభాగ్య మారవి♦సంక్రమింప, మంచెనసి యెత్తు నగు తన♦మండలమునఁ
గందువాఱిన యద్దంబు♦కరణిఁ జంద్రుఁ, డందగింపఁడు తొల్లింటి♦యట్లధీశ!

తే॥ అల్లనల్లనఁ దొడరి హి♦మావృతంబు, లైన కరముల భూస్థలి♦నందలేక
పగటి చందురుఁ బోలెడు♦భానుఁ డిపుడు, తపనశబ్దార్థతత్త్వంబు♦దారి తలఁగ.

సీ॥ ఎదిరి దిక్కునఁ బ్రొద్దు♦పొడలంగ నుత్తర, దిశ బొట్టులేని స్త్రీ♦తెఱఁగు నూపె
నినుఁడు దూరగుఁడు గా♦నివ మెల్లెడలఁ గప్ప, హిమవత్పదార్థ మ♦గేంద్ర మొనసెఁ
బున్నమ రేయెండ ♦ పోనరార చాతప, శ్యామయామా నాగేటి ♦ చాలు భాతి
నీహారముక్తార్క ♦ నిహితాంశువుల శాద్వ, లావని రత్నశో ♦ భాఢ్య యయ్యె

పగలు సన్నగిల్లెఁ ♦ బ్రబలె నట్టి త్రియామ
శయ్య లాకసంబు ♦ జాడఁ జూడ
వయ్యె నళినవనవ ♦ నాళులు రిక్తతఁ
గనె హిమాని నెగడు ♦ కాల మడర. ౩౨౨

క॥ మున్నెండఁ గన్నెఱుంగని, కన్నెలు జల మంచు ముట్టఁ ♦ గాఁ జాయయటం
చెన్నఁగఁ దలఁపరు హిమవే, లౌన్నత్యం బింత లనియు♦నవరా దనఘా! ౩౨౩

ఉ॥ మంచను చీరె గప్పుకొని♦మానగు పూవుల సొమ్ము లూడ్చి యా
సంచున నిద్రఁ గాంచు వన ♦ సంతతి నాశుకశారికాళి తె
మ్మంచన దంచున న్నిలిచి ♦ యట్టె కనుంగొనుఁ గాని నీట ము
ఙ్కంచదు నీరపక్షితతి♦యుల్లము ఝల్లన గొంప ముంపఁగన్. ౩౨౪

క॥ చల్లనిది తీయనిది ముద, ముల్లసిల్లఁగఁ జేయునదియు ♦ సుపవిత్రము గిరి త్రా
నల్లనఁ గర మిడి వెంబడిఁ కల్లోలపడుం దృప్తికరము ♦ కలభాషము గంగే. 324

తే॥ చకితు లాహవమున నట్లు ♦ జలమున నవ
గాహనం బొసరింప వీ ♦ కవివితతులు
లోఁగి యొద్దునఁ గూయు వా ♦ లుకల దడిసి
మంచుపొగ లెమ్ముఁ గ్రమ్మి పై ♦ మాయఁ జేయు. 325

ఆ॥ మేలి మంచు పడుట♦మృదువు భాస్కరుఁ గాంచుట, జలము రస్య మైన దో♦సగుఁ గాని
సరసు లొఱవు గనవు ♦ క్షతదళకర్ణికా, కేసరాబ్జనవి ♦ గీర్ణ తతులు. 326

—♦ లక్ష్మణుఁడు భరతు గుణముల నన్నతోఁ జెప్పుచు సంతోషించుట ♦—

సీ॥ అన్న కోసలనాథుఁ♦డానరసింహుండు, భరతుఁ డేమరుపాటు గన్న♦వాఁడు కొంత.
నీమీఁది భక్తిచే ♦ నెఱి బాసి వ్రతనిష్ఠ, సలుపుచు నున్నాఁడు ♦ సంతతముగఁ
గలిమిభోగము లంచుఁ♦ గాంక్షింపఁ డేనాఁడుఁ, దపస్వి సద్వ్రతపరతఁ ♦ దనుపులు మిని
నియమితాహారుఁడై ♦ నేల సెజ్జను జడ, లట్టిన తల వ్యథ ♦ కారణముగ
మేను వైచి పదంపడి ♦ మేలుకాంచి
సారవజలంబులం దిట్టి ♦ సమయమునను
స్నాతుఁడై కొందఱం గూడి ♦ జరుగునప్పు
డేమిగతిఁ గానఁబడు వాఁడొ ♦ యెఱుకపడదు, 327

క॥ సుకుమారుఁడు సుందరుఁ డ, త్యకలంకుఁడు సత్యవాది ♦ యాస్తికుఁడు
సుకృతజ్ఞుఁడు కృతి నేఁ డే, వికలతనై యున్నవాఁడొ ♦ విధికృతివశతన్. 328

ఆ॥ గెలిచినాఁడు దివముఁ ♦ గేలిమై నీభ్రాత, భరతుఁ డమ్మహాను ♦ భావుఁ డెపుడు
నిన్నె తలఁచి కొలిచి ♦ నెఱిఁ దత్పదధ్యాన, నిరతిఁ దవిలి యిట్లు ♦ నెగడు ఘనత.

ఆ॥ తండ్రితోడివారి ♦ దాయాదు లని వీడ, నెంతు రమ్మవైపు ♦ నెలమి గాంతు
రెపుడు ద్విపదు లనెడు ♦ నీవార్త రిత్తగాఁ, జేసెఁ గైక సుతుఁడు ♦ శ్రీకరుండు.

తే॥ దశరథునిఁ జెట్టఁ బట్టి శు♦ద్ధతఁ బరఁగియు
భరతు సజ్జననందితుఁ ♦ బడయఁ గనియు
నట్లు క్రౌర్యంబు వహియించె ♦ నంబ కైక
కేకయుల దోసమో పూర్వ ♦ కృతము ఫలమొ. 329

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునితోఁ గైకను నిందింపవలదని పలుకుట ♦—

క॥ అను మాడ్కి సహింపక కి ట్లను, ననఘుఁడు శ్రీరామచంద్రుఁ ♦ డన్నా! నీ వ
ట్లనఁజనదు మధ్యమాంబిక, ననవద్యయ యామె తలఁప ♦ నన్నివిధములన్. ౩౮౩

క॥ భరతుని వార్తలె తెలుపుము, పరమాప్తుఁడు నాని కెడము ♦ పడి ననిష్ఠా
నిరతుఁడ నగు నామది లో, ద్భరితప్రీతి నగుచుండు ♦ బాలిశ మనగన్. ౩౮౪

తే॥ మానసాహ్లాదకరములు♦మధురములగు, నతనిపలుకులె స్మరియింతు♦నహరహంబు
నమృతనుయములౌ యనుకొందు♦నంతరంబు, దోపకుండుట మదిని ని♦గ్రహాత్మవైరి?

క॥ ఎన్నఁటికిఁ గాంచ నగునో, యన్నా! భరతునిఁ ద్వదీయ ♦ ననుజన్ముని నీ
వు న్నేనును వారును ము, న్నున్నట్టులె యుండి యరుస ♦ మొలయం గలమో.

క॥ అని యుత్సుకతం బెరయుచు, ననుజుఁడుఁ దా మహీజయును మ♦హాగౌతమిఁ దోఁ
గ నియతి ప్రవతత్పృష్టం, బొనరించి నుతించి దినుని ♦ బూర్ణేందుముఖా! ౩౮౬

తే॥ అమ్మెయిఁ గృతాభిషేకుఁడై♦యనుజుతోడ, సీతతో రాముఁడొకవింత♦సిరిఁదనర్చె
నీవు విష్ణుండు శోడుగా♦నియతి నొకట. స్నానమొనరించి నే మించు♦చందమునను.

ఉ॥ ఆహ్నికకృత్యము ల్నెఱపి ♦ స్వాశ్రమభూమికిఁ జేరి తీర్ణమా
ర్గాహ్నికులై మును ల్గొలువ ♦ నా సభ సత్కథలం దనర్చి సా
యాహ్నికముం బొనర్చి సుఖ ♦ మందిరి నిచ్చలు నట్లె యుందురే
నిహ్నవపుం గృతిం గనని ♦ నేమము ముజ్జగము ల్నుతింపఁగన్. ౩౮౯

సీ॥ సీతతో రాముఁ డొకనాఁడు ♦ చెలువు మీఱఁ
జిత్రతోఁ జందురుని యట్లు ♦ చెలఁగుచుండ
నంజలి ఘటించి శుశ్రూష ♦ కలరు కలన
లరసి లక్ష్మణుఁ డిట్లనె ♦ నలరుఁబోడి. ౩౯౦

—♦ లక్ష్మణుఁడు తత్త్వోపదేశంబు సేయుమని శ్రీరాముఁ బ్రార్థించుట ♦—

క॥ ఏ నజ్ఞానము దలఁగఁగ, నీనెనరున మోక్షమార్గ ♦ నిర్ణయ మరయం
గా నెంచితిఁ గావవె యని, పూని యెఱింగించి నన్నుఁ ♦ బురుషోత్తమసా! ౩౯౧

తే॥ తనకు నీకన్న దైశికో ♦ త్తము లొకొండ్రు, లేరు లీలావిభూత్యవ ♦ లీఢమూర్తి
వచ్యుతుఁడ వట్లు గావున♦నవధరించి, న న్నొనర్పవె ధన్యు మ♦న్నాథ! నేఁడు.

తే॥ రాగవిద్వేషహారము నై ♦ రాగ్యకరము, జ్ఞానవిజ్ఞానభక్తివి ♦ స్తారకంబు
నైన తత్త్వంబు బోధింపు♦మయ్య! దాన, నిన్నుఁ గొలిచి భవాంభోధి♦నిస్తరింతు.

క॥ అనిన యనుజన్ము పలుకుల, కనుమోదితుఁ డగుచు వాని ♦ యాత్యంతికభ
_క్తినిఁ గనుఁగొని మెచ్చుచు ని,ట్లని రాముఁడు దెలుపఁ దొడఁగె ♦ నసురముఖ్యనుతా!

—♦ శ్రీరాముఁడు లక్ష్మణునకుఁ దత్త్వోపదేశం బొనర్చుట ♦—

తే॥ అతిరహస్యంబు నిష్కృష్ట♦మైన తత్త్వ, మే నెఱిఁగింతు వత్స! నీ♦ వెఱుకపడఁగ
గాంచు సిద్ధాని నరసియా♦క్షణమె ము_క్తిఁ, బొదలు వైకల్పికభ్రాంతి♦వదలినరుఁడు

సీ॥ పరఁగ మాయాస్వరూ♦పము మున్న వివరింతు, సమనంతరము జ్ఞాన♦సాధనంబు
విజ్ఞానయుతము సం ♦ విద్యోగ మాదటఁ, బరమాత్మతత్త్వాను ♦ భవముఁ బిదప
నలరు నద్ది వొసంగ ♦ సభయప్రతిష్ఠుండ, వయ్యెద వయ్య నీ ♦ వనఘమూర్తి
వాత్మబుద్ధి యనాత్మ♦మైన శరీరాది, యందుఁ దోచుట మాయ♦యనఁదనర్చు
వఱలు దాన సంసృతి పరి ♦ వర్తనంబు
తాను విక్షేపరూపంబు ♦ దవిలి జగము
లెల్లఁ జేయు నావరణాత్మ ♦ నెనసి జ్ఞాన
మావరించును దన్మాల ♦ మరయు టరిది. ౩౯౮

తే॥ అనఘ ! కేవలుఁ డగు పర ♦ మాత్ము నందు
మాయచేఁ గల్పితంబయి ♦ మలయు జగము
రజ్జువున సర్ప మట్లుఁడై ♦ భ్రాంతి కలిమిఁ
దోఁచుచుండు వివేచింపఁ ♦ దొలగుచుండు. ౩౯౯

క॥ వినునది కనునది స్మరియిం, చునదియు నన మున్నుగాఁగఁ ♦ జొప్పడునది యె
ల్లను నన దన నగు స్వప్నం, బునఁ బొనరు మనోరథంబు ♦ పోల్కిఁ గృతార్థా!

తే॥ తనువె సంసారతరుబీజ♦మని దృఢముగఁ, దలఁపు మది దారపుత్రాది♦కలల కెల్ల
మూల మగుఁ గాదె యద్దాన♦మొనయుజీవ, భావబంధభేదము లాత్మ♦పక్షము నకు.

తే॥ భూతతన్మాత్రపంచకం ♦ బులు నహంత
బుద్ధి మన మక్షదశకంబు ♦ మూలభూత
ప్రకృతి యాభాసుఁడును జేరఁ ♦ బరఁగు క్షేత్ర
మింతకు విలక్షణుఁడె యాత్మ ♦ యిద్ధచరిత ! ౪౦౦

క॥ తా జీవుఁ బ్రబోధించుట, కేఁ జెప్పెద సాధనముల ♦ నిడు మిది యెదలో
ధీజన్య భిదయె క్రమముగ, నాజీవపరాత్మభేద ♦ మయ్యెఁ గుమారా! ౪౦౧

వ॥ మానాభావంబును దంభహింసాదిపరివర్జనంబును బరాక్షేపాదిసహనంబును నవక్ర
భావంబును ద్విశుద్ధిపూర్వకంబుగ గురుపరిసేవనం బొనరించుటయు బాహ్య

భ్యంతర సంశుద్ధియు సత్క్రియాస్థైర్యంబును మనోవాక్కాయదండంబును విషయ నిరీహత్వంబును నిరహంకారత్వంబును జన్మజరాద్యాలోచనయు నసక్తియు సుత దారధనాదులయెడ స్నేహశూన్యతయు నిష్టానిష్టాదుల దెస సమభావంబును సర్వాత్మకుడనైన నాయం దనన్యవిషయం బగు మతివిశేషంబును వివిక్తదేశనిషే వణంబును ప్రాకృతజనసంవాసవైముఖ్యంబును స్వాత్మజ్ఞాన ప్రయత్నంబును వేదాంతార్థావలోకనంబును నను నీసద్గుణంబు లలవడునేని విధ్వస్తతమస్సముద యం బగు జ్ఞానోదయంబు సముదంచితంబుగా సంఘటిల్లు. ౧౦౨

సీ॥ దేహేంద్రియప్రాణ ♦ ధీమనోహంకృతి, లక్షణాకృతికి వి ♦ లక్షణుండ
సురుచిరచిన్మాత్ర ♦ శుద్ధబుద్ధాత్ముడ, నే నంచు నిశ్చయం ♦ బెనయు దేని
చే నది జ్ఞానంబు ♦ చిత్ప్రకాశక మేక, మద్వితీయ మఖండ ♦ మక్షరంబు
పరిణామధీగుణో♦పాధిసంగవిముక్త, మానందపూర్ణమ♦వ్యయము నిత్య
మైన పరమాత్మతత్త్వంబు ♦ నందు సామ
రస్యయోగంబు యత్ప్రచా ♦ రమునఁ దనరు
నట్టి జ్ఞానంబె విజ్ఞాన ♦ మది గురూక్తి
శాస్త్రసిద్ధంబు నాఁ జను ♦ జనవరేణ్య! ౧౦౩

తే॥ అట్టి జీవపరాత్మల ♦ నైక్య మెప్పు, సద్గురుప్రోక్తలక్ష్యాప్తి ♦ సముదిత మగు
నప్పుడె యవిద్య కరణకా♦ర్యములతోడ, నంతరించును పరమాత్ము♦నంతరమున.

ఆ॥ ఆయవస్థ ముక్తి ♦ యన నొప్పు నద్దియు, నౌపచారికమె ప ♦ రాత్మునందు
వెలయు మింక జ్ఞాన ♦ విజ్ఞానవైరాగ్య, సహిత యిట్టి యమృత ♦ సంసఁ బెరసి.

క॥ ఇది దుర్లభ మని యెంచెద, నదనున మద్భక్తివిముఖు ♦ లగువారికి నే
యది పగలు సులభ మగు న, ప్పది మే నిశఁ గంటఁ బడయఁ♦బొల్పడని గతిన్.

తే॥ కాన మద్భక్తిపరులకే♦జ్ఞాన మొదవు, జ్ఞానము లభింప బ్రహ్మసా♦క్షాత్కృతి యగుఁ
దనరు నెన్నియొ భక్తిసా♦ధనము లగుచు, నందుఁ గొన్నిటి వినిచెద♦ననఘ! వినుము.

సీ॥ మద్భక్తసంగతి ♦ మత్సేవనాసక్తి, మత్కథాశ్రవణసం ♦ పత్ప్రసక్తి
పఠనతద్వ్యాఖ్యాన ♦ పరత మదర్చనా, పరినిష్ఠకీర్తన ♦ భజననిరతి
మన్నామపదబీజ ♦ మంత్రజపాత్యంత, సంసక్తి సజ్జన ♦ సాధురక్తి
యేకాదశీముఖా ♦ భీష్టదాయివ్రతా, చారానుమోదప్ర ♦ చారయుక్తి

సంతతము గల్గి వర్తించు ♦ సాధకునకు
భక్తి యవ్యభిచారిణి ♦ పరఁగ నిచ్చు
లది యొకఁడె ముక్తి నందఁజే ♦ యంగఁ జాలు
జ్ఞానవిజ్ఞానవైరాగ్య ♦ సంశ్రయమున. ౪౦౯

క॥ నీయడిగిన యర్థము ముని, గేయము నే వినిచినాఁడ ♦ గీలించి మనం
బీయెడ శ్రీయుతుఁడై యమ్మాయిని, శ్రేయసముం జెందు సరసిజ ♦ చిరసుస్థిరతా.

ఆ॥ ఇంద్రరాజ్య మొసఁగె ♦ నేనియు నీయది, మొదలు భక్తియోగ ♦ మునకుఁ జనని
కాదరించి పిలిచి ♦ యవ్వాని కిడు మిది, భక్తియుక్తి నోందు ♦ సరగు నేని. ౪౧౦

క॥ మనసంవాదం బెవ్వం, డనితరసులభ మని తెలుచు ♦ నామ్నాయినుఁడా
ఘనుఁడై సుశ్లోకుండై, యనన్యుఁడయి వాఁడు ముక్తి ♦ నందు సుస్థిరా! ౪౧౧

శా॥ భక్తు ల్యోగపరు ల్వినిర్మలతర ♦ స్వాంతుల్ప్రశాంతుల్ సదా
సక్తాధ్యాత్మవిచారు లాపనిషద ♦ శ్రీద్ధానుబద్ధాత్ములు
ద్రిక్తాజ్ఞానతమోనిహంతృమదుపా ♦ ధిధ్యానసంభావనో
ద్యుక్తు ల్సన్మతియుక్తులు న్స్వపదసా ♦ యుజ్యాప్తిగాఁ గాంతురా! ౪౧౨

—♦ లక్ష్మణుండును సీతయు రాముని తత్త్వోపదేశముగ నానందించుట ♦—

తే॥ అని ప్రబోధింప లక్ష్మణుఁ ♦ డంతరంగ, మంతయును సంతసమున కాఁగ ♦ సంతసమున
దెరల సేవించె రాము వై ♦ దేహి హాగ, భక్తచింతామణీ! గుణా ♦ భరణ! యనుచు.

తే॥ సంతతసుఖానుభూతిని ♦ సాంద్రు లగుచు
మునులు ననుజుఁడు మహిజయు ♦ మొనసి కొలువ
రాముఁ డటు సర్వసుజనాభి ♦ రాముఁ డగుచుఁ
గడపెఁ గొండొక కాలంబుఁ ♦ గమలనయన! ౪౧౩

క॥ నిత్యానందమయుం డటు, సత్యాప్తి తెమ్ములు దొలఁగ ♦ సత్ప్రసన్నులుఁ దా
సత్యానుజన్ములతో సా, మత్యముతో నిలిచె నచట ♦ మహీభృత్స్తనుఁడా! ౪౧౪

క॥ అని శివుఁ డెఱిఁగించిన శివ, విని చేతోవృత్తిఁ దద్వి ♦ వేచనపరత
న్మౌనయించి కొంత తడవున. కనంతరస్థితి వచింపు ♦ మని యడుగుటయున్.

ఉ॥ అక్షరతత్త్వమూర్తి విది ♦ తాక్షరగుంభనివేదితాత్మ ప్ర
త్యక్షసుఖానుభావమయ ♦ హానిసమృద్ధివికారదూర స
ద్వీక్షణసంహితాఖిలని ♦ వేశమహాశయలక్ష్య సర్వసం
రక్షణదీక్షితా సుజన ♦ రామమనోరమనైకతత్పరా! ౪౧౫

క॥ ఈశ! బిలేశయసముదా, యేశనివేశితమహామ ♦ హీధరభారా
వేశా తద్భృతిహృతికృత, వేశ మహేశా! యనీశ! ♦ విశ్వాధీశా! ౪౧౮

మంజు॥ నవమోహనాకృతిస ♦ నాధ! చిన్మయా!
ప్రవరాత్మయోగ ♦ పటుభావనాంచితా!
వివృతిస్వతత్త్వసుని ♦ విష్టసత్త్వభృ
త్కవికల్పనాఖిల వి ♦ కల్పనోచితా! ౪౧౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబాగర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబునం బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

—♦—

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## అరణ్యకాండము.

———o———

## ద్వితీయాశ్వాసము.

———o———



యామినీంద్రభాస్వ
చ్ఛాయోత్పాదితతమఃప్ర ♦ సారణత్రిజగ
న్మాయాకలనా సాక్షి
త్వాయత్తగుణప్రచార ♦ ణా! మునిశరణా! ౧

వ॥ అవధరింపు మట్లు వేఁడిన మహాదేవీదేవి కమ్మహాదేవదేవుం డిట్లనియెను. ౨

తే॥ వింటె యిందీవరాక్షి! శ్రీ ♦ విభుని చరిత
మూర్ధ్వమూల మథశ్శాఖ ♦ మూర్జిత మనఁ
దనరు చెలి కిది రస మమృ ♦ తాయితంబ
కాదె కడముట్టఁ గోనఁ గాంచు ♦ కవివరులకు. ౩

—♦ శూర్పణఖాఽగమనము ♦—

తే॥ ఆజనస్థానమున నుండి ♦ యడవిఁ దిరుగు, త్రిమ్మరి యొకర్తు రాకాసి ♦ తెరువుమిత్తి
తబిసిపిండున కయ్యాది ♦ దరలి యొక్క, నాఁడు గోదావరీమహా ♦ నది తటమున. ౪

క॥ దారితలం గాంచెఁ దమో, దారి తరుణచరణనళిన ♦ తత్త్రద్రేఖా
హారిసుపదముల శంబర, వైరియుఁ దోడ్తోనె యవ్వి ♦ వల్గిత నొంచెన్. ౫

ఆ॥ విస్మయాబ్ధిఁ దోఁగి ♦ విపరీత కామప, రీతచిత్తయగుచు ♦ నీతి లేని
రీతి సహజ తనకు ♦ దూతి యై తనర ని, ట్లని తలంచెఁ దలఁపు ♦ లబ్జముఖిరో. ౬

ఆ॥ కూటశంబరారి ♦ కోటి యిప్పదకలా, కోటి నొకటఁ గూర్పఁ ♦ గూర్చి చేసిఁ
జాలదే తదీయ ♦ సౌందర్య విభవంబు, జగము లెల్ల నేలఁ ♦ జాలుటకును. ౭

క॥ నెయ్యం బెట్టిదొ యియ్యల, కియ్యడుగులు దాల్చి మురియు ♦ నీతని మోహనే
నయ్యాకృతిఁ గని యెమ్మెయి, నయ్యెదనో దయ్య మెఱుఁగు ♦ నయ్యలఁతి కృతికిన్. ౮

ఆ॥ ఎంతవాఁడొ తలఁపు ♦ లెంతలో యమ్మెయి, నింతకాని ప్రాబఁగు ♦ వెలయఁ గొన్న
యింతి యేమివలని ♦ యిల్లాలొ యెట్లైనఁ, గంతుగుఱి సుఖమ్ము ♦ గతియుఁ గను నె. ౯

ఆ॥ శాంబరీ ప్రభావ ♦ సంసృష్టి నెటులైన, వాని ముంచి తేఁచ్చు ♦ వలను గాంచి
కూడిమాడియవలఁ ♦ గాన నెంతుఁ దాత యి, త్తనువొనర్చి యిడిన ♦ తత్ఫలంబు. ౧౦

క॥ అని మొనకొని కొండొకవిధ, మున రూపొనరించి యచటు ♦ మొనసిన చాయం
జని కనెఁ బర్ణనికేతన, మనంతరము గాంచె మోహ ♦ నాకారు మదిన్. ౧౧

సీ॥ శ్యామలాభ్రము వెంట ♦ జంట బాయక మించు, మించుఁ దీసియు జాడ ♦ మెలపుతోడఁ
గామకోటిప్రతీ ♦ కాశప్రకాశమ్ము, మాకోటి దను చంద ♦ మానుతోడఁ
గమ్మని నగు చాయ ♦ గమ్మని సిరి యాడు కమలపాలిక పాలి ♦ కళిమితోడ
సమయోచితోద్యద్ర ♦ సమరసోపహారమ్ము, లందిచ్చు స్మారశ ♦ రాళితోడఁ

గంబు లెత్తి పెంచి ♦ కమనీయ మంకమ్ము, గప్పివుచ్చి యిడని ♦ కటకవాట
సీమ వెలయు పేర్మి ♦ చెలువమ్ము గలవింత, పురుషుఁ గాంచె శూర్పనరవధూటి. ౧౨

— ♦ శూర్పణఖ రాముని జూచి తలపోతలఁ బొచ్చుట ♦ —

క॥ ఆసుస్వర మాస్వరసత, యాసామ్రాజ్యంబు కలిమి ♦ నందిన సుతా
నా సన్నాహము బీరం, బాసుర గని కామపరవ ♦ శాత్మిక యగుచున్. ౧౩

ఆ॥ స్మరునిఁ గెలిచి యతని ♦ సర్వస్వము హరించి, విశ్వమోహకలన ♦ వెలసి నట్టి
రుద్రుఁ డనినఁ గాక ♦ రూఢిమై నలఁదఁగా, భసిత మేల జటల ♦ పటల మేల ౧౪

ఆ॥ మొనసినాఁడు పీఁచు ♦ మునివేసమున నిట్లు, పడఁతి తోఁడుగాఁ ద ♦ పస్య నెఱపి
వైరి వైర మీఁగ ♦ వలను గాంచుచు నున్న, శంబరారి యే య ♦ సంశయముగ. ౧౫

క॥ కన్నులు దమ్ములు సడు మని, యెన్నఁగఁ బిడికిఁటికిఁ జాల ♦ దెంతపొడవు లీ,
తిన్నని భుజములు నెమ్మొగ, మున్నది జగమెల్ల మొక్క ♦ దో తన కనుచున్ ౧౬

క॥ నాకొలఁది కిదియ చాలును ♦ నీకొలఁదియు నీవ యెఱుఁగుమా ♦ నేఁడు వనియుఁ గా
కేకాలము నను వీడఁగ ♦ నీకామిని తలఁపఁబోవ ♦ దిచ్చ నెఱుఁగుమటన్. ౩౯

ఆ॥ దీని పొత్తు దొలఁగి ♦ తెలివ నెమ్మనితో, నేఁ జరించుటరిది ♦ నియమ మింత
వట్టి నిన్నుఁబోటి ♦ వనిత సాపత్యంబు, కలి భరించు టంట ♦ కష్టభరము. ౪౦

ఉ॥ ఒంటిగ నున్నవాఁడు సుగు ♦ ణోజ్జ్వలమూర్తి గుణాధికుండు ని
న్నంటి మెలంపనేర్చు జగ ♦ మంతయు మోవఁగలాఁ డొకండు నే
గంటియు లేదు నీ వరిగి ♦ కైకొను మాతని మత్సహోదరు
ల్కంటి శరాసన మ్మగము♦గ్రమ్మెడు భానువిభం గ్రమించుచున్. ౪౧

క॥ భార్యార్థి వీర్యవంతుం ♦ డార్యుఁడు తరుణుండు వాని ♦ నర్థించిన నీ
కార్యముఁ గొనుఁ బొమ్మనఁగ న♦నార్య యచటి కరిగెనట్టు♦ లాతని వచ్చనుచున్.

—♦ శూర్పణఖ లక్ష్మణునిఁ జేర పలుకుట ♦—

ఉ॥ ఆతనిఁ గాంచి నీవెఱిఁకి ♦ నా ననఁగా నగు భార్య నన్ను నీ
వీతఱిఁ గొమ్ము మే లరయు ♦ మిట్లు వచించెను నీదు భ్రాత ల
క్ష్యాతతవన్యభూముల మ ♦ హమ్ములు సేకొను మన్న దాని య
ప్పాటెతర మెల్లఁ దా నరసి ♦ పూజ్యుఁడు సస్మితుఁడై తినర్చుచున్. ౪౩

ఆ॥ పలికె నమ్మహాను ♦ భావుండు సౌమిత్రి, యితఁడు రామభూసుఁ♦ డింతి ! వీని
నెనసి దాసి వౌదె♦ యేల యింతటిద్దాని, కిట్టికాని యోగ♦ మక్క మదికి. ౪౪

క॥ సిద్ధార్థ వీ వతండు స ♦ మృద్ధార్థుఁడు, నీకలాస ♦ మృద్ధికిఁ దగువాఁ
డద్ధార్మికు వరియింపుము ♦ పద్ధతి, రెండవ యువతిగఁ ♦ బరఁగించు నినున్. ౪౫

ఆ॥ నిన్నుఁ జూచి నీదు ♦ నెఱిఁగాంచి మానుషి, వసతి నాశగాళ ♦ నాపినూవ
నాబ్బృహత్ప్రచండ ♦ నావృద్ధ భార్యఁగా, ననుమతించునే సు ♦ఖాప్తిఁ గనఁదె. ౪౬

క॥ పొమ్మనవుడు నమ్మాటలు ♦ నమ్మి యదియ నెమ్మి యనుచు ♦ నగుబాటగునా
కమ్మాయావిని చనె నా♦ కమ్మవిలుతు చేతి కందు ♦ కమ్మగు మతితోన్ ౪౭

తే॥ చేరియాతండు నీపేరఁ ♦ జీటి వ్రాసెఁ జులుకసేయక నామేలు ♦ జూడు మనినఁ
జాలు పొమ్మని రాముండు♦జాలుకొలుప, రాగములుకగ మాఱఁగ♦రాళయగుచు.

—♦ శూర్పణఖ సీతను మ్రింగఁబోవుట ♦—

శా॥ ఏమీ వింతలు సీతలం బొడమెఁ గా ♦ కిల్లా లొకర్తున్న నే
రామం జేకొనరాదె మీకొలమున ♦ న్రాజు ల్బహు స్త్రీరతి
శ్రీ మానింపరె చెల్వ లేని యతడుం ♦ జెల్లాట లాడింప నా
బూమె ల్వన్నునె యిట్టి వెఱ్ఱి నడకే ♦ పొర్దెల్లఁ బోకార్పఁగన్. ౪౯

ఉ॥ మారుని గెల్తు రాకృతిఁ గు ♦ మారులు శ్రీసుకుమారు లుద్భటుల్
చీరమృగాజినాంబరులు ♦ జృంభితపద్మదళాయతాక్షు లా
చారపరు ల్ఫలాశనులు ♦ సంయమివేషులు దాంతు లాసితు
ల్తా రట రామలక్ష్మణులు ♦ దాశరథుల్ధరథు ల్గభీరతన్. ౬౧

చ॥ ఇరువురు నన్నదమ్ములు మ ♦ హీశ్వరలక్షణలక్షితు ల్గనన్
నరు లనరాదు దేవతలు ♦ నాఁ జన దొక్కెడ వజ్రహస్తుఁడున్
వరుణుఁడు నిట్టు లై రనిన ♦ వాస్తవమే యగునేమొ యేల యి
ప్పరుసున నివ్వనంబుఁ జొరఁ ♦ బాటిరొ చొప్పలరార దెమ్మెయిన్. ౬౨

ఆ॥ వారి నడుమ నొక్క ♦ వనితఁ ద్రిలోకమో, హినిఁ దటిల్లతాభ ♦ నిందువదనఁ
జూచి యదియు మదను♦సుందరిఁ గిందరి, జేయఁ జాలు ప్రతిభఁ♦జెలఁగుటయును

తే॥ దాని హరియించు కోర్కె ల ♦ క్ష్మినిదాన
మిదియపో యను చూడ్కి చూ ♦ లెనసి కనఁగ
జతన మొనరించి యీయాగ ♦ చాట్లు పడఁగ
నైతి నది కప్ప యెలుఁగు పా ♦ మని యరయమి. ౬౪

క॥ ఏమైనఁ గాని యింకిట నాముప్వుర నతిమి యేని ♦ నడఁచియ యేనిన్
గామన దీఱంగా మన మామెయిఁ దద్రక్త మాన ♦ నగు నే ర్పొలయన్. ౬౫

ఆ॥ ఇంత సేసి యిట్టు ♦ లే నయి మిన్నక, పోవ మీామగఁటిమి ♦ పొల్లుగాఁగ
నింక వీరె మనల ♦ ని ట్టట్టు దోలరే, సురలు మునులుఁ గనులఁ ♦ జూచుచుండ.

క॥ ఈదండకాఖ్యవనమున కీడుండగవుం, దునేదు ♦ లే తేరఁగ సం
వాదింతురి లెక్క గొన రా, మోదమ్మున మనల నిచటి♦మును లిప్పుఖ రా! ౬౭

క॥ పూ లమ్మిన యూరనె మన, కేలా కట్టియలు విలువ ♦ నెందేఁ జనగాఁ
బొలుపడుము లేదా పరి, పాలింపుము మగతనంబుఁ ♦ బరిపంథిహతిన్. ౬౮

ఆ॥ నాయవస్థఁ గనియు ♦ నడికి నీ వూరకే, యుందువేని నీక ♦ యొప్పఁజెప్ప
దాన నున్నమాట♦ నేనె నాకయి యిప్డె, వూని యసుఱు లెడలఁ♦బుత్తు మాన.

—♦ శూర్పణఖ మొఱ విని ఖరుఁడు మత్తీక్ష్ణాదుల రామలక్ష్మణులపై బంచుట ♦—

మ॥ అనినం గ్రోధపరీతమానసుఁడు వాఁ ♦ డద్దాని నూరార్చి చ
య్యన న క్తంచరుల న్సుతీక్ష్ణముఖుల ♦న్వ్యాస క్తసంరంభులన్
ఘనకోదండశరాసికుంతధరుల ♦ న్గార్ద్ర్యశుద్ధానద్ధులన్
బనిచె న్మర్త్యుల బిల్కు మార్పఁ డని వా ♦క్పారుష్య మొప్పారఁగన్. ౭౦

—♦ సుతీక్ష్ణాదులు పదునలువురు రామునితో పోరి చచ్చుట ♦ —

తే॥ నాథు ననుమతి నాపదు ♦ నలుగు రసురు
లుగ్రరణరంగవిదులు త ♦ మ్మొరసి చుప్ప
నాతి చనుదేర నేతెంచి ♦ నాతిదూర
మునను నృపసూనులను గనుం ♦ గొనిరి గిరిజ ! ౨౧

ఆ॥ ఎగిచి యయ్యరణ్య ♦ మెల్ల నే నని యాక్రమించి మించువారి ♦ మేలి తేజ
మరసి దైత్యులిభము ♦ లడవిచి చ్చొడఁగని యుపరఁ బోనియట్టు ♦ లైరి గౌరి! ౨౨

క॥ ఆరక్కసి వెరవున రఘు, వీరుల తెఱఁగింత తెలిపి ♦ విడిచల యిం యుం
చారాక్షి వటుపనెటఁ గని, యారక్షోవరులు గవియ ♦ నరుదెంచుటయున్. 23

ఆ॥ రాముఁ డరసి కొంఱవి ♦ రాకాసి గొనివచ్చె భటులు తొడర సిద్ధ ♦ పడిసవారు
నీవు సీత యున్న ♦ నెలవుఁగాపాడు మే నతిమి వారిఁదుంచి ♦ యరుగుదెంతు. ౨౪

వ॥ అని యిట్టు లనుజన్ము ననునుతునిం జేసి. ౨౫

క॥ సన్నద్ధుఁ డగుచుఁ దా నా, సన్నగతుల నెదిరె రాము ♦ [illegible] వా రా
సన్న గని తొడరి రాయుధ, సన్నాహముతోడ దేవ ♦ సంసద్వినుతా ! ౨౬

ఉ॥ వారలఁ గాంచి యిట్టు లనె ♦ వారిజనేత్రుఁడు రాముఁ డిట్లు మీ
రూరకపోరు పోరున క ♦ నుద్ధతులేనిఁ జనుండు జీవితా
శారహితుల్విలంబడుఁడు ♦ చక్కఁగ నిక్కడ మున్ను మూకలన్
నేరము లేక దుంచు పగ ♦ నేఁటికి నీఁగఁ దలంచి వచ్చితిన్. ౨౭

క॥ రోజింపుఁడు మదినన నా, రోజ న్నాకొలఁది తెలుఁగ ♦ [illegible] జెసఁగి శ్రీ
వేజాలిపా లగుదు నిలు, మాజి క్షరకరుఁడు గురున ♦ కరి [illegible] ! ౨౮

ఆ॥ అనద యంచు నబల ♦ నవమానితం జేయు, పనియ కా దటంచుఁ ♦ బరపముద్ధ
రాసి శూలకలన ♦ లలరార నెక్కటి, యనుచు రాముఁ దొడరి ♦ యుడరుటయును.

ఉ॥ అందఱు కన్ను రూపు లయి ♦ యర్కకులీనుఁడు మూర్వ్వటంకృతిన్
జెందిన వజ్రఘోషకృతి ♦ శ్రీఘనుఁ డాఘను నట్లు గ్రమ్ముఁ జే
రొందినవారు దైత్యభటు ♦ లొక్కటఁ గుమ్మరి శూలసంహతిన్
మ్రందితి పొమ్మటంచు నతి ♦ మానవిమానన యుల్లసిల్లఁగన్. ౩౦

ఆ॥ అన్ని శూలములకు ♦ నన్ని వాలమ్ములు, దొడిగి యేసి పొడిగఁ ♦ ద్రుంచి వడిగఁ
దొడరు పిడుగు లట్టు ♦ తూఁపులు సిగుడించె, వారి లెక్క నాజి ♦ వరసుతుండు.

చ॥ శరములు సొచ్చి వక్షమునఁ ♦ జయ్యన వచ్చి ధరిత్రి గ్రుచ్చి వా
శరధినిఁ జేరవచ్చి నిము ♦ సంబునఁ దచ్ఛరధి న్నిల స్వైరా
సుర యని మెచ్చి రయ్యనిమి ♦ షుల్వడి రాహవభూమి నాసురుల్
సరగున ఛిన్నమూలములు ♦ సాలము లట్లు ధరిం దప్రినఁదిసి ! ౮౭

ఆ॥ వారి పాటు గాంచి♦ వల్లకాటి పిశాచి, మొనసి శిర ముగమ్ము♦ మోదుకొనుచు
నాకసమ్ము వగుల♦ నార్చుచుఁ జనె ఖరుఁ, డున్న చోటి కరిగి♦ [illegible] సభఁగ.

— ♦ శూర్పణఖ మగల ఖరాసురుఁజేరి మొఱ్ఱగొనుట ♦ —

శా॥ నిర్యాతేపద, నార్ద్ర రక్తతలయై ♦ నిష్ఠ్యూతనేత్రాంబువై
నిర్యాసావిలసల్లకిం బెరయుచు ♦ న్నైరంబు లూహించుచుం
దర్యం బాననమందు వ్రేలఁగ మహా ♦ దైత్యుండు వాఁ డాసభా
ధుర్యుండై కొలువుండ నయ్యెడ వివి ♦ ధ్యాతాత్మయై వ్రాలినన్. ౮౮

తే॥ వీక సెడి యున్న చెల్లెలి ♦ రాకఁ గాంచి, యేమిగతి గల్గె నేల యి ♦ ట్లేడ్చెదనిన
వారిదశఁ దెల్పియందఱ♦ వలనుసూచి, ఘూర్ణమానాస్య యై పల్కెఁ♦గువలయాక్షి!

క॥ ఏ రాణ సెడితి నని కా. దీ రేడుజగమ్ము లేలు ♦ నీ రాముఁడె ప్రాం
డో రాక్షసులారా! యిఁకఁ, బోరున, నాతని జయింపఁ♦ బోలు న మీరున్.

ఆ॥ రమణ నిచ్చటునఁ ది♦రమ్మయినాడు న, న్నిట్లు సేసె మీఁదఁ♦ నెట్లు లగునొ
తొడరి వాని నింకఁ♦దోలెడువాఁ డొండు, గలఁడె యాసపసదుఁ♦డిలను నిలువ.

శా॥ అయాసం బని యెంతు రేనిఁ జనుఁ డెం♦దైన న్సుఖం బబ్బుచో
నాయాస ల్విడనాడుఁ డొక్కఁట మహా♦న్కృత్యంబు వాటిల్లనే
యాయుశ్శ్రీ లెడఁబాసి భర్తసన నే ♦ నొఁ గాదు నాకిమ్మెయిం
బ్రాయం బూరక పుచ్చి తుట్టతుదకుం ♦ బాలైతి నీచెట్టకన్. ౮౯

ఆ॥ ఒక్క మొగిన నెగసి♦యుతికి యందఱు వారి, నతికి ప్రోవులిడుఁడు♦నాదు మతము
గొంటి రేనిఁ బగఱ♦గొంటు మాయింపంగఁ, దలఁప రేని నిచటు♦దలఁగుఁ డిపుడె.

క॥ అతఁడు లంక సుఖించుచు, మీతల నిడినాఁడు నాదు♦మేశము నేఁ డి
ట్లై తలమున నిలకడ సెడఁ, బోఁతెర మొనరించు బంటు♦పోటొనఁగూడెన్. ౯౦

క॥ అని యారాటముతో నేఁ, డ్చిన సోదరిఁ గాంచి యెట్లు ♦ సెల్లె రణమ్ము
ప్పనిఁ దెలుపక మిన్నకె యి, ట్లనె దేమన నన్నతోడ ♦ నాసురి పలికెన్. ౯౧

ఉ॥ వచ్చిరి నాకుఁ దోడగుచు ♦ వాలుమగంటిమిఁ గ్రాలు శూలముల్
గ్రొచ్చిరి యన్న రేఁడు నెద ♦ గొంటున నాతఁడు వానిఁ ద్రెంచి నం
విచ్చతురత్వ మేర్పడఁ బ ♦ విం బురుడించెడు నమ్ము లేయఁగాఁ
జచ్చిరి నీదు యోధులొక ♦ చర్చయుఁ గల్గెనె నే వచింపఁగన్. ౯౨

ఆ॥ ఎగిచిపడెడు వారి ♦ నెల్లర మంత్రించి, పైచినట్లు నేల ♦ పాలొనర్చు
మాయలాఁడు వాని♦మర్మమే నరయంగఁ, జాలుదాననే ని ♦ శాచరేంద్ర. ౯౩

క॥ అన విని యాజ్యము వోసిన ననలుని క్రియ వాఁడు వెలిగి ♦ యనుజను గని యి
ట్లనె నింతమాత్రమునఁ బోయెనె వాఁడు కృతార్థుఁ డయ్యె ♦ నే చేడ్పడఁగన్.

ఆ॥ ఖరుఁడు పనిసఁ గాల ♦ గతులు దప్పిన నాఁటి, మాటగాక ప్రేలివి ♦ మాలి నోరు
వగుల నేడ్వ నేమి ♦ పనివోయె నిపుడె యి, ల్లలికినంతఁ బండు ♦ వయ్యె ననెదె.

క॥ అని నుడివెడు నెఱితో న, య్యనదకుఁ జేవ యొదవించి ♦ యనుఁగులఁ గని చ
య్యన నాదగు స్యందనమును, ననువు పఱచి మీరుఁబయన♦మగుఁ డీకఁ బెలుచన్.

ఆ॥ పదియు నాల్గు వేల♦బలురథమ్ములవారు, నొక్కమొగిన ప్రెగున ♦ యుద్ధమునకుఁ
దరలవలయు ననుఁడు♦దాత వానికిఁ దోడు, వచ్చునేనిఁ దలఁప♦వచ్చు నొకటి.

—♦ ఖరాసురుఁడు పదునాల్గువేల రథికులతో రామునిపై దాడివెడలుట ♦—

మహాస్రగ్ధర॥ అని యానం బాన సేయ♦న్వ్యవసితు లగుచున్♦యాతుధానుల్మహాంభో
యను భావం బుల్లసిల్ల ♦ న్వ్యపగతభయులై ♦ యావదర్థ ప్రసక్తుల్
దనరార న్నేను నేని ♦ త్తఱిఁ దఱిమెద ము ♦ త్తావులం గల్గు వీరుల్
గని పోరం దన్ను మిత్త్రిం ♦ గనినట్లు దెరలం ♦ గా నటం జాడికొంచున్. ౯౮

లయవిభాతి॥ అరదముల నొరసికొను ♦ ద్విరదముల రొదల కవ ♦ సరదముల మననిమొన ♦ సరభసపు నుడులున్
బరగమన మరయనగుఁ♦బరఁగ మన మరసి యని♦ధర గదల నడచు భట♦వరతతి కలనలున్
దరపవణడమరుకసు♦షిరపటహమురజకము♦ఖరపటలపటురవణ♦భరభరితగతులున్
గర మొలసి యదితిజని♦కర మొడిచికొనఁ జను వి♦వరము యనఁ గరగతిక♦సురపదవి నటుమన్. ౯౯

క॥ తరలిరి యోధు లమరులుం, దెరలిరి దితిజుల యదల్పుఁ ♦ దెంపును గని య
వ్వైరవునఁ దనయరదం బ, మ్మరుద్విరోధిపతి మెప్పు ♦ మైకొన నొప్పెన్. ౧౦౦

వ. స్వీయసేనాధినాథులగు దూషణుండును త్రిశిరస్కుండును సమ్మోటి సున్నిని మున్న నలు వడసి తన్ను హెచ్చరించుచుఁ బన్నుగడలు మిన్ను ముట్టఁ బన్నించికొనిన తిన్నని తేరులఁ బేరుల నుగ్గడించి పంతమ్ములు నెఱపుచు నెలకొని నెలవుకొనఁ బురికొల్పు నపారమహోత్సవంబు డంబునకుం బునరుక్తిం బచరించు వందిజన జయోక్తిసందోహంబులు గ్రందుకొన ఖరకరతేజుండు ఖరుండు సుమేరుశిఖరం బట్లు మణికాంచనభూషణభూషితంబై యవక్రహిరణ్మయచక్రంబును వైదూర్య కూబరంబును హాటకమణిరత్నకల్పితచంద్రసూర్యతారాగ్రహపుష్పద్రుమశైలనా గమత్స్యమృగపక్షిపాంచాలికాసమంచితంబును ధ్వజనిస్త్రింశవిరాజితంబును గింకిణీ క్వాణసంపన్నంబును సమున్నతంబును సదశ్వయుక్తంబును నగు రథంబును సొమ్ముగం డగుచు నధిష్ఠించి యలతింబోని యమ్మేటివిలుకాండ్ర నెల్లరం దిలకించి పులకించు బీరంబు నఱసేయ కరుదెం డని యానతిసేయం దద్వాక్యసహాయంబున నాయ త్తంబై యుత్తలం బగు నాసైన్యపారావారంబు మీఱంబోలని చేరియుట్టి కట్ టెట్టన దూరంబున విడనాడి జనపదంబులు మూపం బగిలించెను జనస్థానం బుననుండి పొంగి పొరలి ముద్గరపట్టసశూలపరశ్వధఖడ్గచక్రతోమరశక్తిపరిఘగదా ముసలవజ్రశరశరాసనంబుల పేరి మహామత్స్యగ్రాహాదియాదస్సంతానంబు లంగారంబు నిరంతరంబుం బొనరింప నయ్యరణ్యం బశరణ్యంబు గావించు వైనంబునం గానం పించుచు నేగుదెంచు నయ్యవసరంబున. ౧౦౧

క॥ పదునాల్గువేల రథములు, పదరి నడచుచుండ ఖరుని ♦ ప్రాంచద్రథ మ
య్యదనున నెఱిఁ గని సారథి, యదల్పనగఁ దీవె దివిచి ♦ నట్టనయించెన్.

తే॥ శత్రు నెదిరించు ఖరు రథ♦చక్ర చంక్ర, మణమునం దోఁచి కడ లెల్ల♦ మలసి వెలసె
వాన కారు మొగి ల్గుమి♦వలని రసిత, మట్టిఁ డగు నట్టి ప్రమోంత కాం♦తాజవతంస.

క॥ అంతకుఁ డనఁగ ని యంత యొ, కింతయుఁ గొఱలేని దర్ప♦మెనయఁగ నొప్పన్
యంతయు ననిలుఁడు ఘన మ, ట్లంతరమున నెయిద నెఱపె ♦ నాస్యందనమున్.

తే॥ అటు లనీకినితోడ దు♦ష్టాసురుండు, చటులతరసైన్యనాయక ♦ పటలితోడ
దూషణాదిప్రధానసం♦ ఘుత్తుణంబు, దనరఁ దనరథ మొప్పారఁ ♦ దఱుముసపుడు.

—♦ ఖరునకు దుర్నిమిత్తంబులు దోఁచుట. ♦—

ఉ॥ ముందలఁ గొట్టి నట్టు లిల ♦ మొగ్గతిలంబడె యానయుగ్యముల్
పొందగు రాజమార్గమున ♦ బోరన నస్రము లొల్కెన్ నస్రముల్
గ్రిందుగ నెత్తుటాలు గొని ♦ కందము లోలి స్రవించె నర్కునిన్
ముందుగఁ జుట్టె నప్పరిధి ♦ ము ప్పెటిగించుచుఁ గృష్ణరక్తమై. ౧౦౬

సీ॥ కాన్పురు గ్రమ్మెడి ♦ క్రతువుల ధ్వజదండ, మెక్కె గ్రిద్ధ కృతావ ♦ సీఁలసముగ
నాజనస్థానముం ♦ దంతట మూఁగసాద, మృగపక్షు లఱచుచు ♦ మొట్టఁదొడఁగె
భైరవారావము ♦ ల్పరఁగించె వరళులు, మూఁగెఁ గంకాదులు ♦ మొనలపైని
వీచికూఁచిధ్వను ♦ ల్వెడలించె శారిక, లుల్కలు తారల ♦ ట్లురలఁదొడఁగె
పరిఘు మట్టి కబంధంబు ♦ భానుకెలనఁ, దోఁచె స్వర్భానుఁ డాతని ♦ నాఁచికొనియెఁ
బట్టపగలె యెఱ్ఱగ సంజ ♦ ముట్టఁ గదిసె, భూమి కంపించె నొకట సం ♦ భోరుహాక్షి!
తే॥ అదరె సవ్యభుజంబు గ ♦ ద్గదిక వొడమె, నశ్రుసంతతి కన్నుల ♦ నావరించె
ఫాలతలమున నట్టె గ ♦ న్పట్టె రుజయు, వాఁడు తలఁకఁడు మోహమో ♦ వస్తుగుణము

వ. తనకుఁ గోడివాఁడై వాఁడి గలిగి మోడికొని బీరమ్ము లాడుచుఁ గూడ ముట్టి దోఁ
తెంచు దూషణాఖ్యుం డగు నప్పుహామాత్యుండును వానిపిఱుంద నరుదెంచు
మహాకపాలస్థూలాక్షప్రమాథిత్రిశిరస్కు లను నలువురు సేనాధిపతులును నెల్ల
కడలం దామయై యేమెయినేనిం దనయిమ్ము వాయని మేలుగోలున మేలుకోరి
పఱతెంచు శ్యేనగామియుఁ బృథుగ్రీవుండును యజ్ఞశత్రుండును విహంగముండును
దుర్జయుండును గరవీరాక్షుండును బరుషుండును గాలకార్ముకుండును మేఘమా
లియు మహామాలియు సర్పాస్యుండును రుధిరాశనుండును నను పండ్రెండుగురు
దండనాయకులును రోమహర్షణకరంబు లగు నచ్చెడుంగు నినాదంబుల నిదా
నించుచుండ నందఱం గలయం గనుంగొని కనుంగొనల నవ్వు దోఁపకొడ నోడ
రాని దిట్టఁతనంబున మనంబున నెట్టన గట్టిసేసికొని సోఁకుమూఁకల ఱేఁడు మేకొను
చలమ్మునఁ బ్రాఁకువెట్టుచు నిట్లనియె, ౧౦౯

—♦ ఖరుఁడు మంత్రులతో వీరము లాడుట ♦—

శా॥ ఏఁ జర్చింతునె దుర్బలమ్ముల బల ♦ మ్మో లేని సన్న్యాసి యు
ద్వ్యాజ న్నెక్కొనఁ గాక కాలజము లె ♦ ట్లోఁ గోఁచు లోపించునే
యాజి న్నేనె జయింతు నం చెఱుఁగరే ♦ యా దేవరా జుల్క నీ
రాజ్యా, లెక్కకు వచ్చువాఁడు కునరు ♦ ల్లోరాఁపు సైరింతురే. ౧౧౦

ఆ॥ మిత్తి గెల్తు నుదుల ♦ మేకొని గాల్తు నే, హుంకరింప రుద్రుఁ ♦ డురు వడంగి
పోవు ననఁగ నిట్టి ♦ పురుషులు నా కు ప్ప, దంశకీముల యింత ♦ దలఁప నేల. ౧౧౧

తే॥ అని నెఱపు వాని గర్జల ♦ నవధరించి, పొంగె రాక్షసవాహిని ♦ భోరుకొనుచుఁ
గాల మాసన్న మైన నొ ♦ క్కండు దలఁప, వచ్చునే కీడు మే లంచు ♦ వరగుణాఢ్య!
తే॥ తపిలి బ్రహ్మర్షి దేవగం ♦ ధర్వసిద్ధ, చారణప్రముఖులు త ♦ త్ప్రచార మరసి
యంబరంబునఁ జేరి యి ♦ ట్లనుకొనంగఁ, దొడరి రురుసుకృతము లెంచి ♦ ధూతకలుష.

క॥ శ్రీ వెలయఁగ స్వస్తి యగుం, గావుత గోబ్రాహ్మణులకుఁ ♦ గావరుల దురు
ద్భావన లడఁగుంగావుత, మావిధికృతి రామునకు జ♦యం బిడుగాతన్. ౧౧౪

తే॥ రాఘవుఁడు పౌలస్త్యుల ♦ రజనిచరులఁ, జక్రహస్తుండు పూర్వరా♦క్షసుల నట్లు.
సంహరించెడుఁగాత ని♦స్సంశయముగ, నెల్లెడ శుభప్రచారణం♦బెలయుఁగాత

ఆ॥ అట్లు వారి మంగ ♦ ళాశాస్య లొప్పార, నాగతాయువులును ♦ రారు లొండు
దలఁపనీని తమము ♦ దముఁ గప్ప శ్రీరాఘు, వాశ్రమంబు సేర ♦ నరిగి రగజ!

ఉ॥ ఏకృతి మాకుఁ గల్గ దని ♦ యెన్నుచు నాసమరాభిరామ యా
రాక్షసవీరసేన ఘన ♦ రక్షణ మై చని యాశ్రమాంతికం

బాక్షణ మాక్రమించె మహి ♦ జాధిపుఁ దత్సహజున్ రప్పించులం
గక్ష వహించి యన్యగ్రహ ♦ కక్ష్యయ నా నెదిరింపఁ దంపునన్. ౧౧౭

ఉ॥ అమ్మెయి సూచనమ్ముల న ♦ హర్పతి తేజుఁడు రాఘవేంద్రుఁ డ
య్యమ్మునినుండి కాంచి యిది ♦ యేమొకొ యంచుఁ దలంచుచుండ లే
లెమ్ము జయమ్ము గా మ్మని స ♦ లీలముగాఁ బురికొల్పె రాక్షసా
దమ్ము స్ఫురాపదేశమున ♦ దక్షిణమౌ భుజ మాక్షణంబునన్. ౧౧౮

— ♦ శుభశకునములఁ గొని రాముఁ డానయిడ లక్ష్మణుఁడు సీతారక్షణమున కరుగుట ♦ —

ఉ॥ తమ్మునితోడ రాముఁ డనె ♦ దాశరథీ శరధీసమగ్ర! నీ
వి మ్మహిళామణిం గొలిచి ♦ యీగిరికందరమందు నిల్వు మేఁ
గ్రమ్మెదఁ గోణపావలి ని ♦ కామమదాలస యేగుదెంచెడున్
సమ్మదవృత్తి మీఁ దరయఁ ♦ జాలక చాల గడంక మేకొనన్. ౧౧౯

ఆ॥ భూనభోంతరమ్ము ♦ భోరనఁ బోరున, కరుగుదెంచు వీరు ♦ లలఁతిఁ బోను
వీరు బీర మింత ♦ వెలయింతు నాదగు, సంగరం బెసంగ ♦ సంగరమున ౧౨౦

తే॥ నీదు ముఖమున తేటయు♦నిర్మల మగు, తేజమును దెల్పుచున్నవి♦యాజి విజయ
మస్మదీయంబె యని కాని♦యట్టులైనఁ, దనర వవి యిటు లదియే ని♦దర్శనంబు.

ఉ॥ కా దిది యంతమాత్రమనఁ ♦ గాదు త్వదీయము తేజ మల్పముం
గా దిటు లొంటిమైఁ గదియఁ ♦ గాఁ దగదం చనుమాట వల్కఁగా
గాదిలితమ్ముఁడా తెలిఁగు ♦ గన్గొని యే తగుకట్టు సేసితిన్
గా దన కానమై నిలుము ♦ క్రిమ్మఱి యేఁ జనుదెంచు నంతకున్. ౧౨౨

ఆ॥ అనుచుఁ దీవరింప ♦ నన్నమాటకు మాఱు, పలుకరాక వాఁడు ♦ పడఁతిమిన్న
రక్షణమునకై తి ♦ రమ్మయి యమ్మెయి, వలనుగొని తొలంకె ♦ వారిజాస్య!

ఉ॥ సందడి వాసె నివ్వ డని ♦ సంతస మాంతర మెల్లఁ గ్రమ్మి రా
కేందునిభాననస్థితిర ♦ హి న్స్మితసంపద నావహింప ము
న్నెందును నేరికి న్మానయ ♦ నిట్టిదియుం గలదే యటంచు మి
న్నందుచు భూతము ల్వొగడ ♦ నాతఁడు దాల్చె జిరా వరాననా! ౧౨౪

క॥ ఆకత్తళమున తళతళ, లాకట్టెను గనెడు కనుల♦నమ్మెయిఁ బొగ లే
కేకతము వెలుఁగు వెలుఁ గయి, చేకొనె శరచాపముల వి♦శిష్టగుణాఢ్యా! ౧౨౫

క॥ మేదురముగ జ్యావల్లిక, నాదకలాకోవిదుఁడు ని ♦ నాదితఁ జేసెఁ
వేదపదవిహారోచిత, మాదయితుని జతన మొప్పె ♦ నధియోగదృశా! ౧౨౬

క॥ సావష్టంభుండై యు, ద్దేవుఁడు నిలువంగ దివిని ♦ దివిజులు సిద్ధుల్
దేవర్షు లాడికొని రిటు, లావిలసన మరయవచ్చె ♦ యభ్యుదయకలా! ౧౨౭

సీ॥ స్వస్తిగోబ్రాహ్మణ ♦ వర్గంబులదిగాఁగ, నొఁగాత మభయ మి ♦ య్యందఱకును
బరఁగఁ బంటవలంతి ♦ భాసిల్లనవుఁగాత, భారమ్ము దలఁగి ని♦ర్భరరసాప్తి
వెలయుఁగావుత గెల్పు ♦ కలిమి దాశరథిపా, లిఁటి సొమ్ము గాఁగ స♦లీలముగను
బౌలస్త్య సంతాన ♦ పటలంబు చేడ్పడి యడఁగుఁగావుత మింక ♦ యడరు దక్కి
మాకనులు చల్లగా నెల్ల ♦ మహము లమర,
నమరనాయకుఁ డైంద్రియు ♦ నఘము లెడలి
ముజ్జగంబులఁ బాలించు ♦ మురువుగాంచు
వలను వనువడుఁగావుత ♦ మలఘుగతిని. ౧౨౮

క॥ మాచేసిన పున్నెంబులు, పూచిన తంగేటిగముల ♦ పొలుపునకై యి
న్నీచులఁ బొరిగొన ననువౌ, నాచతురత రాముసిరికి ♦ నగుఁగాత తఱిఁ. ౧౨౯

తే॥ చక్రిహస్తుండు మును నిశా ♦ చరబలముల
నెట్టు లేర్చెనొ యార్చు ని ♦ య్యెల్లమొనల
నేర్చి రఘునేత పొరిఁ గడ ♦ తేర్చుగాత
మిప్పు డిప్పొలమున బాము ♦ లెల్లఁ దలఁగ. ౧౩౦

క॥ పదునాలుగువేవురు దొర, లదరిపడెడువారు భీమ ♦ ణాకృతికృతు లి
మ్మదవదరాతుల నెమ్మెయి, గొదకొని కెడపునొ కకుత్థ్స♦కులుఁ డొకరుఁడనిఁ.

క॥ మాయాపరు లిందఱు ని, ర్మాయికుఁ డనఘుం డితండుఁ♦మలసినచో నె
ల్లేయఁ దెరలింప నేర్చునొ, యాయుధముల తెఱఁగు లెట్టి ♦ వన నగునవియో.

మ॥ నెఱయం గన్గొన రాముఁ డాయుధకలా ♦ నిష్ణాతుఁ డవ్వాహినిం
దఱియం జొచ్చి విదిర్పఁగాఁ దొడఁగె ని ♦ ర్ఘాతూఁపు లారూప మ
త్తఱి దుష్ప్రేక్షము కోప ముద్ధతము త ♦ త్కల్పం బనల్పంబుగా
నెఱి పున్నెంబునఁ గల్గె నంచు సురలు ♦ న్నిద్రాక్షులై కాంచఁగన్. ౧౪౪

—♦ ఖరుఁడు సైన్యములతో గూడ నొక్కట రాముపైఁ బడుట. ♦—

క॥ ఆవీరవర్యుఁ గని ఖరుఁ డావిష్టఖరస్వాంతత్వ ♦ మనువుపడ రయుం
భావహిలఁ జేయు మన రథ, మావిధి గొని తఱిమె సూతుఁ ♦ డంటగదియఁగన్.

ఆ॥ ఉల్కలట్లు ములుకు ♦ లురల వి ల్లాండించు, వాని రాఘవేంద్రు ♦ వాఁడు దాఁకె
నురవడించి యెల్ల ♦ యోధులు నట్లు పై, నెగసి రొంటిఁ జిక్కెఁ ♦ బగతుఁ డనుచు.

క॥ తారల నడుమ నుదితుఁ డగు, గారకుఁ డను గ్రహము భంగి ♦ ఖరుఁ డాసేనా
వారములో మధ్యస్థుం, డై రాజిలె రథముపై మ ♦ హాద్యుతిమహితా! ౧౪౭

క॥ విదితు మహారాజస్యుఁ గుల, ప్రదీపు రఘునాథుఁ గదిసి ♦ ప్రదరసహస్రం
బద నరసి గుప్పి ఖరుఁ డను, పద మార్చెం ద్రిదశు లుదిల ♦ హా యనియఁ జెలీ!

చ॥ అరదములం దురంగముల ♦ హాస్తిశిరస్థలులం దనర్చుచున్
బరు వడి భీమమూర్తి హరిఁ ♦ బట్టసశూలపరశ్వధాసిము
ద్గరముసలక్షురప్రశర ♦ ధారల నొక్కటఁ గ్రమ్మి రమ్మహా
శరవరయోధు లెల్లఁ గుల ♦ శైలము వారిధరమ్ము లట్లుగన్. ౧౪౯

ఆ॥ తనుకఁ డింత యేని ♦ దాశరథి శరప్ర, వాహములు మహోగ్ర ♦ భంగిఁ దన్ను
ముట్ట మున్నుఁగఁ జేయ ♦ నెట్టన నద్యోఘు, శతము లక్షము వఱలు ♦ శరధివోలె.

క॥ ఎదిరి పరఁగించు శస్త్రము, లెదురొక్కనం దివురు రాము ♦ హేతిసమితు ల
య్యుదధి తెర లేటివాఁకలఁ, బొదలింపఁగ నెఱయు మేలి ♦ పొలుపున నెగడెన్.

ఆ॥ అశనినిభము లైన ♦ యసురవీరుల ప్రద, రముల నొఱపు గనియు ♦ రాము మేని
యచలధర్మ మొప్పె ♦ నదియు వజ్రమయంబె, యనిన నగునుగాక ♦ యచలతనయ!

క॥ ఆజిఁ దనయచలభావం, బాజితనయునందుఁ దనరె ♦ నది జయలక్ష్మీ
నైజవరణసందేశ, శ్రీజనితం బనఁగ యోగ ♦ సిద్ధేంద్రనుతా! ౧౫౩

క॥ క్షతజము సర్వాంగంబుల, నతిమాత్రము బులిమి నట్టు ♦ లైన రఘువరుం
డు తరణి సాంధ్యపయోదా, వృతిమెయిఁ జూపట్టు రీతి ♦ వెలయించె సతీ!

ఆ॥ కలఁతపడిరి దేవ ♦ గంధర్వసిద్ధర్షి, వరులు రాము నొకని ♦ వైరివరులు
వేలకొలఁది గలఁచు ♦ వేడబం బీక్షించి, తలఁప రతని మహిమఁ ♦ దలిరుఁబోడి!

వ॥ అంత. ౧౫౮

సీ॥ పిలిచె బొట్టిడి తన్నుఁ♦జేరటంబున కంచు, బొమముడి మిన్ను సల్క♦పొలుపు నూపఁ
జక్రాయుధకలాను ♦ సంధానమున కన్ని, మంగళోక్ష్మాతము గ్రో♦దండ మనఁగ
నాగడం బిఁకఁ జెల్లు♦ననరాదు లెం డని, నారితీ చె ముహుర్మ్య ♦ సంబు నెఱప
సృష్టికర్తను గన్న♦సిరి కెంత వని యంచు, సింహసంము స్మృజింపు♦ సరిపు నొడువఁ
దరలెఁ గాలపాశ ♦ దండాభము లజిహ్మ, గములు సింకపత్రి ♦ కఠినము లతి
దుర్విషహము లధిక♦దుర్వారములు గాను, శరము లసురజీవ♦ హరము లగుచు.

క॥ రానేరా దసురుల పాళి, నానిలములఁ గానక సనిచి ♦ సత్కృత పరిసరమునం
భీనసములం దొకండును, దానే యామర్మ మురయు ♦ ధారాధరదనుజా! ౧౫౯

తే॥ అగ్నిశిఖ లట్లు మెఱసె న♦య్యాశుగంబు, లంబరంబున గామహన్య♦స్త్రంబు లగుచు
నసురతనువులఁ జించి చెం♦డాడి తివిరి, రక్తసిక్తంబులై గాఁ ♦ రాజవంద్య!

వ॥ వెండియుఁ జండతరదోర్దండసముద్దండ పాండిత్యము వెలుఁగునగు రామచండధరుని
కోదండమండలంబున నుండి వెలువడి యసంఖ్యయంబు లయ్యును సుసంఖ్యాఖ్య
యంబు లగు శరవిసరంబు లాశరప్రవరానీకప్రకరంబులపయిం బడి సుకరంబుగా
నసునికరంబు లెడల్చి కరికరోపమంబులు సకోటీరంబులు నగు నూరుస్తంభంబు
లను సవలయవరంబులగు కరంబులను సకేయూరంబులగు భుజదండంబులను
సకిరీటంబులు మణికుండలాంచితమ్ములు నగు ప్రశస్తమస్తకంబులను స్ఫురత్తార
హారవిమలంబులగు వక్షస్స్థలంబులను పదాతుల నపదాతులం బొనరించి కాంచన
సన్నాహంబులగు సాదులతోడి హయంబులను విచిత్రసచిత్ర దస్త్రకంబులాస్తరణం
బులుఁ బరిశస్తరణంబులు నగు హస్తిపకులతోడి హస్తినివయంబులను ససారథి
రథికంబులు సప్రాసంగికంబులు నగు మణిరత్నరథంబులను ఛేదించియు ఛేదించియు
దనివోక యని వీఁక విహరించుచుండె నయ్యవసరంబున. ౧౬౦

—♦ రాముఁడు రాక్షససైన్యములఁ జించి చెండాడుట. ♦—

తే॥ భీమరణరామబాణని ♦ ర్భేదనమున, భిద్యమానులు కోణపు ♦ లైనపు దక్షి-
యార్తనినదంబు లెనయించి ♦ రంబరచరు, లుల్లసనములు పరఁగింప♦నుత్పలాక్షి!

తే॥ మర్మభేదు లయిన రాము♦మార్గణము ల, నర్గళముగ విదారింప♦మార్గ మెఱుక
పడక కొంద ఱతనిఁ జేరి ♦ ప్రదరవృష్టిఁ, గురిసి రాం జేమి కల దని♦కోమలాంగి!

వ॥ అవారితవిక్రమరంహుం డగు రఘుసింహుం డవ్వారిగా నిగుడు నవ్వారి యాశుగ
వర్గణంబు నివారించి. ౧౬౩

క॥ వర్మములు సించి తత్తను, మర్మములఁ గలంచి చండ ♦ మార్గణకలా
కర్మతఁ డాదుష్కర్ముల, ధర్మగృహాతిథ్య మొనయఁ ♦ దద్దయుఁ బనిచెన్. ౧౬౪

తే॥ పడిరి విచ్ఛిన్నులై వారు ♦ పవనగరుడ, వినిహతము లగు తరువుల ♦ విధము దోఁపఁ
దదవశిష్టులు చెదరి చె ♦ దరి పరి గన, నేర కరిగిరి శర ణంచు ♦ నేతఁ జేర. ౧౬౫

— ♦ దూషణుఁడు సేనల కభయ మొసఁగి రామునితోఁ బోరవచ్చుట. ♦ —

క॥ దూషణుఁ డయ్యసురులఁ గుల, దూషణుఁ డారార్చి యసుఱు ♦ తోనే నుండన్
శోషింప నేల యని సం, భాషింపుచు వారిఁ గొంచుఁ ♦ బఱతెంచె సఖీ! ౧౬౬

తే॥ అంతకుఁడె యీతఁ డైన యు ♦ గాంతరుద్రు,
నెనయఁ బోవుచున్నా డ ♦ హితము నాక
మెట్టు లయ్యెడునో యంచు ♦ నెంచి రపుడు
నాకసదు లాకసమున మే ♦ నాకుమారి! ౧౬౭

తే॥ దూషణాశ్రయతోషమ్ము ♦ తోఁ గలింప, మరలిరి స్వదోష మెంచక ♦ మరల వారు
తాలసాలశిలాస్త్రసం ♦ ధాను లగుచు, రాము దెస రోషమున నభ ♦ రామ వేష.

క॥ కొందఱు గురిసిరి శరములఁ, గొందఱు వృక్షముల మఱియుఁ గొందఱు శిలలన్
గొందఱు ఘోరాద్యాయుధ, సందోహముల న్సరోష ♦ సంరంభమునన్. ౧౬౯

తే॥ మంచు మూఁగిన కరణి సా ♦ మర్ష మగుచుఁ
గప్పె రఘునాథదిననాథు ♦ క్షణములోన
రాక్షసబలంబు శరవర్ష ♦ రూక్ష మగుచుఁ
గదిసి పైఁబడి వికచపం ♦ కజదళాక్షి! ౧౭౦

క॥ చేయిం గాలు దెమల్పఁగ, నీయక వా రఱును విభుఁ డ ♦ హీనధనుర్జ్వా
లాయుతు డనుసంధించెన్, హహా యని గాంధర్వ మస్త్ర ♦ ముద్యతుఁ డగుచున్.

ఆ॥ దాన నుద్గమించెఁ ♦ దతశక్తిశోభరా, ద్యాయుధములు భీష ♦ ణాకృతులుగఁ
గప్పె నాకసమ్ముఁ ♦ గకుబంతములును ని, మేషమాత్రమున మ ♦ నీషివంద్య!

సీ॥ అంధకారం బరుగ ♦ నాక్రమించెనె కాని, యాత్మభానుస్ఫూర్తి ♦ యావహిల్లెఁ
జాలనం బనరాక ♦ చాప మొప్పెనె కాని, విశ్వరూపము దాల్చె ♦ విశిఖపంక్తి
తివియుట విడుచుట ♦ తెలియదయ్యెనె కాని, లక్ష్యపాతము దెల్పె ♦ లాఘవంబు
జ్యాశంఖనినదప్ర ♦ సక్తి దోఁచెనె కాని, మొదిరి యాహారవ ♦ మెడలు గ్రమ్మె
నాజగన్మోహనుం డిట్టి ♦ దనఁగరాని, శాంబరీడంబరంబున ♦ సంగ్రహించి
వేలుపులు మెచ్చికొన నిరూ ♦ పించినట్టి, మేటి రాక్షససంహార ♦ నాటకమున.

క॥ ఒకమొగి ప్రాలెడువారటు, లోకటఁ బతిను గ్గినవారు ♦ లొంకిట పాతులుగాఁ
గకవిక పడువారునుగా, వికీర్ణ మైు వసుధ వింత ♦ నిఘనముసఁ దనరెన్. ౧౭౪

వ॥ మఱియు నాప్రథనప్రదేశంబు, వెల్లివిరిసిన రక్తపూరంబున ఛిన్నభిన్నవిదారితంబులై పడిన రాక్షసకళేబరంబులచేతను జోస్టీషంబులగు నుత్తమాంగంబులచేతను సాంగదంబులగు బాహుదండంబులచేతను సవిభూషణవిశేషంబగు నూరుజానుచరణాదులచేతను నానావిధాభరణసంవిధానంబులతో విధ్వస్తంబులై యొఱఁగిన యశ్వహస్తిరథాదులచేతను విశీర్ణంబులైన ఛత్రచామరవ్యజనధ్వజపతాకాదివిసదంబులచేతను ఖండీకృతభిండివాలముసలపట్టసప్రాసపరిఘశరాసనశక్తిధనుర్బాణతోమరాది సాధనంబులచేతను శకలితచూర్ణితంబులగు గండోపలంబులచేతను సముపలక్షితంబగుచు వికీర్ణవివిధ యాదోవర్గనిర్గళత్సరిత్ప్రవాహాదుర్గమంబగుయమమార్గంబు పగిది సార్గళంబు నతిభయంకరంబు నై యుండె నయ్యవసరంబున.

తే॥ హన్యమానం బగుచు శూన్య ♦ మనఁగ నైన,
తనదుసైన్యంబు నీక్షించి ♦ త్వరితుఁడై యు
నన్యసామాన్యజన్యసం ♦ మాన్యబలులఁ
దోడరఁ బురికొల్పె రథికుల ♦ దూషణుండు. ౧౭౫

క॥ వారయిదువేల లెక్కన, వారితవిక్రములు మొనసి ♦ వరశస్త్రాస్త్ర
సారమున రాముతోఁ బ్రవి, దారణ మొనరించి రప్పుడు ♦ తాపసవంద్యా! ౧౭౬

ఆ॥ మఱి శిలాద్రుమవృష్టి ♦ మలయించి రయ్యెడ, ప్రాణహానిఁ గ్రుతినె ♦ బద్ధగాఁగ
మెలఁగె దానఁ దా ని♦మీలితం బాభుగ్న, శిరము వృషము పోల్కి ♦ శ్రీవిభుండు.

ఆ॥ క్రోధ మొగిచి పొదువఁ ♦ గొనకొని యువ్వారి, నెల్లఁ గూల్చు నివ్వ♦జో నటంచు
భాస్కరాన్వయుండు ♦ పరఁగించె శరవృష్టి, బ్రిట్టనిలిచి తేజ♦ మెఱసి మెఱయ.

క॥ దోషాచరవాహిని నా దూషణు నడికింప శత్రు ♦ దూషణుఁ డతఁ డా
దోషి పవినిభశరమ్ముల రోషముమొయి రాముపయి ని♦రూఢతఁ బఱపెన్. ౧౮౦

క॥ తాఁ కోర్చి క్రుద్ధుఁ డగుచు స్నేకొని క్షురమొకఁడు గొని ని ♦ మేషంబున ద
త్ప్రాకటధనుర్విపాటన మాకృతి యాకృతికి మూల ♦ మన నొనరించెన్. ౧౮౧

తే॥ మఱియు నాల్గింట హయముల ♦ మడచి యొకట
స్యందన మగల్చి ప్రథితార్ధ ♦ చంద్రశరముఁ
దొడిగి సారథి శిర మిలఁ ♦ దొరఁగ నేసి
వాని వక్షంబు మూడింట ♦ వ్రచ్చి యార్చె. ౧౮౨

తే॥ ఛిన్నధన్వుండు హతయంత ♦ శిథిలితరథుఁ, డదిగతశ్రముఁడును నయి ♦ యాశ్రమిజన
హంత వాఁడు పరాక్రమ ♦ మలఁతివోవ, నీ కనీకిని మెచ్చ జ ♦ యేచ్ఛ నెగడ ౧౮౩

మ॥ గిరిశృంగాభము రోమహర్షణ మయః ♦ కీలాన్వితం బన్యగో
పురవిస్ఫోటక మాత్తశత్రువస మా ♦ పూర్ణస్ఫురాజాల మా
సురసంతోషము స్వర్ణపట్టమహిప ♦ స్తోభం బమోఘంబు నా
పరిఘం బొక్కఁడు దాల్చి రాము పైన దీ ♦ ప్రక్రోధసంరంభుఁడై. ౧౮౪

చ॥ బ్రదుకుదు గాసిలేర యిఁకఁ ♦ బొవనగా యనివాఁడు నేల గ్ర
క్కఁదల నెదిర్చి రా విభుఁడు ♦ గ్రక్కునఁ దద్భుజయుగ్మ మమ్మెయిన్
బ్రదరయుగమ్మున న్నఱికెఁ ♦ బొటితదంతతలమ్ము దంతి నా
మదమఱి కూలె నప్పుడు వ ♦ మందరసోన్నతి వేల్పు లుబ్బఁగన్. ౧౮౫

తే॥ కంఠనాళంబు లవియ ర ♦ క్తంబు దొరల, రక్కసుఁడు బోరగిలపడి ♦ చక్కసీల్గ
సర్వభూతంబు లధిపుఁ బ్ర ♦ శంస సేసె, నగడు వాసె నటంచుఁ బ ♦ ద్మాయతాక్షి!

తే॥ అంతలోఁ గ్రుద్ధు లగుచు సే ♦ నాగ్రయాయు
లడఁచిపడఁజొచ్చి రదె కూర్చు ♦ నద నటంచు
మిత్తి త్రాఁట బిగించి యె ♦ మ్మెయిన నేని
నొండు త్రోవఁ దొరయనీని ♦ యుక్తిఁ ద్రోయ. ౧౮౭

వ॥ మహాకపాలస్థూలాక్షప్రమాథులను నవ్వారలు శూలపట్టసపరశ్వథంబులు ధరియించి సన్నాహసముద్ధతులై యుద్ధార్థిత్వంబున నతిఘలుంబోలె నరుదెంచినఁ దీక్ష్ణాగ్రంబులు నిశితంబులు నగు పృషత్కంబుల రఘువీరుం డమ్మువ్వర గ్రహించి. ౧౮౮

సీ॥ ఛేదించెఁ దడయక ♦ శితకలంబముల మ, హాకపాలుని యుత్త ♦ మావయవము
మథియించెఁ దోడ్తోఁ బ్ర ♦ మాథి సాకాగము, సంఖ్యేయశస్త్రప్ర ♦ చారణమునఁ
బూరించె స్థూలాక్షు ♦ స్ఫురితేక్షణంబుల, వివిధసాయకసన్ని ♦ వేశనమునఁ
జదిపెఁ బంచసహస్ర ♦ సంఖ్యాకు లగు తొంటి, రథికుల నన్నిశ ♦ రములు దొడిగి

యెపుడు నేర్చెనో యేమఱ ♦ కింతవట్టు, వారి నెల్లరఁ గడపె దు ♦ ర్వారబలుల
నరసి యజితుండౌ యని యింత ♦ లంత లనఁగ, నేలనే లలితాంగి య ♦ న్నేల మనియె.

తే॥ దూషణుని దూషణము తోడు ♦ కోనె త్రోడి, వారి పాటును గాంచి వి ♦ పాటితారి
ఖరుఁడు పన్నిద్దఱ నసీక ♦ వరుల రణాధు, రంధరులఁ గని పలికెఁ బు ♦ ష్పంధయకచ!

అ॥ అపుడు రాము గెల్తు ♦ నని రోసమునఁ దోడ
రంగఁ బోవు ఖరు ప్ర ♦ సంగ మరసి
నెఱసి పలికె వాహి ♦ నీపతి యాత్రిశీ
ర్షుండు నెఱి వొసంగ ♦ సుందరాంగి! ౨౦౨

—♦ త్రిశీర్షుఁడు రామునితోఁ బోరాడి మడియుట ♦—

సీ॥ ఇంత సాహస మేల ♦ యేనుండ ననుఁ బంపు, మధిప! ప్రాశ్నికుఁడ వో ♦ దంతవట్టు
లీల రక్కసులపా ♦ లిఁటి మిత్తి యీరాము, సంహరించెద నొక్క ♦ క్షణములోనె
యీయుద్ధం బంటి యొ ♦ య్యనఁ బొనర్తుఁ బ్రతిజ్ఞ, మరల సీతని దను ♦ మక యటంచు
వచ్చెద నీమెచ్చు వరము ల ♦ వ్వాలఁ గొంచు, సంతసంబున జన ♦ స్థానమునకు
నట్లు గాక నరుఁడె ♦ యంతలై గెలువంగ, నైన గిట్టి నీప ♦ మర్ధభావ
మెల్ల వెలయఁ జేసి ♦ యేలుదు జగమున, నొకఁడె గండఁ డనఁగ ♦ నోరపులేక.

క॥ అని మృత్యుగ్రహణమునకు, మొనసి ప్రసాదింపఁ జేయ ♦ ముదల యనుచు వాఁ
డెనయింపఁ జనెఁ ద్రిశీర్షుఁ, డనుపమరథమునఁ ద్రిశృంగ ♦ మగు గిరి యనఁగన్.

క॥ రాము నెదిరి శరవృష్టి మ, హామేఘం బట్లు గురిసి ♦ యార్చె జలార్ద్రిం
బై మొఱయు దుందుభికి నెన, గా మదమున వాఁడు నిత్య ♦ కల్యాణగుణా!

ఆ॥ వాని నెదురుకొనియె ♦ వర్ధిష్ణుఁ డారఘు
వంశభానుఁ డగుపు ♦ వఱలుచుండ
సాయకౌఘములఁ బ్ర ♦ సారింపుచు సురేంద్రు
ధనువుఁ బోల ధనువుఁ ♦ జక్కఁగొనుచు. ౨౦౬

మ॥ తుములం బయ్యెను జన్య మిర్వురకు ని ♦ ర్ధూమంబు ధామంబు సం
తమసంబు న్వారియింప రాముఁ డెగువ ♦ న్దైత్యుండు పైఁగ్రమ్మ మో
హము బోధంబును జక్కటిం దొడరి ప ♦ ర్యాయప్రచారంబునన్
విమలంబుం గలుషంబు నౌ తెఱఁగు గా ♦ వింప న్నర ల్ప్రొన్పడన్. ౨౦౭

క॥ సింగము బాఱిం బడిన మ, తంగజ మయ్యసుర నిఖిల ♦ దయితలలాట
ప్రాంగణమున మూఁడమ్మల, నంగనరో సిల్లు చూపి ♦ నట్టులు నాటెన్. ౨౦౮

తే॥ కుపితుఁ డయి రాముఁ డనె నోరి ♦ క్రూర! యేమి
బలము పూవులఁ గొట్టితి ♦ ప్రదరము లని
నాప తూఁపుల చేవయు ♦ నయము ద్రోవ
కెదిరి కనుఁగొను మగు త్రోవ ♦ నెనయఁగలవు. ౨౦౯

క॥ అని యాశీవిషరాజము, లన నగు పదునాల్గు శరము ♦ లాశుగ వక్ష
మ్మున గ్రొచ్చి నాలు గిషువుల, ననితరరథరథ్యముల ర ♦ యంబునఁ గూల్చెన్.

ఆ॥ మఱియు భానువంశ ♦ మండనుం డనిమిది
సాయకముల సూతుఁ ♦ జక్కడంచి
యొకటఁ ధ్వజ మెడల్చి ♦ యుత్పిత్సుఁడైన య
య్యసుర యెద నగల్చె ♦ నాశుగముల. ౨౧౧

తే॥ బా నజఘుఁ డయ్యెఁ దలకొని ♦ దానవుని శి
రములు మూఁడును నిశితభ ♦ ల్లముల నఱికి
నైచెఁ దోడనె రఘుకులో ♦ ద్వహుఁడు దివిని
సురలు సంస్తవపరు లయి ♦ చూచుచుండ. ౨౧౨

క॥ నెత్తురు లోలుక నిశాటుని, యుత్తాలశరీరసాల ♦ ముర్విఁ బడఁ ద్రా
సస్తంభితులై నిలువక, తత్తరమునఁ బాఱి రున్న ♦ దైత్యు లభయుఁడు ?

ఆ॥ వ్యాఘ్రభీతభీత ♦ మగు మృగవ్రాతంబు
పగిదిఁ జెదరి తనదు ♦ పదమె పదము
గాఁగ మొనయు మూఁక ♦ నాఁగి రాహువు చంద్రు
నట్లు రాముఁ గదిసె ♦ నపుడు ఖరుఁడు. ౨౧౪

—♦ ఖరాసుర యుద్ధము. ♦—

మ॥ దొరలు న్దూషణుఁడుం ద్రిశిరస్కుఁడుం దో ♦ ర్దోఁ గూలి రప్పాడుమూఁ
క రణోత్సాహియె యింక నేకరణి నేఁ ♦ గావింతుఁ జో దట్టెను
ర్భరునిం గిట్టి యటంచుఁ దా నెడఁద సం ♦ భావించె నుద్దామయు
ల్కారణంబు ల్సెడ దైత్యుఁ డేకరణి యై ♦ క్రవ్యాదసంహారణీ! ౨౧౫

క॥ మన మగలి చెదర నిఁక నే, మని మనవలె నని తలంచి ♦ యసురగణాధీ
శుని నముచివోలె గాముని, మునిఘస్మరుఁ డాఖలుండు ♦ మొగకొనె మగువా!

ఆ॥ దృఢము చాప మెత్తి ♦ దీర్ఘబాహువుల నా, కర్షణం బొనర్చి ♦ ఖరశరసుల
రక్తభోజనముల ♦ రాముని యెద నాటె, విషధరముల నట్లు ♦ విశ్వశరణ. ౨౧౬

క॥ తనశిక్షమెఱుం గేర్పడ, ఘనభుజు రాఘవుఁ దెరల్తుఁ ♦ గా కని మౌర్వీ
నినదముతో మార్గణముల, ననుగతములఁ జేసె దిశల ♦ నట్లు విదిశలన్. ౨౧౭

శా॥ పూరించె న్రఘునాథుఁడు న్ధనువు సం ♦ పూర్ణస్ఫులింగాగ్నివి
స్తారాకారవిహారఘోరము శరా ♦ సారంబు పెంపార వి

స్ఫారస్ఫూర్జథుభాగిరమ్మదసర ♦ స్సంసత్త్రి స్వీయోరుతే
జోరంహాస్సముదారనాదకలన ♦ లుల్లసింపఁ బర్జన్యుఁడై. ౨౧౯

గీ|| ఉవిద యన్యోన్యపదసము♦ద్యుక్తిఁ జేసి, యుభయస్పృష్టశిలాశుగ♦యోగమునను
కథిత మాకాశ మప్పు డనా♦కాశ మనఁగ, నయ్యె నటు లప్రకాశత♦నందె నినుఁడు.

తే|| కదిసి నారాచనళికవి ♦ కర్ణికర్ణి, కాశరంబుల రాముని ♦ గలకపార్శ్వ
ఖసుఁడు కరికలభముఁ దోత్ర♦కముల నట్లు, గలదుమేలనుకాంక్ష పైఁ♦గనలినాఁడొ.

క|| అరదమున నిలిచి చాపం, బురవడి నాడించుచుం బ ♦ యోధ మన దురు
ద్ధరుఁ డగు నసురఁ గని యనిరి, సుర లంతకుఁ బాశహస్తుఁ♦జూచితి మనుచున్.

చ|| కనుఁగొని సర్వభూతతతి ♦ కంపము నొందఁ బ్రభూతవిక్రమం
బున నలిరేగి రక్కసుఁడు ♦ పోరున డస్సెను మర్త్యుఁ డింతకున్
ననుఁ దెరలింప శక్తుఁ డగు ♦ నా యని యెంచెనె కాని కిమ్మృగ
మ్మును హరివోలెఁ దన్నతఁడు ♦ మున్నె తలంచుట గానఁ డద్రిజా! ౨౨౩

ఆ|| వెలుఁగు లురలఁ దేరు♦వెరవున నెఱయించి, యఱిమెఁ దపనవంశ్యు♦నసురుఁడప్పు
డగ్నిలోఁ బంతగ ♦ నట్టులు వాఁ డగు, తెఱఁగు మాను లరసి♦తెలుసుకొనఁగ.

క|| దాశరథి శరము చాపము, నాశరుఁ డమ్ముష్టిదేశ ♦ మందె తెగ నిజో
ద్దేశ మిషులాఘవము ని, ర్దేశించుచు నేసి యార్చె♦ దివిజస్తుత్యా! ౨౨౪

తే|| అశనినిభములు వహ్నిజి ♦ హ్వాభములును, నైన విశిఖమ్ముల ధరాత్మ♦జాధినాథు
వర్మ మేడింట నగలించె♦వాని చేటు, దెలుపఁ దొడరెడు నుల్కనాఁ♦దెరలెనదియు.

ఆ|| మఱియు మర్మభేది ♦ మార్గణసాహస్రి, మెగిచిపడుచు రాము ♦ నెల్ల యవయ
వముల నాటి యఱచె ♦ వాని ఖరత్వమ్ముఁ, దలఁచి భూతగణము♦ తల్లడిల్ల.

క|| ధామనిధిధాముఁ డట్లభి, రాముఁడు వేధింపఁబడియు ♦ రాజిల్లె సము
ద్దాముఁడనలుఁడాజ్యాహుతు, లాముకొన విధూముఁ డగు న♦యంబెనయంగన్

చ|| గొనకొని యెత్తె నత్తపసి ♦ కోరి యొసంగెనొ దేని వైష్ణవం
బనితరభేద్య మాధనువు ♦ నాదట సజ్యముసేసి యేసె న
మ్మనుకులభూషణం బసుర ♦ మాత్రిన్నడ నొక్కట వాని యొక్కజీ
వన మటులుండ నొం డనఁగ ♦ వచ్చు ధ్వజం బిలఁ గూల్చెఁ బెల్చనన్. ౨౨౯

క|| అతుల మతిదర్శనీయం, బతిశయితము హైమ మనఁగ ♦ నగు నది పడె నా
క్షితి నొకట దేవతాజ్ఞం, బతంగుఁ డెనయంగ నైన ♦ పద్ధతి దోఁపన్. ౨౩౦

లోభకామౌఘములు తన్ను ♦ లోఁ గొనంగఁ
గరకముం బట్టి బ్రాహ్మణి ♦ గతిని దొలుత
గానఁ గానేరఁ డంతంబు ♦ గాంచునపుడె
కాని కానీని కర్మంబు ♦ కట్టికుడుప. ౨౮౦

తే॥ పరువు లార్తనప్రసవసం♦తతుల నట్లు, తటి దటియవచ్చు నంతలోఁ♦దత్ఫలములఁ
గాంతు రెల్లరుఁ దమచేయు♦కర్మములకుఁ, దగినయట్టివ యై యవి♦దారసిల్ల.

తే॥ తనపూనర్చిన పాపకృ♦త్యముల బెడఁద, లనుభవింపక తీఱ వ♦య్యాజనకైన
నెన్నక విషాన్నము ల్దిని♦యెంతవట్టు, దలఁగి వర్తించుఁ బోడము సం♦తాపములను.

తే॥ దండకారణ్యవాసులౌ ♦ తాపసులను, ధర్మచారుల సాధులఁ ♦ దవిలి తవిలి
చంపి తేమని యమ్మెలి ♦ సంబరమున, నధిగతంబయ్యె నిది వేఱె ♦ యనఁగనేల

ఉ॥ ఎల్లర కప్రియంబుగ మ♦హిం జరియించెడు దోసకారులన్
మొల్లముగా వధింప నను ♦ మున్కొని పంపె ధరావిభుండు మి
మ్మిల్లలి నుండనీయ నిఁక ♦ నెందుఁ జనంగల రేమి చేయువా
రొల్లమి సూపినం దలఁగ ♦ దోరినిశాచర! తథ్య మింతయున్. ౨౮౪

తే॥ నేఁడు నాచే విడువఁబడు ♦ నిశితశరము, లలఁతి నీమొద భేదించి ♦ యసుపదంబె
యసువులఁ దెరల్చి తెరువర♦యంగఁగలవు, పుట్టమెడలించి వెడలెడు♦భోగులనఁగ.

తే॥ నేఁడు సఖారు నీవును♦నిహతిఁ గాంచి, నిరయఁపుంద్రోవఁ గొనిచన♦నరయఁగలరు
మున్ను మీపాలఁబడిచన్న♦యున్నియతులు, వ్యోమయానసమున్నతి♦నొప్పుగనుచు.

క॥ వారి సదాచారంబు ల, వారితసద్గతికిఁ గూర్చు ♦ వరుస దురాచా
రారంభులు దుర్గతికిం, బోరే మీబోంట్లు పాప♦ పుంజము పొదువన్. ౨౮౭

ఆ॥ చెనయు మెంతలైనఁ ♦ జేయుము ప్రహారింపు, మెట్టులేని విడువ ♦ నింతలోనె
నేలఁ గూలవైతు ♦నీతల తాలఫ, లంబపోలె శితక ♦ లంబములను. ౨౮౮

క॥ అని పలికిన సంరక్తన, యనుఁజు తెఱగంటిసూ డ ♦ యమితమనస్కుం
డును క్రోద్ధతరోషుఁడు నై, యనె నిటు వెడనవ్వుతోడి♦యారాటమునన్. ౨౮౯

ఉ॥ ప్రాకృతు లైన రక్కసులఁ ♦ బల్వురఁ గూల్చితి నంచు స్వప్రశం
సాకృతికిం గడంగితివి ♦ చాలినయంతలు సేసి యైన నొ
ప్లీకరణీ న్వికత్థనము ♦ నెంచఁగఁబోవరు శూరు లైనవా
రేఁకటఁ దీఱనోటు తన ♦ కియ్యెడ బాటున మిత్తి వాయునే. ౨౯౦

తే॥ నీచ! నినుఁబోటి చెట్ట లి♦న్నేలఁ గ్రాల, దేవతాగణములును భూ ♦ దేవతలును
క్షుభితులౌదురు మిముఁ దెగఁ♦జూచుజాడ, నోటగాంత్రు మీయంగన♦లుసుస్సురనుచు.

క॥ అని నొడివెడు మనుకులమణిఁ, గని యభిసంరబ్ధుఁ డగుచు ♦ ఖరతర మగు ని
స్స్వన మొప్ప ఖరాసురుఁ డే, పున నుడివో కనియె నిట్లు ♦ ఫుల్లాబ్జముఖీ! ౨౬౨

మ॥ అనలిస్తుంగఘన శ్లాఘ్యతి విన్తకు భయం ♦ బౌ లేదవాచ్యం బటం
చు విచ్చంజూడదు నోరు నాకు నిటులే ♦ చొల్లుమాటమాటాడఁగా
నవునే కార్య మకార్య మంచుఁ గనఁగా ♦ నక్షోపసంజ్ఞానముం
దవులంగాఁ దలపండు మృత్యువశుఁ డా ♦ దౌర్భాగ్యవంతుం డిలన్. ౨౬౩

ఆ॥ రిత్తపలుకు లేల ♦ యిత్తఱి నీపొగ, రడఁగఁ జూతు నంచు ♦ నదరి నొసట
భ్రుకుటి యూఁడ నొదర♦భూరుహం బొక్కండు, గాంచి జతన నెఱయఁగాఁ ♦ బెకల్చి.

క॥ మసఁగితిలే పొమ్మనుచు న, వ్వుడు గఱచుచుఁ ద్రిప్పినైవ ♦ భూతనయాకా
ముఁడు పటుభల్లౌఘంబుల, నడపొడఁగనఁ బోలకుండు ♦ నట్లొనరించెన్. ౨౬౫

ఆ॥ దాని వమ్ము సేసి ♦ దానవుఁ డెరలింప, నెంత వలయు రోస ♦ మంత గొని స
హస్రమార్గణముల ♦ నాతని యొడలెల్లఁ, జిల్లులుగ నొనర్చె ♦ శ్రీవిభుండు. ౨౬౬

క॥ పొరిపొరి నురువులు గట్టుచుఁ, బరివహనము నెత్రుటేఱు ♦ పరఁగింప దురా
శరుఁడు మద మఱి దురాశా, పరవశమునఁ దన్నుఁ గదియఁ♦బఱతెంచుటయున్.

ఆ॥ విస్రగంధ మెదకు ♦ వెక్కసమగుచుండ, నఱుము నల్లవాని ♦ యడుగువరుస
నొదిఁగి వెనుక కనిచె ♦నొండు రెండంజలుఁ, బడఁగ నొరసేయు♦పాము పగిది.

క॥ ఆపన్నగడ త్రివిక్రమ, తాపృతిఁ దలకడతు ననెన ♦ నంతరమాంచ
ద్వ్యాప్తపాటవము తిడుభయ మను, మూపక మచ్యుతరసోద్య ♦ మమునకు నవలా!

ఉ॥ రెండవబ్రహ్మగండ మురర ♦ రీకృతపావకమూర్తి సాదరా
ఖండలసన్నిధాపిత మ ♦ ఖండజయావహశక్తియుక్త మ
య్యండజవాహనుండు గొనె ♦ నస్త్రము శస్త్రకలాధురీణుఁ డు
ద్దండుని దండిరక్కసునిఁ ♦ దాపసవైరిని మాప నుద్ధతిన్. ౨౭౦

—♦ రామాస్త్రము ఖరాసురు దహించుట. ♦—

క॥ సంధాత దాని వింట, న్సంధించి వికర్షణంబు ♦ జరిపి సురారి
స్కంధాంతరమున నాటమ, దాంధుం డెదవగుల దగ్ధుఁ ♦ డై పడెఁ బుడమిన్.

తే॥ మును వినిర్దగ్ధుఁ డయ్యె న♦న్ముట్టి మూఢుఁ, డంధకుం డెట్లు శ్వేతవ♦నాంతరమున
నడఁగి రింద్రునిఁ గిట్టి వృ♦త్రాదు లెట్టు, లట్టు రాము నెదిరి హతుఁ♦డయ్యె ఖరుఁడు.

—♦ మునులు వేల్పులు రాముని గొనియాడుట. ♦—

శా॥ రాజర్షు ల్పరమర్షులుం గలిసి రా ♦ రాజద్వికాసు న్మహో
రాజశ్రీవిలసద్విలాసు నజితు ♦ న్రామావనీజాని ని
ర్వ్యాజోల్లాసితఁ జేరఁగాఁ జని మహీ ♦ యస్వీయవాక్యామృత
శ్రీ జాల్కొల్పుచు సన్నుతించి రమరీ ♦ సేవాఢ్యభావాంచితా! ౨౬౩

సీ॥ వరనిష్ఠ లెమ్మొయిఁ ♦ బరఁగింపఁ డిమ్మెలి, పరమార్థ మొదఁ గోరి ♦ పంక్తిరథుఁడు
గాధేయుఁ డిన్నెటి ♦ గని చూవె జన్నంబు, గాపాడఁ గొనిపోవఁ ♦ గాఁ గడంగె
నిన్న మొన్న నె కాదె ♦ నినుఁ గొల్వ సిగ్గుతో, హరి శరభంగుతో ♦ సని సెలంగె
నెఱిఁగింపరే యంద ♦ తేకతంబున మును, గ్రమసద్ధపా ప్లాచి ♦ పొల్పడిలుచుఁ
దీర్చితయ్య ప్రతినఁ గడ ♦ తేర్చితయ్య!, చెడుగు రాకాసిపిడుగుల ♦ చదుగుఁదనము
సుఖముపనుపడధర్మర్థఁ ♦ జూతుమయ్య!, యింకనోయయ్య! యిలసీవ ♦ గేలుమయ్య!

క॥ మాపానరించిన పున్నెం, బీపగిది నుపాయకలన ♦ నేతేఁగ నీ
ప్రాపు గనఁగంటి మింకిటఁ, బాపమ్ములు లేవు లేవ ♦ పాయకథనముల్. ౨౬౪

క॥ రామా! రక్షస్సోమవి, రామా! నీనామమంత్ర ♦ రాజము యిఁక మా
బాములఁ దొలంప సుకృతము, లామేఁత లొనరింపఁ జాలు ♦ నయ్యా! యెపుడున్.

తే॥ అని పొగడుచున్నయంతలో ♦ నంతరిక్ష
చారు లటు చారణకృతి ప్ర ♦ శంస లొలయ
నప్సరస్సంఘు సరసలా ♦ స్యములు వెలయ
విరులు గురియించి రెడ లెల్ల ♦ విరులుగొనఁగ. ౨౬౬

క॥ మ్రోసెం దుందుభు లమ్మొయి, భాసిల్లెను నారదుండు ♦ పరమప్రీతిన్
జేసిరి ప్రసంగ మిట్లని, ద్యోసదు లాసమయ మరసి ♦ ద్యుమణిద్యోతా! ౨౬౮

తే॥ అరరె సార్థముహూర్తకా ♦ లాంతరమునఁ, దునిమెఁ బదునాల్గువేవుర ♦ దుష్టరాక్ష
సులను ఖరదూషణప్రము ♦ ఖులను మఱల, హరివిలాసంబె కానంగ ♦ నయ్యె నిట్లు.

క॥ భీమం బీసంగ్రామం, బీమెయి వీర్యంబు దాక్ష్య ♦ మీతేజం బు
ద్దామగుణుం డీరాముని, సామర్థ్యము వింత లనిరి ♦ సంయమివంద్యా! ౨౭౦

తే॥ అనుచు మితిమీఱు సంతసం ♦ బమరుచుండఁ, నమరు లరిగిరి గిరిదుర్గ ♦ మందునుండి
నిండు మనమున రాముని ♦ దండితనము, గాంచి క్షితిసుతఁ గొంచుల ♦ క్ష్మణుఁడు మరలి.

—◆ స్వాశ్రమ మొనసిన రాము సీతయు లక్ష్మణుఁడు నుచితముగ సేవించుకొనుట. ◆—

క॥ రామాశ్రమత్వ మెంచుచు, రామాశ్రమభూమి సేర ◆ రా మౌనివరుల్
రామావనీంద్ర జయ మని, రా మానధనుం డతండు ◆ రహి మొనయుటయున్.

తే. చెలఁగి సాగిలపడి మ్రొక్కెఁ ◆ జిష్ణునుండు, లక్ష్మణుండు ధరాజ లీ◆లావిభూతి
దనరఁ దనరహి నెఱయ ని◆ద్దంపు హర్ష, కలన పెనుపారఁ బ్రాణేశుఁ◆గౌఁగిలించె.

క॥ తదవయవస్పర్శంబున, నదనున నెలకొన్న గంటు ◆ లన్నియుఁ బాయన్
బద నెనసి మెఱయు మదనుని, ప్రదరం బన రాముఁ డొనరెఁ ◆ బర్వేందుముఖి!

తే॥ అశ్రమతఁ బలువేవుర◆నధిరథికుల, నెదిరి యిరుమూఁడు గడెలలో◆మద మడంచి
కదియవచ్చిన వల్లభు ◆ కలన లెంచి, పొగడె భూపుత్రి భూధర ◆ పుత్రి! వింటె.

క॥ మానిని సన్మానింపఁగ, మౌనివరుల్ స్తోత్రపాఠ ◆ మహితులుగా స్వా
నూనుఁ డనుజుండు వినతులు, మానుగ నొనరింప రామ◆మహీవిభుఁ డొప్పెన్.

తే॥ అజితుఁడఁటె తనభర్త ని◆త్యానుషంగ, తానఁటె విలాసమహిత త◆ద్దయుఁదదీయ
జయరమాశంసలే కూర్చె◆క్ష్మాప్రసూత, యుల్లసిల్లుచుఁ జన వెచ్చ◆నోలగమున.

క॥ వనమయ్యె నిహతకంటక, మనుపప్లవములు జగమ్ము ◆ లయ్యె జయశ్రీ
వినివేశ మయ్యె రఘురా, ముని చరితము మునుల తపము ◆ మూర్తం బయ్యెన్.

తే॥ మంగళాస్పద మగు రామ ◆ మహివిభుండు
మంగళాలయ సీత ల ◆ క్ష్మణుఁడుఁ గొలువ
సంగతిఁ జెలంగె నప్పర్ణ ◆ శాల సర్వ
మంగళ ! యసంగుడు సుఖాను ◆ షంగుఁ డగుచు. ౨౮౯

తే॥ ఆజనస్థాన మపజనం ◆ బైన నచటు
గడచి కంపితుఁ డగుచు న ◆ కంపనాఖ్యుఁ
డింక గతి యే మనెడు శంక ◆ లంక కరిగి
రావణునిఁ గాంచి పలికె నా ◆ రావ మెసఁగ. ౨౯౦

—◆ అకంపనుఁడు లంక కరిగి రావణునితో జనస్థాన వృత్తాంతము సెప్పుట ◆—

క॥ ఆజి జన స్థానంబున, నోజ మహారాజ పొసఁగె ◆ నుద్వృత్తోద్య
త్తేజస్సంభృతి దైత్యో, ద్వేజకముగ నొండు గలదె◆తెలుపఁగ నింకన్. ౨౯౧

తే॥ ఆమహాస్పదమున నున్న ◆ యంతవట్టు, వీరు లెల్లరు మడిసిరి ◆ సారబలుఁడు
ఖరుఁ డడఁగె నెట్లొ బ్రదుకంగ◆గలిగె నాకు, నీదు దర్శన మిడనున్న◆నియతికతన.

ఆ॥ అనిన యంతమాత్రి♦ననలఖండము లైన, కనుల నెదిరిఁ గాల్చు♦గతిఁ దనర్చి
పంక్తివదనుఁ డిట్లు ♦ భాషించె బీరంబు, రూపు మార్చి చరమ ♦ రూపమెనయ.

శా॥ ఏమేమీ ? యెవఁ డీపరాసుఁడు మదీ♦యేష్టార్థసిద్ధి రమ్యస్థలిన్
సామాన్యం బనరాని పూజితజన ♦ స్థానంబుఁ బోఁకార్చె వాఁ
డేమాద్రి న్మన నెంచె లోకతతి నెం ♦ దేనిన్ స్థితిం గాంచఁగా
లేమి న్మానసవృత్తి చేడ్పడదొ ని ♦ ర్లేపత్వ మర్థించెనో. ౨౯౪

సీ॥ నాఁకు విస్మిత మగు♦నడగాంచి సుఖ్యగాఁడు, ఇంద్రుండ యేని వై ♦శ్రవణుఁ డేని
యముఁ డంత విష్ణుఁడో♦యనఁబోఁడు కాలున, కేనె కాలుండ వ♦హ్నిని దహింతు
మృత్యువు పాలింటి♦మృత్యు వీతం డనఁ, బరగుదు రవి శశిఁ ♦ బట్టి విడుతు
వాయువు గతియును♦వరుణు పాశంబు న, కించిత్కరములు న♦త్యుగ్రశస్త్ర
ములు వెఱసి యొక్కఁ డిమ్మెయిఁ ♦ గలఁచె ననుచు
నా మొగమ్మునఁ బలుపఁగా ♦ నేమి గలదు
లోకము లలోకములు గావొ ♦ లోలభావ
మెనయఁడో రుద్రుఁడేనియు ♦ నింతలోన. ౨౯౫

క॥ అని సంరంభించు నతనిఁ, గననేరక కకంపనుండు ♦ కలవరపడుచున్
దన కభయ మొసఁగు మని వేఁ, డిన వాఁ డిడఁ దల్లడంబు ♦ డిందుపడంగన్.

శా॥ శ్రీమంతుండు త్రివిక్రమక్రమణుల ♦ శ్రీస్మేరయోగి వ్యాఘ్రాయతా
శ్యామస్థేమభుజుం డతంద్రుఁడు వృష ♦ స్కంధుండు ప్రోద్యద్ద్వయీ
కామారాస్యుఁడు సింహసంహననల ♦ క్ష్మశ్రీయశోసిద్ధ్యభ్ర
ద్రామాఖ్యుండు నరుండు దాశరథి చే ♦ రన్వచ్చె నచ్చోటికిన్. ౨౯౬

ఆ॥ అతనిచేత నిహత♦మయ్యె నయ్యా! జన, స్థాన మెల్ల ననిన ♦ సంశయింప
నేల యాతఁ డొక్కఁ ♦ డే యింత సేసెనో, సురలు తోడ్పడంగఁ♦జూచినారొ.

క॥ వివరింపు మనుచుఁ బెనుబా, ము విధంబున రోజు దనుజ ♦ మూర్ధన్యు నెఱిం
గవలోకించుచు వర్ణిం, చు వెరపులే కలుకుచు నె య♦సుర యిట్లనియెన్. ౨౯౭

సీ॥ విలుకాండ్రలో మేలి ♦ వలను గాంచినవారి, తల నుండు రాముండు♦దనుజనాథ!
యతని తేజున నర్కుఁ ♦ డనలుండు సరిపోల, రనిన నన్యు లిఁకెట్లు♦ననుచువారు
దివ్యాస్త్రసంపత్తి ♦ తెలిగొందు తా విడె, యన నింద్రు నెంచుట♦యనవసరము
జోడుకోడె యఁట సై♦దో డొకం డవ్వాని, కనిలుఁ డగ్గికి సట్టు ♦ లైనవాఁడు
నెలవు గాపాడుకొనఁ జిన్న♦నిలువఁ బెద్ద, పేర్చినాఁడు దుర్గము పా డొ♦నర్చినాడు
చేసె నిమ్మెయి నమ్మక ♦ చెల్లరొంటి, దంట వీడని తలఁచి నెంత♦దలఁచునొక్కొ.

తే॥ వేల్పులే పాటి యవ్వీరు ♦ వింటఁ బొడము, తూఁపు లేనుతల ల్గలఁ ♦ పాఁప లగుచు
మొసవినవి సైనికుల నెల్ల ♦ మిత్తి యనుచుఁ, గలదెమనవారిఁజెనయర ♦ క్షఃకులేంద్ర!

క॥ ఏయెడఁ దల నిడె నెవ్వం, డాయెడ రాముఁడె శరాస ♦ నాన్వితుఁ డయి కం
దోయి భ్రమియించు వాఁ డే, చాయం గానెనొక్కొ మైందవ ♦ జాలికశక్తిన్.

ఆ॥ అనిన నేన పోయి యవ్వారి పొగ రడఁ, గంగఁ జూతు నని క ♦ డంగు నతని
యాత్ర మరసి పలికె ♦ నప్పు డకంపనుఁ, డున్నయంతవట్టు ♦ నోరసిలొనుచు.

—♦ రావణుఁడు రాము నెదుర్కొన నెంచ నకంపనుఁడు వారించి యుపాయము సెప్పుట. ♦—

క॥ సామాన్యునిఁగా నెంచెదె. రాముని రాక్షసవరా! ధ ♦ రావలయమునన్
ద్యోమండలముననేనియు, నామెయి పురుషావతంసు ♦ నరయంగలమే. ౩౦౪

ఆ॥ ఆతఁ డాశుగముల ♦ నాపగావేగంబు, నాఁగుఁ బంకిలంబు ♦ గాఁగ నేలఁ
గడవఁ జేయు నబ్ధిఁ ♦ గెడపు నతారకా, గ్రహము నభము నేలఁ ♦ గలుపు గిరుల.

ఉ॥ అగ్గి నడంచు వాయుగతి ♦ నాల మొనర్చు ధరిత్రి మున్కఁ గా
లొగ్గి యెడల్చుఁ జేతఁ బిడు ♦ గో యని తాల్చును ముప్పోలంబులన్
భగ్గున నుండఁజేయు నొక ♦ బాణమున న్దలఁ పింత గల్గినన్
దిగ్గన సృష్టి గూర్చుఁ దన ♦ తీ రొకఁ డారయుకుండు నంతలోన్. ౩౦౫

ఆ॥ నీ వెదిర్చి యతని ♦ నేవగనేనియు, గెలుచు టరిది సురలుఁ ♦ గ్రిందుపడుదు
రనఁగ ననఘ! స్వర్గ ♦ మపకృష్టులకు నట్లు, రాముఁ గదియఁ జనదు ♦ రక్కసులకు.

క॥ నా నెఱి యరయ న్వాలతువ, యేని న్వాను మేజగముల ♦ నెందును ధరణీ
జాని సతీమణిఁ బోలిన, చాన న్గన మేల నిఁక వి ♦ చారం బొంటన్. ౩౦౬

ఆ॥ మొఱఁగి యెట్టు లైన ♦ ముగ్ధముఖాంభోజఁ, కమలపాణి నీల ♦ గచ సుజఘనఁ
బీనవృత్తకుచ వి ♦ భీతమృగేక్షణ, నామెఁ దోడితేర ♦ ననువు గనుము. ౩౦౭

క॥ తదుపహితజీవితుం డతఁ, డది మూలముగాఁ గృశించి ♦ యవసానదశా
విదితుఁ డగు టాదవ నీ వే, లెదు జగముల నెల్ల నేక ♦ లీలాగృహివై. ౨౧౦

ఆ॥ అనిన వాని మెచ్చి ♦ యటఁబోవనిచ్చి యే
కాంతమున మహీజ ♦ కాంతుఁ గూర్చి
తలఁపు మెలపు లొలసి ♦ తలపోసికొనుచుండె
రాక్షసేశ్వరుండు ♦ రాజవదన. ౩౧౦

తే॥ అటు జనస్థానమున నున్న ♦ యనఘ చుప్ప
నాతి తన దిక్కు సెడ నతి ♦ శీఘ్ర మరుగుచు
నా మునిఁ గూర్చి చెవిముక్కు ♦ రమ్ము ముంచి
చెల్వఁ బలికెంచె లంకకుఁ ♦ దీపులాడి! ౩౧౭

క॥ ఘననాద యగుచు విశృతా, ననలక్ష్యత నొడ్డబెసఁగ ♦ నంబోలక న
న్గొనుచు దనుజాధిపుని కొ, లువునచక్కం జేరి యూఁ ♦ బొరుస్యను నచటన్.

సీ॥ వెలుఁగులజేని మం ♦ డలిఁబోని ప్రాసాద, మున వింత తేజమ్ము ♦ నినుచువాని
స్వర్ణవేదికస్థుని ♦ జ్వలితాగ్నియట్టులు, సింహాసనమున భా ♦ సిల్లుచువానిఁ
దూలకు దిక్పతులతోఁ ♦ దులదూఁగి మంత్రులు, గొలకింప నిగ్రహనఁ ♦ గ్రందరువానిఁ
గలితవిద్యాధర ♦ గంధర్వసూక్తుల, యక్షపన్నగలాస్యంబు ♦ లరయువాని
దేవజన్మవిశేషులఁ ♦ జెఱఁగు మాలి
మిగ్గింగఁ బది గాఁగఁ జెఱచిన ♦ మిత్రినోష్ఠ
భావ మెత్తింగించు దశముఖ ♦ పంక్తివాని
వింశతిభుజు స్తనుంగాంచె ♦ వెలఁది సాధ్వ! ౩౧౮

వ॥ మెండియుఁ బ్రచండతేజో మండలుం డగు నద్దైతేయాఖండలుండును నిజవిశాల వక్షస్థ్సలమండనాయమాన సుదర్శన దంభోళిప్రముఖనిఖిల జీవతాపహారణ వ్రణకిణాంకాంకణమ్ము లై రావణవిషాణాగ్రప్రోత్కతిప్రాంగణంబు లై మహావీర లక్షణలక్షకంబు లగుచుండ జయశ్రీసమాశ్రమణోపదేశకంబు లగు తారహారం బులు యశస్సముపహారంబు లనం దత్తత్ప్రకరణపర్యాయవచనంబులగు మణి ప్రదీపగణంబుల ప్రయోజనం బనుసంధానింప దర్శనీయపరిచ్ఛదుండై స్నిగ్ధమై దూర్వసంకాశంబును దివ్యవస్త్రాభరణగంధమాల్యోపశోభితంబును వ స్థకాంచన కుండలంబును సుభుజంబును శుక్లదశనంబును వితతాస్యంబును బర్వతోపమంబును మహాసన్నాహంబు నైన దేహంబు నిజాసాఫల్యత్వం బభివర్ణింప సముద్రక్షోభ్యసము ద్రక్షోభంబును సుస్థిరపర్వతేంద్రక్షేపణంబును సర్వసుపర్వాయుధగ్రహణంబును త్రిలోకీదండయాత్రయు ధర్మోచ్ఛేదనంబును యజ్ఞవిధ్వంసనంబును సోమహా విస్సంపాదనంబును వివిధజాతియువతీతతిసమభిమర్శనంబును భోగవతీగమనంబును వాసుకిపరాజయంబును దక్షకప్రియభార్యాపహారణంబును కైలాసతోలనంబును నరవాహనసంచాలనంబును బుష్పకవిమానాకర్షణంబును చైత్రరథాలోడనం బును నందనవనవిచ్ఛేదనంబును జంద్రసూర్యనిరోధంబును దిక్పాలకనిగ్రహణం బును దపఃప్రశస్తియు వీరహోమవిధానంబును స్వయంభూప్రసాదంబును శర్వతో

నిర్భయప్రస్తావనంబును వరలాభంబును మనుష్యానాదరంబును మృత్యునిగ్రహంబును నిఖిలలోకపాలనంబును మున్నుగాఁ గలుగు స్వీయచరిత్రంబు లుగ్గడించి చారణులు ప్రచారణం బొనరింప మంత్రిసామంతహితపురోహితప్రముఖులు పరివేష్టింప గూఢచారులు చారులు నెల్లవృత్తాంతంబు లెఱిఁగింప సకలభూతంబులు స్వీయశాసనమునకై వేచియుండ నిండుకొలువుండియు రామప్రతాపశ్రవణదోధూయమానాంతరంగుం డగుచుఁ దత్ప్రతారణపరత్వంబునఁ దనలోఁ దా నెద్దియేనిం దలపోసికొనుచుం బగినవల నరయుచున్న యప్పౌలస్త్యకులసంభూతు భూతభయావహు బ్రహ్మఘ్నుఁ గ్రూరు దుష్టచారు నిర్విచారు నిరనుక్రోశుఁ గర్కశు నవిరతుఁ బ్రజాహితేతరరతు నవికలు మహాబలుఁ గాలకల్పు నకల్పు రావణు లోకవిద్రావణు నదరు నిజసహోదరుంగనుంగొని యయ్యభీతచారిణి వ్యభిచారిణి భయమోహమూర్ఛితయు ననర్చితయు వికలయు విహ్వలయు విరూపితయు నవోద్యచ్ఛోకనిరూపితయు నగుచు నాతనిమ్రోల నేలంబడి పొరలుచు మహాజనసమక్షం బనక రోషపరుషాక్షరంబుగాఁ బలుకం దొడంగె.

— ♦ శూర్పణఖ రావణుఁ దూలఁనాడుట ♦ —

సీ॥ స్వైరితాస్థ నిరంకు♦శతఁ గన్న జనుఁ డెందుఁ, బ్రాప్తఘోరభయాను♦భవముగొనఁడు
కామవృత్తుఁ బ్రమత్తు ♦ గారవింపఁ దలంప, రాశ్మశానానలు ♦ నట్లు ప్రజలు
దుశ్చారు దుర్ధర్ము ♦ దుష్టు నస్వాధీను, నెఱయఁ జూచెద రెంత ♦ హితులయేని
నేటిపంకము నెంచి ♦ యిట్టట్టు జరుగవే, యిభములు రసవిహా ♦ రేప్సితములు

కొండలు సముద్రమున మున్గి ♦ గొఱలకున్న
యట్లు దేశమ్ము కాలమ్ము ♦ స్వాత్మవిషయ
మును విచారింపఁ బోవని ♦ మూఢతములు
చెడుదు రవ్వారి రాష్ట్రము ♦ ల్చేటు లెనయు. ౩౧౬

ఉ॥ కొంటె విరోధము న్గొసరి ♦ కోవిదులౌ సురముఖ్యు లన్న వె
న్నంటి యయుక్తచారుఁడ వ ♦ హంకృతిమగ్నుఁడ వస్తబుద్ధి వా
గొంటటు బాలచాపలమె ♦ కూర్చెను నా నిపు డేమి గంటి ని
న్నొంటి దలంటి మొత్తఁగ మ ♦ హోన్నతిమై బఱతెంచు బన్నముల్. ౩౧౭

గీ॥ చారకోశనయంబులఁ ♦ జక్క నరయఁ
జాలని జనేశుఁ డెనయు నే♦జయము నయశు
భాయతుల నాయతములు కా ♦ నైనఁ గాంచు
మూఁడునాళ్లదె యనఁ దగు ♦ మురిపె మతఁడు. ౩౧౮

క॥ చారులవలన ననర్థము, లేగా జరసి ప్రతికార్య ♦ మెఱిఁగి ఘటించుర్
దూరముననుండ నాతఁడె, ధీరోదాత్తుండు వాని ♦ దే దృష్టి యనర్. ౩౧౯

ఆ॥ వెడఁగులైననారు ♦ విహితు లయుక్తులు, చారు లీ వస్త్ర ♦ స క్తి నుందు
వట్లుగాకయున్న ♦ నగునె యింతలు జన, స్థానమునను స్వజన ♦ సంహారణము. ౩౨౦

క॥ ఒంటి గెలిచె మనుజుఁడు ము, క్కంటికి భర మనఁగఁ దగు ప్ర ♦ కామబలులఁ వే
గంటి నగ మునులు మొగకొని, తంటా లెడసె నని నుతులు ♦ దద్దయుఁ గూర్పర్.

క॥ వరమిచ్చినాఁడు వారల, కరుస మపుడె కూర్చినా డ ♦ హంకృతి నాతో
సరి వచ్చునె యొక్కఁడు సం, గరమున నని యున్న వాఁడు ♦ ఘనుఁ డె నరుడుర్.

క॥ ఆజిఁ బదునాల్గువేవురు, తేజోనిధు లాత్తరథులు ♦ ధీయుతు లడఁగం
గా జవనులు ఖరముఖ్యులుఁ, బో జయమే నీకు నిఁకఁ బ్ర ♦ భుత్వము గలదే. ౩౨౩

ఆ॥ తీక్ష్ణుఁ డల్పదాత ♦ తీరని మత్తత, గలుగువాఁడు శఠుఁడు ♦ గర్వితుండు
నైన తేని కలిమి ♦ నాదరింపఁపు వాని, పోక కలరు నెల్ల ♦ భూతములును. ౩౨౪

క॥ అగ్రాహ్యుం డతిమానియు, నుగ్రకథుఁడు స్వప్రశంస ♦ నోల్లాసపరుం
డాగ్రహయుతుఁడు నగు విభుని, నిగ్రహ మొనరింపఁ జూచు ♦ నిజజనమేనిర్.

సీ॥ కర్జంబు నెఱప కా ♦ గతభయం బరయక, యున్నవానికి సిరి ♦ యుండఁబోదు
తృణకాష్ఠలోష్టత ♦ త్కణములఁ బోల్పఁగ, నైన రా డపరాష్ట్రు ♦ డైన యొడయఁ
డుపభుక్త మగు వస్త్ర ♦ ముత్సృష్ట మగు మాల్య, మానిర్థకు సాటి ♦ యనఁగవచ్చుఁ
గనులుమూసియు నిద్రఁ ♦ గలసియుమేల్కాను, నయదృష్టి నెవఁడు స ♦ నాథుఁడతఁడు
సర్వదృక్కు జితాత్ముండు ♦ సత్స్వభావుఁ, డప్రమాది కృతజ్ఞుండు ♦ వ్యక్తనృత్త
సాదుఁ డగువాఁడు నిల్చు గా ♦ జ్యమున నెల్ల, కాల మఖిలజనస్తుతి ♦ లీల లోలయ.

ఆ॥ లేవు మేల్గొనములు ♦ లేదు సద్బుద్ధి ప, రావమంత విండ్రి ♦ యప్రసక్తి
మనెదు ప్రొద్దు నేల ♦ యని గుణదోషమ్ము, లనియుఁ గనవు చెడద ♦ వనతిచిర మె.

క॥ అని తన దోషమ్ముల నె, న్ని నవావజ్ఞ నిడు స్వసఁ గ ♦ నీయసిఁ గని యా
ఘనదర్పబలాన్వితుఁ డి, ట్లనెఁ దద్దయుఁ జింత వెనుచు ♦ నారాటమునర్ ౩౨౮

తే॥ ఏల దూఱెద వీసభ ♦ నిట్టు లెంత వాఁడు, రాముఁ డతని గుణ ♦ వర్తనంబు
లేవిధంబులు వల నెద్ది ♦ యెట్లు గలవు, రూపవిక్రమధైర్యని ♦ రూపణములు. ౩౨౯

క॥ ఏయాయుధంబుఁ గొను నచి, రాయుష్కుఁడు దేన శూరు ♦ లందఱుఁ దునిమెర్
నీయున్న తెఱఁగునకు నెది, యామెను మూల మయి తనర ♦ నా కర్మంబుర్.

క॥ పలుకుము వరుసనె యూరక, యులికిపడిన నేమిగల ద ♦ యు క్త మనఁగనై
తల పగులు వార్త వొడమినఁ, దలఁతురె స్వజనంబుతోడ♦దబ్బర లాడన్. ౩౩౧

క॥ అని త న్నాతం డడిగిన, విని క్రోధవశంవదాత్మ ♦ వివరణ మొప్పన్
ఘనుడు రఘురాము చరితము, వినిపింపం దొడరె నది ప్ర ♦ వీణత వెలయన్.

—♦ రావణుం డడుగ శూర్పణఖ రాముని పరాక్రమం బెఱిఁగించుట. ♦—

సీ॥ ఉరుతరదీర్ఘబా ♦ హుఁడు విశాలేక్షణుం, డటు చీరకృష్ణాజి ♦ నాంబరుండు
కందర్పసమరూప ♦ కలితుఁడు రామనా, ముఁడు దాశరథి జగ ♦ న్మోహనుండు
శక్రాయుధనిభంబు♦చాపంబు ధరియించుఁ, గనకాంగదము లందుఁ♦గ్రాలుచుండ
దీప్తాశుగముల ను ♦ దీర్ణమహావిషా, శీవిషాభముల సృ ♦ జించుచుండుఁ
గొనుట కూర్చుట తివియుట ♦ కోటి నెఱయ
విడుచుటయు ననువవి గానఁ ♦ బడ వతండు
ధనువు చేఁబూని నిలఁబడుఁ ♦ ద న్నెదుర్చు
వారు శరవిద్ధులై యిల ♦ వ్రాలుచుండ్రు. ౩౩౨

తే॥ అలిగి పర్జన్యుఁ డొదవించు ♦ నశ్మవృష్టిఁ, జావకట్టుగఁ బడెడు స♦స్యంబు లట్టు
లతని శరవృష్టిఁ గూలు సై♦న్యంబు లెల్ల, స్వీయఘృష్టు లిరమ్మద♦సృష్టిఁగూర్ప.

తే॥ అభయ మిడినాడు వనవాసు ♦ లైన మునుల
కట్లు సార్థముహూర్తకా ♦ లాంతరమున
నడఁచినాడు పదాతియై ♦ యతిరథులఁ జ
తుర్దశసహస్రసంఖ్యాయు♦తులఁ గడంగి. ౩౩౪

క॥ దూషణుఁడుఁ ద్రిమస్తకుఁడును, దోషాచరవరుఁడు ఖరుఁడుఁ ♦ దొడరిన యుప్పుడా
భాషణ మావిక్రమ మా, వేషము వర్ణింపఁ గలనె ♦ వేనోళ్లైనన్. ౩౩౫

తే॥ పరిభవము గూర్చి న న్నిట్లు, ♦ పనిచినాడు, స్త్రీవధాశంకఁ జర్చించు♦చిత్తవృత్తి
నింక రక్కసుఁ డడు గుంచు♦నే యటంచు, దండకాటవి నిడినాడు ♦ డిండిమంబు.

తే॥ అన్నమాటకుఁ దప్పఁ డ♦ట్లాతఁ డుండ, నన్న మాటకుఁ దప్పఁబోఁ♦డతని తమ్ముఁ
డన్నిఁటను దన్నె పోలెడు♦నన్నిరంకు, శప్రతాపుని గణియింప♦శక్తి గలదె. ౩౩౭

ఆ॥ లక్ష్మణాఖ్యుఁ డతఁడు ♦ లక్షణవంతుండు, దక్షిణంపు భుజము ♦ తనకుఁ గాఁగఁ
దొడరకుండు నెట్లు ♦ దుర్జయుం డఁట వాఁడు, చాల దింక శని ని ♦ శాచరులకు.

సీ॥ మెఱుఁగుఁ దీఁగెలు ప్రాఁకు♦మేల్మి నెమ్మని కాం, తులు వనాంతరసీమ♦దుముకులాడ
వనదేవతలఁ గూర్చు ♦ వరుస పాటలతోడి; చిఱునవ్వు చంద్రికా ♦ శ్రీ ఘటింప

బంగారు నెఱపోఁతఁ ♦ బరఁగు సంహననమ్ము, సాపత్ని లక్ష్మీప్ర♦సక్తి నొడువఁ
దోఁబుట్టువను ప్రీతిఁ♦దోఁతెంచె ననఁగ ము, ఖాస్థాని జంద్రుండు♦హారువు నూపఁ

బ్రియుని కనుసన్నల మెలంగు ♦ ఫణుపునడల
గునుపు సయ్యాటలఁ దనర్చు ♦ నునుపుచూఁపు
దనుపుఁ దనసొమ్ము లన నొప్పుఁ ♦ దనువలగ్న
రాము నిల్లాలు రతనాల ♦ రాజనాలు. ౩౮౦

ఉ॥ ఆడెడునాట యచ్చరల ♦ నాడఁ దొడంగెడు బాట ముచ్చటల్
గూడెడు మాట సంగడము ♦ గూర్చెడు ముద్దుల మూఁట యాసుధా
నాడిక తోడ నివ్వనము ♦ నాటనము న్వనగించు నాటకుం
డోడు నె వాఁడు ముజ్జగము ♦ లొక్కటిగాఁ జెనయంగ నెంచినన్. ౩౮౧

తే॥ చూడమే మన మాచంద్ర ♦ చూడు రాణి
లక్ష్మి భారతి శచి మున్ను ♦ లాఁతివార
లెంద ఱెందఱు సుందరు ♦ లిందువదనఁ
బోలఁబో దొక్కసతియు ము ♦ వ్వాలములందు. ౩౮౨

క॥ ఆతలిరుఁబోఁడి నామము, సీత యనంజెల్లు జనకు ♦ శ్రీయుక్తమహీ
జాతము రతసం బగుట స్మ, రాతతవిలసితము వింత ♦ యాసురనాథా! ౩౮౩

తే॥ లోలనయన ప్రియుని చూడ్కి ♦ లో మెలఁగుట
యబ్రమె విచిత్ర మాతఁడ ♦ య్యతివదృష్టి
లో నిలచి యుంట మఱియు నే ♦ లోకమునను
గలరె పతిపత్ను లట్టుల ♦ ఖండరసులు. ౩౮౪

తే॥ ధర్మదేవతలే యనఁ ♦ దగు ప్రసక్తి, కేమి లోప మపాప తా ♦ నెవనిఁగోరె
నెవనిఁ గౌఁగిట గదియించె♦నెల్ల జగము, లేల నాతండ కాడె య♦ధీశుఁ డధిప.

క॥ ఏ నెంచితి నానెఱి నిటు, లానెలఁతుక నిన్నుఁ గూర్ప ♦ నైన సుయోగం
బౌ నని యానరునెడ నె, ట్లైనను లోపంబు లుండ♦వా యనియు నెదన్. ౩౮౬

క॥ పీనశ్రోణిపయోధర, నానీలాలక సుజఘన ♦ నావరవదనన్
దే నుద్యమించు టొక్కఁడు, నానేరం బయ్యె నసుర ♦ నాయక తొలుతన్.

ఆ॥ చెవులు ముక్కు లిట్లు♦చెక్కి విరూపితఁ, జేసి యనిచి రింకఁ ♦ జెప్పవలెనె
యీవు నామెఁ గాంచి♦యేమయ్యెదో స్మర, రామశరవరాంత ♦రప్రసక్తి. ౩౮౭

ఆ॥ తలఁపు వోడమెనేని దరలుము కుడియెడు, గత్తి యునిచి వారి నెట్టులైనఁ
బొడిచి గెలువ కొదవఁబోవ దమ్మహనీయ, మర్థ మరయు మిదియు నాసురేంద్ర.

క॥ ఇమ్మేలు వొసఁగెనేనియు, నుమ్మలికము వాయుఁ దనకు నుల్లోకులకున్
సమ్మతి నటు యోజింపుము, కొమ్మం గొని సౌఖ్యవార్ధిఁ గ్రుమ్మరుమటువున్.

క॥ నీబల మెదిరి బలము గని, యాబన్నము గన్నవారి యాగతి గని తో
రాబడి పోబడియుం గని, పూబోఁడిం దెమ్ము పొమ్ము పురుషుఁడ వగుమీ. ౩౫౧

— రావణుఁడు మంత్రాలోచన మొంటిగఁ జేయుట —

మ॥ అని తెల్పం గతి నిల్వరాని తమకం బాత్మస్థితిం దేల్ప రో
మనికాయంబు ప్రహర్షణోన్నతిఁ గన న్మానిత్వమానిత్వముల్
బెనుపొందంగ నమాత్యులం బనిచి యా పేరోలగం బాఁగి లోఁ
జని యోజించె గొనమ్ము దోస మొదలోఁ జన్మాప్రయుక్తంబుగన్. ౩౫౨

ఆ॥ రెండుగడెలలోఁ బ్రచండులఁ దనవారిఁ, దునిమినపుడె యతని దోర్బలంబు
దలకు మీఱె నింక దశరథాత్మజుఁ డన్న, హరియు కాక యపరుఁ డనఁగ నగునె.

ఆ॥ ఐన నేమి చెడియె నద్దేవుఁడేని వై, కుంఠపదవి కేను గూర్చువాఁడ
నన్యుఁడేనిఁ దోలి యాఁపెతో జగమెల్ల, నేన యేలువాఁడ నింత నిజము. ౩౫౪

క॥ ఔరె మ్మని యల తిమ్మనిఁ, బోలిన మది గుదురు పఱచి పోయె నతఁడు శుం
డాలగతి యానశాలకు, నాలోలకటాక్షభృతను మాయుధవిభవా! ౩౫౫

ఆ॥ ఒంటి సేరి సూతు నోరి మామక మర, దమ్ము దె మ్మనంగ దక్షణమ్మె
వాఁడు గూర్చి తెచ్చె వరహేమమణిభూష, ణోజ్జ్వలమ్ము ఖరఖు రోచితమ్ము.

తే॥ స్వర్ణకుండలచామర చ్ఛత్రయుతుఁడు
వింశతిభుజుండు తేరిపై వెలసి మెఱసె
బెగ్గురులు గూడ మించుల పెనుపుతోడఁ
గొండపై మోడుకొను మొగి లండఁ బెరయ. ౩౫౭

— రావణుఁడు జనస్థానమునకుఁ బ్రయాణ మగుట. —

తే॥ పదితలలకొండ వాఁ డట్లు పరఁగి పెరిగి, కామగమనము కింకిణీ క్వాణభరితము
నైన యానమ్ము నెమ్మనం బలరఁ జేయ, నబ్ధి తలమీఱి యావల నరయఁ గోరి.

చ॥ చని చని శీతమంగళర సప్రవిభాసినరోజినీరమా
వనచణతీరపుష్పవన వన్యఫలద్రుమశారి కాఱిని

స్వనయుగభంగురాలిగుణ ♦ శాలికలాంచితగీతిలక్ష్యశో
భనభవనప్రచారముని ♦ పావనశాలల లీల లెన్నుచున్. 3౫౯

తే॥ సిద్ధచారణగంధర్వ ♦ సేవితంబు, లప్సరశ్చరితములు హం ♦ సాశ్రయంబు
లప్సరశ్చయములు కొండ♦లనుపమంబు,లుపవనంబులుఁగనియెన♦య్యుజ్జ్వలుండు.

తే॥ చందనవనంబు లగరుద్రు ♦ సంశ్రయములు
మరిచతక్కోలజాతిగు ♦ ల్మములు నక్త
మాలసుతమాలమాలికా ♦ మంజిమములు
వాని రంజిల్లఁజేసె ను ♦ ద్యానరసిక! 3౬౧

శా॥ శంఖప్రస్తరవిద్రుమోత్కరకలా ♦ శాలీనముక్తాత్మభూ
కంఖాణద్యుతిరత్నసూత్నఘటనా ♦ కల్పాఢ్యసత్కాంచనో
త్పుంఖప్రేక్ష్యవిమానహర్మ్యతలసం ♦ పూర్ణోదయోచ్ఛృంఖల
ప్రేంఖద్బాలకురంగదృగ్వితతి సం ♦ ప్రీతిం బ్రశంసించుచున్. 3౬౨

క॥ అనుకృతగరుడుం డంబుధి, యనూపముం గాంచె ధనదు ♦ ననుజుఁ డవలఁ గ
న్గొని మునిపదము సుభద్రం, బను న్యగ్రోధము సురాంగ♦నార్చిత చరణా! 3౬3

సీ॥ మును దండ్రి యానతి ♦ మొనసి ఖగేంద్రుండు, గజకచ్ఛపగ్రాస ♦ కబళనమున
కధిరోహణ మొనర్చె ♦ నధిరోహణస్థితి, శతయోజనాయత ♦ శాఖమైన
యవ్వటశాఖియం♦దత్యుచ్ఛ్రిత యొకొండు, శాఖ నయ్యదియు వి♦శ్లథిత యగుడు
వాలఖిల్యాదులు ♦ వరతపస్వులు దాని, యాశ్రయంబున వ్రేలు ♦ టరసి నోటఁ
గొమ్మ నిఱికించుకొని తాతఁ ♦ గూర్చి వేఁడ
వారిఁ బ్రార్థించి యనిచి యి ♦ ప్పాదపలత
వార్థి నిడు మన నాతండు ♦ వైవఁ గూలి
రచట నున్న నిషాదు ల ♦ త్యంతఖలులు. 3౬౪

క॥ ఆకరికచ్ఛపములఁ దిని, యాకలివో నాకనాథు ♦ నదలించి సురా
నీకము దోలి సుపర్ణుఁడు, శ్రీకర మమృతాస్పదంబు ♦ సేరె లతాంగీ! 3౬౫

ఆ॥ తల్లి దాస్య ముడిపెఁ ♦ దద్దయు రసఘుటిఁ, దెచ్చి కద్రుసుతుల ♦ కిచ్చి యాతఁ
డనలలోహజలమ♦హారత్నగృహముఖ్య, యంత్రములఁ దెరల్చి♦యతిరయమున.

క॥ వాసవుఁడు వేఁడ వారల, యాస న్నేఁ దీర్తుఁ గడఁగి ♦ యాకలశము నీ
వాసన్నని కొను మనుచు సు, ధీసన్నుతుఁ డనియె నట్ల ♦ దితిజుఁ డొనర్చెన్.

క॥ ఆవైనతేయకీర్తిల, తావాలము మానిజుష్ట ♦ మగ మరసి చనెన్
రావణుఁ డంబుధిపరపా, రావస్థితిరమ్య మొక్క ♦ యాశ్రమమునకున్. 3౬౮

క॥ ఆరాము బ్రాణగతి త, త్స్వరూపమ్ము గూర్చి వనన ♦ చట వల్కజటా
ధారి మితాహారియు నగు, మారీచుం గాంచె వాని ♦ మానితచరితా! ౩౬౯

—♦ రావణుఁడు మారీచాశ్రమమున కేగి వానిసహాయముఁ గోరుట ♦—

తే॥ ఎనసినంతనె కని రాక్షసే ♦ శ్వరుఁ డని
యతఁడు పూజించె భయభక్తు ♦ లమర నసుర
నమితభోగ్యంబుల నమాను ♦ షముల నేర్చి
కూర్చి కూరిమిఁ గొసరుచుఁ ♦ గోమలాంగి! ౩౬౯

ఆ॥ మఱియుఁ బలికె వాఁడు ♦ మామకానుగ్రహ, హేతు వెద్ది పొసఁగె ♦ నేమివింత
లచట నందఱును సు♦ఖాంచితులే కద, యేల యిట్లు పదరి ♦ యేగుదేర. ౩౭౧

క॥ తడయ కెఱిఁగింపు మన నా, తఁడు దడఁబడ కిట్లు లనియెఁ♦దాత! యొకఁట నా
ర్తుఁడ నైతి దాని నీ వే, ర్పడఁ గొని సవరింతు వనుచుఁ ♦ బడయం గంటిన్.

సీ॥ ఎఱుఁగుదు గాదె నీ ♦ వింతయు నాయాన, నాజనస్థానంబు ♦ నందు ఖరుఁడు
దూషణప్రముఖయో♦ధులు నంట శూర్పణ, ఖయు వారికడ మేలి♦కలన మంట
గొరపిడి సేయుచు ♦ నొడ్లఁ దాపసుల నో, రెత్తనీయక సుర ♦ లెగిచిపడక
యొంట నొదుగఁ బాఱ♦ నున్నతభుజులు వా, రథిసహాయులు గాఁగ♦నఖిలగతుల

సుఖమె చేకూరెఁ దన కట్టి ♦ సోదరులను
బలములను నేలపా ల్సేసెఁ ♦ బగతుఁ డగుచు
మునులు ప్రేరేప మానిసి ♦ మూఖ్గు దశర
థాత్మజుఁడు రాముఁ డను నాతఁ ♦ డదరిపడుచు. ౩౭౨

ఆ॥ తండ్రి త్రోల వనికిఁ ♦ దరలివచ్చెను భార్య, తోడ జీవితాశఁ ♦ దొఱఁగి వాఁడు
నాదు సోదరికి మ ♦ హాదైన్య మొనరించె, రూప మరయఁ జనవి ♦ రూపఁ జేసి.

క॥ అది కారణముగ మనవా, రెదిరిన వధియించె సత్య ♦ మే కొనెనఁట వాఁ
డదనున నాతెఱఁగింతయు, మది నరయక త్యక్తధర్మ♦మర్మం డగుచున్. ౩౭౪

ఆ॥ ఆయకామవైరు ♦ నాక్షత్రియాధము, నావిశీలు లుబ్ధు ♦ నాయువశుని
మొఱఁగి వాని భార్య ♦ మోహనాంగినిఁ గొని, తెత్తు దాన నవసి♦తీఱు నతఁడు.

క॥ దాన సహాయుఁడ వీ వై, తేనిం దలయెత్తి కాంతు ♦ రే సురలైనన్
మానితుఁ జేయుము నాయభి, మానముఁ గాపాడి ప్రథిత ♦ మాయోపాయా?

తే॥ జౌపయికమున మేటి వీ♦ర్యమున సార, దర్పమున నిన్నుఁ బోలిన♦దనుజుఁ డున్నె
నన్నుఁ దేర్పు మాశ్రవోప♦నతుఁడ వగుచు, వీటిబుచ్చకు మిమ్మేలు♦వెడమతమున.

క॥ వింతమెకమునై తత్పతి, చెంతఁ జరింపంగ నీదు ♦ సిరిఁ గనుఁగొననై
మంతనము గఱఁగ నాపెయుఁ, బంతమున న్మగనిఁ బనుచుఁ♦బట్టుకొనంగన్. ౩౮౯

ఆ॥ అతఁడు దోడుఁదోడ♦నటు దోఁడు కోడరా, నల్ల నరిగి పొలము♦లెల్లఁ గలయఁ
బెరయుచుండు మే వి♦భీతమృగేక్షణఁ, దెత్తు నొంటి గదిసి♦తెలివి నెఱయ. ౩౯౦

క॥ చందురుని సిరిని రాహువు, చందమున న్రాము సాధ్విఁ ♦ జయ్యనఁ గొని వా
నిం దెగఁజూచెద నావల, నిందలపాలై కృశించి ♦ నెఱి దొఱఁగినచోన్. ౩౯౧

తే॥ అనుచు గొంతెమకోరిక ♦ లలర ఱేఁడు, నోడువ రామకథాశ్రుతి♦నోటి తడి త
లంగఁ బెదవులు దడుపఁ గ♦డంగి వెఱ్ఱి,చూపు చూచుచు వెల్లనై♦స్రుక్కియతఁడు.

క॥ శవ మట్టులు గానఁగనై, యవయవములు వడఁక నిట్టు ♦ లనెఁ గరములు మో
డ్చి వినీతుఁ డగుచుఁ దోన, య్యవినీతుని వలనుపడిన♦యంతలు దేర్పన్. ౩౯౩

—♦ మారీచుఁడు రావణునకు హితములు సెప్పుట. ♦—

క॥ ఏ నెఱిఁగించెద నీ మే, లానయమున నాదు మేలు♦ నారసి విన నో
దేనిం దీన నపాయము, వో నిచ్చ లనూనసుఖము ♦ పొరయును నిన్నున్. ౩౯౪

తే॥ ఎందునేనియు దొరకదు ♦ రేలువాని, కిచ్చకము దోఁప వచియింప♦ నెంచువారు
పథ్యమును హితమును నైన♦పలుకు వలుకు,వాఁడు లేఁడదియాలించు♦వాఁడులేఁడు.

తే॥ నిజముగా నీ వెఱుంగవు♦నియతసత్త్వు, రాము సద్గుణనిరతుఁ బ♦రాక్రమాఢ్యు
నింద్రవరుణోపము నొకొండ్ల♦కెఱుక గలదె,చపలుల కయుక్తచారసం♦చారులకును.

తే॥ కలదె శుభ మని యింక ర♦క్కసుల కెందుఁ
గుపితుఁడై రాముఁ డెనసి నం♦ కోచ మెడలి
లోక మపగతరాక్షస ♦ లోకముగ నొ
నర్తు నని పూని నిలఁబడ ♦ ననిచె నేని. ౩౯౭

ఆ॥ నీకు నాకు బ్రదుకు♦నెఱి యున్నె యిమ్మెయి, సీతఁ గాళరాత్రిఁ♦జెనయఁ దలఁప
లంక పాడు వడదె♦లాఁతివారలు నవ్వ, దైత్యయువతు లెల్లఁ ♦ దల్లడిల్ల. ౩౯౮

తే॥ కామచారి దుశ్శీలుఁ డు ♦ ద్రక్కముఁడు పాప
మంత్రితుఁడు నగు నినుబోఁటి ♦ మండలంబుఁ

జెఱచుఁ దాఁ జెడు నిం కెద్ది ♦ చెడక యుండు
నభిజనము మున్నె చెడిపోవు ♦ నతనికతన॥ ౩౮౯

సీ॥ తనుఁ దండ్రి వెడలింపఁ ♦ దరలినవాఁడు గాఁ, డపగతమర్యాదుఁ ♦ డనఁగరాదు
లోపంబు దుశ్శీల ♦ లోలత కులదూష, కతయు నాతనియందుఁ ♦ గలుగఁబోవు
హితము పథ్యము గాని ♦ యేపల్కు బలుకఁబోఁ, డే భూతమున కేని ♦ నెగ్గుదలఁపఁ
డజితేంద్రియత్వం బ ♦ హంకృతి కార్కశ్య, మవ్వాని పే రెత్తు ♦ నచటు సోరవు
రూపు గైకొన్న ధర్మవు ♦ రూపధేయ, శాలి యభిరూపుఁ డధిగత ♦ సత్త్వుఁ డట్టి
రాము నెటు వింటి వే మంటి ♦ రాక్షసేంద్ర, మాటవో బాఱెడలినసగు ♦ బాటుగాదె.

ఉ॥ సత్యపరాక్రముండు నెఱ ♦ సాధువు ధర్మరతుండు యోగసం
ప్రత్యయశాలి సర్వహిత ♦ భావనుఁ డింద్రనిభుండు దుష్టభూ
తాత్యయకారి కాతరజ ♦ నావనుఁ డేలఁగఁ జాలు రాముఁడే
నిత్యవిభూతిమై నిఖిల ♦ నేతృత పైఁ దలఁ పూనెనేనియుఁన్. ౩౯౦

తే॥ తండ్రి! యెట్లు హరింతు వా ♦ తపనుని ప్రభ, స్వీయతేజోభిరక్షిత ♦ శ్రీవిలాసఁ
దలిరుఁబోఁడి విదేహభూ ♦ తనయయనుచు, నెఱిఁగి యెదుష్టుఁడని చెని ♦ న్నెడరుపఱుప.

తే॥ ఎవఁడు నిద్రించు సీతల ♦ యెడయ మోదెఁ, గాలఫణి నోట నెవఁడు నీ ♦ వ్రేలిఁ జొనిపె
నతఁడె శత్రుం డతండె దే ♦ వారికులము, శృంగ మెడలింపఁ దలఁచిన ♦ చేటుకాఁడు.

తే॥ శుద్ధవంశాగ్రకరము తే ♦ జోమదంబు, దోర్విషాణంబు యుద్ధసం ♦ ధుక్షితంబు
రామ గంధగజంబుపై ♦ రాణ నెఱపఁ, బోకుమది చెల రేగినఁ ♦ బొలియఁ జేయు.

క॥ ఆసింగము మేల్కొలుపకు, మాసురమృగహారము శితశ ♦ రాసినఖరదం
ష్ట్రాసదృశచేష్టితం బది, కేసరితరుణప్రకార ♦ కీర్త్యము వింశే! ౩౯౪

సీ॥ ఇషుకీల మధికార్ము ♦ కేంధనాకృష్య మా, రామాగ్నిలోఁ జొచ్చి ♦ రాఁ దలంతె
కోరిక ల్లేకున్నఁ ♦ గోదండధరరాఘు, వాస్యంబు సేరఁగా ♦ నరుగు మింక
బాడబజ్వాలతోఁ ♦ బరఁగు కాకుత్థ్సను, తార్ణవం బీద నీ ♦ కనువుగలదె
మించుఁ గాంచి భ్రమించి ♦ మేకొనె దేమొ యై, క్ష్వాకాభ్రమశనులఁ ♦ గ్రమ్ముఁజుమ్ము
వహ్నిశిఖ నరసింహుఁ డ ♦ వ్వాని వనిత, మిత్త్రి జిహ్వయ నీ వేమి ♦ మెయిఁ గొనంగఁ
దలఁచితో యనపాయిని ♦ తత్పురుషున, కనెడు వింత నీచెవి యింత ♦ యరయ దధిప.

ఆ॥ బ్రదుకఁ దలఁచి తేనిఁ ♦ బదరకు మింతలు, సచివు లాప్తు లింటి ♦ జాడవారు
నేమి నోడువువారొ ♦ యెఱిఁగించి యారయు, మవల వలయుకర్మ ♦ మందఁగలవు.

ఆ॥ చెనుగు కరగ మూని ♦ చేరె దాశరథి మొఱం, గెద నటంచు నున్న ♦ కే తెలుఁగవు
సిద్ధ మింక నీను ♦ జీవితాంతమునకుఁ, గాని రాము నెదిరి ♦ కలియఁబడవు. ౩౯౮

క॥ నోనాయటగా దిటుని, న్నే నెఱిఁగింతు విను మంత ♦ తెగిచిపడి ఫలం
బే నెఱిఁ గంటినో రాముని, తో నెదిరింపఁ గని నుమము ♦ తోఁ జలమొదలన్.

మ॥ మొగిలో కాటుకకొండయో యనఁగ నై ♦ ము న్నేఁ గిరీటంబు మే
ల్నగ లాకుండలము ల్వెలుంగఁ బరిఘా ♦ న్వితకహస్తుండ నై
పగ లేకే పగలే మునిప్రవరుల ♦ న్బాధింప నవ్వారిలో
కొమికాఁ డక్కౌశికాశ్రమంబుం డచని వా ♦ ళ్ళ్యాలంబు సం బొప్పఁగన్. ౪౦౦

తే॥ దశరథునిఁ గాంచి నీసుతు ♦ దత్తు మాస, వనము వసమునఁ గాపాడ ♦ నను పు మనిన
నేను బఱతెంతు విఘ్నంబు ♦ లెడలఁ జేయ, నేల పసికూన లను నృపు ♦ జాల మరసి.

క॥ నీసాటి లేరు దివిజుల, కే సాయపడంగ నైతి ♦ వెలుఁగుదు నైనన్
వేసారి వేఁడవచ్చితి, నోసాకేతాధిపా మ ♦ హోదార్యము మరయన్. ౪౦౨

క॥ ఆరాక్షసులం గెడపఁగ, శ్రీరాముఁడు దక్క నొప్ప ♦ చేయ్వఁడుదుదు నీ
గారాము దలఁప కొనఁగుము, నా రాముఁడె యనెడు నెఱి గ ♦ నం గను మింకన్.

తే॥ నేను గాంపోదు శుభ మగు ♦ నీ కటంచుఁ
దఱిమి ముని వల్కు యోజించి ♦ తద్గఁ బనిచెఁ
దమ్ముఁడును దోడుగా రఘూ ♦ త్తంసు నతఁడు
వారిఁ దోడితెచ్చి తో నని ♦ వార్యుఁ డగుచు, ౪౦౪

క॥ క్రతు వారంభింపఁగ నే, నతిదర్పోద్ధతుఁడ నగుచు ♦ నది మాయింపన్
జతన మొయిఁబరిచరులఁ గొని, యతిబలుఁడు సుబాహుఁ డ ♦ నరిగితిఁ బెలుచన్.

మ॥ ధనువుం ద్రిప్పుచు శ్రీ రహింప నవజా ♦ తవ్యంజనుం డబ్జప
త్రనిభాక్షుండు సువర్ణదామపరిణ ♦ ద్ధపోల్లసచ్చూడుఁ డు
క్కునఁ దేజంబున నెక్కుఁ డీతఁ డన న ♦ క్కోన న్వెలింగించు చి
ద్ఘనుని న్రాముని గంటి బాలశశిసం ♦ కాశు న్మహోల్లాసునిన్. ౪౦౬

క॥ చూతము పోతమె కద యని, యాతతబలు లెక్కసేయ ♦ కరిగి క్రతుశ్రీ
కాతంక మొదవఁ జేసితి, నాతఱి వేదిపయి నశుచి ♦ యనఁ దగు వృష్టిన్.

తే॥ అగ్నిబాణంబున సుబాహు ♦ నంటఁ గాల్చి
యొక్క మొగిఁ దక్కువారల ♦ నుక్కడంచి

యేల ననుఁ గూలనైచెనో ♦ యెఱుకపడదు
సంద్రమున గాలితూఁపున ♦ సవితృకులుఁడు. ౨౦౮

ఆ॥ తడవు మూర్ఛ మునిఁగి ♦ తద్దయుఁ దేఱి ది, గ్భ్రాంతి యెట్లొ వీడ ♦ గతియు గాంచి
లంకఁ జేరఁ గంటి ♦ లాఁతులు నవ్వ నీ, బ్రదుకు గలిగె ననెడు ♦ భావమునను.

క॥ అకృతాస్త్రుఁడు రామునిచే, నికార మానాఁడు గన్న ♦ నెఱి యెన్నక దం
డకసీమ నున్నతఱి న, య్యకలంకుని జాడ లరయ ♦ నరిగితి మఱలన్. ౨౧౦

తే॥ చట్ట లిరువురు రక్కసు ♦ ల్చేరి రాఁగ, దారి తల నున్నవారి నే ♦ తాపసులనొ
మారిమసఁగి నెసంగుచు ♦ మదము ముదము, మిగులఁ దఱిసితి నచ్చోటు ♦ మృగకలనల.

క॥ పెనుకోఱలు బలుగొమ్ములు, ఘనకాయము లొప్పఁ దీక్ష్ణ ♦ గతి నమ్మాంసా
దనలక్షణ మెడయక త, మ్మనువర్తింపంగ నైన ♦ యామార్గమునన్. ౨౧౨

తే॥ తాపసుఁడు నియతాహార ♦ తత్పరుండు, ధర్మచారి సమస్తభూ ♦ తప్రచార
నిరతసంచారుఁ డురుయోగ ♦ నిష్ఠుఁడు నగు, నతని జాయానుజసమేతు ♦ నజితుఁ గాంచి.

క॥ నెఱి సెడె నియతికతన ని, త్తఱిఁ దెరలఁడె వైరమీఁగఁ ♦ దగు నను ధృతి నే
త్తెఱి నెఱయఁ బెరయఁగ సక్ర, మ్మఱిమలసి తెయనుచుఁ గినుక ♦ మార్పడు మదితోన్.

తే॥ మూఁడు తూఁపులు సంధించి ♦ ముట్టవిడువ, రెండు వారలఁ దోడ్తోనె ♦ గండడంచె
నొకటి దొల్లిఁటియట్లు స ♦ న్నుదధి వైచె, నద్ది మూలమె కాకున్న ♦ నేటి నెనరొ.

ఆ॥ సిగ్గుపాటు విసుపు ♦ చేడ్పాటుఁ దను ముంపఁ, గూడ దింక నిట్టి ♦ కూళతన మ
టంచుఁ దపసి నైన ♦ మాహితవృత్తి ని, ట్లుంటి నింటి వంక ♦ నోజ తలఁగ. ౨౧౬

మ॥ తరుషండంబులఁ గొండలం గుహల ను ♦ ద్దాముండు రాముఁడు సు దా
శరచాపంబులు దాల్చి నిల్చు నెఱి ని ♦ చ్చ ల్దోఁచు స్వప్నాదులం
దరవిందాక్షుఁడుఁ దాపసాకృతియునై ♦ యాతండె చూపట్టు నం
తరమం దంతకు భాతి నెల్లజగముం ♦ దాద్రూప్యముం బొందెడిన్. ౨౧౭

తే॥ ఉలికిపడుచుందు రాదియై ♦ యొప్పు నామ, పదము చెవిసోఁక రామవి ♦ భ్రాంతి గదుర
రత్నరథరణరాజ్యరా ♦ ష్ట్రప్రభృతులు, రావణ మదంతరంగవి ♦ ద్రావణములు.

ఉ॥ కావున నా యెఱింగిన ప్ర ♦ కారమున న్వచియించినాడ నీ
చేవఁ దలంచి యెమ్మెయిని ♦ జేరెదొ తాల్మి వహించెదో యిఁకం
బోవఁగఁజాల రాముఁ గనఁ ♦ బున్నెము నీ కగు నన్ను వీడు మా
చావునకన్న మేలు గనఁ ♦ జాలనె తద్వ్రతనిష్ఠ నున్నచోన్. ౨౧౯

క॥ అలిగిన బలిసమునులు నన, దల యీ వే ననఁగ నెంత ♦ దైత్యేశ్వర! నీ
పలికిన యది కాదే యతఁ, డలఁతి ఖరాదుల వధించె ననుచు నన్నుడియున్. ౭౨౦

తే॥ చెట్టపసులకుఁ దోడరి నీ ♦ చెలియ లరిగి, పడసె నవ్వారి రాపాడి ♦ పరిభవంబు
మూల మదిగాఁగ మడిసిరి ♦ మూల నున్న, యా ఖరాదులుఁ దనదు త ♦ ప్పరయవలదె.

క॥ నేరము తానర్చి యుద్ధత, నేర నునుచు నతనిఁ జూడ ♦ నేర్చినవాఁడే
పో రాముఁడు సెలరేగిన, గారవ మునుఁ గను భరింపఁ ♦ గా నసురేంద్రా. ౭౨౧

చ॥ ఒనరిన నున్న స్త్రీయగణ ♦ మోర్వఁగఁ జాలమి యాత్మసౌఖ్యఁపుం
బనిగొని యుండ రామియును ♦ బన్నము లన్నియు లంక పాలిటన్
పనుపడ వీడఁబోలమియు ♦ భావమునం గనుపట్టనేని స
న్నన కటఁబోయి యాకృతికి ♦ నా జతనం బొనరింపు మొక్కటన్. ౭౨౩

ఆ॥ నేను రాముఁ జూచి ♦ నినుఁ జూడ నాయాస, లేల నాదు జాడ ♦ లీవు గనవు
పొమ్ము తలఁచి సంత ♦ పూని చేసెడువానిఁ, బొరుపు పీడ గూడఁ ♦ బొదువవలెను.

తే॥ ఆతనిది తప్పని యొకింత ♦ యనఁగఁ బోల
దడరి పైఁబడ దలఁకి తా ♦ విడువఁబోఁడు
మాయలును మంత్రములు రాము ♦ చాయఁ గనవు
మరలి మెయిమెయి నిలు గాంచ ♦ మలయు టరిది. ౭౨౪

క॥ ము ప్పరసి యేను దెలిపితిఁ, ద ప్పన కటు నీదు హితము ♦ దవిలిన మదితో
నిప్పలుకు గొని మెలంగిన, నెప్పటి సుఖవార్ధి దేరల ♦ నెనసెద వధిపా! ౭౨౫

మ॥ అనుచుం బథ్యము తథ్యము న్నైతియు నె ♦ య్యం బొప్ప బోధించు నా
తని పల్కుల్చెవి నాటవయ్యె నిజవి ♦ ధ్వంసాప్తికిం గాలచో
దన కై కోలునఁ బోవు రోగి మది వై ♦ ద్యప్రోక్తభైషజ్యముం
గొనునే వ్యత్యయముం బొసర్చుగతి కే ♦ కుంగాక శైలాత్మజా! ౭౨౬

చ॥ అనియెను వానిఁ గాంచి దను ♦ జాధిపుఁ డీ వని యేగుదేర ని
య్యనువునఁ దప్పఁ బల్క నగు ♦ నా నినుబోఁటి మొలంగి మామకే
చ్ఛను దెరలింపనేర్చునె ప్ర ♦ శంసకుఁ గూర్చునకాని తేఁడు వ
ల్దని తలఁగింప నొక్కనికిఁ ♦ దావల మౌనె తలంప వింతయున్. ౭౨౭

—♦ రావణుఁడు మారీచుని గోపించి పలుకుట. ♦—

చ॥ మనుజుఁడు పాపశీలుఁ డటు ♦ మూర్ఖ్యమునం బినతల్లి మాటకై
వనమున కేగుదెంచె నిజ ♦ వర్గము రాజ్యము వీడి యంతమా
త్రిన చన కస్మదాశయము ♦ దారుణమౌ నెటి కౌఖరాదులం
దునిమె నిజాప్తులం గడఁక ♦ దోషిని వానిఁ జెలంగ నిత్తునే. ౪౨౯

ఆ॥ వాని భార్యఁ దెచ్చి♦వఱలింతు లంకలో, నునిచి యెట్లు నిదియ♦యొలయు బాట
నీబిభీషికలకు ♦ నేఁ దలంగెడువాఁడ., గా నటన్న మాట ♦ గానవౌకొ.

క॥ నిను దోషము గుణమును గని, వినిర్ణయము సేయు మన్న ♦ విధ మే యే మం
చనియె దపాయ ముపాయం, బని యనివార్యముగఁ గార్య♦మంత లరయుదే.

ఉ॥ చేతులు మోడ్చి రాజుకడఁ ♦ జిన్నలఁ బెద్దలఁ గాంచి శుద్ధమౌ
చేతమున న్మృదూక్తి కృతి ♦ చెల్లఁగఁ బొల్లుగఁ బోని మాటఁ దా
నాతతభక్తి నాడఁదగు ♦ నాదట నానతిమై మెలంగ నోఁ
గాతరుఁ జేయఁ జూచునెటి ♦ గా దన కిట్లు గడింపఁ జెల్లునే. ౪౩౨

ఆ॥ అగ్ని వేఁడిమియు బి ♦ డౌజు విక్రమమును, సోము సౌమ్యత రవి♦సుతుని దండ
శక్తి పాశధరు ప్ర♦సాదవిశేషంబుఁ, దాల్చు నధిపుఁ డెపుడు♦దైవతారి! ౩౪౩

క॥ కావున నవిమానార్హులు, భూవల్లభు లెందు లోక ♦ పూజ్యులు గారే
నీ విట్టులాడఁ దగునే, కావరమున ధర్మ్మ వరసి ♦ కాని తెరువునన్. ౪౩౪

క॥ ఇంటికి వచ్చితి నని యి, ట్లంట దురాత్మతయ కాదె ♦ యూఁయెం బోయెన్
గంటకము వీడి దుర్గతి, కంటక మెలపొందు మతిన ♦ యము గను మింకన్.

శా॥ నాకర్జం బిటు చక్కఁ జేయునెటి నె ♦ య్యం బొప్ప నీ వొప్పినన్
నీ కర్పించెద నర్ధరాజ్య మెపుడు ♦ న్నీవాఁడనై యుండెదన్
లేకున్నం బొలియింతు నిష్టై ప్రదరా ♦ లీఢాగ్నినిర్దగ్ధుగాఁ
గైకొ మ్మేయది మేలు కీ డరసిన ♦ న్గాన్పించునో మించుగన్. ౪౩౬

తే॥ యుద్ధమునఁ బోని పద్ధతి ♦ నోటమి యని, లేక వారలఁ దెరలింప ♦ లీల మెయిన
వఱలి లీలావతిం గొని♦వత్తు నవలఁ, జూచుకొందము పొనరెడు♦సూచనముల.

క॥ తప్పదు నీ కన నెటులు, న్మెప్పే సమకూరె నైన ♦ మున్నాడి పటం
బొప్పం జెప్పెద నని వాఁ, డప్పిశితాశనునితోడ ♦ ననె నిట్లు సఖీ! ౪౩౮

—♦ మారీచుని చివరిమాటలు ♦—

సీ॥ ఎక్కించె నెవ్వఁడో ♦ యీపాపకృత్యంబు, దవిలి చిత్తంబునఁ ♦ దలఁగకుండఁ
దిరుగదు కాలంబు ♦ దీటె నింతటితోన, నిన్ననఁ బనియేమి ♦ నీదు మిత్తి
యాపె యయ్యెనుమంత్రి ♦ హితకులు వధ్యులు, త్పఘునిన్నుమరలించు ♦ పాటుగొనరు
రాజుచే ధర్మ మ♦ర్థము కామము యశమ్ము, నందఁగాంతు రమాత్యు♦లట్లు ప్రజలు
మంచి వడయుదు రటుగాక ♦ మడియు వార
లతనితో మందయంత్రక ♦ మయిన రథము
తురగములు రథితోఁగూడఁ ♦ దునిసి నట్లు
లడరి దుస్తంత్ర మను గహ ♦ నాంతరమున. ౪౩౯

క॥ ప్రతికూలుం డవినీతుం, డతితీక్ష్ణుం డైన రాజ ♦ నర్హుఁడు ప్రజలుం
గతిచెడుదు రతనికతన ని, హతుఁ డగు నవ్వాఁడుఁ గడఁగి ♦ యాయతి మెడయన్

తే॥ నక్కక్రోఁపున మేఁక లెం♦ దాఁక బ్రదుకు, నట్టులన రాదె దుష్టుఁడౌ ♦ నధిపుఁ గొలుచు
వారి జీవిత మింతకు వచ్చిపడె న! నర్థ మిమ్మెయి నీదు స్నే ♦ హంబుకతన.

తే॥ కాకతాళీయ మిది యయ్యెఁ ♦ గాని మున్నె
నిన్నుఁ జాపన తోఁచె న♦ స్నిలవర్ణుఁ
డాపెయును యోగమాయయే ♦ యఁట విరించి
వేఁడె నఁట దివ్యముని తెల్ప ♦ వింటి నిట్లు ౪౪౦

క॥ నీనాచేటుల కనియే, యే నింతలు వగవ బంధు ♦ హితసుతముఖ్య
శ్రీనాశనమున కడలెద, నానెటి విని కులముఁ బ్రోచు ♦ నయముం గనుమీ.

క॥ రఘునందను భజియించిన, నఘసంచయ మడఁగు సౌఖ్య ♦ మందెదు విజ్ఞా
నఘనుఁడ వయ్యెదు స్వీయకు, లఘుస్మరతి వాయు నిది త♦లంపు మెడఁదలోన్.

మ॥ అనిన న్నన్ను వధింపఁగాఁ బొడమి వాఁ ♦ డర్థక్రియ న్వ్యర్థతం
గనునే విష్ణుఁ డధీశుఁ డింద్రముఖులుం ♦ గంజోద్భవుండున్ ఘటిం
చిన సూడెంచి చలించెనేని వినుమీ ♦ శీఘ్రుంబె యిమ్మైన నె
మ్మనము న్గట్టి పొనర్చి యయ్యెడకు నే ♦ మం బొప్ప నేఁ బోయెదన్. ౪౪౧

ఆ॥ హరియయేని ముక్తిఁ ♦ బెరయుదుఁ గాకున్న, నవనిజాతఁ దెచ్చి ♦ యఖిలసౌఖ్య
కలన లందఁగాంతుఁ♦గాదన్న నసికి ని, న్నిపుడె బలి యొసఁగుదు ♦ నింత నిజము.

ఆ॥ ఏల చెడెదు రాము ♦ నెడయించి నిను ముట్టఁ
గదియఁ గూక లిడుము ♦ క్ష్మాజ లక్ష్మ

ణా యటంచు దాన ♦ నాతండుఁ జెరల నే
సీతఁ దెత్తు నొంటిఁ ♦ జిక్కఁ జెరసి. ౪౪౭

క॥ ఆవల నెందేనిం జను, మీవలనున మేలు గాంచి ♦ యోగింపద ని
న్నావంతయేనిఁ గొఱలే, దీవంత దొలంప నుంత ♦ యుగ్గాపటు గనుమీ! ౪౪౮

మ॥ అను నమ్మాటకు వీనిచేఁ బెగిన నే ♦ హాఁ బాపి మూర్ఖుండను చ
చ్చునకా కావల రాము బాఱిఁ బడి నేఁ ♦ జూపట్టుదుం దొల్లి శ్రీ
ఘను కల్యాణకటాక్షవీక్షణము లు ♦ త్రాక్కంగ నన్నను న్మాగభా
వనునింగాఁ బొనరించుఁగాత మని ని ♦ ర్వాణేచ్ఛ నింపొందఁగన్. ౪౪౯

క॥ లేలెమ్ము రావణా! యటు, లా లెమ్మని తరలు బెంచి ♦ యాతఁడ తని గా
ఢాలింగితుఁగాఁ బాదివి స, మాలీఢుం జేసె రథము ♦ నం దభిగామా! ౪౫౦

తే॥ వెఱచితివి త్రోవఁ దప్పితి ♦ వీరుఁ డనఁగఁ
బరఁగియును ద్రిప్పకొంటివి వి ♦ ప్పటికి మఱల
ననఁ గడంగెద మారీచ! ♦ యనుచు నిన్ను
ననుచు బ్రేముడి నీ దెస ♦ నినుచు వేడ్క. ౪౫౧

క॥ నాకర్ఘము సాధింపుము, నాకసదు ద్వైరల ననుచు ♦ నన్యవచశ్శ్రీ
ప్రాకట్య మతనిఁ దేర్పఁగ, నాకసుఁపుం గతి రఘూత్త ♦ మాశ్రమము సొసగెన్.

—♦ సీతారామ సంవాదము. ♦—

ఉ॥ అంతకు మున్నె రాఘవుఁ డ ♦ నంతవిలాసుఁడు సీతతోడ నే
కాంతమున న్నెలంగుతఱి ♦ నంగనరో చనుదెంచువాఁడు జే
వాంతకుఁ డల్లరావణుఁ డ ♦ హంయువు వాని మొఱంగ నప్పు తే
జోంతరితాత్మత న్నిలువు ♦ మాకృతిఁ బాయ స్వకీయ నూర్పఁగన్. ౪౫౩

ఆ॥ మాయదారి రూపు ♦ మలసి లంకకుఁ జని, యుండు మవలఁ గగ్గ ♦ మొప్పఁ గీర్తి
వత్సరాంతమున భవద్యోగముం గను, వాఁడ సురలు మునులు ♦ నచ్చికొలువ.

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ నద్దేవు నాదేశ, మున మెలంగఁ గాంచి ♦ మొనసి యుండె
దేవి! చిత్రకలన ♦ దిటవు మేకొన జగ, చ్చిత్రితాత్మరూప ♦ చిహ్న మొలయ.

క॥ అని భవుఁ డభవుఁడు వినిచిన, విని వేడ్క భవాని యవలి ♦ వృత్తాంతము నె
మ్మనము మననమ్మునకుఁ దార్కొనఁ జేయఁగఁ గోర్కె నేటు ♦ కొనఁగోరుటయున్.

శా॥ స్వారాజ్యప్రతిభాసమానమహిత ♦ ప్రస్థానానంతలీ
లారాజత్ప్రతిభాఽసమానవిజయో ♦ ల్లాసాఢ్య సంపోషణో
దారత్వాంచితసర్వభూతనిజత ♦ త్త్వప్రాపణశ్రీపద
ప్రారంభోచితపావనాకృతికలా ♦ ప్రాగ్భారసంభావనా? ౨౫౭

క॥ అసదృశవిభవమహోజ్జ్వల, మసారముఖసకలవర్ణ ♦ మానితనిత్యో
ల్లసనచణశుద్ధకాంతి, ప్రసారణా? యోగివర్య ♦ భావనశరణా! ౨౫౮

వనమయూరము.

భాసజనిధానవిని ♦ పాతనసమర్థ, శ్రీవిలసితాత్మపద ♦ చింతనవిశేషా!
సేవకజనాదరణ ♦ శీలసదయోద్య, ద్భావుకకటాక్షపద♦భాసురవిభూషా! ౨౫౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబునం ద్వితీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## అరణ్యకాండము.

---

### తృతీయాశ్వాసము.

---



కుసుమమంజరీమహి
తాకాశవికాసవిలసి ♦ తామేయగుణా
స్తోకకలాశ్లోకిత సు
శ్లోకచరిత్ర ప్రకార ! సూత్రాధారా ! ౧

ఆ॥ అవధరింపు మగజ ♦ యమ్మయి వేడినఁ, జెప్పఁ దొడఁగెఁ జంద్ర ♦ శేఖరుండు
వినుము వన్నెలాఁడి ♦ విష్ణుమాయావిలాస, సంగతి సంబరంబు ♦ సంభవించె. ౨

క॥ ఆవలనున నునుబూవులఁ, బూవుంబోఁడి చిదుములగఁ ♦ బూసి రసికతో
వ్రేపిణ్యము తనులతికా, శ్రీవిలసిత మిరవు వెలయఁ ♦ జేయుచునుండెన్ . ౩

—♦ మాయలేడి సీతకుఁ గన్పడుట ♦—

ఉ॥ బంగరుమేని డంబరము ♦ పజ్జను నీలపుఁజూడ్కి యొప్పిదం
బుం గరువంపుఁ జెద్దుముల ♦ పోఁపును బ్రాపున నాగు రిక్కసం
చుం గమకించు మొక్కలపుఁ ♦ జుక్కలు చందురు బొట్టు వాఁడి చా
యం గొమరారు బొజ్జనెఱ ♦ యం గనుపట్టఁ గురంగ మయ్యెడన్. ౪

సీ॥ పసిడికట్టడముపైఁ ♦ బరఁగు మానికములై, తనువిశేషము లొంటఁ ♦ దళుకు లీనఁ
బొదరు పూరెమ్మలఁ ♦ బోదలు రోలంబాళు, లగుచు నీల పుఁజూపు ♦ లందగింపఁ
జివురు మోవులఁ గేలి ♦ సేయఁ దోఁచిన హిత, శ్యామిక పెదవుల ♦ చక్కి నెఱయ
నీలోత్పలచ్ఛాయ ♦ నెఱిగాంచు వీను లా, కసము శబ్దాసక్తి ♦ గతి వచింప
మొలకపై దూర్వములు గోరి ♦ సెలు సెలంగి
మంటికిని మింటికిని దార్లు ♦ మలయఁ జేయ
మొనసెఁ బచ్చల రుచులకై ♦ మోరసాచు
కథకుఁ బచ్చిక లంటుచు ♦ గడుసు మెకము. ౫

ఉ॥ చెంగటిపూపొదల్ దఱియఁ ♦ జేరి తటాలున దాఁటునంతలో
ముంగిటఁ దోఁచుఁ జక్కఁగన ♦ ముట్టున శంకఁ దలంగు రాకపో
కం గననీని చెల్లటము ♦ గన్పడఁ గ్రొళ్లుఱుకుం గడింది మా
యం గమకించు నమ్మృగ మి ♦ లాత్మజ చిత్తగతి న్మొఱంగఁగన్. ౬

ఆ॥ కన్ను లొక్క వైపు ♦ గా లొక్క వైపు మే, త్తెలివితేట లొఱపు ♦ దీర్ఘతయును
నొక్కవైపు గాఁగ ♦ నోడ కాటాడెన, మ్మొకము మరుని సిడము ♦ మకరమట్లు. ౭

చ॥ చివురులవంక ముట్టె యిడు ♦ జిహ్వక కెంపునఁ గూడ వాని పెం
పవియఁగఁ జేయు నవ్వగ బ ♦ యల్పడఁ బూపొదరిండ్లు సొచ్చు న
వ్వావులును మేని చుక్కలకుఁ ♦ బోలని కైతవ మెంచి వాని వ
స్తువితతి జూఱవుచ్చు నెఱ ♦ చోద్యము నెక్కొన నమ్మృగ మ్మొగిన్. ౮

మ॥ మృగయూథమ్ములఁ జేరఁబోవు నవె యి ♦ మ్మేలమ్ము వీక్షించి నో
వ్వఁగ భక్షింపఁదలంపకే తెరలు భా ♦ వాచ్ఛాదనావాప్తికై
తెగి పాఱుం బఱతెంచు నొంటఁ దనుసం ♦ దీప్తు ల్వనంబెల్లఁ గ్ర
మ్మఁగ మాయామృగ మిల్లటంబయిన నే ♦ మం బొడ్లకుం దోపఁగన్. ౯

ఆ॥ అడవి నుంట నెఱుఁగ ♦ దటఁ రత్నమయమృగం
బచటఁ గాంచెనఁట ప ♦ రార్ఘ్య మంచు
నెంచెనటఁ మృగాక్షి ♦ యేలదే తన్నని
వాని చెయిద మెచ్చె ♦ వనరుహాక్షి! ౧౦

ఆ॥ మాయకాండ్ర జగము ♦ మాయలో ముంచి యా
డించువాని కొమ క ♦ డింది మాయ
లాని మరునిఁ గన్న ♦ మానిని యయ్యోగ
మాయ యొకని మాయ ♦ మఱువుపడునె. ౧౧

—♦ సీత మాయామృగముం గాంచి రామలక్ష్మణులం బిలుచుట. ♦—

మ॥ పిలిచెం బూవులు గోయుచే మఱచి సం ♦ స్ఫీతప్రకాశంబు చె
న్నొలయన్ స్మేరదృగాఢ్యయై తలఁపు లు ♦ ద్యోగంబు సామగ్రి గ్రహా
దల నిల్వం దమకించి వల్లభుని వా ♦ త్సల్యంబు పెంపార న
వ్వల సౌమిత్రిని రండు కాంచుఁ డిదె స ♦ ర్వస్వం బటంచాదృతిన్. ౧౨

క॥ అను నంతలోనె పెరసిరి, ధనుర్ధరు ల్వారు సీత ♦ తాత్పర్యముతో
ననిచిన వ్యగ్రత కనువ, ర్తనియై నిజచిత్తవృత్తి ♦ ప్రేరేపింపన్. ౧౩

—♦ లక్ష్మణుఁడు మృగమును రాక్షసమాయగా నిరూపించుట. ♦—

ఆ॥ వచ్చి దాని స్వర్ణ ♦ వర్ణంబు ప్రమదిమయు, సుందరాకృతియును ♦ జూచి పలుకు
రాణనెఱయఁ బలికె ♦ రామునితోడ ని, ట్లనుచు లక్ష్మణుం డ ♦ హార్యధైర్యుఁడు!

ఉ॥ మోసమ కాక యిమ్మెయిని ♦ మోహనహారిణం బొకం డిలన్
భాసిల దిందుమండలము ♦ పట్టుననేమొకొ రత్నకాంచన
శ్రీసముపాత్తగాత్ర మిది ♦ చేరకమున్నె యెఱుంగ నన్యెడన్
మోసల నున్న దేశముల ♦ ముంపఁగ నా నిజకాంతిసంపదన్. ౧౪

తే॥ అన్న! మారీచుఁడే యితం ♦ డరయు మింక
వంక యిడి యేమితలఁపున ♦ వచ్చినాఁడొ
మున్ను దన పోలముల యివి ♦ మునులపాలి
శక్తియై వీఁడు నెఱపు సం ♦ చారమునను. ౧౫

ఉ॥ ఎందఱు వేఁటకై పెరసి ♦ యేలిక లీమటుమాయకానిచే
మందిరో పీనినోటఁ బడి ♦ మాను లికెంద ఱొడళ్లు బాసిరో
మందలమారి తార్కొనియె ♦ మానసము ల్గలగింప మేనితోఁ
బొం దెడఁబాపఁ గాని విడఁ ♦ బోవఁడ యివ్వెడగాపు లన్నియున్. ౧౬

తే॥ అనుచు నున్నది యున్నట్టు ♦ లను సుమిత్ర
కొడుకు పలుకుఁబడుల నాఁగి ♦ కువలయాక్షి
నాథ యిమ్మెయిమెకము గ ♦ నంగరాదు
నాదు చిత్తమ్ము దీనిఁ బె ♦ నంగి విడదు. ౧౭

—♦ సీత రాముని మృగార్థమై ప్రార్థించుట. ♦—

ఉ॥ పుట్టువు లెన్ని లే విలను ♦ బూర్ణశశాంకనిభమ్ము దీని మే
ల్పుట్టున కేది కారణమొ ♦ పున్నపుఁ దేశము కాల మిట్టి శ్రీ

లుట్టిపడంగఁ జేయు బలె ♦ యూర్జిత మియ్యది చెంత నున్న నే
పట్టున నేని సంపదలు ♦ భావుకము ల్వొసగింప నుండునే. ౧౯

మ॥ వనవాసంబు గ్రమించి స్వీయపురికి ♦ న్వాంఛ ల్దలిర్పంగ నే
గిననాఁ డిమ్మహనీయమూర్తిఁ గనుచున్ ♦ గేళీపరత్వంబునన్
జనను ల్బందుగు లాప్తులు న్మనల మె ♦ చ్చంజూడరే భవ్యభా
వన లొప్పార నిజపరిచారకలన ♦ ల్వాకురిచ్చు నప్పట్టునన్. ౨౦

ఉ॥ జీవముతోడఁ బట్టుపడి ♦ చిన్నెల వన్నెల తీయ మొప్ప రా
జీవము వీడి లక్ష్మి శ్రితనుఁ ♦ జేరఁగఁ జేరిన మేలు కానిచో
జీవముఁ బాసె నేనిఁ దను ♦ చిహ్నము లేర్పడఁ దెచ్చి యిచ్చినన్
భావము పొంగ మేలి బ్రిసి ♦ పై నిడి తీర్తు నుపాసనావిధుల్. ౨౧

ఆ॥ ఆడువారి కింత ♦ యాగడ మెట్లును, గూడ దనకుఁ డిట్లు ♦ కోటిసేయు
దీనిఁ గాంచి యెడఁద♦తివిరెడు దానికై, వేఁడవలసె వేఁట ♦ విధియు నరసి. ౨౨

క॥ మెకములఁ బట్టఁగ వీడఁగ, నకలంకప్రతిభ మెలఁగ ♦ నౌదురు మీరల్
మొకమోటకైన రఘునా, యక! యిట్టి మహార్హవస్తు ♦ వార్జింపఁగదే. ౨౩

ఆ॥ అనుచు స్మేరదృష్టి ♦ నడ్డు సేయుచు నుడి, తీయదనముతోడి ♦ తీపులాడి
వేఁడికోలు మోడి ♦ విధము నారసి రసి, కాగ్రసరుఁడు రాముఁ ♦ డనియె నిట్లు.

—♦ రాముఁడు లక్ష్మణునితో మాటలాడుట ♦—

ఉ॥ తమ్ముఁడ! యిట్టికొత్త గని ♦ తామరసాక్షుల చిత్తము ల్తటిన్
బమ్మెరపాటు గాంచవె వి ♦ పాకవిచారణ లట్టు లుండఁగా
కిమ్మన నాదు నెమ్మనము ♦ నీయది యాఁకపడంగనయ్యె నా
కమ్మననేనిఁ గానని వి ♦ కాసముతోఁ దులకించు మేనితోన్. ౨౪

ఆ॥ అగ్నికీలఁ బోని ♦ యానాల్కఁ గనుఁగొను, మావలించు దీని ♦ యాస్యమునను
మేఘమండలమున♦మెఱుఁగుఁ బోలెడు చుక్క, లొప్పు నొడలిపేరి♦యుప్పరమున.

తే॥ రతనముల గని యీమృగ ♦ రాజ మట్లు, గాక బంగరుమేనున ♦ ఖచితములయి
మణిశలాకలు రోమము ♦ ల్మానుగఁ దగు, రీతి నుండును యవయవ ♦ శ్రీ తలిర్ప.

ఆ॥ ఆమసారగల్ల ♦ కాస్య మాశంఖము, క్రాంచితోదరంబు ♦ నైన హరిణ
మాడువాండ్ర మాట ♦ కననేల నాబోఁటి, కిమ్ముగను వికార ♦ మిరవుకొలుప.

క॥ అంసమున విల్లు దాల్చెడు, సంసారుల కెల్ల నిదియ ♦ సరణి యనినచో
హింసింపరె మనుజేంద్రులు, మాంసమునకు వనమునందు♦మలయు మృగములన్.

శా॥ సంపాదింతురు ధాతువు ల్ధనములు ♦ న్నద్రివ్యరత్నంబులున్
జెంపుంగూర్చు తలంపున న్మతియు భా ♦ వింపంగ శుక్రాదులున్
సంపన్నత్వముఁ బెద్ద సేయు నెటికై ♦ శాసింపరే దాని నై
లింపౌఘం బెలయింపదే దనుజపా ♦ లిం గ్రమ్మి యర్థాప్తికిన్. ౩౦

క॥ కాంచనచర్మం బీమృగ, మంచిత మిటులెంచి యెట్లు ♦ లా విడువఁగ నే
సంచిత మొనర్తు నియ్యది, పంచత్వము గాంచనైన ♦ ప్రౌఢిని నెఱయన్. ౩౧

క॥ మేదిని నావికి ప్రియకియు, గాదళియుఁ బ్రవేణియును ర ♦ కంబున దీనిన్
గా దొకటియుఁ బోల్పఁగ సం, మోదం బొదవించు నిది ప్ర♦ముఖ్యం బగుచున్.

తే॥ ఇది యెశ్రీమంతమిద్దాని♦నెనయ నేర, వెలయుతారామృగములుమ♦హీమృగములు
దీని యజినంబుపై నుండి ♦ తీర్చువార, మేను సీతయు నౌపాస ♦ నాసుఖిధుల.

చ॥ తెలిపితి వీవు వీఁ డసుర ♦ తేఁకువమై మెలగంగ నౌ నటం
చలఁతిగ నట్లులైనను దు ♦ రాత్ముఁడు వాని వధింపఁగా నగున్
బొలముల పీడ లేమఱక ♦ పోలునకా దె తొలంప నెమ్మదిన్
దలఁచిన యంతఁ దారసిలఁ ♦ దద్దయుఁ గాంచి తలంగ నేటికిన్. ౩౪

క॥ ఈతతి వీనిం జంపెద, వాతాపి నగస్త్యమౌని ♦ వలె వార [illegible]న్
సీతం గాపాడుచు నీ, వీతలమున నుండు మనకు ♦ మెచ్చియు నింకన్. ౩౫

ఆ॥ పట్టి తెత్తు నొండె ♦ పడఁగొట్టి పనిముట్టు, లొదవినంతవట్టు ♦ నాడి చికొంచు
వత్తు నొండె నొండు ♦ వలనునఁ జనక మ, త్ప్రాణపదము జనకు♦పట్టిఁ గనుము.

తే॥ ఎన్ని పుట్టిన నేమైన ♦ నెందుఁ బోక, యప్రమత్తత నై దేహి ♦ నరయుచుండు
మల జటాయువుగూడఁదోఁ♦డగువలసినఁ, దడయ కేనరుదెంతువా♦స్తవముసుమ్ము.

—♦ రాముఁడు లక్ష్మణు నొప్పించి మృగము వెంట జనుట. ♦—

క॥ అని యనుజుఁడు వల్లె యనం, దనధను వసి శరధియుగముఁ ♦ దాలిచి గన్నునం
దనుఁడు మృగము మార్గముఁ గొని, చనె విద్యావిభవలసిత ♦ సంయమివినుతా!

సీ॥ కనుచూపుమేరన♦కాన్పించుచు మెలంగుఁ, గదియవచ్చినయంతఁ♦గడల కుఱుకు
విద్యోతమానమై ♦ వెలయించు వన మెల్ల, నంతర్థి ( గై కొను ♦ నంతలోన
నెలకొని రాఁజూచు ♦ నిర్దోషి యట్టులు, విలుగాంచి లంఘించు♦విన్ను దఱియు
మృగమండలముతోడి ♦ మేలమ్మునఁ జరించుఁ, బచ్చికపట్లపై ♦ భ్రాంతి నెఱపు

వృక్షషండంబులం డాగు ♦ వెడలు మొగిలు
సొచ్చి వెలువడు శారద ♦ శుభ్రకిరణు
బింబముం బురుడించుచు ♦ బిఱుసుఁదనము
మెత్తనయుఁ దోఁప నమ్మాయ ♦ మెకము గడఁగి. ౩౯

క॥ దృశ్యాదృశ్యతలనె యు, త్పశ్యని శ్రీరాము మొఱఁగు ♦ పనిగొని తన యు
ద్దేశ్య మెఱుకపడకుండ వి, పశ్యం డెనయించె దూర ♦ పథ మణుమధ్యా! ౪౦

తే॥ కుపితుఁడై రామదేవుండు ♦ కోమలంబు, మెక మనక భానురశ్మిభా ♦ సకము బ్రహ్మ
నిర్మితము శ్వసదురగస ♦ న్నిభము నైన, యస్త్ర మవ్వాని గుఱిసేసి ♦ యనిచె సాధ్వి!

—♦ మాయామృగ మరణము. ♦—

తే॥ ఆశరము వక్ష మగలింప ♦ నాశరుండు
మాయ మాయమ్ము సేసి ని ♦ ర్మానదేహ
మొప్ప నుప్పరమును ముట్టి ♦ యుర్విఁ గూలి
తన్నుఁ గొనుచును రావణు ♦ తలఁపుఁ దలఁచి. ౪౨

క॥ హాసీతా! హాలక్ష్మణ!, యాసన్నుఁడ నైతి ననుచు ♦ నఱచి తను వెడం
బాసి వెలుఁగై రఘూద్వహు, భాసంబునఁ గలసె నపుడు ♦ పర్వేందుముఖీ! ౪౩

ఆ॥ ఏమి సేసె మంచి ♦ యెవ్వారి కేయెడ, నెట్టు లెట్టు లెనసె ♦ నినకులీనుఁ
బాపకర్ముఁ డింత ♦ పరఁగునే రాము నే, ర్పనుచుఁ బొగడి రమరు ♦ లమరవంద్య!

క॥ పుట్టె నిదె ధూమకేతువు, నట్టింటనె రావణుని వి ♦ నాశమునకె షో
గట్టిముడి యనుచు రాముని, మట్టున విరివాన సురలు ♦ మలయించి రుమా!

ఆ॥ మున్నె రాముఁ బొగడె ♦ మునివేసమున నుండెఁ
ద్యక్తసంగుఁ డయ్యెఁ ♦ దనువుఁ దొఱఁగు
నప్పు డతనిఁ గనెఁ దద ♦ స్త్రాహతుఁడు వాఁడు
ముక్తిఁ గాంచు టరుదె ♦ మోహనాంగి. ౪౬

క॥ ద్విజుఁడైన శ్వపచుఁడైనను, గజ మైనను రక్కసుండు ♦ గా నైనను దు
స్త్యజ మగు కర్మ మెడసి యు, య్యజఁ గెల్చి పరాత్ము నెనయు ♦ నంతస్స్మృతిచేన్.

ఉ॥ అంతట రామచంద్రుఁడు ద ♦ యామయుఁ డాత్రముతోఁడ రక్కసుం
డంతలు సేసి నానుడి బ ♦ యల్పడ నిట్లఱచెన్ స్వకీయదే
హాంతము గాంచుచున్ సతియు ♦ నయ్యనుజన్ముఁడు భీతభీతులై
వంతకుఁ బాల్పడంగల ర ♦ వారణ నంచుఁ దలంచి చెచ్చెరన్. ౪౮

క॥ కొండొక హరిణముఁ బొరిగొని, దండిమగఁడు రాముఁ డిరవు♦దలఁపునఁ దవులన్
మెండుకొను త్వరితగతి యు, ద్దండత నద్దానిఁ గొనుచుఁ♦దరలుచునుండన్. ౮౯

—♦ సీత మాయాహరిణము వాక్కున కులికి లక్ష్మణునితో మాటలాడుట. ♦—

ఉ॥ ఆయువతీవతంసము ధ ♦ రాత్మజ రామునిపల్కు సంగతిన్
బాయని యార్తనాదము వి ♦ పత్తిమయమ్మై చెవి సోకినంత హా
హా యని లక్ష్మణుం గని త్వ ♦ దగ్రజుఁ డేమిటఁ గీడు నొందెనో
పోయి యెఱుంగు మవ్వలని ♦ పోకడ యెట్టిదొ సత్వరంబుగన్. ౯౦

ఆ॥ మాయదారి యసుర ♦ మండలి పొదువ నే
మాయెనో మహాత్ముఁ ♦ డనఘుఁ డతఁడు
గాలి హరుల నడిమి ♦ గోవృషం బట్టులు
నిలుపఁజాల నుసుఱు ♦ నిలిచె దేల. ౯౧

క॥ వినఁబడదే హా లక్ష్మణ, యను నుడి యేయది తలంచి ♦ యటు నిటు మసలన్
గొనకొనె దవ నప్పావనిఁ, గని గొనములప్రోవతండు ♦ గ్రన్నన ననియెన్. ౯౨

—♦ లక్ష్మణుఁడు సీతకుఁ బ్రత్యుత్తర మిచ్చుట. ♦—

ఉ॥ చెట్ట యొకండు రక్కసుఁడు ♦ చేడ్పడి జీవితముం దొఱంగు న
ప్పట్టున నీయెదం బెడఁద ♦ పా లొనరింప ఘటించినట్టి యా
గు ట్టని కాక యాకసము ♦ క్షోణియుఁ గూలవె ముజ్జగంబులున్
మట్టున మీఱ నేని నొక ♦ మాత్రన రాముఁ డడంప నోపఁడే. ౯౩

క॥ దీనతఁ గూయిడువాఁడే, దీనావనచతురుఁ డతఁడు ♦ దేవారులలో
మానిని! యమ్మహనీయుని, పూనికఁ బెరలింప నేర్చు ♦ పోటరి గలఁడే. ౯౪

—♦ సీత లక్ష్మణుని దూఱనాడుట. ♦

క॥ అను పలుకులు వినినంతనె, జనకజ యేచాయ నిట్లు ♦ జనె నీ కనఁగా
ననుమిత మయ్యెడు నీవ, ర్తన మిద్దాననె తలంగు ♦ తలఁపుం గొనుమీ! ౯౫

ఆ॥ ఏమి సేయఁ దలఁచి ♦ యిం దరుదెంచితో, నీదు నేస్త మెట్లు ♦ నేఁటి నమ్మి
నాఁడొ యంతరమ్ము ♦ గూడిన నిమ్మెయి, జాడ నరయ నయ్యె ♦ జతన నెఱయు.

ఆ॥ అనుచుఁ దెలివిఁ బాసి♦యారాటపడుచు హా, రామ! హా మనోహ ♦ రా మనోజ
వేషభాష! నిన్ను ♦ విధి నట్టడవిపాలు, సేసెనే స్వజాతి ♦ చేతఁ జేసి. ౯౭

క॥ అని బోరన నేడ్చెడు న, వ్వనితామణిఁ గాంచి హరిణ ♦ వధు వట్టులు త్రా
సనిహతిఁ గనె ని ట్లీయమ, యనుచుం దలపోసి మఱియు♦ననె నతుఁడగుచున్.

సీ॥ అమ్మరో! శోకాభి ♦ హత వోచు నెమ్మది, జెడుఁగు సంకల్పము ♦ లేర్చ దేల
నీనాథుఁ డనఁదె యా ♦ నీరజగర్భాదు, లాశ్రయింతురు తన ♦ యండఁ గోరి
ఫాలలోచనుఁడేని ♦ ప్రతిభటింపఁ డనంగ, నన్యు లెంతటివార ♦ లతని ప్రోల
నిను న్యాసభూత ని ♦ న్నేల కీడు దలంచి, యొంటి విడుట కోడు ♦ చున్నవాఁడ
ఖరుఁడు గూలిన యది మొద ♦ ల్గానివార, ధీశు నెదిరింప లేక నీ ♦ కెగ్గు సేయ
తలఁపుమెయి నుండిరనువార్త ♦ దద్దవింటి,నొండుభావింపకొకక్షణ ♦ మోర్చికొనుము.

క॥ అచ్చెనఁటిఁ గూల్చి నీప్రియుఁ, డొచ్చెము లే కాశ్రమమున ♦ కోలిమికమెయిన్
వచ్చెడువాఁ డిక్కట నా, పొచ్చెములేమి దలఁపంగఁ ♦ బోలును నీకున్. ౬౦

ఆ॥ అనిన రౌద్రమూర్తి ♦ యై యేమి నీ కంత, చులుక నయ్యెనోటు ♦ చూడ విభుని
యార్తఘోష మాని ♦ యాపద తుదిముట్టఁ, గాంచి గాని కదలఁ ♦ గాన వెట్లు. ౬౧

క॥ ఆనేర్పరి పనిచెనో నీ, కై నీ వరుసెంచితో న ♦ యం బేది యిఁకన్
నే ననవలెనే జ్ఞాతులఁ, కేనెఱినేనియు సదిచ్ఛ ♦ యెలమియుఁ గలదే. ౬౨

ఆ॥ అంత సేసి భరతు ♦ సమ్మ ని న్ననిచె వాఁ, డడవిలోన నట్టు ♦ లంటఁ గ్రాఁగె
నున్నవాఁడ వెట్లొ ♦ యొదిగి రంధ్రాన్వేష, ణానుషక్తి నేఁటి ♦ కదియుఁ బొసఁగె.

ఉ॥ మేలు దలంచి వచ్చితివె ♦ మెల్లగఁ జల్లని మాట లాడి యి
ల్లాలు గృశించుచున్ గృహము ♦ నం దటు లుండఁగ నొంటి నిమ్మెయిన్
గాలము వేఁచియుంటివి ర ♦ కమ్ముగ మాకడ నాథుఁ డోల న
న్నేలఁగ నిమ్ముమై భరతు ♦ నిష్టము దీర్పఁగ వంశదూషణా! ౬౪

చ॥ కడుపు చెడంగఁ బుట్టితివి ♦ కాక సుమిత్రకు నాపె నీవు నాఁ
డడవికిఁ దర్లివచ్చుతఱి ♦ నాడిన యానుడు లెట్లు నీమదిం
దోఁడరెడు వృత్తు లెట్టు లెటు ♦ దోఁచె నఘార్ణవపారముం గనం
బడయుదె యేను నీతలఁచు ♦ పాపపుఁ గర్మము విశ్వసింతునే. ౬౫

తే॥ మోహనాకారుఁ డవ్వీరు ♦ ప్రోల మెలఁగి, యొకనిఁ గామింతునే యతం ♦ డోసరిల్లె
నేని నాయుసు త్రెడలింప ♦ నెంతుఁ గాక, నీవు గనుచుండ నిదియపో ♦ నిశ్చతంబు.

క॥ అని పరుషోక్తులఁ బలిచెడు, వనితామణిఁ గాంచి మోము ♦ వాంచి వినతుఁడై
తన కేలుదోయి మోడ్చి స, వినయముగా ననియె వాఁ డ ♦ విప్రభుతనయా! ౬౬

—♦ లక్ష్మణుఁడు సీతతో తననిర్దోషత విన్నవించుకొనుట. ♦—

సీ॥ తగునె యిట్లాడంగఁ ♦ దల్లిరో! నామది, దైవతంబ వటంచుఁ ♦ దలతు నెపుడు
నుత్తరం బిడనైన ♦ నుత్సాహ మొదవదు, నీవైపరీత్యంబు ♦ నిర్ణయింప

నిది చిత్ర మనఁ బోల ♦ దింతులదెసఁ బుట్టు, లేనిపన్నాగము ♦ ల్గాన నగుట
ధర్మువుపై వృత్తి ♦ దవులదు చాపల్య, మెక్కుడు తైక్ష్ణ్య ♦ మెంతె లసఁగ
వచ్చు వ్రేల్మిడి భేదింప ♦ వార నేర్తు, రెంచ రెదిరి స్వభావమ్ము ♦ సేవగింతు
రంతలో నిన్ననఁగ నేల ♦ యన్నియు మది, నెఱిఁగి నీకాఁపుగొంట నా ♦ కెగ్గుగాదె.

తే॥ తోఁచుచున్నది రవిఁ బాయఁ ♦ జూచు సంజ్ఞ
చాయ నొక్కతె నిడి చన్న ♦ చంద మెల్ల
నామె తిట్టెను జముఁ గొడు ♦ కనక నీవు
నన్ను దూషించి తిం దేమి ♦ నయము గలదొ. ౧౯

తే॥ చెవులు చిల్లులు వడె మది ♦ చెదరె న్యాయ, మరసి పలికియు నీ తిట్టు ♦ లంటినాఁడఁ
దథ్య మరయునుగాత భూ ♦ తవ్రజమ్ము, మలసి వనదేవతాళి ని ♦ న్మనుచుఁగాత!

క॥ అమ్మ! వినఁజాల నీనుడు, లమ్మహనీయుఁ గొలువంగ ♦ నరిగెద నాపై
నుమ్మలిక మెనయ నేమగు, నెమ్మె విధి తలఁపులోన ♦ నిడి యున్నాఁడో. ౨౦

క॥ అపశకునమ్ములుఁ దోఁచెడు, విపర్యయం బేమి రీతి ♦ విన నయ్యెడునో
నృపమౌళితోడ నీ వి, య్యపవేశమున న్మెలంగు ♦ నోల పరయనొకో. ౨౨

క॥ మే లొనగూర్చెడుఁగావుత, మేలలినేనిఁ బరమేశు ♦ డీయిక్కట్టుల్
చాలి పరికించి యిందఱఁ, బాలించు తలంపు వెట్టి ♦ పావనమూర్తి! ౨౩

తే॥ అనుచు నులుకుచుఁ బలికెడు ♦ నాతనిఁ గని, యొండు వుట్టిన నిస్పృయి ♦ నుండుదానఁ
గాను విషశస్త్రవహ్నులనేని నీట, నేని నసువులఁ బుచ్చెద ♦ నింతె నిజము. ౨౪

క॥ ఆదయితుఁ దక్క నొక్కనిఁ, బాదమునన యేని నంట ♦ భావించెద నే
పోదువొ యుందువొ యనుచుం, బైదలి యేడ్వందొడంగెఁ ♦ బరుసం బెడలన్.

ఆ॥ ఆతఁ డూరడింప ♦ నైన నాలింప దొం
డనదు మంచి తలఁపు ♦ గొనదు వాఁడు
విసువు దోఁప మ్రొక్కి ♦ వెడలె రాముని జాడ
లరయువాఁడ నమ్మచు ♦ నార్తుఁ డగుచు. ౨౬

—♦ లక్ష్మణుఁడు రామునికొఱ కేగ రావణుఁడు సీతాసమీపమునకు వచ్చుట ♦—

క॥ ఆతం డటుచనఁ దటి గని, పాతకి రావణుఁడు దుష్ట ♦ భావంబున న
వ్వాతలిరుఁబోడిఁ గదియఁగ, నేతెంచెను భిక్షురూప ♦ మెలయుచునుండన్. ౨౭

సీ॥ కావిరంగున తీర్పు ♦ గల మేటి శాటుల, మాంసలాంసోరువు ♦ ల్మఱుఁగుపఱిచి
గంగమృత్తికబొట్టు ♦ కాంతిసంగతమున, మొగము బెట్టితనంబు ♦ మఱుఁగుఁజేసి

పూసిన నెఱిబూది ♦ పూఁత తెల్పిన మేన, నెలకొన్న కప్పావడ్చి ♦ నిగ్గుదేర్చి
జుట్టు జన్నిదముల ♦ కట్టుబా టెడయని, కరకయష్టుల యిచ్చ ♦ కంబు సూపి
గొడుగు కక్షపాల ♦ గొని తార్చి పాదుక, ల్దొడిగి యల్లనల్ల ♦ నడుగు లిడుచు
వచ్చి పర్ణశాల♦వాకిట నిలఁబడె, సీత మొఱఁగు ధ్యాన ♦ చింత నెఱయ. ౭౮

ఆ॥ అన్నదమ్ము లడవి ♦ కరిగిన నొంటిమైఁ, జంద్రసూర్యు లెడయ ♦ సంజవోలె
నున్నదాని నమ్మ♦హోజ్జ్వలమూర్తి సం, తమస మట్లు గవిసె♦దానవుండు. ౭౯

క॥ శశిరహిత యైన రోహిణి, భృశదారుణ మైన గ్రహము ♦ పెనుపున నతఁ డా
శశధరముఖి సాధ్వీమణి, విశదయశం దొరసె నపుడు ♦ విమలచరిత్రా! ౮౦

క॥ సముదగ్రతేజుఁ డని దు, ష్కర్ముఁ డని యవ్వానిఁ గాంచి ♦ కదలవు తరువుల్
స్తిమిత యయి నడిచె నాగా, తమి వాయువు వీవఁ డయ్యెఁ♦దరుణీమణిరో! ౮౧

సీ॥ తమ్మిఁ బాసి యొకంటఁ ♦ దారసిల్లియు నిజ, పద్మినీత్వంబునఁ ♦ బరఁగుచుంట
బాంధవాంచితచంద్ర♦భావంబునకుఁ దానె, మూలకందం బయి♦మో మెలయుటఁ
గమలాక్షి యోగప్ర♦కారంబు గొని హిర, ణ్మయత సహోర్ధంబు♦మను పరయుట
మంగళాంగస్ఫూర్తి♦మాట యట్లుండంగ, హొంబట్టు కట్టొక్క♦యొఱపొరయుట
లక్ష్మి యన నొప్పు నమ్మాత ♦ లాఁతి యనక
సాధురూపత నయ్యైంద్ర ♦ జాలికుండు
బ్రహ్మఘోషం బొలయ మేలి ♦ బ్రాహ్మణుండ
కాఁగఁ బోరానిచుట్టమై ♦ యాఁగి నిలిచె. ౮౨

తే॥ చిత్రిను శనైశ్చరుం డట్లు ♦ చేరఁ గాంచి
యధి తృణచ్ఛన్నకూప మ ♦ య్యసుర మార
పరత తను పాఱ గుణలక్ష్మిఁ ♦ బ్రస్తుతింపఁ
దొడరెఁ దొడవుల తొడవుగా ♦ స్తుతవిలాస! ౮౩

సీ॥ ఎవ్వరిదానవే ♦ యిందీవరేక్షణ, యిం దేటి కరుదెంచి ♦ తిందువదన!
కమలమాలికఁ గొంటి♦కమలాలయవొ తెల్పు, మంఘ్రిపల్లవము లి♦య్యడవిఁ ద్రొతె
యొంటి నిల్వఁగ నేమి ♦ యొప్పమి వాటిల్లెఁ, బే రెద్ది వల్లభు ♦ ప్రీతి గలదె
చింతిల్లె దెవ్వారి ♦ చేటెంచి లలితాంగి!, కలికికన్నులపైనిఁ ♦ గరుణ లేదె
యిట్టిరూపు ప్రాయ ♦ మీసౌకుమార్యమీ, తళుకు కళలతోడి ♦ కులుకు గాంచి
యౌవనాధివాస ♦ మెడఁ గని శంకించి, యనవధాని ననగ ♦ నైతి నబల! ౮౪

తే॥ పీతకౌశేయవసనంబు ♦ పెనుపు దక్కు, నేల కాటుకకన్నీట ♦ నిట్లు దడుప
మేని సౌవర్ణవర్ణంబు ♦ మించఁ గోరు, తప్పనకు దాని కియ్యది ♦ దండనంబె.

తే॥ దృక్ప్రసన్నత లనునవి ♦ తెఱగు లైన
నేమి నేరంబు చొప్పడె ♦ నీకనులకుఁ
గాంతములు గావొ ప్రాంతర ♦ క్తములు గావొ
కృష్ణతారకములు గావొ ♦ కేవలములొ. ౧౬

క॥ సమములు శిఖరులు స్నిగ్ధము, లమలము లవు దశనములు మ♦హాన్నము లవో సూ
త్రములఁ దెగడు టొరసి పు, న్నెమునకు నగ వుడిపి వూన ♦ నియతి నవసిందొ.

తే॥ శ్రీఘనము జఘనము పయిఁ ♦ జేర్చి మీఁద
శిఖరియుగ మిడి యేమి వి ♦ శేష మెంచి
నడుమ లేఁగాను నలయింపఁ ♦ దొడరినాఁడొ
సృష్టి యింతకు దాని య ♦ దృష్ట మదియు. ౧౮

తే॥ హ్రీవొ కీర్తివొ లక్ష్మివొ ♦ శ్రీవొ రతివొ
భూతివో యట్లుగాక యే ♦ పురుషు సతివొ
వేగమే తెల్పు మింకేల ♦ జాగొనర్పఁ
జే రెనసి మాటఁ దాఁచినఁ ♦ దీరుగలదె. ౧౯

ఉ॥ మేడలు మిద్దెలు న్నగరి ♦ మేలములు న్వరభోగపంక్తులుఁ
బోఁడిమి గల్గు సంపదలుఁ ♦ బోకడఁ బెట్టి యరణ్యభూమి నే
జాడ మెలంగ నేర్చితొ వి ♦ చార మడంగదొ నాకుఁ జెప్పఁగా
వేడబ మంచు నారయక ♦ పీడుదురే కసి యెవ్వ రేనియుఁ. ౨౦

తే॥ ఎందు నేనియుఁ గనుపట్ట ♦ రింతు లింత
లెంతవాఁ డన నానొ ని ♦ న్నేలు నతఁడు
వసువులనొ రుద్రులనొ మరు ♦ ద్వర్గమునవొ
యెందుఁ బొడమితొ యాతఁ డిం ♦ కెచటివాఁడొ. ౨౧

క॥ ఇది రత్నస్థలము మిమ్మెడ, నదనున గంధర్వ లేని ♦ నమరుల యేనిఁ
బద మిడ వెఱతురు మనుజుల, కెది గతి కనుఁగొనఁగ నైన ♦ నిందునిభాస్యా!

క॥ కావున నీవృత్తాంతం, బే వెరవున నేని నరయ ♦ కెట్లును మెలఁగం
గా వలనుపడదు తెలుపుము, తీనరపడ కింతవట్టు ♦ టీ ర్పనయుంగన్. ౨౩

ఆ॥ అనుచు నెఱపు నతని♦యాభాషణము సౌమ్య, దర్శనంబు వబిసి♦తనము నెంచి
సిద్ధుఁ డనెడు తలఁపు♦నేకూర నెఱి లేక, గాంచి యాతిథేయు♦కలన మించి. ౨౪

—♦ సీత భిక్షురూపుఁడైన రావణు గౌరవించి తత్ప్రశ్నములకుఁ బ్రత్యుత్తర మిచ్చుట ♦—

చ॥ ఇదె బృసి దీనిపై నిలువు ♦ మీ యదె పాద్య మనర్ఘ్య మర్ఘ్య మి
య్యదె యివె వన్యభోజ్యములు ♦ సాదరతం గొనుమయ్య ధన్యతం
బొదలెద మయ్య! యంచుఁ దగఁ ♦ బూజ లొనర్చెను నాథు రాకకున్
గొదకొను చూడ్కు లిమ్మెగిచి ♦ కోనపయిం దవులెత్తి పాఱఁగన్. ౯౫

తే॥ ఒఱపు నేరిమి యొరిమెయు ♦ నోలిమియును
మెచ్చు నూపంగ నమ్మెయి ♦ మెఱుఁగుఁబోఁడి
యొదిఁగి మెలఁగుచుఁ బారార్థ్య ♦ మొప్పఁ దనదు
వృత్త మెఱిఁగింపఁ దొడఁగె స ♦ ద్వృత్తిమహిత! ౯౬

ఆ॥ మహితుఁ డైన జనక ♦ మహీపతి దుహిత న, స్సీత యండ్రు నాదు ♦ చెట్టఁ బట్టె
రవికులీనుఁ డతఁడు ♦ రామనామాంకితుం, డధిగుణప్రతాప ♦ హారియశుఁడు. ౯౭

సీ॥ ఏనుఁ బండ్రెండేడు ♦ లిక్ష్వాకుకులు నింటఁ, గామరొప్ప నెఱపితిఁ ♦ గోటతికము
మామామ దశరథ ♦ మహిజాని తనసూను, మన్నాథు రాజ్యర ♦ మాసనాథుఁ
జేయ సంభారముల్ ♦ చెచ్చెరఁ గూర్పింప, నియతుల మైతిమి ♦ నెఱిదలిర్ప
భద్రగజం బెక్కి ♦ పతిరా వశిష్ఠాదు, లలరుచుఁ దత్కృతి ♦ వలనుపఱుప
నెఱిఁగి ప్రాక్ప్రసంజి ♦ తేష్టవరద్వయ, కైక రాజుఁ బిలిచి ♦ కౌసలేయుఁ
డడవి కరుగ మామ ♦ కాత్మజుం డిలయేలఁ, గాఁ బొనర్పుమనుచుఁ ♦ గలఁచుటయును.

ఉ॥ ఆడినమాటకుం దలఁగ ♦ నద్దెస ధర్మువు వీఁడ జూడ నో
రాడక వృద్ధరాజు మహి ♦ తాత్ముఁడు చేడ్పడ నాపె యొంతకే
నోడక మత్ప్రియుం బిలిచి ♦ యున్నది యున్నటు దెల్పి నీవు నీ
పాడి దొఱంగ కీనృపతి ♦ పల్కు దిరం బొనరింపుమో యనన్. ౯౯

తే॥ ఈయ నేర్చుఁ బరుల వేఁడు ♦ టెఱుఁగఁ డెపుడు
సత్యమే పల్కు నన్నృతంబు ♦ జాడఁ బోవఁ
డరియు శర ణన్నఁ గాపాడు ♦ నరసి రాముఁ
డన్న మాట త్రిలోకియుఁ ♦ గొన్నపాట. ౧౦౦

క॥ ఏ నరిగెద వని కనఁ దలఁ, పూనిన పినతల్లి వనుప ♦ నొల్లమి నెఱపన్
గానమిఁ దండ్రి యుపేక్షనె, యానతి సేయంగఁ దరలి ♦ యానతుఁ డగుచున్.

* క॥ గోత్రాసుత్రామాగ్రిమ, పుత్రుఁడు మన్నాథుఁ డెలమిఁ ♦ బొదలెడు మదిఁ ద
ద్గోత్రాణము కర్తవ్యము, యాత్రకు సెల వీగదె మ♦హామతి! యనుచున్. ౧౦౧

క॥ తనజననిం బ్రార్థించిన, ననఘాత్మక యెట్టకేల ♦ కనుమతి సేయన్
నను జేకొని ప్రస్థానం, బనితరముగ నెఱపc జూచు ♦ నాసమయమునన్. ౧౦౩

ఆ॥ అటు సుమిత్ర కొమరుc ♦ డనఘుcడు లక్ష్మణుం, డన్నమాటc దప్ప♦నన్నవాcడు
తనదు పాద మంటి ♦ దాస్య మొసంగవే, యనుచు దీనుc డగుచు ♦ నర్థి వేcడ.

ఉ॥ తమ్ముని వీడcగాc దలcపు ♦ దద్దయుc దోcపమి వాని రాకకున్
సమ్మతి సూప ముప్పూరము ♦ సంయమ మొప్పc జతుర్దశాబ్దముల్
నెమ్మిc జరింప నా ప్రతిన ♦ నేcటి కొ కే డెడ గాcగ వచ్చి యీ
యిమ్ముల నిల్చి తీర్చితి మ ♦ హీనచరిత్రత కార్యు లుబ్బcగన్. ౧౦౪

ఆ॥ ఒకముహూర్త మోర్చి ♦ యోసంయమీంద్ర! యిం
దుండుమయ్య! వార ♦ లొఱవు మీఱ
వన్యవస్తువితతి ♦ వారక గొనివత్తు
రెలమిcగూర్తు రట స ♦ మీహితముల. ౧౦౫

క॥ ఎం దుండి యెచటి కేగుట, ముం దేయది నెలవు మీని ♦ ముఖ్యుల కొనరే
సందియము గలదె మీనుల, విందుగ వివరింపు మదియు ♦ వినియెద ననినన్. ౧౦౬

— ♦ రావణుcడు నిజరూపముc జూపి సీతం గోరుట ♦ —

క॥ ఆనెఱి పోకడచి మనం, బానందమున న్మనుంగ ♦ నది యిది యను టీ
మాని నికషాత్మజుం డ, మ్మానినిc గొంపోవుతలcపు ♦ మైకొనc బలికెన్. ౧౦౭

ఉ॥ ఎవ్వcడు ముజ్జగంబుల జ ♦ యింపcగc గట్టెనో కంకణమ్ముc దా
నెవ్వని వార్త విన్న సుర ♦ లెన్నcడు నిద్దురc బోరో పోరులం
ద న్నెదిరించువారలను ♦ దార్కొనc బోదో కుటుంబభార మో
యన్నులమిన్న! యాతcడితc ♦ డోc జుమి రావణసంజ్ఞుc డాఖ్యcసున్. ౧౦౮

క॥ లంకాపురమునc గాపుర, మింకం గొఱcత లని కలవె ♦ యెల్లజగములం
బొంకము గల కొమ లీతని, లెంకల యేలికొనc దలcపు ♦ లేదే నీకున్. ౧౧౦

ఆ॥ నీకు భద్ర మొదవు ♦ నీరజాక్షిరో! నీవె, యగ్రమహిషి వంద ♦ లబలలందు
నైదువేల దాసు♦లనిశంబు నినుc గొల్చు, వార లాదు రేమి♦వలను దలcతో.

ఆ॥ మూcడు తలల కొండ ♦ మొనసి యాపుర ముందు
నేcడు సంద్రములకు ♦ నేడుగడయు
కాcగ నందనమ్ము ♦ గడచిన సిరి గల్లు
వనులు గాంచి ప్రీతి ♦ వఱలc గలవు. ౧౧౨

తే॥ చూడ నేర్చిన కనులకు ♦ సుంక మిడుట
గాదు పదిపై నొకం డని ♦ కాదు నిన్నుఁ
గాంచినదియే మొదలుగాఁగఁ ♦ గాంచనాంగి !
మెల్లతరుణులయందలి ♦ యిచ్చ తలఁగె, ౧౧౩

క॥ నాసేవ వడసి కొల్చెదు, నాసీమంతినుల మెలఁపు ♦ లరసి రసకలా
భాసురరాజ్య మొలసి వన, వాస మిది తలంపఁబోవు ♦ వరవర్ణినిరో ! ౧౧౪

క॥ పౌలస్త్యజాతుఁ డిటు బ్రితి, మాలుచునున్నా డొకింత ♦ మాలిమి నూపం
జాలఁ డొరులయెడ నింకిట, జాలముసేయంగ వలదు ♦ జలజాతాక్షీ ! ౧౧౫

ఆ॥ అనినఁ గుపిత యగుచు♦నారామ రాము నె
మ్మదిఁ దలంచి మ్రొక్కి ♦ మానవిహతు
వాని లెక్క గొనక ♦ వాగస్త్రములఁ బ్రయో
గింపఁ దొడరె భృతని ♦ లింపకాంత ! ౧౧౬

—♦ సీత రావణుని దూఱుట ♦—

సీ॥ మేలి ధైర్యంబున♦మెఱుఁగారు తలఁపున, గొండరాయనిఁ గేలి♦గొనెడువాఁడు
గాంభీర్యమున కల్మి♦గాంచు నక్షోభ్యత, సరిదీశు నుంకింపఁ♦జాలువాడు
హంగారు స్వీయచి♦త్తాభోగసంపద, క్రైందవ్రవైభవ మెంత♦యనెడువాఁడు
చూడనేర్చిన వారిఁ♦జొక్కించు సొబగున, నతనుసోయగ మెట్టి♦దనెడువాఁడు
నైన రాము ననువ్రత ♦ నై భజింతు
మనము వాక్కును దనపుఁ ద ♦ న్మయము లగుచు
నుండ దుండగితనమున ♦ గం డడంగి
చనకుము తలంగు మింక ర ♦ క్షఃకులీన ! ౧౧౭

తే॥ సర్వలక్షణలక్ష్యుండు ♦ సత్యపరుఁ డ
ఖండవటతరువరపరి ♦ మండలుండు
సింహవిక్రాంతగామి నృ ♦ సింహుఁ డతనిఁ
గాంచి యచ్చోట నిలిచెదే ♦ కర్బురుండ ! ౧౧౮

క॥ ఇంద్రనిభుఁ గీర్తిపరు విజి, తేంద్రియుఁ బురుషోత్తము ♦ న్మహీంద్రతనూజున్
జంద్రాస్యుఁ బృథుభుజోరఁ, స్కం ద్రప మున్నెదవు చూచి♦సురవిద్వేషీ! ౧౧౯

ఆ॥ విభుని కోపదృష్టి ♦ విధ మెంచి సిరి మించు, శూరు లెల్లఁ గడలు♦సూచువార
కలదె సింహి నొడియఁ♦గాంక్షించు జంబుకం, బొండు జగములందు♦నొకటనైన.

క॥ నన్నాదిత్యుని ప్రభ నీ, వెన్నఁడును స్పృశింపనేర ♦ విశ్వావసులుం
డున్న నిపుడే హరించును, బన్నగపతి యగుచు నీదు ♦ ప్రాణానిలముల్. ౧౨౧

క॥ కాంచెద వోరీ! యెల్లెడఁ, గాంచనవృక్షముల కాఁగఁ ♦ గలప్రమాఁకులనీ
పంచత్వ మనఁగ నాన్నృప, పంచానను హస్తగతినిఁ ♦ బరఁగెడు నింకన్. ౧౨౨

సీ॥ క్షుధితకేసరి నోటఁ ♦ జొనిపెదే హస్తంబు, నెత్తిపై మందర ♦ మెత్తి విడుతె
పాముకోఱలు ముట్టి ♦ పాలార్పఁ దొడరుదే, కాలకూటము ద్రావఁ♦గాఁ దలంతె
సాలయక కనుదోయి ♦ సూదులు గ్రుచ్చెదే, క్షురధారపై జిహ్వ♦నెరప నెంచె
శిలఁ గట్టుకొని యబ్ధిఁ ♦ జేతుల నీదెదే, యొడియుదే చందురు ♦ నుష్ణకిరణు
వహ్నిఁ గొంగున నిడి ముడి♦వైవఁ జూతె, వాఁడి శూలాగ్రముల నడు♦నం గడఁగెదె
చెడుఁగ? రామప్రియ న్ననుఁ జేరి ధర్ష, ణం బొనర్పంగ మలయు నీ♦సంబరమున.

ఉ॥ సింగము నక్క స్యందినిక ♦ సింధువు గంజి సుధారసంబు మా
తంగముఁ బిల్లి వాయసము ♦ తార్క్ష్యుని మద్గువు కేకి గ్రద్ద హం
సం గనకంబు సీసకము ♦ చందనవారినిఁ బూతిపంక మే
హంగునఁ బోలు రామునకు ♦ నస్రప! నీ కటు లంతరం బగున్. ౧౨౪

ఉ॥ కార్ముకహస్తుఁడై కడఁగి ♦ కంజదళాక్షుఁడు రాముఁ డుద్ధతిన్
మర్మవిదుండు నిన్నదిరి ♦ మార్గణము ల్పరఁగించునప్పు డా
కర్మము గాలము న్నెఱసి ♦ క్రక్కదలింపఁ దలంప నన్ను నీ
నేర్మి మెయిన్ హరింపఁ దగు ♦ నే వెడలింపఁడె నీమదం బొగిన్. ౧౨౫

క॥ నే జీర్ణింతునె మక్షిక, తోఁ జేరిన ఘృతముఁ ద్రావఁ ♦ దోనె వెడల కే
యోజ నిమిడి యుండం గల, దోజాల్ముఁడ! దుష్టబుద్ధి ♦ యుడుగదె యింకన్.

ఆ॥ అనుచుఁ గినిసి పల్కి♦యాకల్కి యుల్కుచు, స్త్రీస్వభావమునను♦జెట్టఁ దలఁచి
కదలె మెలఁచు గాలిఁ♦గదలియ పోలె వాఁ, డదను గాంచి త్రాస♦మందఁజేయు.

—♦ రావణుఁడు సీతం జంకించి ప్రగల్భములు పలుకుట. ♦—

క॥ మిత్తికి మిత్తియ పో వాఁ, డత్తలిరుంబోఁడిఁ గాంచి ♦ యనెఁ గులబలక
ర్మాత్తములు బిరుదములు సం, పత్తియుఁ బ్రకటించుచుం బ్ర ♦ భావసమగ్రా!

ఆ॥ బ్రహ్మపౌత్రజుఁడ న ♦ పారబలోన్నతిఁ, గన్నవాఁడ వరముఁ ♦ గొన్నవాఁడఁ
బేరు దలఁచి నంతఁ ♦ బెంపేది ముజ్జగం, బులును వడఁకు నింత♦ముగుద! కనవు.

క॥ దిక్పాలకుల జయించితి, దృక్పాతమె చంద్రు సూర్యుఁ ♦ బెరలించె నని
దృక్పారుషమున నెల్లను, దృక్పాళులఁ దెచ్చి యునిచి♦తీర్చితి వ్రతముల్. ౧౩౦

క॥ ఆకైలాసం బెత్తి మ, హాకాలుని మెచ్చు వడసి ♦ యమరత్వము సు
శ్రీకలితం బావయికము, సేకూరం గొంటి నొంటఁ ♦ జింతలు దలఁగన్. ౧౩౧

తే॥ భ్రాత వైశ్రవణుండు సా♦పత్న్యపుఁ బగ, వాఁడుగాఁ దోలఁ గైలాస♦వాసుఁ జేరఁ
గామగమన మతనిపుష్ప♦కమ్ము నొడిచి, కొంటి ముల్లోకములుదిరు♦గ దుక్షణమున.

తే॥ మయుఁడు మాయామయుఁడు విక్ర♦మం బెఱింగి
శక్తితోఁ గూఁతుఁ గొంచుఁ బ్ర♦సక్తితోడఁ
జేరి యయ్యుభయముఁ గూర్చి ♦ చెంద భద్ర
మితరయువతుల మాట యిం♦కేల చెప్ప. ౧౩౩

చ॥ బొమముడి వైచినంతటనె ♦ పో రవి చందురుఁ డాను బోర వి
భ్రమముఁ దలంచి నిచ్చలు వి♦పాకదురంత స్వచింత వేఁప న
భ్రముని భువాహనుండు పొన♦ర న్సురభూజపదార్థము ల్ప్రియం
బమరఁగఁ దెచ్చి యిచ్చు నమ♦రాఘుము లన్నిటఁ దోడు సూపఁగన్. ౧౩౪

మ॥ ఎట కేఁ బోవుదు నెచ్చట న్నిలుతు నాఁ♦డెల్లన్ భయోద్విగ్నతం
దటిను ల్పారవు వృక్షము ల్కదల వా♦తంకంబున న్వాయు వా
చటులత్వంబు దొఱంగి వీచు నను ని♦చ్చ ల్గొల్చు భూతౌఘ మె
క్కట సామ్రాజ్యము కాక తక్కినది యే ♦ కల్యాణి! యిట్లెంతయున్. ౧౩౫

ఉ॥ కన్నులఁ గాంచి యెన్నఁ దగుఁ ♦ గాని వచింప నశక్య మబ్ధిలో
నున్నది లంక రత్నమయి ♦ యున్నతసాలవిశాలకక్ష్య సం
పన్నగుణాతిరేక సుర ♦ భర్తకు బిచ్చము పెట్టినాడ దీ
న న్నెలకొంచు స్వర్గము గొ ♦ న న్నగుబాటను నాతలంపునన్. ౧౩౬

క॥ ఉన్నది నందనవనమున, కు న్నెల వని యీఁక పసిఁడి ♦ కుజములతో న
భ్యున్నతిఁ గాంచిన యుపవన, మన్నళినాకరము లెల్ల ♦ నమృతాయితముల్. ౧౩౭

తే॥ నాదు సంపత్తిఁ గనుఁగొన్న ♦ నళిననేత్ర!
యెన్నటికి మానుషసుఖంబు ♦ లెన్నఁబోవు
రాము మనుజు గతాయుష్కు ♦ రహిఁ దలంప
వచటి భోగంబు లొలసి త ♦ న్నాదరించి. ౧౩౮

ఉ॥ కొండికవాని రాజ్యరమ ♦ కుం బొసఁగింపఁగఁ గాంత కోరు ట
ట్లుండఁగ రాజు జ్యేష్ఠుఁడు ని ♦ రుద్యముఁ డంచుఁ దలంచెఁ గాక యే
దుండగి యేని నట్టడవిఁ ♦ ద్రోయునె లోకులు విశ్వసింతురే
భండతనంబునం దనకుఁ ♦ బాల్పడె నీయగచాట్లు నెట్టనన్. ౧౩౯

తే॥ తనదు దేబెతనం బెల్ల ♦ తలములందు, ప్రేమ పేడక కైకొన్న♦మొఱకుతనమ
కాక దీక్ష యొకండె యి♦క్కానలోనఁ, దమ్ము నిన్ను నలంచు నే♦ స్తం బొకండె.

ఆ॥ ఱాల ముండ్లఁ బడి య ♦ రాలకేశి! యిట్లు, నీవు వ్రేలఁ బ్రోచు ♦ నెఱికిఁ దక్క
కందమూలములను ♦ గ్రసియించు పురుషుని, పౌరుషేయ మెంత♦ప్రౌఢి యెంత.

ఉ॥ కావున భ్రష్టరాజ్యుని న ♦ కాముని రామునిఁ గొల్వ నేల యి
ట్లీవనవాసఖేదము స ♦ హింపఁగ నేల స్మరైకతంత్రు న
న్నేవగనేని పేడక స ♦ మీహితము ల్సమకూర్చుకొమ్ము సం
భావన లుల్లసిల్ల నినుఁ ♦ బాలన సేయుదు నెల్లకాలమున్. ౧౪౨

ఉ॥ ఊర్వశి యేలువాని మహి ♦ మోన్నతు సన్నుతు నప్సరూరవున్
గర్వమున న్దలంచి చని ♦ కాంచె నట న్వితతానుతాపమున్
సర్వము నీయదే యనుచుఁ ♦ జాటెదు న న్విడనాడి నీవు న
ట్లుర్వరపుత్రి! యుమ్మలిక ♦ మొందెదు సు మ్మెడయాని చింతచేన్. ౧౪౩

క॥ సంగతి గనఁ జాలవ యా, సంగరహితుఁ జెప్పి నన్ను ♦ జంకించెద వా
సంగరమున నేనియు నా, యంగుళితోఁ బోల్ప నర్హుఁ♦డా యతఁ డబలా! ౧౪౪

క॥ భోగ్యము లన్నియుఁ గొన నగు, భాగ్యము సమకూరె నన్ను♦భజియింపు మికన్
వాగ్యతభావాంగీకృతి, యోగ్యత కితఁ డెలమిఁ గాంచు♦నుత్పలనయనా! ౧౪౫

ఆ॥ అని వచింప వాని ♦ నాదరింపక కృధా, రక్తనయన యగుచు ♦ రాజవదన
పలికెనొంటి ననికి♦పాటింప కసురేంద్రుఁ, డులుకఁ బరుసములుమ♦హోజ్జ్వలాంగి.

—♦ సీత మరల బరుసములగు మాటల నాతని మదిఁ గలచుట. ♦—

ఆ॥ ఏనె యుబ్బుదాన ♦ నీప్రలోభనముల, కనద! యిట్టు లాడి ♦ యలఁతి పడితి
కాక రాముఁ జక్కఁ♦గాంచెదే యిరు లెందు, నెగిచి తేజ మున్న♦యిరవు గనునె.

చ॥ శునకము పోలె నీ విచటు ♦ సొచ్చితి వన్నరసింహుఁ డున్న నీ
పని సెడఁబాఱఁ బాఱుటయ ♦ పాల్పడు నొంఁదల యెత్తి మేనితోఁ
జనియెదె నోటి కబ్బినది ♦ జాల్కొన నాడెదుగాక యోటమిం
గనఁ డెటు రుద్రుఁ డేని లయ ♦ కాలుఁడ యేనియుఁ జక్క నిల్చినన్. ౧౪౬

తే॥ సర్వభూతనమస్కృతు ♦ సాధురతుని, వైశ్రవణుఁ జెప్పికొంటి వీ♦ వశ్రమమున
నన్న యని ధాత తాత యా♦నని యు దాన, నీదు చెట్టలు మలఁగనే♦నిందితాత్మ!

ఆ॥ వజ్రిహస్తు నింటి ♦ వాలుగంటి హరింప, నెంచువార లెంద ♦ ఱట్టు లయిరి
నన్నుఁ జెనకఁ దలఁచి ♦ నాడవు నీవును, మొదలివారి గతిని ♦ మొనయఁగలవు.

క॥ ఇంద్రసతి మాత్రమే రా, మేంద్రుని సతి నీకు మిత్తి ♦ యింత గనవ వె
ట్లూఁ ద్రిప వీడితి వమృతము, తంద్రిం ద్రావినను మోక్ష ♦ దశ జొప్పడునే.

ఆ॥ నీవు గొనెదు చిచ్చు ♦ నిన్నొంటిఁ బోనీయ, దిరుగు బొరుగు వారి ♦ నెల్లఁగాల్చు
రాజుచెట్ట వాని ♦ రాష్ట్ర మెల్ల హరించు, ననెడు మాట నిక్క ♦ మసుర ! వినుము.

క॥ అని బోధాత్మిక ధృతి నా, తనిఁ గసరుకొనంగ నామె ♦ తలఁ పరసి యెటో
చనసీ కభిమానము నెఁ, ట్టనఁ బురికొల్పంగ నెఱిక ♦ డంత దొలంకన్. ౧౫౩

—♦ రావణుఁడు సీతం బెదరించి మూర్ఛిల్లినప్పుడామెం గొని చనుట ♦—

ఆ॥ చిట్టు బుస్సు మంచుఁ ♦ జేచేతఁ జఱచుచు, వాఁడు పెరిగె సాధు ♦ వర్తనంబు
మున్నె లేదు నేఁడు ♦ మోమోటకై కొన్న, తబిసిదనము మెఱుఁగు ♦ తఱుగుపడగ.

క॥ వెండియు మైథిలిఁ గనుఁగొని, గండఁ డనుచు నెఱుఁగ విట్లు ♦ గాటించెద వీ
వండ సెడి కాని నీదగు, దుండగితనమునకు ఫలము ♦ దొఱయువ యింకన్. ౧౫౫

తే॥ ఆకసమ్మున నుండి యి ♦ య్యవనియెల్లఁ
దాల్తు భుజయుగళంబునఁ ♦ దార్చి నేర్చి
లీల మున్నీట నీ రెల్లఁ ♦ గ్రోలి విడుతు
యుద్ధ మని మిత్తి దొరకొన్న ♦ నోట యిడుదు. ౧౫౬

తే॥ నిశితశరములఁ దపనుని ♦ నిర్గతునిఁగఁ, జేయుదు నగల్తుఁ జిలువల ♦ సీమయెల్లఁ
గామరూపధరు న్ననుఁ ♦ గాంచి కాని, నీచలము వీడ వని పల్కె ♦ నిర్ఋతివిభుఁడు.

క॥ కను లెఱ్ఱఁ జేయఁ దోడ్తో, ననలస్ఫుర లావహిల్లె ♦ నర్కద్యుతులు
న్మొనసెఁ గొనలంది తలఁపున, నునిచిన యంతటి విపాక ♦ మొప్పారంగన్.

ఆ॥ భిక్షురూప మెడలి ♦ భేదకుం డవ్వాఁడు, కాలమేఘు మట్లు ♦ గడలకెల్లఁ
జాలు మేనితోడ ♦ జాల్కొల్పె రాక్షస, భావవిభ్రమములు ♦ పద్మగంధి! ౧౫౯

సీ॥ అంజనాచలసర్జ ♦ నాభ్యాసమున కల్మిఁ, దాత గూరిచిన పు ♦ త్తలము నెఱయ
మొగిలు సంగతికినై ♦ మొగియు బలాకావి, తానంబు నాఁగ దం ♦ తతతి మెఱయ
వెండికొండకుఁ జాఁచు ♦ వెరవున పొడవులై, పెరిఁగిన బాహువు ♦ ల్పిక్కటిల్ల
దెసలకుఁ బది లెక్కఁ ♦ దీ రొందు తలలకు, ముకుటము ల్గుండల ♦ మ్ములుఁ బొసంగఁ
గోఱలకు మిగులంగ నె ♦ క్కొనెడు నాల్క
లంతకుం డేడి యనుచుఁ గ ♦ య్యమున కడరఁ
గెంపులు ధరించి మించి ని ♦ లింపవైరి
యస్త్రశస్త్రాళితో నెల ♦ వాక్రమించె. ౧౬౦

మ॥ ఇటు చూడంజను నెంతకుం దగుదునో ♦ యేణాక్షి? యేఁ గాపులం
పటతం బల్కెడు పల్కుగా దఖిలసా ♦ మ్రాజ్యంబె యేలింతు ని
ట్లటవీవృత్తిఁ గృశింపనేల దయితుం ♦ డామానవుం డిట్టి యీ
కుటిలోనా వసియించు టొప్పు సిరికిం ♦ గోల్పోక వాటిల్లెనే. ౧౬౧

క॥ నీ కెన్నఁటికిని విప్రియ, మోకంజదళాక్షి చేయ ♦ నోపఁ జుమీ న
న్నీకనులఁ గాంచి ప్రోవుము, చేకొను మెల్లవిభవములు ♦ సిరి ముద్రికయున్.

ఆ॥ నీదు భాగ్యముననె ♦ నేఁ దక్కినాడ నోం
డెంచఁబోకు మనుచు ♦ నిరవుకొనఁగ
రాఁగ ఱాఁగ వాని ♦ రారాపు మది నెంచి
ముగుద సొలసి కనులు ♦ మూయుటయును. ౧౬౩

మ॥ పెనుగోళ్లన్ ధర వ్రక్కలించి ఘన మా ♦ పెల్లన్ సహోజాస్యతోఁ
దనబాహాబల మొప్ప మోచికొనుచున్ ♦ ధ్యానోపనమ్రంబు స్వాం
దనరాజంబున నుంచి తానును దదా ♦ స్థానంబునం బొల్చి క్ర
న్ననఁ బోవం దొడరె న్నభోగతగతి ♦ న్వామాక్షి ఘోషిల్లఁగన్. ౧౬౪

తే॥ ఆయశస్విని సీత య ♦ య్యసురచేత, నట్లు గొనిపోవఁబడుచు బి♦ట్టఱచుచుండె
మత్త, నా భ్రాంతచిత్త నా♦మలయు నమ్మ, హాతురత్వంబు దను ముంప♦ ననఘచరిత!

—♦ సీత ఘోషిల్లుట. ♦—

క॥ దూరమున నున్న రాముని, సారసదళనేత్ర యిటకుఁ ♦ జయ్యన రావే
కారుణ్యమహిత యనుచుం, దీరుగఁ బిలువంగఁ దొడరుఁ ♦ దేఁకువ సెడఁగన్.

తే॥ అరదమునఁ గూలుఁ బన్నగేం ♦ ద్రాంగన యటు
లార్తిమై స్తంభముం బట్టి ♦ యట్టె పెనఁగుఁ
దన్ను నిందించుకొను విధిఁ ♦ దద్ద దూఱుఁ
గడఁగుఁ గడకొను చింత స ♦ క్కాంత తెరలి. ౧౬౫

క॥ నేత వవినీతలోకవి, నేత వటు పరంతపుఁడవు ♦ నిర్ణేతవు ని
ష్పాతక మెట్లు సహించెదు, సీతాముఖకమలభృంగ! ♦ శ్రీముఖ! రామా! ౧౬౬

తే॥ అన్న! లక్ష్మణ! గురుహృద ♦ యానుమోద
కా యెఱుంగవు గదె నాదు ♦ గతి సుతేజ!
నిన్ను దూషించి యనిచితి ♦ నేఁడె తత్ఫ
లంబు గాంచితి నింక మ ♦ లంగఁ గలదె. ౧౬౭

తే॥ నన్నుఁ గాముని గామార్తుఁ ♦ డిన్నరాదుఁ, డొడిచికొని పోవుచున్నవాఁ ♦ డోడ లెఱుంగ
కున్నతటి వేల్పులార! మీ ♦ రిన్నయేత, రంబు దలఁగరె తెలుపరే ♦ రామహరికి.

క॥ స్మృతిఁ బాసియున్న నన్నీ, య్యతితుచ్ఛుఁడు మొఱఁగి రథము ♦ నం దిడిపోవన్
గతిగాంచె ననుచు వనదే, వతలార! వచింపవలయుఁ ♦ బ్రాణేశునకున్. ౧౭౧

మ॥ అవినీతుం డొనరించు నాకృతిఫలం ♦ బద్దే కనంగాంచుఁ బో
యవనద్ధం బయి యుండుఁ గాలగతి స ♦ స్యౌఘంబు పాకంబు గూ
ర్ప విలోకించెదు భంగి నింకిట భవ ♦ త్పాపంబున న్నిన్ను రా
ఘవబాణాగ్ని దహించు రావణ జగ ♦ త్కల్యాణసంధాతయై. ౧౭౨

తే॥ కైక! నీకోర్కి కడముట్టఁ ♦ గాంచె ఫలము
సుఖముఁ గాంతురు నీవు నీ ♦ చుట్టములును
ధర్మపరుఁ డయి రాముఁ డ ♦ ర్థం బసువులుఁ
దలఁపఁ డే రక్కసుని చెఱఁ ♦ దవులఁ గంటె. ౧౭౩

సీ॥ ఉంటిమి నీచెంత ♦ నోమాల్యవంతమా!, నీకు మాకు ఋణాంబు ♦ నేఁడు దీఱె
గోదావరీదేవి! ♦ గొడవ లెల్లఁ దొలంచి, యిలు సేస్తు వనుకొంటి ♦ నింతవట్టు
గంటిరే నా వెత ♦ గర్ణికారములార!, యేమి నో మెడలెనో ♦ యెఱుకపడదు
మృగశాబకములార! ♦ మే లెంచి నన్నొంటిఁ, దలఁపున నిలిపి నే ♦ స్తమ్ము నెఱపుఁ
డిందఱకు వందనములు మీ ♦ రెవ్వరైన, రామచంద్రుఁ దయాసాంద్రు ♦ రాకఁ గాంచి
రాక్షసుని చెట్టనైన యీ ♦ రాపు దెలియఁ, జేయఁ దగు రీతికై యింక ♦ సిద్ధపడుఁడు.

క॥ అలవడిన పలుకులను మీ, రలు రామునిఁ జేరఁ గాంచి ♦ రక్షఃకృతముం
దెలుపుఁడు శారికలారా!, యలిసారసకీరపరభృ ♦ తాంగనలారా! ౧౭౪

ఆ॥ విన్న యంత లోక ♦ విశ్రుతుం డమ్మర్త్త్రి, నోట నున్న చాడ ♦ నొక్కి యొడిచి
కొనునకాని రిత్త ♦ గోల్పోవునే నాదు, వృత్త మెఱుకపఱచు ♦ వేత్త లున్న. ౧౭౫

ఉ॥ సుందరమూర్తి! నిన్గనులఁ ♦ జూచెడు భాగ్యము కద్దొ లేదొ యీ
మందలమారిచేఁ బడితి ♦ మ్రందక వీడునె నన్ను వీఁడు నీ
కిందలివార్తఁ దెల్పు ఘను ♦ లెవ్వరొకో చెడుగొ కృతాంతు వృ
త్తిం దలకొన్న దెయ్యదియొ ♦ దేవ! త్వదీయదయోదయం బెటో. ౧౭౬

—♦ సీత త్రోవలో జటాయువుం గని తనయవస్థఁ దెల్పుట. ♦—

తే॥ దీనముగ నట్లు వాపోవు ♦ దివ్యమూర్తి, యంచితాయతలోచన ♦ యపుడు గాంచె
నొక పృథువనస్పతిస్కంధ ♦ మొంది యున్న, గృధ్రరాజమ్ము స్వజనతా ♦ కీర్తితమ్ము.

క॥ కని సముప హితాలంబన, మని తేఁకువ నొంది సుహిజ ♦ యారాటమునన్
దనతీ రెలుఁ గొప్పఁగ నా, తని కెఱుకపడంగఁజేయు ♦ తలఁపునఁ బలికెన్. ౧౮౯

ఉ॥ అన్న! జటాయువా! కను మ ♦ హంకృతి న న్గొనిపోవుచున్నవాఁ
డిన్నరభోజిపాంసనుఁ డ ♦ నిష్ట నజేయుఁడ! యెట్లు నాజి నీ
కెన్నఁగఁ గాన నీ వరిగి ♦ యిత్త చరిత్రుఁడు రాముతోడ నా
బన్నము విన్నవింపు మెడ ♦ పట్టకము న్జెఱ నీఁగఁ జెచ్చెరన్. ౧౯౦

క॥ జితకాశి క్రూరగుఁ డాయుధ, తతిగలవాఁ డధికబలుఁడు ♦ దానవుఁ డీతు ని
న్మతి లెక్కగొనఁడు చని మ, త్పతి తత్సోదరుఁడు వినఁగ♦భాషింపఁగదే. ౧౯౧

ఆ॥ వారు నీవు గలసి♦వచ్చి యిచ్చెనఁటి పెం, పడఁచు వలన మేలు ♦ దుఃఖఁగనము
గా దటంచు నొడువు♦కల్యాణి నుడికి వాఁ, డులికిపడుచు లేచి ♦ యుక్కు మిగిలి.

—♦ జటాయువు రావణుని నిందించి పలుకుట. ♦—

ఉ॥ చండపరాక్రముండు సయ ♦ శాలి ఖగేంద్రుఁడు గాంచె దైత్యు న
య్యండజయానతో నరద ♦ మాదటఁ గాంచె వచించె నోరి! యు
ద్దండుఁడు లోకనాథుఁ డగు ♦ దాశరథీశుని పత్ని నొంటిగా
నుండ మొఱంగి కొంచుఁ జన ♦ నోటమి పుట్టదె నీమనంబునన్. ౧౯౩

ఉ॥ చెట్టవ యింత కెట్టి గతిఁ ♦ జెందెదొ కాని విధాత్రు సంతతిన్
బుట్టితి వేదము ల్చదువు ♦ పున్నెము గంటి తపఃప్రసక్తిఁ బై
పెట్టున కెక్కి తేమి మిడి ♦ మేళము పాల్పడ నిట్టులై తొ చే
పట్టెద వన్యభామినులఁ ♦ బాపభయుం బని లేదె దేహికిన్. ౧౯౪

ఆ॥ భువనమాత యీమె ♦ పురుషోత్తముని సాధ్వి, బ్రహ్మమూర్తి జనకు♦పట్టి రాజ
పత్ని యనఁగ నైనఁ ♦ బ్రజల కే మగు నోరి! మట్టుమీఱితె నీదు ♦ చెట్టదనము.

ఆ॥ ఇంక మరల దేల ♦ యీతల యేశిల, యొడ్లచేతఁ దిట్టు ♦ లొందు బ్రదుకు
బ్రదుకె శాశ్వతత్వ ♦ పద్ధతి గొంటివే, చోటు ప్రొద్దు గాన ♦ కాటలాడ. ౧౯౬

క॥ వైశ్రవణజనని చాలక, యాశ్రవ యని నీదు మాత ♦ కభయం బిడి ని
న్విశ్రవసుఁడు గనఁ గని జగ, దాశ్రయులకు నెల్ల విషము ♦ హంకృతిఁ బోసెన్.

తే॥ నీదు పెండ్లము నెవ్వఁడే ♦ నెఱిని బిలువ
నేమి దలఁతువు నీమది ♦ నెగ్గుసిగ్గు
నున్నఁ దలఁ బాఁచుకొనఁగఁ దా ♦ వొకఁడు గలదె
యెల్లపంచాంగమును విప్పి ♦ యెదుట నిడిన. ౧౯౭

చ॥ సిరి గల దందు ధర్మ్మ వెడ ♦ సేసి విమానము నెక్కి దుష్కృతుం
డరుసము గాంచు మాడ్కిఁ దగ ♦ వందక నెట్టనఁ గామచారివై
పరుసఁదనంబున న్మెలఁగు ♦ పద్ధతి నొక్కటఁ గూలువాఁడ వం
బరమున ఱెక్క లూడ వడిఁ ♦ బాఱు విహంగమ మట్లు బోరనన్. ౧౮౯

తే॥ మేలు కీడ ననునవి రాజ♦మూలము లని, తెలిసి ధర్మార్థకామము♦ల్తెలుపమెయి
నడుపనేర్చు నతని సిరి♦విడ దధర్మ, పరుఁడ వీ వెట్లొనర్చెదో♦పాలనంబు. ౧౯౦

ఆ॥ లేరె ధర్మమరయు♦వారు నీనెలవునఁ, గామహతుని నిన్నుఁ ♦ గాన రెట్లు
చేదుమాని నీ గూండ్లఁ♦జేరిన పులుఁగు ల, ట్లడఁగు నీకతమున♦మడియఁబోరె!

ఆ॥ చెడిప జంత నీదు ♦ చెల్లెలి తప్పున, మడిసె నిచటి దైత్య ♦ మండలంబు
తేటిచూడఁ డొందు♦ తెరువు ద్రొక్కఁడు రాముఁ, డేల పగతుఁ డయ్యె♦నిందఱకును

తే॥ అంతమాత్రకు♦నతనిపై నడరి నీవు, వారిఁ గనఁబోవు దింతియు♦వఱల వింక
క్షీణపుణ్యుండ వైతి వీ♦చెఱుగు పనుల, వంక నా బంకరఘురమున♦వారి మునిఁగి.

సీ॥ లోకనాథుని భార్య♦లోలత్వమున నీవు, హరియింప దొరఁకొంటి♦వంతమాత్ర
నిముడదు కొంగున ♦ నిడిన నిప్పట్టులు, మృత్యు నింద్రాశని ♦ విధము దోఁప
దహియించు ఘోరాహి♦వహియించితే మని, కాలపాశము చుట్టఁ♦గాన వెట్లు
కులగిరి మోయుదే♦కూళ విషాన్నంబు, దినెదె యిద్దానితోఁ♦దీఱుగడకు
వత్తుగాక యొక్క ♦ వరుస నర్థము ధర్మ, వసము సుఖము వీడి ♦ యాత్రపడుచు
నెదిరివారు పొగడ ♦ నిల్లాలుఁ జుట్టాలు, నడల నాశ్రయింప ♦ నరువు లేక.

క॥ ఏను జటాయు ననుపమా, ఖ్యానము గలవాఁడ ఖ్యాతి♦గంటి బ్రిదికితిన్
మానుగ నఱువదివే లేం, డ్లానెటితోఁ బెద్దతనము ♦ నందితి సుఖినై. ౧౯౫

తే॥ అరుణసూనుఁడ బక్షిరా ♦ జంత లనఁగ
నొదుఁ గొండిక వీవు ర ♦ థాదిపరిక
రములుఁ గలవాఁడ వెగిచి బీ ♦ రమ్ము గొంటి
వైన నాపాలఁబడితి వెం ♦ దరిగ దింక. ౧౯౬

ఆ॥ ఏనుఁ జూచుచుండ ♦ నిక్ష్వాకుకులపత్ని, న్యాయహేతుయుక్త ♦ మైన శ్రుతియ
పోలెఁ జెట్ట నీకుఁ బోలునె హరియింప, నిలువు మెన్నువాఁడ ♦ నీదు బలము.

ఉ॥ శూరుఁడ వైన వే దొడరి ♦ చూడుము నాదు కడంక నింక నా
దూరవనంబుల న్వెదకి ♦ ధూర్తుని నిన్వధియింప వారి దు

ర్వారబలపరిచారుల జ ♦ వంబుమెయి న్గొని వచ్చు నంతకున్
దారి తలంగ కుండువె వి ♦ దారితుఁ జేయుదు నేన యుత్తతిన్. ౧౯౮

ఆ॥ ఎట్లుఁ జచ్చువాఁడ ♦ వే పరాత్ముఁడు రాముఁ, డతని కపకృతంబు ♦ నాచరించి
భీతిఁ గుంది కుంది ♦ పెంపేద నను గిట్టి, యేని నిచటు వాసి ♦ యెగయు టరిది.

క॥ నే జీవముతో నుండఁగ, నోజం జననీయ నుండు ♦ ముత్పలనయనన్
భూజను డించితి వేనియు. వే జను మిదె సంగరంబు ♦ విధ మిర్వురకున్. ౨౦౦

చ॥ చెలిమి ఘటిల్లి నందులకుఁ ♦ జేసెద నే నుపకార మమ్మహా
త్ముల కటు లాజి కాజి మును ♦ ద్రోపుడు గన్న సురాళికిన్ వితా
పలుకుట గాదు వృంతమునఁ ♦ బండిన పం డటు తేరిపైని ని
న్నిలువఁగనీక రాల్చుదు న ♦ నిన్ గొన నెట్టన నిశ్చయింపుమీ! ౨౦౧

—♦ జటాయువు రావణుతోఁ బోరుట. ♦—

ఆ॥ అనిన నన్ని కనులు ♦ నగ్నికుండంబుల, పోలె వెలుఁగఁ దొడరఁ ♦ బోరితమున
కడరి పెలుచ నార్చి♦యావిహంగ మడంతు, ననుచుఁ జక్క సేర♦నరుగుటయును.

ఉ॥ ఆతఁ డెదిర్చి విస్తృతబ ♦ లాతతపక్షసపక్షవాతసం
జాతజవాతిరేకమునఁ ♦ జాలినయంతలు సేసి యాఘన
వ్రాతముఁ దూలపుచ్చు నెటి ♦ వాని పరిచ్ఛద మెల్ల దుల్ల వి
ఖ్యాతయశుం డదల్చి తలఁ ♦ కం దల దన్ని తెరల్చి నిల్చినన్. ౨౦౩

ఉ॥ త్రోవఁగరాని రోసమున ♦ దుష్టుఁడు రక్కసుఁ డాఖగేంద్రునిన్
ద్రోవఁగ వాఁడు వోక ధృతి ♦ తోఁ బెనఁగ న్నగము ల్పతత్రు లా
నావగ నాప్రతీపపవ ♦ నాహతమేఘయుగంబు డంబు నై
వావిరిఁ బోరు పో నెసఁగె ♦ వారి కవారిత మా క్రమంబునన్. ౨౦౪

క॥ నిశితములగు నారాచము, లశనినిభంబులు వికర్ణి ♦ కాస్త్రంబులు న
ద్దశవదనుఁడు గురియించె న, వశత న్నవశతము లొకఁట ♦ వారని గృధ్రుచేన్.

తే॥ అవి గ్రహించి విదిర్చి వి♦హంగమోత్త, ముండు తీఅని చిట్టిఁ బై♦గుండి కాళ్ల
గోళ్లఁ దుండంబునను జీల్చెఁ♦గో యని కడి,కండలుగ వాని నెమ్మేన♦ఖండుఁడగుచు.

ఆ॥ దాని కలుక గదుర ♦ నానిశాచరుఁడు ఘో, రాశుగముల జముని♦ ముష్టికలను
బోలువాని నైచెఁ ♦ బొలిసితి లె మ్మంచు, నొక పదింటి లెక్క♦నుగ్రుఁ డగుచు.

తే॥ దీనయై తేరిపై నున్న♦జానకిఁ గని, కలని కెగిచెడి యసుర యా♦గడము దలఁచి
యస్త్రనిహతి గణింపక♦యాతని పయి, కొనియె ఖగపతి లేఁబ్రాయ♦మెన సెననఁగ.

—♦ రావణుని రథముం బరికరముం గూల్చి ధనువుల విఱిచి జటాయువు విక్రమించుట. ♦—

క॥ చరణముల నొడిచి వాని న, శరము శరాసనము విఱిచె♦సరగునఁ బతగే
శ్వరుఁ డరి యీతని గెలుపు సు, కర మనఁబోల దని తలఁక ♦ గర్వోన్నతుఁడై.

ఉ॥ దాని సహింప కుద్ధతుఁడు ♦ దానవుఁ డంతకు మీఱి యొండు వి
ల్లానెఱిఁ దాల్చి గుప్పెను శ ♦ రావళు లొక్కట వేనవేలు సం
దానితనీడమధ్యమునఁ ♦ దార్కొని పేర్కొని వాఁడు తెక్కలన్
వాని విదిర్చి యంఘ్రుల న ♦ వారణ నద్ధను వల్లె ద్రుంచినన్. ౨౦౦

తే॥ తత్తరంబున నొండు కో ♦ దండ మరయు
నంతలో నంతరముఁ గాంచి ♦ యభ్రగేంద్రుఁ
డతని వర్మంబు దొనలు ద్ర ♦ య్యంగఁ దన్ని
యగ్నిశిఖ లట్టి విశిఖంబు ♦ లవనిఁ గలిపె. ౨౦౧

ఉ॥ బంగరు వారవాణములు ♦ పారు పిసాచుల మోము లొప్ప బ
ల్మిం గడుకొంచుఁ దీవ్రగతి ♦ మేకొను యుగ్యఖరంబులం బత
త్పుంగవుఁ డబ్బురం బెసఁగ ♦ బోరన గీటడఁగించి రత్నచి
త్రాంగము కామగం బగు మ ♦ హారథముం దెగటార్చెఁ బెల్చనన్. ౨౦౨

ఆ॥ ఛత్రచామరములఁ ♦ జంద్రకాంతములఁ ద, ద్గ్రాహింజనముతో న♦గల్చి యంత
నుత్తమాంగమును మ♦హోగ్రతుండమునఁ దుం,డించి వైచె నక్క♦డిందిపులుఁగు.

తే॥ అన్ని పరికరములు సెడ ♦ నవని కుఱికె, సీత మునుకొని తలఁగ ని ♦ శీథినీచ
రుం డఖిలభూతములు ఖగేం♦ద్రుని నుతించె, సాధుసాధువచస్స్వనతి♦సాధ్వి! వింటె.

క॥ అలసె ఖగరాజు ముదుకఁడు, చలమునఁ బోరాడె నింకఁ ♦ జాలఁడు తె మ్మం
చు లతాతన్విం గొని చను, తలఁపు మది న్నెలకొనంగఁ ♦ ద్వరితుం డగుచున్.

ఉ॥ మాయలగొండి కొండొక వి ♦ మానము నెట్టన రా జనాధిభూ
జాయ నిజాయతి న్గొనుచుఁ ♦ జయ్యనఁ బోయెద నంచు నెంచు నా
చాయఁ దలంచి యప్పతగ ♦ శక్రుఁ డవక్రత వాని డాయఁగాఁ
బోయి యెటో యిర న్మనుచు ♦ బుద్ధికిఁ బాసి తటంచుఁ గ్రమ్మఱన్. ౨౦౬

—♦ జటాయువు రావణు లెక్కసేయక పలుకుట. ♦—

ఆ॥ పలుకఁ దొడరె నిట్లు ♦ పాపుఁడ! విశ్రవు, పేరు సెఱుప నింత ♦ బేలవైతి
గాక నీకు దక్కఁ ♦ గాఁ బోదు పావన, చరిత మహిజ యీపె♦జాడఁ గనవు.

ఆ॥ విసముఁ గ్రోలఁ జెట్టి♦వెట్ట్రియు జలతృష్ణఁ, బొసఁగె ననుచుఁ దనదు♦పస చెడంగఁ
బిడుగు లట్లు రాము♦భీషణబాణమ్ము, లగడుపఱచు నప్పు♦డరయు మెట్లొ. ౨౧౮

తే॥ కాలపాశంబు మెడ గట్టి♦గా బిగించె, నింక మోక్షంబు కల దని ♦ యెన్నరాదు
బడిశమును సామిషం బని♦పట్టి మ్రింగు,ఝుషము గతి నీవు చత్తు వ♦సంశయంబు.

క॥ ఉక్కివుఁడ వీవు పొలియుట, యక్కజ మనఁబోల దెంద ♦ అనభిహితులు నీ
చక్కటిబందుగు లడఁగెద, రిక్కొఱగాని కొల వారి ♦ నెల్లర మునుపన్. ౨౨౦

క॥ అనుబంధ మరయ నేరక, యనదలు దుష్కృతు లొనర్చి♦యగువారలకున్
వినిపాతం బొనఁగూర్చుదు, రనుపదమే చెడుదు రింక♦నన నేమి యగున్. ౨౨౧

తే॥ ఖరుని చన్న తెఱం గెల్ల ♦ నరసి నీవు, వాని పట్టున పైమొట్టు♦వరుసఁ గొనఁ ద
లంచు టెన్న మదోన్మత్తు♦లాగు గని త, థాత్వగతిఁ గోరు పంద వి♦ధంబ కాదె.

తే॥ వారి ధర్షింప నోపవు ♦ వార లున్న, చోటు ద్రొక్కంగ నేరవు ♦ చోరవృత్తి
గర్హితం బగు గతికిఁ బోఁ♦గంటి కాక, రాము చూడ్కి కెదుర్పడి♦రావు మరలి.

ఆ॥ ఇప్పు డేమి చెడియె ♦ నింతటితో నిన్నుఁ, బోవనిత్తు ననుట ♦ పొల్లుమాట
రామకింకరుండ ♦ రా నిల్వు మొక్కొండు, గడియలోన మంటఁ♦గలుపువాఁడ.

క॥ చావంబోయెడు వానికి, నేవలనున నేమి చెట్ట ♦ లేర్పడఁ గలవో
యావిధము లన్ని మూఁడెను, బోవుదు వికఁ మంచిమాట ♦ పుట్టంగఁ దే. ౨౨౪

క॥ పాపానుబంధ మగు కృతి, కోపుదు నని చొరఁగనైన ♦ ను క్కడలున కా
కాపరమేష్ఠికి నేనియుఁ, బ్రాపించునె మంచిగతి స ♦ భాజనధూరా ! ౨౨౫

—♦ జటాయువు రావణు నొడలెల్లఁ జించి చీకాకుపఱచుట ♦—

ఆ॥ అని తృణీకరించి ♦ యవ్వాని మూఁపుపై, వ్రాలి మెడ నరమ్ము ♦ వాఁడి తుండ
మునఁ బెకల్చి పట్టి♦మునుగోళ్లఁ బఱియలు, సేసె వెన్ను పఱవు♦చించి చించి.

ఆ॥ మావటీఁడు దుష్ట♦మాతంగమును విదా, రించు విధము దోఁపఁ♦గ్రించురక్క
సునిఁ దెరల్చి నెఱులు♦సునిశితనఖములఁ, బెరించి మఱియు వి క్ర♦మించుటయును.

క॥ విసువు దలకొన విహంగముఁ, గసిమసఁగుదు ననుచు నొంట♦ఖడ్గంబు గనుచున్.
గసరి యఱచేతఁ జఱచిన, నసుర చెయిది లెక్కసేయ♦కాతఁడు పెలుచన్.

ఆ॥ వామబాహువనము ♦ వజ్రాభ మౌ నిజ, తుండమునన నఱికి ♦ త్రోచి పైవ
మగుడ మొలిచి తొంటి♦మాద్రిన పెనుపొందె, వరదుఁడైన విధి వి♦వర్తనమున.

క॥ పుట్టం దల లెత్తు ఫణుల, గు ట్టటుగా సీతజోలి ♦ గొనఁ జూడక వాఁ
డట్టె ఖగరాజు పైఁబడి, మట్టు మిగలి కాలఁ జేత ♦ మర్దన సేసెన్. ౨౩౧

క॥ తోడన పులుఁగులమన్నీఁ, డోడక నఖరములఁ ద్రోటి ♦ నురుపక్షములన్
వీడని యగ్గలిక న్నుఱుఁ, మాడం దొరకొనియె నమరు ♦ లబ్బుర మనఁగన్.

క॥ సరిసరిగాఁ బోరిరి వా, రిరువురు నొండొరుల మెచ్చు ♦ లే యెఱుఁగక య
ప్పురుసునఁ బరుసఁదనంబునఁ, బురుషత్వమున న్మహార్ద ♦ పుంగాల ముహా!

ఆ॥ నాఁటి ఖగ్గ మెత్తి ♦ నామేలు వాఁగడి బ, న్నంబు వాపికొనెడు ♦ నయ మెఱింగి
రౌద్రకర్ముఁ డసుర ♦ రామార్థకర్శితు, వ్రేసె గఱులు కాళ్లు ♦ విఱిగి పడఁగ.

—♦ రావణుని చంద్రహాసముచే జటాయువు కూలుట ♦—

తే॥ అల్పజీవితుఁ డయి పులుం ♦ గవనిఁ గూలె
ధూళి ద్రుంగిన మేను నె ♦ త్తుటను జొత్తి
లంగఁ బైపయి నొయిలు గ ♦ ప్పంగ ఱెక్క
లవిసి పడ గుట్టవడు కొండ ♦ యట్టు లగుచు. ౨౩౫

తే॥ పాండురోరస్కుఁ డవ్వాఁడు ♦ పృథివి తేజుఁ
డట్లు పడి రాఘవాశ్రమో ♦ పాంతమునను
శాంతమై యున్న దావాగ్ని ♦ చంద మొప్ప
ననిచి రక్షోమనశ్శల్య ♦ నయము నూపె. ౨౩౬

క॥ కూలిన పతంగపుంగవు, కూలంకషసత్త్వ మెద ది ♦ గు ల్గొనఁ జేయన్
నాలి సెడినవాఁ డసురుం, డోలిం బురికొనఁ గడంగె ♦ నుత్పలనయనా! ౨౩౭

క॥ తన బంధువు ఖగనాయకు. ననవద్యచరిత్ర చేర ♦ నరిగి పొలిసితే
చనెదె తండ్రీ! యనుచుం, బనవుచుఁ బెనువగలఁ బొగిలెఁ ♦ బర్వేందుముఖి! ౨౩౮

—♦ సీత జటాయువుంగూర్చి వగచి బంధువులం దలంచి విలపించుట. ♦—

చ॥ కరమున నాతని న్నిమిరి ♦ కాలము కర్మముఁ గూడెఁ గాక నీ
వరికి వశంబె నాదగు మ ♦ హాపకృతిం జెడి తేమి పల్కుదా
న రమణుఁ జేరి పల్క నయి ♦ న న్విపదంబుధి ముస్గకుందు మి
ర్వారమునుఁ బాపకర్ములకె ♦ పో విధి సాయముఁ గూడ నయ్యెడున్. ౨౩౯

క॥ నేమమున మేలుగీండ్లకు, నే మని శకునములు శకుని ♦ కేరితములు ము
న్నామికొను నరుల కెందునుఁ, గామాంధుల కెన్నఁ జనవు ♦ గాక మహాత్మా!

ఆ॥ నీవు నిట్టు లైతి ♦ నెఱి వోవ నాయభా, గ్యమున నాథుఁ డింత ♦ యరయఁ డయ్యొ
నేమి సేయు దాన ♦ నెట్లు గానుండెనో, యాకృతాంతు దుష్ట ♦ మగు మతంబు. ౨౪౦

తే॥ కొన్ని మృగపక్షితతులు కా ♦ కుత్స్థచంద్రుఁ
గాంచి యివ్వార్త మెఱిఁగింపఁ ♦ గడఁగుటయును
గానవచ్చుచు నున్నది ♦ కదిసి వచ్చు
నేమొ యిమ్మాయపొలదిండి ♦ నింతలోన. ౨౮౨

తే॥ రామ! కావవె లక్ష్మణ! ♦ నామహోప, లాప మెన్నకు మీఱలు ♦ లాఁతి ననకుఁ
డత్తలార! విపన్ననై ♦ యరుగుచున్న, దాన జనక! ధరిత్రి! నీ ♦ ధరణ మసదె.

క॥ అని పేరువేర నందఱ, వనితామణి యెదుర నున్న ♦ వారింబలె న
య్యనుఁగుం జుట్టలఁ బిలుచుచుఁ, బనవి పనవి మఱియుఁ జొక్కు♦పాటు గదురఁగన్.

క॥ ఎలదీవె నేలపైఁ బడి, పొలుపఱఁ జిక్కువడి విరుల ♦ పొం పెడలిన య
వ్వలనునఁ గననయి బలుభ్రమా, నలవడు నను నాసఁ బొదలు♦నాసమయమునన్.

తే॥ పాడురాకాసి పేరి ప్ర ♦ భంజనుండు, కదిసి గదుముచు సంకల్ప ♦ కల్పిత మగు
రథముపైఁ బడనైచెఁ బౌ♦రమ్ము లేని, చింతఁ గొను నామెఁ దివిచి ర♦శ్మిప్రసక్తి.

తే॥ సీత నమ్మాయి వాఁడు ధ ♦ ర్షింప భువన, మపుడు సంతమసావృతం♦బయ్యె వీవఁ
డనిలుఁ డపగత తేజుఁ డ♦హర్పతి యయి, కానఁబడె భూతతతి వడఁ♦కం దొడంగె.

సీ॥ పలుగాకి పాపంబు♦పండె వీఁ డింకఁ జే, డ్పడు లెం డనుచుఁ బల్కెఁ♦బద్మభవుఁడు
దుర్జాతి యింతకు♦దొరకొనెఁగా యంచు, గోడు మే లెంచి ర♦క్కొన మునులు
కదిసి యే వెలయింతుఁ♦గా కెందుఁ జన నేమి, పొం డంచుఁ బ్రకటించె♦ భూతధాత్రి
పైఁగాఁవు గానె మా ♦ పాలిదేవత కంచు, దేవలోకమువారు ♦ దిటవుపడిరి
మొనసి చనె రాము నాక్షణ ♦ మ్మనసె కాంచి
కూళ చెయిదముఁ దెలుపఁ బ ♦ క్షులు మృగములు
తొడరి తనకీడు దలఁపక ♦ ధూతకలుష
నట్లు చెఱఁగొని రావణుఁ ♦ డరుగు నంత. ౨౮౮

తే॥ ఆపదుద్ధారకుఁడు రాముఁ♦డనెడు మాట, చాటి చెప్పుచు నరిగె నా♦చంద్రవదన
రామ! రామ! దయాంబుధీ!♦రావె యనెడు, నుడికి నొం డెడసేయ క♦న్నులతురాయి.

వ॥ వెండియు సప్పొలదిండి గండరగండఁడు పిచండిల తేజోమండలంబు దన కండ దండయై మండనంబు సూప నుద్దండంబగు భుజాదండంబు బలిమి నొక్కండు లెక్కసేయక విమానరాజంబుపై రాజపుత్రి నునిచికొని గండుకొను చండితనంబునం దన వీటి దారి వట్టి వినువీధి నెయిద సమకట్టిన నారాజవదన నెమ్మేని మెఱుంగులు మెఱుంగులఁ దృణీకరించి యాభరణమణిద్యుతులతోడి సంగడంబున కలిమి నిఖిలాశాప్రదేశంబులకు నాశపాశలు గల్పింపఁ దదీయకాంచనకాశేయ

చేలాంచలానలప్రభలు వాయుసహాయంబున నభ్రంబున నదభ్ర యగు తామ్రాభ్రరేఖక సృజియించి యారక్కసులతేని పేరి నల్లకొండ కోన నల్లనం గాల్పం దొడరెనో యని సుమనోవితానంబు చిత్తంబుల వంక వాశంకాలతలకుం బాదులుం బ్రోదులుం బొనరింప మారీచమర్దను నారాచవిశేషంబు లక్కాఱ గామి దిక్కునకుం గవియంబోలు నను సందర్భంబునకు సగర్భంబు లగుచు రత్నగర్భానందన కబరీభారమ్మునుండి తెరలిన కెందామర రేకులు పవనాకీర్ణంబులై ఝల్లన నాతనిపయిం డొల్ల నీలమేఘంబు భేదించుకొని నెట్టనం దోఁచు దివాచంద్రమండలంబును వినాశంబై వడఁగొన్న పంకజంబును బోల్పం దగి సులలాటంబును సుకేశాంతంబునుఁ బద్మగర్భాభంబును నవ్రణంబునుఁ బ్రవిమల దంతప్రభాభాసితంబును సునాసంబును జారుతామ్రోష్ఠంబును హాటకప్రభంబును నగు నద్దేవి వదనంబు రాక్షసోపప్లుతంబై రామదేవకటాక్షామృతనిష్యందం బపేక్షింప నకాలకాలజలదంబు పొంత వైపరీత్యంబునం బొడకట్టు విద్యుల్లేఖ వడువున స్ఫురించియు స్ఫురింపనిదై నీలమణుల దండ నండగొన్న కాంచనకాంచి యట్టిదయై కట్టున నొరగియు మహాగజంబును సావర్ణకక్ష్య వోలె నవ్వాని వెలుంగం జేయుచు స్వీయభూషణ నిక్వాణంబుల నాచపలమలీమస మేఘంబు సఘోషం బగుచుండ నుత్తమాంగచ్యుతమైన పుష్పధార ధరాతలంబునం బడియుం బడక వాతధూతమై దశగ్రీవు నభివర్తించుచు నిజావస్థ నెఱింగించు నంతియకాక విమల యగు నక్షత్రమాల మేచకోపలమేదురం బగు మేరుశృంగంబునం గూలు నయ్యుపద్రవం బభివర్ణింపఁ జరణతలంబుననుండి భూతలమ్మునకుం దొరలు రత్నభూషితంబగు నూపురంబు పతత్సౌదామనీమండలంబును నగ్నివర్ణంబులు సఘోషంబులునై యవకీర్ణంబు లగు తదీయభూషణంబులు ప్రక్షీణంబులై భూమిపై రాలు నక్షత్రంబులును స్తనాంతరపరిభ్రష్టంబులై నేల కొరగు సతరళతారహారంబులు గంగాతరంగిణీప్రవాహ తారాధిపబింబంబులుంగా డాయం బాఱ నాయ భూతోత్పాతంబులం బరికింపంబోలె యప్పెనుభూతంబు తేజోవిశేష దేదీప్యమాన యగు నప్పృథివీభూమహాల్కుం గొని పోవుచుండె నట్టి సమయంబున.

సీ॥ లాలించె సతి! తలం♦ కేలె యంచుఁ బులుంగు,నుడుల వాతాహతా♦నోకహములు
శోకించెఁ దోడుగా ♦ శోషితసరసిజ, త్రస్తజలేచర ♦ ల్సారసినులు
జంకించె నసురుఁ ద♦చ్ఛాయానుగతములై, శార్దూలసింహాది♦సత్త్వతతులు
ఘోషించె నాస్యద్భ్ర♦గుస్రుతు లుచ్ఛ్రిత, బాహుశృంగంబులు♦పర్వతములు
మేల్మి సెడఁ గృశించె♦మృగపోతములు దివా,కరుఁడు వెల్లవోయెఁ♦గాంచి కాంచి
యశ్రుపూరకలిత♦ లాకంప్యమానాంగు, లైరి విపినదేవ ♦ తాళు లపుడు. ౨౫౧

ఆ॥ ఇంక ధర్మ మున్న ♦ దెటఁ బోయెనో సత్య, మానృశంస్య ముడిగె ♦ నార్జవంబు
దారిఁ దలఁగె ననుచుఁ ♦ దల్లడిల్లుచుఁ బల్కె, నెల్లభూతగణ మ ♦ గేంద్రతనయ!

క॥ సీతం గాని చనువాఁడె యి, సీ? తాతకు మాటఁ బొడమి ♦ చెల్లునె యింకం
బోతర మడంగు లెం డని, భూతములకు భూతధాత్రి ♦ బుద్ధులు సెప్పెన్. ౨౫౩

ఆ॥ నేల వంకఁ జూచు ♦ నేల రాకుండె మ, న్నాథుఁ డను సుమిత్ర ♦ నందనుండు
బోధసేయఁ డొక్కొ ♦ పురుషోత్తమున కను, నెందు నేనిఁ జిక్కి ♦ రేమొ యనును.

ఉ॥ ఆమహిళాశిరోమణి ధ ♦ రాత్మజ శేముషి రామరూప త
న్నామమయాత్మ జిహ్వ యవి ♦ నాకృతతద్గతదృష్టియుం దగన్
భూమరసాఢ్యమై తనరు ♦ పోఁడిమిఁ గన్గొనియుం దలంపఁ డా
సేమము రక్కసుండు తన ♦ చేటునకే మతి సమ్మతింపఁగన్. ౨౫౫

మ॥ సడలె న్గేశకలాప మాతిలకమా ♦ జాఱెం బ్రపాతంబుగా
వెడలె న్గన్నుల వేఁడినీరు శ్వసనా ♦ వేగంబు గన్పట్టెఁ జొ
ప్పడె వైవర్ణ్యము వ్యగ్రభావ మెసఁగెన్ ♦ బాటిల్లెఁ జింతాభరం
బుడురాజానన కాశరుం డటమి త ♦ న్నుద్వృత్తిఁ గొంపోవుచోన్. ౨౫౬

తే॥ ఆమనస్విని రామేంద్రు ♦ నందరాక, రాకపోకలు లేని ని ♦ రాకరణము
పాలువడె నింక నీదైత్య ♦ పాలుని కృతి, గోలుపోనైతి ననుచు గ ♦ గ్గోలుపడియె.

చ॥ ఎడరున నల్కఁ గన్నుఁగవ ♦ యెఱ్ఱని డాలెనయంగ భంగపా
టెడ నలయింప రామవిభుఁ ♦ డేడ్తెఱఁ డాయమి ముట్టముంప న
ప్పడఁతుక వాని కైతవము ♦ భావమునం దలపోసి యీరెలుం
గడరఁగఁ దెంపున న్బలికె ♦ నాశరుఁ గాంచి కురంగలోచనా! ౨౫౮

—♦ సీత దుఃఖాతురయై రావణు దురాగతమును నిందించుట. ♦—

ఆ॥ ఏల సిగ్గుపడవొ ♦ యింతలు సేసి నీ, చాత్మ! యన్యభామ ♦ యనక దన్నుఁ
దెచ్చి తేమితలఁచి ♦ దేబ! నీ విద్దాన, ననుభవించు సౌఖ్య ♦ మనుచుఁ గలదె.

క॥ పతి యింటలేనితఱి న, న్నతిసాహసవృత్తి మొఱఁగి ♦ యవశత నుండన్
గతిసెడఁ గొంపోయె దస, న్మతి! యాయతిపైని యాస ♦ మాని మెలఁగెదే.

తే॥ ఇట్టి కష్టాత్ముఁడవు నీవె ♦ యినకులీను
నేమి బూమెలు పన్ని యి ♦ ల్లెడలఁజేయ
నెంచితో కాక యాచాయ ♦ యేణ మొకఁడు
విభుని దిప్పంగఁ గలదె యీ ♦ విశ్వమునను. ౨౬౧

క॥ సీతారూప మే మాయెనొ, యే పుడిగిరె యిట్టిమాయ ♦ లే కొనసైత్రో
హ పుడఁడ నీపుట్టున విధి, పాపేతర మాత్రకులముఁ ♦ శాడోనరించెన్, ౨౬౭

ఆ॥ క్రూర ! నిన్నుఁ దోడరి ♦ కూలెఁ గాక జటాయు, వింతలోన వారి ♦ కెఱుక పఱుప
నెంచువాఁడె లైన ♦ నింతింత ముక్కలు, గాఁగ నిన్ను మాటఁ ♦ గలియ నిడరె.

ఆ॥ సేటతెల్ల మయ్యెఁ ♦ దెలివి యుప్పీరుల, మొఱఁగి ననుఁ పెరల్చు ♦ మోసమున నె
యింక నిన్ను మెత్తు ♦ రెవ్వారు మున్నుఁ బూ, లమ్మి తిపుడు గట్టి ♦ లమ్మఁగలవు.

ఆ॥ ఒంటి నడవి నుండి ♦ యునుజవసత్త్వాల, నొక్క గడియలోనె ♦ యుక్కడంచె
నట్టి దొరకు దొంగ ♦ నైతి నీకిటికిఁ, బారుపేయు మేల ♦ బ్రిదుక దేల.

క॥ ధన్యులు వారలె పో విభు, జన్యంబున నెదిరి నిలిచి ♦ జానగు ధృతి య
న్యాన్య మనిసించి మడిసిరి, మాన్యపదవి నడసి రిట్టి ♦ మలకలఁ బడిరే, ౨౬౮

క॥ చలియింప నేల మగఁటిమి, గలదేని న్నిలుము కీర్తిఁ ♦ గనె పెదిరి మహా
జ్వాలు రాము శరదవాగ్నిఁ, బులుంగనై యెల్లవారుఁ ♦ బొగడఁగ నసురా !

క॥ కాకున్న నన్నుఁ బనిచి సు, ఖాకర మగు బ్రిదుకు గోరి ♦ యరుగు మొకంటన్
బో కన్యముఁ దలఁచిన ని, ష్క్రాకుకులుఁడు వెదకి నిన్ను ♦ సమయించు నెటున్.

ఉ॥ మంచి దలంపఁ జేచెడుఁగు ♦ మంతనము న్విడఁజూడఁ జేయెదన్
గాంచనవృక్షము ల్లసు న ♦ కారణనైరమ పూనఁ బథ్య మి
ట్లుం చన గేలిసేయు నడి ♦ యాసలకుం దలయొడ్డు నెట్లనన్
సంచితకర్మదోషమునఁ ♦ జావఁగఁబోవు జనుండు దుర్మతీ ! ౨౬౯

సీ॥ కాలపాశము గట్టెఁ ♦ గంఠనాళంబుల యమమార్గగతు లెల్ల ♦ నరయగలవు
వైతరణిం బడి ♦ వాపోయె దింకిట, వజ్రకీటములు దొ ♦ ల్వాం బడ లెదు
లీఘాయసము శాల్మ ♦ లీవృక్ష మం డెద, వసిపత్రివనముపై ♦ నాడజొత్తు
వింధనాగ్నిని వేల్తు ♦ రినసూను దూతలు, సంతాపపడె దుక్క ♦ స్తంభమునను
నమ్మహాత్మున కీదృశం ♦ బగు నలీక, మాచరించి విసముఁ గోరిల ♦ నైతి వెవఁడు
నిన్నుఁ బ్రోచెడువాఁ డేది ♦ నెఱి దలంగఁ, దలఁతె తద్బాణకీలిక ♦ లదివిలి కాల్ప. ౨౭౦

క॥ కులనాశనుండు వీఁ డని, పలువురుఁ దిట్టంగఁ దనదు ♦ పడఁతుక లార్వన్
గలకలిమి యెల్ల మంటం, గలియఁగఁ గుచ్చితపుఁ బోకఁ ♦ గాంచెద వసురా!

ఆ॥ అని భృశార్త యగుచు ♦ నాడెడు నద్దేవి, నుడుల లెక్కగొనక ♦ నొవ్వ కతఁడు
తఱిమి నడుపఁ దొడ రెఁ ♦ దద్విమానము మానఁ, బోఁడు కాలహాతుఁ డ ♦ పుణ్యగతిని.

—♦ సీత ఋశ్యమూకమున నున్న వానరులఁగని తనసొమ్ముల మూట వైచుట ♦—

ఉ॥ అమ్మొయిఁ బోవుచో నెదుట ♦ నామె గనుంగొనె శైలశృంగమం
దిమ్ముగ నున్న వానరుల నేవుర ♦ నేమి దలంచెనో క్కొ చే
లమ్మున కొంగున న్మణిక ♦ లాపముల న్బిగియంగఁ గట్టి నె
య్యమ్మెలయంగ వైచె నతఁ ♦ డారయ నేరఁడు సంభ్రమంబునన్. ౨౨౩

క॥ అనిమేషనేత్రులై వా, గనిమిషపతివంద్యుఁ గాంచి ♦ యసుర వియోగఁను పా
వనచరితం గొని చనియెడు, ననుకొని రపగతునిఁ జెనయ ♦ రైరి సుశీలా! ౨౨౪

ఆ॥ నడుమ పడిన మేలి ♦ నాణియమ్మల మూట, యెత్తి యునిచి రెచటి ♦ హితునకొ వాఁగు
వాఁడు పంప దాటి ♦ వనసరోవరసరి. ద్వర్గములును గడచి ♦ వసధఁ జేరి. ౨౨౫

క॥ తిమినక్రాహివికీర్ణము, సమయోల్లంఘనపరమ్ము ♦ సాగరమును సం
భ్రమమున నెన్న కసుర యు, త్క్రముఁడై యవ్వలనిగట్టు ♦ గవిసెఁ బ్రియసఖీ!

తే॥ సిద్ధచారణు లవ్వాని ♦ చే కలఁగి, యిదియె యంతంబు వీని కి ♦ య్యుదధిగను మిత్తి
యనుచు నోడువంగ సడికోర్చి ♦ యవలఁ జొచ్చె, లంకనిశ్శంకుఁడగు నుసే ♦ నాంగవదన.

—♦ రావణుఁడు లంకకేగి సీతకుఁ గాపు వెట్టి యందఱ గట్టడి సేయుట. ♦—

క॥ బహువీధులు బహుపథములు, బహుకక్షులఁ గడచి చైత్య ♦ పరిష్కృతంబగు శుభా
వహ మంతిపురిని మహిజా, మహిలామణి డించె వేడ్క ♦ మల్లడిఁగొనఁగన్.

ఆ॥ మయుఁడు నేర్పుకొలఁది ♦ మగువ మాయామయి, నొకతె సృష్టి సేసి ♦ యుల్లసిల్లు
పగిది సంతసిల్లెఁ ♦ బరిపరివిధముల, వాఁడు సీతఁ జేర్చి ♦ వనరుహాక్షి! ౨౨౯

క॥ అమ్మొయిఁ బ్రతివేశనమున, నమ్మానిని నునిచి ఘోర ♦ లగు రాకాసుల్
గ్రిమ్మఁగ వారలఁ గనుఁగొని, యమ్మనుజాశనుఁడు పలికె ♦ ననవద్యాంగీ! ౨౩౦

ఉ॥ ఇష్టము లేని యేనెలఁత ♦ యేనియుఁ బూరుషుఁ జేనియు న్మహా
త్కృష్టచరిత్ర నీమెఁ గనఁ ♦ గేరడము ల్పచరింపఁ బోల దే
కష్టముఁ గూర్పరాదు మణి ♦ కాంచనమౌక్తికవస్త్రమాల్యభో
జ్యేష్టుల నెందు నేకొఱఁత ♦ లెమ్మొయి నేనిఁ బొసంగ దేర్పడన్. ౨౩౧

క॥ ఈయమ కప్రియ యగు కృతి, నేయధముల యేనిఁ గూర్తు ♦ రెంచికొనుఁడు వా
రా యమనికేతనంబున, నాయతయాతనలఁ గాంచ ♦ నయ్యెద మనుచున్.

తే॥ అనుచుఁ గట్టడి సేసి వాఁ ♦ డచటు వాసి, దిట్ట లగు వారి నెనమండ్ర ♦ దివిజవైరి
వీరులం గాంచి మీరలి ♦ వ్వీధిఁ దలంచి, యాజనస్థానమున వంక ♦ కరుగుఁడింక.

ఉ॥ చెట్టయొకండు మానవుఁడు ♦ సేరెను దండకవన్యసీమ వాఁ
డట్టె తెరల్చె యోధవరు ♦ లందఱు నాఖరముఖ్యుల న్భగం
బట్టితి నాతనిం జెఱుపఁ ♦ బన్నిద మొప్పఁగఁ గాన నేగి యా
మట్టున నిల్చి యెల్లెడల ♦ మా కెనయింపుఁడు తత్ప్రవర్తనల్. ౨౮౪

శా॥ రామాఖ్యుం డతఁ డాశరారి యయి నేఁ♦రంబు ల్పొనర్పంగఁ ద
ద్భామారత్నముఁ దెచ్చితిన్ గడఁగి మీ ♦ రారాపు వాటిల్ల న
ట్లే మార్గంబునఁ దా మెలంగఁ గనునో ♦ యేమైన నేచాయ నే
బూనె ల్వన్నియ యేనివాని నొకటం ♦ బోకార్ప భావింపుఁడా! ౨౮౫

ఆ॥ అతని దెస నమర్ష ♦ మగ్గలం బయ్యెది, ధైర్యకోటి కెక్కి ♦ తరము మీఱె
నాఁడె నింతలోనె ♦ యువయువరోధంబు, తన్నిరోధ మింకఁ ♦ దలఁపవలయు.

తే॥ అరిపు నలంచి సంతోష♦మందువాఁడఁ, బేద నిధిఁ గాంచి సంతృప్తిఁ♦బెరసినట్టు
లంతవట్టు రుచింప వా♦హార మేని, నిదుర యేనియు నింతయు♦నిజము సుండు. ౨౮౭

ఆ॥ అలఁతిఁ బోవవలవ ♦ దస్త్రశస్త్రాదులే, మఱక మఱపు లేక ♦ మాఱు రూపు
లొప్ప నెందునేని ♦ నొప్పమి వాటిల్ల, కుండఁ జేరి మెలఁగుఁ ♦ డొరిమ నెఱయ.

క॥ ఏ నెఱుఁగుదు మీబలముల, నానెలవున కట్లుగాన ♦ ననుపఁ దొడరితిన్
బూనిక మైఁ బోలదిండుల, నే నేలినయట్టు లేలు ♦ నెఱి గనుఁ డింకన్. ౨౮౯

—♦ రావణాజ్ఞపులై యెనమండ్రు రక్కసులు జనస్థానమున కరుగుట. ♦—

మ॥ అనుచు న్వారి బహూకరించి సకలా ♦ ర్థాఘంబులుం గూర్చి పొం
డన నవ్వానికి మ్రొక్కి వీడ్కొని స్వకీ ♦ యం బౌ పరీవారముం
జనుదేరం జని రంజనాకృతులఁ బ్రి ♦ చ్ఛన్నాత్ములై నిల్చి ర
మ్మనికిన్ రామవిభుప్రితారణ మసా ♦ మాన్యంబుఁ జింతింపుచున్. ౨౯౦

ఆ॥ ఇట్లు సేసి యసుర ♦ యేఁ గృతార్థుఁడ నైతి, ననుచు నంతిపురికి ♦ నరిగి సత్వ
రమునఁ గాంచె రాము ♦ రాణివాసము దేవ, యుజనభూత నచట ♦ నమరవినుత!

—♦ రావణుఁడు సీత ననునయింపఁబోవుట. ♦—

సీ॥ సుడిగాలి వల్లడ ♦ ల్బుట్టిన మున్నీట, మునుఁగఁ బాటెడు నౌక ♦ ననుకరించి
తనయూథముం బాసి ♦ తఱిమి కుక్కలు ముట్ట, డింప వడంకు లేఁ♦డిని నయించి
యిభ మెత్తి యొక్కచో♦నిడిన మవ్వము వీడఁ, గలఁగు సరోజిని♦గతిని గాంచి
శశి పొ త్తెడలి బలు ♦ శాపోపహతి నేల, నెనయు నొ తారక ♦ ననుగమించి
శోకభారావనమ్రయై ♦ సోగకనుల, నుండి వెలువడి యశ్రువు ♦ ల్మెండుకొనఁగ
నొండు దిక్కనరామికి♦నొదిఁగి యున్న, యా వెలఁదిమిన్నఁ గదిసి ర♦క్షోవిభుండు.

క॥ తత్తరపాటున నిట్లనె, బిత్తరి చూపు లొకకొన్ని ♦ బెరయింపుము నా
హృత్తాప మెడల నీడగు, పొత్తెనయం గాంచి భూరి ♦ పుణ్యుఁడ నాదున్.

తే॥ ఎలయ కిమ్మెయిఁ జింతిల్ల ♦ నేల బాల, యెల్ల లోకంబు లొక్కటఁ ♦ నేలఁజాలు
సిరికి ననుఁ గొనికాక యా♦పురుషకార, హీనుఁ జేకొని యే మేల్మి♦నెసయఁగలవు.

మ॥ ఇవె దాసీశతము ల్సహస్రములు పా ♦ ర్జ్యేష్ఠోపభోగశ్రమో
పవనంబు ల్మణిహర్మ్యము ల్భవనము ♦ ల్ప్రాసాదము ల్స్వర్గలా
భవిధానానుపలభ్యమానములు ని ♦ ర్భాగ్యుండు రాముండు నీ
కవిధేయుం డతఁ డిన్ని గూర్పగలఁడే ♦ యాప్రొద్దు సేవించినన్. ౨౯౭

క॥ దీనుఁడు రాజ్యభ్రష్టుఁడు, మానుషుఁ డల్పాయు వనభి ♦ మానధనుఁ డతే
జోనిహితుండు తపసి ని, న్నే నెఱిఁ బొదలింప నార ♦ హిం గనఁ గాంచున్.

ఆ॥ ఎఱిఁగి యెఱిఁగి యేల ♦ యేణాక్షి! యాతని, వలని చింతఁ బెరయ ♦ నాసవారు
లెల్లఁ గొలుచు వార ♦ లీవు నాచెంగట, నున్నఁ జేతిచూడ ♦ నొకఁడు గలఁడు.

ఉ॥ ముప్పదిరెండు కోటులకు ♦ ము ప్పెటు లే దననైన సైనికుల్
దప్పక రాజకార్యములఁ ♦ దార్కొని యుండెద రండఁబాయకే
యెప్పుడుఁ గొల్చు వార లిదె ♦ యేకసహస్రమితు ల్సయోషు లీ
తిప్పఁ గనుంగొనంగఁ బోలఁ ♦ తీ! లయకాలున కేని శక్యమే ౨౯౮

తే॥ నను జయించెడు నాతఁ డీ ♦ నాల్గుచెఱఁగు
లైన నేలన కాదు ము ♦ య్యాఱు ద్వీప
ములను బదునాలు గగు జగ ♦ మ్ములను లేఁడు
వీసమునకును గా వడి ♦ యాస లెవియు. ౨౯౯

ఆ॥ లాతు లెవ్వ రేని ♦ లంక ధర్షింపంగ, దన్ను గెలువఁ బొడమి ♦ యున్నవార
లోన లే రటంచు ♦ లోకము ల్నిర్జించు, నాఁడె భేరికాని ♦ నాద మొదవె.

తే॥ నెలఁత! మద్బాహుపరిగుప్త ♦ నిన్నుఁ గొనునె
యొండు వాయువు గుదియింప ♦ నోపునే మ
హాగ్నిశిఖ నొడి నిడికొన ♦ నలవరించు
పనికిఁ జొచ్చునె యెంత ని ♦ ర్భాగ్యుఁడైన. ౩౦౧

మ॥ వనవాసంబున క్లేశము ల్పొసఁగె నా ♦ వంత ల్దురంతంబులే
చనియె న్నేఁటికి సౌఖ్య మబ్బు నెఱి కీ ♦ చందంబున న్మట్టి పా
ర్త్తనపుణ్యంబు ఫలించె నిఁకఁ గొఱఁత ♦ ల్గాక్షింపఁ నేలా వికా
స్వనవోల్లాసినివై సుఖింపుము కలా ♦ సంధానధారేయతన్. ౩౦౨

ఆ॥ సర్వసారభూత ♦ సంసారి కీలంక, యెల్లయోగ్యపదము ♦ లిందె వెలయు
ననుభవింపు మిచ్చ ♦ నంబరభూషణ, మాల్యభోజ్యవితతి ♦ మమత నెఱయ.

క॥ రసికుఁ డగు నాని చెలిమిం, బొసఁగెడు సౌఖ్యంబు కొంటఁ ♦ బొనరుపడునె నీ
పసితనము వీడ దేమని, పసగల జవ్వనము దండఁ ♦ బాయక యుండన్. ౩౦౪

ఆ॥ అనుచుఁ బొలసుదిండి ♦ యన్ను లాయమఁ గాని
తేర నొక్క వలను ♦ ద్రిక్కుకుండఁ
గలుగు కలుము లెల్ల ♦ గాన్పించి వివరించి
యెలమి మీఱ మఱియు ♦ నిట్టు లనియె. ౩౦౫

క॥ తగనే నే నినుఁ గొలువఁగ, వగ వీడ విదేమి వికచ ♦ వనజనిభం బీ
మొగము నొగిలింపనగునే, తగ వొండెడ నొంటనైనఁ ♦ దలఁపఁగవలదే. ౩౦౬

తే॥ దేవతలనేని వేడఁగా ♦ బోవఁ డీశుఁ, డెన్నఁడు నమస్య లొడ్లకుఁ ♦ బన్నవాఁడు
గాడు నీసేవ కైకోలు ♦ గాంక్ష సేసె, నేలఁ గాఁ బోలదే యింత ♦ కింత యెరవె.

క॥ పాదములకు మ్రొక్కెదు న, మ్మోదం బొదవింతుఁ దలఁప ♦ మోసం బొకటన్
వేద మనుకొనుము నాపలు, కో దైవతమణి! వికాస ♦ మొంద విఁకేలా. ౩౦౮

తే॥ సందియం బేల దేవని ♦ ష్యంద మార్ష
సంభవం బగు తత్త్వ మో♦చామ యిదియు
ధర్మలోపకృతం బగు ♦ కర్మ మనఁగ
బోల దింతయు నీదగు ♦ బుద్ధిఁ గనుము. ౩౦౯

ఆ॥ అనుచు నాస గొలుపు ♦ నాయమ సద్వృత్తి
చిత్త దార్ఢ్య మెడఁదఁ ♦ జింతసేయుఁ
గాని యొంటిఁ జిక్కెఁ ♦ గల్యాణి యెటఁ బోవఁ
గల దటంచు మఱియుఁ ♦ గాంక్ష సేయు. ౩౧౦

—♦ సీత రావణు ననాదరించి గడ్డి యడ్డము సేసి పలుకుట. ♦—

తే॥ అమ్మొయిఁ బ్రలోభనమ్ముల ♦ నఱుముటయును
నామె దురపిల్లి స్వీయచే♦లాంచలమున
వదనశశిఁ గప్పి కన్నీరు ♦ వఱద పెల్లు
గాఁగఁ గళవళపడి మదిఁ ♦ గాంతు నునిచి. ౩౧౧

క॥ తృణ మొంటి నడ్డుగా నిడి, గుణమంజరి తేఁటి నులివు ♦ గొనకొన రక్షో
గణవిభుఁడు వినఁగఁ బలికె న, నణీయ మా ప్రాభవం బ ♦ నాదృతి నూపన్.

ఉ॥ వింటివొ భానువంశమణి ♦ విశ్రుతుఁ బంక్తిరథాఖ్యుఁ దత్సుతుం
బంటవలంతి భాగ్యముఁ బ్ర ♦ భావవికాసము రామదేవునిన్
గంటివొ లేదొ తత్సతినిఁ ♦ గాఁ గనుమీ నను నోరి నిన్ను నీ
తుంటరిమూఁక నీయెడనె ♦ తోఁచి హరించును నేఁటరేపటన్. ౩౧౩

ఉ॥ ఒంటిగ రాఁడు తమ్ముఁడును ♦ నోపినవాఁడు మొఱంగునాఁడు తా
రింటనె యున్న నిన్నెదిరి ♦ యింతకు మున్నె ఖరాదుల న్గనన్
గెంటఁ గడంగువార యప ♦ కీర్తియ కాకెది యంతమాత్ర నీ
కంటినభాగ్య మాకొలఁది ♦ కాతనలోపల నుబ్బియాడుటల్. ౩౧౪

చ॥ కల రొకకొంద ఱెందు ఘన ♦ కాయు లపాయవిధాయు లాశరు
ల్బలయుతు లంచుఁ బొంగెదవు ♦ పన్నగముల్ ఖగనాథు చక్కటిన్
బొలిసెడుభంగి కయ్యెదరు ♦ వో రఘునాథు నెదిర్చి నీవు నా
బలఁగములోన నే ననెడు ♦ వాఁ డని లేఁ డనుచు స్మరింపఁగన్. ౩౧౫

ఆ॥ ప్రబలరామబాణ ♦ పంక్తులు గాంగభం, గముల గములు తటము ♦ గమిని నీదు
తనువు నారసికొని వి♦దారించు నపుడు త, త్పౌరుషకార మీవె♦ఱుఁగఁగలవు.

కం॥ మును గెలిచితి లోకము లె, ల్లను వరబలు నన్నుఁ బోలు ♦ లావరి లేఁ డం
డును ననెడు మద మడంగును, దనంతటనె రవికులీనుఁ ♦ దారొక్కొను సంగరన్.

తే॥ బ్రదికిపోలేవు యూపని ♦ బద్ధమైన
పశువుపోలిక నీ వరి ♦ భావమునను
రాము నెదిరింపఁ గాంచి ని ♦ రాకరించి
యుభయ మిది విధివిహితమ్మై ♦ యుండ నసుర! ౩౧౬

కం॥ ఇప్పుడె దగ్ధుఁడ వయ్యెద, వప్పురుషుఁడు రోషకలన ♦ నరయున [illegible]నిన్
దప్పదు నాపలు కెన్నఁడొ, యెప్పాటనొ కాంచువాఁడ ♦ వే పరిభవముల్

ఆ॥ చంద్రు నుడుగణముల ♦ జలజల రాలఁగా, నేయు నొకట నుదధు ♦ లింకఁ [illegible]యుఁ
గాని వీడఁబోఁడు♦క్ష్మాజాత నిను మంట, నెఱపు దయితుఁ [illegible]♦నియమముఁ [illegible].

కం॥ తాఁకున చండాలుఁడు శు, ద్ధాకృతి ద్విజమంత్రపూత ♦ యగు సవవేదిన్
బ్రాకరణికార్ధశోభిత, నీ కెమ్మెయి నను స్పృశించు ♦ నెఱియుం గలదే. ౩౨౧

ఆ॥ రాజహంసయుక్తి ♦ రహి మీఱ నిచ్చలుఁ
బద్మమండవిహృతిఁ ♦ బరగుచుండు
హంసి పొదలు దూర ♦ నగు మద్గుకము మోము
గాంచునే వికార ♦ గతియుఁ గనునె. ౩౨౨

సీ॥ ఈరేడు జగముల ♦ నేలఁగాఁ జాలుఁబోఁ, నాభర్త దైవస ♦ నాథుఁ డతఁడ
యెంతలు గాకున్న ♦ నెక్కటి దండకా, రణ్యవిహారాను ♦ రక్తిఁ గనునె
కాలవశంబునఁ ♦ గన్ను మిన్నును గాన, కున్నాఁడ వియ్యది ♦ యురక చనునె
నీవు నీవారు నీ ♦ సేవకు లంతఃపు, రంబు వర్గంబును ♦ రాణ సెడఁగఁ
గోరి తెచ్చుకొంటి ♦ కొనప్రాయమున మిగ్రింగ
రాని కడియ యెదిరి ♦ ప్రాణములు హ
రించు నేమి గల ద ♦ రిందముఁ డమ్మాగ
వానితోడి పగ య ♦ వార్య మగుచు. 3౨3

ఆ॥ వఱలఁ బోదు లంక ♦ వైధవ్యసంయుక్త, యై శుభాంక మెడల ♦ నగుచు నింక
నాయు వెలమి సిరియు ♦ నైంద్రియకార్థ స, త్త్వములు సెడఁగ నీవు ♦ దరలు వంక.

క॥ ఆధార్మికు పత్నిని దై, త్యాధమ తదనువ్రత న్న ♦ యం బేద నను న్
బాధింపం దలకొంటిపు, గాధంబగు నీదు నార ♦ కం బెట్లింక న్. 3౨౫

క॥ ఈరోషవహ్నిచే నిను, నీ రొనరింపంగ నిపుడె ♦ నేఁ జాలుదు కా
నీరా తపఃక్షతిక్రియ, కోరువ దెద యావిధిచ్ఛ ♦ యెుం డై యుంట న్. 3౨౬

ఆ॥ నీచ! నీతలంపు ♦ నేఁ గాన నిమ్మేను, గోసి యిడుము తినుము ♦ కొర్తిశిక్షు
పాలుసేయు మేమి ♦ బ్రిదు కపకీర్తిశంబు, గన్నపిదప మొనయఁ ♦ గలిగి యున్న.

క॥ అని తూలనాడు నమ్మా, నిని పరుషాక్షరము లాత్మ ♦ నిష్ఠయుఁ గని య
ద్దనుజాధిపుఁ డేమిఁటఁ బెర, యని మతమున మునిఁగి యొంట ♦ నాఅని యలుక న్.

—♦ రావణుఁడు సీతకు నొకయేడు గడువిచ్చి చనుట. ♦—

ఉ॥ ఆయమఁ గాంచి యిట్టు లనె ♦ నంతకు నింతటఁ దెల్లవాటెనే
హేయవచోగతి న్నలుమ ♦ నెంచెదు రావణు నెంద తొంద టి
ట్లాయతరోషభాషణల ♦ నాడరు మున్నడి కన్ను సన్నల న్
బాయని కూర్మిమై మెలఁగఁ ♦ బ్రార్థన సేయఁ గడంగ రాదట న్. 3౨౯

క॥ ధృష్టవ యెమ్మెయినేనియుఁ, గష్టము లుడిపికొన నేర్చి ♦ కానవు కాన న్
భ్రష్ట వయి పడినపాట్ల క, నిష్టమె యిష్టోపభోగ ♦ హేతుస్థితియు న్. 330

తే॥ నిన్ను వదలితిఁ బండ్రెండు ♦ నెలలదనుక
యేమి దలఁచెదో నీభర్త ♦ యెంత గలఁడో
కాంచి యాలోన నను మెచ్చఁ ♦ గానకున్న
వంటవారలె తెగఁ గోసి ♦ వండఁగలరు, 33౧

మ॥ అని రాకాసుల ఘోరదర్శనల వాఁ ♦ డాలోనె వీక్షించి పా
దనిఘాతంబున నట్టహాసమున భూ ♦ తాశ్రిసంబు సంధిల్ల ని
య్యనివిష్టం గొనిపొందు సాధ్వసము నె ♦ య్యంబుం బ్రివ_ర్తింపఁ జే
సి నికామాలస గాఁగ మద్వశగతిం ♦ జెందింపుఁ డిచ్ఛాగతిన్. 33౭

క॥ దర్ప ముడిగించి దీనిం, దర్పకునకు నటు విధేయ ♦ తం బడయఁగ మీా
నేర్పు వెలయించి కొని తెం, డర్పణ మొనరించినాఁడ ♦ నన్నివిధములన్. 33౮

ఆ॥ అనిన యంత వార ♦ లద్దేవిఁ జుట్టుకొ, నంగ నిర్వ్యరాంగ ♦ నం గడంగి
మన యశోకవనిక ♦ మధ్యమస్థలి ని గూ, ఢముగ నునిచి రక్ష♦ణమునఁ దవిలి.

క॥ వన్యగజవధువు నట్టుల, నన్యాస్థం జేసి వశము ♦ నందింపుఁడు స
న్మాన్యత వెలయఁగ సీభూ, కన్యక మీాపాల్గి మనుచుఁ ♦ గట్టడి సేసెన్. 33౯

—♦ రావణాజ్ఞచే రాక్షసాంగనలు సీత నశోకవనిం జేర్చుట. ♦—

క॥ అంత రఘురాము కాంతం, జంతలు గొనిచని రశోక ♦ సత్కాంతారా
భ్యంతరపదమున కాయమ, వంతలపా ల్సేసి మలఁచు ♦ వల నగఁడు గన్. 34౦

ఆ॥ ఇంత సేసి యసుర ♦ యిచ్ఛమైఁ జరియింపఁ
జెలఁగి మెలఁగి యామె ♦ యిచ్ఛకంబె
కోరు భావ మరయు ♦ తీ రెంచు సత్కృతుల్
నివ్వటిల్లఁ జేయు ♦ నిచ్ఛ లగజ! 34౧

క॥ ధన్యుఁడకా కాతం డాక, సన్యాసిమె మాతృబుద్ధి ♦ సౌజన్య మసా
మాన్యముగ నిరూపించెదు, మాన్యత నెలకొలుపుచుంటె♦మహిళామణిరో.

—♦ సీత వర్తననియమములు. ♦—

సీ॥ ఎల్లకాలమ్మునఁ ద ♦ దేకాకృతిఁ బ్రిసూన, ఫలముల నొసఁగు సం♦ప_త్తి దనరఁ
దనరంజనమున నం ♦ దనరహోపావన మకిం, చిత్కరం బనెడు వా♦క్సిద్ధి వెలయ
వెల యర్థపతి కేని ♦ వలనే యిడఁగ నంచు, ద్విజపాలి సంతృప్తి♦దేలి యాడఁ
దేలి యాడఁగఁ బద్మ♦పాలీసమాలీఢ, రసపూర్ణసరసికల్ ♦ రాణ నమర

నమర వైమానికులు పొంచి ♦ యరయ మలయు
మలయపవనార్భకుని లాల ♦ నలు వొసంగ
సంగరహితులకును స్మర ♦ సంగరముల
రములలితవృత్తి సూపునా ♦ రామమునను 34౨

క|| ఉండె మహీజ రాకాసుల, దుండగములఁ బలుకుఁబడుల ♦ దోసఁగుల ద్వైతం
బండఁగొన స్వమతి రామా, ఖండాద్వైతప్రసక్తి ♦ కలనఁ జెలంగన్. ౩౮౦

ఆ|| పలుకు రాముఁ బలుకు ♦ భావంబు మున్నె త
న్మయము కృతికి వేఱె♦నయము కలదె
యొండు వృత్తి యనుచు ♦ నుండ దాయమ దెసఁ
బ్రాణములును రాము ♦ పాలి వగుట. ౩౮౧

ఉ|| ధీరతఁ బాయ దింతకు న ♦ ధీరవిలోచన దేహపోషణో
దారత నొల్లదే విధి న ♦ ధర్మ్యయనీయత కోర్చి కొల్చినన్
నేరమె మోపి పోఁదలఁతు ♦ నిద్దుర నన్నము నన్న సున్న యే
తీరునఁ దీర్చునో వ్రతము ♦ తీర్పొకయించుక దోప చేరికిన్. ౩౮౨

ఆ|| ఇంద్రజాల మొక్కఁ ♦ డేణాక్షి జలముల, నిత్యకృత్యవిధులు ♦ నెఱపుచుండ
నమృతసార మందు ♦ నమరింపనై యుంట, యదియుఁ గన్నతల్లి♦యవని మెఱుఁగు

ఉ|| కట్టిన కట్టు కట్టుఁ బరి ♦ కర్మవిహీనత శోకదైన్యమున్
ది ట్టలతిల్లు నెమ్మనము ♦ దీర్ణ మొనర్పఁ గృశాంగి సీత య
మ్మట్టున నట్టులుండె ధృతి ♦ మాటకు రాముఁడె కర్తగాఁగఁ దా
నెట్టనఁ దన్మయాత్మకృతి ♦ నీతివశంవదమై నగాత్మజా! ౩౮౪

క|| అన్నిఁటను రామనామమె, సన్నతగాత్రి! లగింపఁ ♦ జాలునులే య
భ్యున్నతి నెలకొల్పఁగ శ్రీ, సన్నాహముతోడి సుప్ర♦సన్నతఁ గూర్పన్. ౩౮౫

ఆ|| అనుచు విభుఁడు నోడువ ♦ నద్దేవి యద్దెస
కరిగి తమ్ముఁ డెట్టు ♦ లనియె నన్న
యెద్ది వినియెఁ గడఁగి ♦ యే వెంట మెలఁగి ర
వ్విధము దెలుపు మనుచు ♦ వేఁడుటయును. ౩౮౬

ఉ|| యోగవియోగసంయుగధి ♦ యోగనియోగవిలక్షణాత్మ యో
గాగమలక్ష్యభావపద ♦ హారివిహారి విదారితారి వ
ర్గా గతిభేదవర్జితమ ♦ హాపథగమ్యసుసౌహృదాంచితో
ద్యోగనిరూఢ నిత్యవిభు ♦ తోజ్జ్వలసద్గుణయోగపుష్కలా! ౩౮౭

క|| సారసనంభవముఖ్య, శ్రీరమణీయమతియోగ ♦ చింతితవిభవా
సారాసారవిచారవి, దూరా భజమానలోక ♦ దోషక్షపణా! ౩౮౮

స్రగ్వి॥ నిత్యయోగాంచితో ♦ న్నిద్రిలక్ష్మీశకలా
ప్రత్యయోపాత్తసం ♦ పద్విపద్భావనా
యత్యవక్రప్రకా ♦ రాధిగమ్య ప్రథా
సత్యచిత్సౌఖ్యసం ♦ సత్తిలక్ష్మ్యాత్మకా! ౩౮౯

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథామృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబునం దృతీయాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



# శ్రీరామకథామృతము

## అరణ్యకాండము.

---

### చతుర్థాశ్వాసము.

---



శ్రీలలితాకార విశే
షాలంబనచణజగత్త్రి ♦ యౌవనదీక్షా
లీలాగృహీతసంప
ల్లాలితభోగోపపదక ♦ లాచతురతరా! ౧

తే॥ అవధరింపుము చంద్రిక ♦ లావతంసుఁ
డిట్టులను గౌరితో దేవి! ♦ యింతలంత
లనుచు రాముఁడు త్వరమాణుఁ ♦ డై సుదూర
పథము నెట్టనఁ గడచుచుఁ ♦ బడయునపుడు. ౨

ఆ॥ మాయదారి కడకు ♦ మారీచుఁ డమ్మెయి, నాడినట్టి నుడికి ♦ నోడి సీత
తన్నుఁ బఱిచి యనుచు♦తద్వ్యథం బెడఁ దల, పోసికొనుచు శీర్ణ♦బుద్ధి యగుచు. ౩

మ॥ పరిధిచ్ఛన్నరుచి న్శశి న్గ్రహావృతిప్ర ♦ చ్ఛాదితచ్ఛాయు భా
స్కరుఁ బోల్పందగి యుంచు నెమ్మొగ మథ♦స్తాత్పశ్యమై దర్శనీ
యరమానిస్వముగాఁ బరాభవవిధం ♦ బాక్రోశముం దద్విప
త్పరిశంకాకలనంబు నొక్కట మది న్బాధింప ♦ సవ్యాధియై. ౪

—♦ శ్రీరాముఁడు లక్ష్మణుని రాక నూహించుట ♦—

తే॥ దీనుఁడై వచ్చు సౌమిత్రి ♦ తీరుగాంచి
రామచంద్రుండు త్రైలోక్య ♦ రక్షకుండు
మాన్యుఁ డీతండు మత్కృతి ♦ మలకఁ గనఁడు
గాన నిట్లొందుచున్నాఁడు ♦ కలఁకపాటు. ౫

క॥ ఏ నప్రాకృతతత్త్వం, బౌనటె నిడి ప్రాకృతత్వ ♦ మవలంబింపన్
గాని ప్రాసఁగ దిక్కర్జము, గాన వికారిత వహింపఁ ♦ గా నగు నింకన్. ౬

ఉ॥ ఊరక నిస్పృహత్వమున ♦ నున్న దురాత్ములు తోడిరక్కసుల్
రా రతఁ డాదరింపఁడు భ ♦ రం బగు శోకమున న్ధరాసుతన్
జేరువఁ గాంచి కాంచి యటుఁ ♦ జేరిన నట్టన దేవకార్యమున్
దీరు ప్రాసంగఁ గూర్పనగు ♦ తీర్పు ఘటిల్లును దత్ప్రసక్తిచేన్. ౭

ఆ॥ దుష్టరాక్షసాలి ♦ దూలించి యగ్నిస్థ, మైన సీతఁ గూడి ♦ యచటుపిడి
సిరి దలిర్పఁ బురికిఁ ♦ జేరి పాలింప ని, లింపు లాదరించు ♦ లీల లమరు. ౮

క॥ లీలామానుషచరితము, లాలోకించి విని హృదయ ♦ మం దిడి భక్తిన్
గీలించి ధన్యు లౌదురు, బాలిశులై చెడక జనులు ♦ బాగగు ననుచున్. ౯

—♦ రామచంద్రుఁడు లక్ష్మణుని సీతను గూర్చి ప్రశ్నించుట ♦—

క॥ ఆలోచించి దయామయుఁ, డాలక్ష్మణుఁ గాంచి యేమి ♦ యారసి వి
ట్లాలంబించితి సాహస, మాలోలేక్షణ వనాళి ♦ కర్పించితివే. ౧౦

చ॥ అడవికి వచ్చునాఁడు విడ ♦ నాడఁగ లేక టు లాడినట్టి యా
నుడికిని సంతసిల్లి కొని ♦ నూతనలక్ష్మి విలాసమూర్తి న
ప్పుడఁతుక నింతవట్టు గని ♦ పాలన సేయఁగఁ జాలి నేర కి
ప్పుడు నిను నమ్మి యిక్కతనఁ ♦ బోకడ వెట్టఁగ నాయె లక్ష్మణా? ౧౧

క॥ ఆదుఃఖసహాయాత్మిక, యేదిర వై దేహి యెంత ♦ యిడుమలు పడినన్
గా దని రాజ్యము బంధుహి, తాదుల విడనాడ నైన ♦ నఘ మెనసితినే. ౧౨

ఉ॥ ఎయ్యది లేక దేవపద ♦ మేని మహోన్నత మంచుఁ నెంచ నే
నియ్యల నేకలక్ష్యముగ ♦ నేలఁగ నైనఁ దలంప నట్టి నా
తియ్యనివింటివాని నెఱ ♦ తీపుల సంగడ మాగుణాబ్ధి నే
దయ్యము నెత్తి దాఁక నిడి ♦ దారి తలంగితివయ్య తమ్ముఁడా! ౧౩

తే॥ ఉండునే యింక జీవించి ♦ యుర్వితనయ
కాదె శూన్యంబు నావన ♦ గమనకష్ట
మాపెకై నే నొడలు వీడ ♦ నాస వెడలి
నీవు చనఁ గైక యిష్టము ♦ లైతెఁ బెరయవె. ౧౪

ఆ॥ పుత్రరాజ్యభోగ ♦ పూర్ణ సిద్ధార్థయా, మధ్యమాంబ నంబ ♦ మలసి యొదిగి
సేవ సేయకున్నె ♦ చింత నెట్టన మున్ని, నష్టపుత్రయై య ♦ నాథ యగుచు. ౧౫

క॥ ముదమునఁ బొదలుచు సతినా, కెదురై మే లరయు చెల్ల ♦ నెరవై వితగాఁ :
దదపేత మైన యాత్మణా, సదనమునకు సిగ్గు మాలి ♦ చనుదెంచెదనే. ౧౬

తే॥ ఉన్నదో లేదొ తెలుపుమో ♦ యన్న ! సీత
యెన్నఁ డేకష్టములనేని ♦ నెఱుఁగ దబల
నీవ్రిమత్తత మడసెనో ♦ నీత యగుచు
నెచట శోకించుచున్నదో ♦ యెఱుకపడదు. ౧౭

ఆ॥ ఆదురాత్ముఁ డడఁగు ♦ నప్పు డట్లఱచిన, నిన్నుఁ గూడ భీతి ♦ నెఱియఁ బాఱె
నదియె యాపె చెవికి ♦ నట్టిట్టు సోఁకంగ, నేమొ హేతు వయ్యె ♦ నిట్టిగతికి.

క॥ శరసంధాన మొనర్ప న, సురమాయ బయల్పడంగఁ ♦ జూచితిఁ గా కా
సరణి యరయంగ నయ్యెనె, హరిణాకృతితో మెలంగు ♦ నక్కాలమునన్. ౧౯

ఆ॥ ఎట్టులేని సీత ♦ నెడయనై జంతల, కంతరం బొసంగ ♦ తయ్యె వారు
కోరుకొనిన దదియె ♦ కొనసాగె విధిచిత్త, వృత్తి తోడుపడెడు ♦ విధ మొనర్ప.

క॥ ఖరసంహారము మొదలుగ, సురవైరులు కీడొనర్పఁ ♦ జూచుచునుండన్
దరుణ మొనఁగూడె నిమ్మెయి, దరుణీమణి యొంటి నుంట ♦ తారసిలంగన్. ౨౧

ఆ॥ మునిఁగినార మిట్టి ♦ ముప్పున వేఱొండు, గతియుఁ గలదె తనదు ♦ కర్మఫల మ
వశ్య మనుభవింప ♦ వలె నన్న నుడి దక్కఁ, దీర్తు ననెడువాఁడు ♦ తెలియఁబడునె.

క॥ ఏమని వచ్చితి వాసతి, యేమని పొమ్మనియె నింత ♦ యెఱిఁగింపుము చి
త్తామయము పొల్పడెం దన, కేమెయి భైషజ్య మింక ♦ నేర్పడియెడునో. ౨౩

తే॥ అనిన వెల్వెలవాఱెడు ♦ నమ్మొగము త, దంఘ్రిసరసీరుహైకాశ్ర ♦ యమ్ముఁ గోరఁ
గేలుదమ్ములు సాఁగి త ♦ ల్లాలనమున, మెలఁగ నిట్లని పలికె సు ♦ మిత్రసుతుఁడు.

—♦ లక్ష్మణుఁడు శ్రీరాముని ప్రశ్నలకు సమాధానముఁ జెప్పుట ♦—

శా॥ అన్నా! నేర మటం చెఱుంగ నటు ల ♦ య్యాదిత్యవిద్వేషి నీ
వన్నట్టే యని నట్టి దీనవచనం ♦ బాలించి కీడెంచి నీ

వున్న ట్లుండుదె యన్నఁ దల్లి! యసురుం ♦ డొక్కండు దుర్వృత్తిచే
నన్నా డెల్ల యెఱింగి నీ కగునె యి ♦ ట్లాతంకముం గాంచఁగాఁ. ౨౫

క॥ ఒక్కట సురాసురులు కై, పెక్కి తోడఁరఁ జక్కనిలిచి ♦ యే ప్రాఁజు సూపక
దక్కుఁడురఁట రఘురాముని, చక్కటి దైన్యంపు నుడికి ♦ సమయము గలదే.

తే॥ కీడు దలఁపకు మమ్మ! యా ♦ కృతకవచన
ములకుఁ దలఁకకుమమ్మ యి ♦ మ్ములకదారు
లున్నయవి రక్కసులవంక ♦ నోర్చియుండు
మొక్కగడె నొంటి విడిచి పో ♦ నొప్ప దనుచు. ౨౭

క॥ పాదానతుండనై విని, వేదించిన నుస్సురనుచు ♦ వెక్కసఁపడుచుఁగా
గా దన కనఁగూడని యప, వాదములం గూర్చి తిట్టి ♦ వలను సెడంగన్. ౨౮

క॥ ఆక్రోశింపఁగ నింక న, పక్రమ మేవంక నెద్ది ♦ పడయఁగ నగునో
విక్రాంతి కూడ దని నుత, విక్రమ! నీసేవ కిట్లు ♦ వెడలితి భీతిన్. ౨౯

క॥ నానేరమి సైపవె యన, దీనుండై రాముఁ డనియెఁ ♦ దేజోవంతుం
గా న న్నెఱిఁగియు న్యస్త, న్మానినిఁ గాపాడు టుడి గి ♦ మరలఁదలంతే. ౩౦

క॥ చకిత యయి యాపె యఱచిన, ముకుర్దాఁ డటు (దెవ్వ నన్న!♦మొనసితి విప్రుఁడా
యకలంకచంద్రముఖికి, న్వికలత్వం బొదవ నేమి ♦ వెరవో చెపుమా! ౩౧

ఆ॥ తప్పొ నర్చి తీవు ♦ దారుణంబుగ నాపె
పలికె ననుచుఁ గోప ♦ భరము గదుర
నేమి సేయువార ♦ మింతి యేమయ్యెనో
తలఁపు మవల వలయు ♦ దశయు మదిని. ౩౨

ఆ॥ అబల నుడుల నెంచి ♦ యనుశాసనము జోలి
మఱచి మూఁడు కీడు ♦ మాటఁ ద్రోచి
యేల వచ్చి తింక నేమన్న ♦ నేమియుఁ
గలదె యెట్టి గతియొ ♦ కలుగుఁగాక. ౩౩

—♦ రాముఁడు సీతను బర్ణశాలయందు వెదకుట. ♦—

ఆ॥ అనుచుఁ దొట్రుపడుచు ♦ నారాట మందుచు
మేను వడఁకఁ గ్రిందు ♦ మీఁదుఁ జూడ
నోప కెంమిది యాశ్ర ♦ మోపాంతమునను మొన
యంగఁ గడఁగుచున్న ♦ యవసరమున. ౩౪

క॥ అనిమిత్తంబులు పెక్కులు, గనుపడె మృగపక్షితతులు ♦ వాశితముల న
న్యూనపు ముపద్రవము దా, రొక్కటి ఱేనికిఁ దెలుపు తెఱఁగు♦గానఁగాననయ్యెన్

క॥ ఉద్విగ్నమానసుఁడు గనె, సద్వినుతుఁడు శూన్యమైన ♦ సంవసథంబున్
హృద్వేలఁ గడచి శోక మ, పద్వారక మగుచు నెల్ల ♦ పద్ధతి మునుపన్. ౩౬

ఆ॥ అచటు సొచ్చి వెఱసి ♦ యంతరాంతరము శో
ధించి పదరి శోక ♦ దీర్ణుఁ డగుచు
హా విదేహభూవ ♦ రాత్మజ! భూపుత్రి!
యనుచు నఱచె దీనుఁ ♦ డై పురంధ్రి! ౩౭

క॥ హేమంతపద్మినిం బలె, సామంతుఁడు గాంచెఁ బర్ణ ♦ శాల న్సుగుణో
ద్దాముఁడు రాముఁడు రహిత, శ్రీమండన యగుచు నది వి♦శీర్ణతఁ గవియన్. ౩౮

సీ॥ విరు లిగురులు వాడ♦వీడఁ బాఱిన కొమ్మ, లలాడ నల్లాడు♦నాగములు
కన్నుల నీరొల్క♦గగనమ్మునకు మోఱ, లెత్తి ఘూర్ణిల్లెడు♦నేణకములు
ఱెక్కలు విప్పి చి♦ఱుక్కన నెగసి, నో, రెండ నాపోయెడు♦నండజములు
దేబెలై యందందుఁ♦దెల్లాడి పోవుచుఁ, దిరిగిచూడని వన♦దేవతలును
విప్రకీర్ణంబు లజినము♦ల్వికటము లగు
కటకములు బ్రుసు ల్కుశస్థలు ♦ ల్కాంతిహీన
ముటజచత్వరమును సీత ♦ యునికి లేని
తెఱఁగు వివరించె శ్రీరామ ♦ దేవునకును. ౩౯

చ॥ కనుఁగొని యుస్సురంచు నిలఁ ♦ గాల్నిల కొయ్యన వ్రాలి సోలి జా
లి నెఱయ నెట్టనం బొరలి ♦ లేదు ధరాసుత యొండు గొంచుఁబో
యెనొ మృత యయ్యెనో తెరలి ♦ యేయెడఁ జిక్కెనొ భక్ష్యభావముం
గనియెనొ కాననంబునఁ గ ♦ కావికలై దరిఁ గానకుండెనో. ౪౦

క॥ పువ్వులు ఫలములుఁ దేఁ జని, యవ్వలనున పెరిమ మసల నయ్యెనొ మఱియుం
ద వ్వేనసి మరలిరా నడ, మవ్వము సెడ నొక్కచోటు♦మలసి యలసెనో. ౪౧

తే॥ నాదు తలఁ పారయం గోరి♦నంద్యచరిత, యెందు నేనియు డాఁగెనో♦యింతవట్టు
నిల్చునే భీరు వది పద్మి♦నీనివేశ, మెనసెనో నది కఱిగెనో♦నెఱుకపడదు. ౪౨

క॥ అని యెల్లెడ లారసి తన, వనజాయతనేత్రిఁ గాంచు ♦ వల నెఱుకకురా
కునికి వగచి యున్మత్తత, గనుపడఁ గను లెఱ్ఱసేసి ♦ కాననగతుఁడై. ౪౩

ఆ॥ చెట్టుచెట్టు పుట్ట♦పుట్ట గట్టుంగట్టు, వాఁగువాఁగు దిరిగి♦వనరఁ దొడరె
నెందుఁ గానఁబడునొ♦యెదియేనిఁ దెలుపునో, యనెడు నాస రాముఁ♦డమలచరిత!

తే॥ కంటివె కదంబమ! కదంబ♦కాననప్రి, యాత్మ నాప్రియ సీత నసు♦భాంగి నిందు
బిల్వ! బిల్వోపమస్తనిఁ♦బీతవసనఁ, జివురుఁబోఁడి వచింపు ప్రహా♦సిని దలంచి. ౪౬

సీ॥ తిలకమా! కాంచితే♦తిలకాంచితాలకఁ, గాంచనమా! కంటె♦కాంచనాంగిఁ
జంపక! కనుఁగొంటె♦చంపకనాసిక, లికుచమా! పొడగంటె♦లికుచసుకుచ
రంభ! వీక్షించితే♦రంభోరుజృంభితఁ, బాటల! చూచితే♦పాటలోష్ఠి
వకుల! వీక్షించితే♦వకులగంధాఢ్యాస్య, మాధవీ! కానవే♦మాధవీస్వరఁ

గానలో నున్న తరులార! ♦ కానరేల, భూజములు మీర లయ్యాది♦భూజసుందు
తోఁడనెడు భావ ముంచి తో♦డ్తోడ నెంచి, నానవాతంక మెడలంగ♦నానతింపు.

క॥ శోకోపహతమనస్కున, శోకమ! యూరార్పవలదె ♦ శోభనమూర్తి
శ్రీకలన లెటేఁగి తెలిపి త్వ, దేకాగ్రపదుం బొనర్చు♦ మెలమి దొలంకన్. ౪౭

ఆ॥ నీవు ననలు కొనలు ♦ నెఱయ శోభిల్లెదు, కర్ణికార! వినుచు♦కర్ణికాఢ్యఁ
గని వచించు కకుభ!♦కరభోరు వది పక్వ, తాల ఫలదురోజ♦తాల! తెలుపు. ౪౮

క॥ సహకారములారా! మీ, సహకారము నెఱయఁ గొనుఁడు♦సాహాయ్యకసుం
దహమహమిక భాసిల్లెడు, నహంయుభావంబు వలవ♦దార్తుల యెడలన్. ౪౯

సీ॥ తిలకమా! నాసతీ♦తిలకంబు గానవే, శ్రీమంతు లార్ద్ర ల♦క్షింపఁ బోరు
ప్లక్షమా! మాతృమా♦పత్య మీక్షించితే, జటిజాల మన్యప్రి♦సక్తిఁ గానదు
గిరిమల్లికా! కంటె!♦గరిమాంచితనితంబ, నేల వత్సకపాలి♦కిట్టి జోలి
మాగధీ! చూచితే♦మాగధిశ్రిత నోర్తు, గణికల కిల్లాండ్రు♦గణన గలదె

కరుణవృక్షములార ! న ♦ న్గరుణఁజూడ
రాదె ప్రియజాడ వివరింప ♦ రాదెయింక
హా జనకరాజపుత్రి ! ని ♦న్నడవిపాలు
సేసెనేకైక మదినున్న ♦ చెడ్డతలఁపు. ౫౦

తే॥ యనుచుఁ బేర్వేర నవ్వని ♦ ననుచు తరుల
తావళుల నెల్ల నడుగుచు ♦ భావజాత
చింత దను ముంపఁ దొడర వి ♦ శీర్ణ హృదయ
వృత్తి నొండొక దెసఁ గాంచి ♦ వెడఁగుపడుచు. ౫౧

క॥ ఓపికవర్యములారా, యోపికమెయిఁ దెలుపఁ దలఁప ♦ రో పికవాణీ
శాపము గాననేరకె యా, శాపముదావహులు వీరి ♦ జాడ లరయరే? ౫౨

క॥ భృంగములారా! చయ్యన, భృంగారుకగాత్రిఁ దెలిపి ♦ పెనుపుగనుఁడు మీ
యంగజుఁడు మీర లల సం, పెంగల పగ దల్ఁతురేమొ ♦ బేలతనమునన్.

తే॥ శారికల కేమి చనుఁ బలా ♦ శారికలనఁ
గాంచు మే లెంచి పలుకుఁ డ ♦ క్కాంచనాంగి
శారికాక్రీడనప్రియ ♦ సారతరవి
చారణ లొనర్చి యిదె మీకు ♦ జన్మఫలము. ౫౪

మ॥ పలుకు న్నీవలెఁ జిల్కలార! కనరే ♦ బాలామణి న్నీవలెం
గులుకుం గంటిరె హంసలార! పృథువ ♦ క్షోజోరుకాంచీస్థలిన్
జిలుకు న్నీరహి బెక్కుజూపుల మృగా ♦ నీకంబులారా! మృగా
క్షుల కీపాటవలంతికన్నె తల ని ♦ ల్చుం జూడరే యివ్విడన్. ౫౫

తే॥ మత్తకాశినిఁ గంటివె ♦ మత్తవార, ణంబ! తెలుపు మవారణఁ ♦ గంబుకంఠి
పోలు పమరు గత్యురోజోరు♦వులకు నీదు, పరికరవిశేషములు పోల్చు♦బడులకావె.

ఆ॥ భయము లేదు తెలుపు ♦ వ్యాఘ్రింబ! యింకిట
గౌరవమున కలిమిఁ ♦ గాంచువాఁడ
నిన్ను నీదు కొలము ♦ నీరజేక్షణఁ జంద్ర
వదనఁ జూచితేని ♦ వల నెఱింగి. ౫౬

ఉ॥ వానరవర్య! యెల్లెడ శి ♦ వం బెనయుంగల వెంచి పల్కుమా!
సూనశరాసు నాఱవప్రి ♦ సూనఁపుముల్కి ధగాతనూజ న
మ్మానినిఁ గాంచితేని నను ♦ మానము పేడుము త్రోడివారిలో
నీనెఱి వన్నెకెక్కఁ దఱి ♦ నిల్పెద రాజపదాగ్ర్యపీఠికన్. ౫౭

మ॥ అని చింతాభరపీడితాత్ముఁ డయి త ♦ ద్వ్యాసంగ మొప్పారఁ గ
న్ననివేశం బని పీడఁబోక కనుచు ♦ న్గల్యాణి నల్లాపముల్
దనలో నెన్నుచుఁ గన్నుచుట్టఱిక మా ♦ తన్వి న్స్మరింపంగ నా
పనికిం జొచ్చిన మాటలాడఁ దొడరెన్ ♦ భాషావిశేషస్తుతా! ౫౮

ఆ॥ నన్ను గేలి సేయ ♦ నాయంబె సాధ్వి! రా, రమ్మటంచుఁ జీరి ♦ యిమ్ముఁబాసి
యేడ్చుచున్న వవిగొ♦ యేణాంగనలు వాని, నూఱడింపకునికి♦ యుచితమగునె.

క॥ శోకవివర్ధని వౌదె యు, శోకతరువు మఱువు సేరి ♦ చూపట్టెతి రం
భాకాండముల నిజోరువు, లాకపడెదె మేలిసిరుల ♦ కావృతి గలదే. ౬౦

ఆ॥ కర్ణికారవనికఁ గలసి హసించెదు, నీదు హాసనిరతి ♦ నే నెఱుంగు
వాఁడ నైన నిట్లు ♦ వనరుచుండెదు నెడ, వలవ దాశ్రమమున♦వలనుపడదు. ౬౧

ఆ॥ ఏమి పలుకు లిడెద ◆ నింతి! కల్వలబంతి!, మఱుపుసొచ్చె దేల ◆ మాన్యశీల!
దాఁగు నంతలోనె ◆ డాగునే నీసిరి, యువిద నను మొఱంగు ◆ టుచిత మగునె.

క॥ నిలుము నిలుము వరవర్ణిని!, చలమే నామీఁది నెనరు ◆ సడలించితివే
పలుకవటే పరిహాసము, గలకాలం బెల్లఁ జెల్లఁ ◆ గా నెఱపుదురే. ౬౪

ఆ॥ నీదు పట్టుపచ్చ ◆ నెఱిఁ గంటి డాఁగురు, మూఁత లేల కాంచి◆మొనయు నంత
నొట్టు పెట్టినాడ◆నుర్వీజ! యవ్వల, నంఘ్రి యిడక మాట◆లాడు మిపుడు. ౬౫

క॥ నా దురపిల్లు టరసి యే, యౌదార్థ్యం బెంచి తలఁగ◆ నెంచెద వబలా
యౌదార్యము ధార్ష్ట్యము కన, రాదో నాయెఱుక మదికి◆రారాదొ బళా. ౬౬

ఉ॥ ఇంతటి కష్టము ల్దలఁచి ◆ యేల తలంగు నుపేక్షసేయు మ
త్కాంత ధరం దొరంగనో వి ◆ ధాతృనిచెద్దియి పిసాచు లొడ్డి యా
క్రాంతిమెయి న్హరించునెడఁ ◆ గాసిలి బాలమృణాలకోమలో
పాంతనళాంతము ల్తునకు ◆ భాంగము లర్పణసేసి చెచ్చెరన్. ౬౭

ఆ॥ ఎంత దిక్కుమాలి ◆ యేణాక్షి ఘోషిల్ల, నయ్యొనోకదా దు ◆ రంతచింత
నంత మొందవలసె◆నక్కటా నా కిఁక, మే లటంచుఁ గలదె◆మిహిరకులుఁడ!

చ॥ అని విలపించుఁ జేడ్పడుఁ ద ◆ దన్యదిశం దిలకించు నొక్కటం
గని నటు సేరఁబాఱుఁ గల ◆ కంఠరవంబుల కుల్కు నింత ల
య్యొనె సతిసంగడం బనుఁ ద్వ ◆ దేకరతు న్నను వీడఁ బాడి గా
దనుఁ గలతావు లెల్లఁ గల ◆ యం బరికింతు నటంచు వే చనున్. ౬౯

ఆ॥ మరలఁ దమ్ము బెరసి ◆ మాటాడు బయలునఁ
జూడ్కి నెఱపుఁ దలఁకుఁ ◆ జొక్కు నింక
నేదిరా మృగాక్షి ◆ యేమయ్యెరా యను
ననవధానతాస ◆ మాశ్రయమున. ౭౦

చ॥ అరిగితి వెందు హా జనక ◆ జా! యను జాయను బాసి దుర్మృగం
బరయఁగఁ జన్న నన్నఁగ ◆ నో నను నో నను వీడ నాగుణా
కర వనిఁ డించి వచ్చితి వృ ◆ కావలి కావలిగాఁగ లక్ష్మణా!
సరభసవృత్తి వైతి వను ◆ సారము సారము గాదొ నీ కనున్. ౭౧

చ॥ అని మఱి వానిఁ డాయఁ జని ◆ యంసయుగంబునఁ గేలుదోయి నె
ట్టన గదియించి లక్ష్మణ! క ◆ టా యిది మూలము గాఁగ మేను బా

సినతఱిఁ జేర నాజియు ని ♦ సీయిట వచ్చితి వాన వీడి యే
మనుచు నదల్ప నెట్టు లన ♦ నౌనొ దరిద్రుని కట్టి యాపదల్. ౭౨

ఆ॥ ఆర్జవంబు లేని♦యధముని కీర్తి యు, ట్లింతి నన్నుఁ బాసి ♦ యేగె నింక
నేమి గలదు నిలువ ♦ దిమ్మేన నుసులు పో, బడియు తక్క నొండు♦బాట లేదు.

మ॥ వనవాసంబు గ్రహించి యే నగరికి ♦ న్వాపోవుచుం బోవ ము
న్ననివార్యుం డయి యేగె సీతఁ గొని యి ♦ ప్డద్దేవిఁ గోల్పోయి యే
మని వచ్చెం బరికింప సీతఁ డెటులు ♦ న్వార్థుండు నిర్వీర్యుఁ డం
చన రే లోకులు నిర్దయుం డనుచు డ ♦ య్యుం దిట్టరే బంధువుల్. ౭౪

తే॥ కాతరుఁడ నైతి నిక్క కి ♦ క్కలన పరుగ
నావిదేహావిభుండు మ ♦ హాత్ముఁ డడుగ
నే మనెడువాఁడ నాతఁ డి ♦ ప్డేమి దలచు
వాఁడు భర మయ్యె నెట్లు ని ♦ వ్వలని బ్రదుకు. ౭౫

తే॥ భరతపాలిత యప్పురిఁ ♦ బడయఁ జాల
దమ్ముఁడా! పొమ్ము రెండు శూ ♦ న్యమ్ము లయ్యె
దివియు భువియును దీన వి ♦ దీర్ణహృదయు
న న్ననసి యిచ్చటున నున్న ♦ నయము గలదె. ౭౬

తే॥ ఎట్లు జీవింపఁజాల నీ ♦ వేగి భరతు
కౌగిఁటం జేరి నావాక్క ♦ గా వచింపు
మాజ్ఞ యొసఁగితిఁ గలకాల ♦ మవని యెల్ల
నేలుకొను మని యిదియె న ♦ మీహితంబు. ౭౭

తే॥ తల్లులకు ముయ్వురకును వం ♦ దనము లే నొ
నర్చినవిగా సమర్పింపు ♦ మర్చనీయఁ
గోసలాత్మజ నేవేళఁ ♦ గొలిచి యామె
కోఱఁత లెల్లఁ దలంగుము ♦ గుణనిధాన! ౭౮

మ॥ అనుచున్ శోకము పేరి కర్దమమునన్ ♦ హా స్త్రీంద్రియుం బోలఁ గూ
లు నరేంద్రు ఘ్ననుఁ నగ్రజు న్గరు నలో ♦ లు న్భావితాత్ము న్మహా
త్ము నిరీక్షించి శుగాహతిం దెరలి యు ♦ న్మన్నాడి యన్నేలక
న్య నిలీనత్వము నేర్పరించు మది ని ♦ ధ్యానించి తా నిట్లనున్. ౭౯

—♦ లక్ష్మణుఁడు రామునకు ధైర్యము బురికొల్పుట. ♦—

చ॥ తగునె మహానుభావ! నిజ ♦ దాక్ష్యము చేడ్పడ నింతమాత్రికన్
వగవఁగఁ గాననప్రియని ♦ వాసమునందున లేకయున్న సే
మగు సుచరిత్రి యేకొలఁకు ♦ లారయ నేగెనొ యేవనిం జరిం
పఁగఁ దలఁ పుంచెనో యెచటి ♦ పావనతీర్థము లాడఁ జొచ్చెనో. ౧౦

ఆ॥ భావ మరయ నైన♦భయము సూపఁగ నైన, నవ్వుటాల కైన♦నంద్యచరిత
యొక్కచోట డాఁగి♦యుండనోపుఁ బ్రయత్న, మొప్ప నరయవలయు♦నుదిలపడక.

క॥ ఒండు వికారము లెమ్మెయి, నుండకయుండంగ నిట్టు ♦ లోటుపడినచో
గండడఁగి పోవులే కా, కొండొకఫల మున్నె ఘనున ♦ కుచితం బగునే. ౧౧

ఆ॥ కాన నీవు నేనుఁ♦గలతావు లన్నియు, నరసి చూచి కార♦ణాంతరంబు
దోఁప నామె చొప్పు♦దొరకొను నమ్మెయిఁ, బురుషకార మెనయఁ♦బోలు ననఘ!

క॥ బలి బంధించి కడఁక ని, య్యిల యెల్లం గొనిన విష్ణు ♦ వీవు నొకఁడుగాఁ
దలపించెడు వర్తనముం, దలపోయుదుగాక యేల♦ధైర్యం బెడలన్. ౧౨

మ॥ అని సౌమిత్రి వచింప నవ్వలని సౌ ♦ హార్దంబునం దోఁగి య
మ్మనువంశ్యుండు సరస్సరిద్గిరిదరీ ♦ మార్గోపమార్గంబులున్
ఘనదుర్గంబులుఁ జొచ్చి కాంచి యొకటన్ ♦ గల్యాణి చొప్పెన్న లే
క నితాంతప్రథమానచింతనదశా ♦ క్రాంతాత్ముఁడై యిట్లనున్. ౧౩

—♦ శ్రీరాముఁడు సీతావియోగావస్థం బ్రదర్శించుట. ♦—

ఉ॥ చూడనిచోటు లేదుగద ♦ చూచితి వీవునుఁ దోఁడు గూడి యే
జాడయుఁ గానరాదు మహి ♦ జాత మహిం గలయుంగఁ బోలు న
న్వీడి చనం దలంచునె సు ♦ నిష్ఠిత చాలని వేళ నిట్టి వా
కీడులు మూడకుండు నెటు ♦ కృత్యవిధు ల్గొనరింప నయ్యెడున్. ౧౪

చ॥ ఎవి యెటు లే నొనర్చితినొ ♦ యింతకు మున్నగు పుట్టువందు నిం
పవు నని కిల్బిషంబు లవి ♦ యన్నియుఁ బాకము నొంది వెంటవెం
ట విపదుపాకృతిం బెరయఁ ♦ డాఁగిన మూఁగిన నేమగుం బరా
భవ మన కొత్తిగిల్లి నయ ♦ పద్ధతిమైఁ దల యెద్దఁగాఁ జనున్. ౧౫

చ॥ తన సిరి వోక స్వీయజన ♦ తావిరహంబును దండ్రి నాశమున్
వనమున నుంటయుం దగని ♦ వారలతో జగడంబులు న్మనం
బెనసి వికారిఁ జేయ నవి ♦ యెన్నియు నేని సహించి ప్రేయసిం
గొని ముద మందఁ గంటిఁ గడ ♦ కుం గడవంబడె నద్దియుం గటా. ౧౬

ఆ॥ పర్ణశాలఁ జేరి♦పడఁతి నీవునుఁ గొల్వ, నెల్ల కష్టదశల♦నీఁగినాఁడఁ
దరుణిఁ బాసి యిపుడు♦తద్దశాపరిపాక, దశవిధప్రపీడఁ♦దవిలినాఁడ. ౮౯

సీ॥ ఆకోకిలాలాప♦యాలిఁ జెంగాబోలు న, పస్వరంబుగ మింటి♦పైని నరుగ
మానుపటి యమ్మేటి♦సూరు వెల్లవిడుఁబో, ముఖచంద్రుఁ డారాహు♦ముఖమునందుఁ
దశర స్తచందనో♦చితము లురోజము, రుధిరోక్షితములై వి♦రూప మొనయు
సురుచిరహారాళి♦శోభిత కంధర, పీతశోణితగాఁగ ♦ బ్రిదిలెనేమొ
యసుర యెవ్వఁ♦డిట్టు లాక్రమింపఁగ నెంత, పడెనొ యేమి వంకఁ♦ బ్రాణ మునిచి
చనెనొ యేవిధమునంస నెనొ యేమయ్యెనో, యెప్రసంగ మేని♦ నెఱుకపడదు

ఉ॥ మొన్ననె యీశిలాఫలక ♦ ము న్నిజయుం గని నన్ను మేలిక
న్నన్న నుపోపవిష్టునిఁ బో♦నర్చి స్మితాంచితాస్యయై సమాశ్రితున్
నిన్ను హసించు నన్నెటి వి ♦ సీతునిఁ జేసెన కాదె యింతలోఁ
జన్నదె రూపుమాసి యువి ♦ చారుత ... న కృతాంతు శాసితిన్. ౯౦

క॥ ప్రియ గోదావరి నాప్రియ, కెయిదంగా కొంటెఁ గోవ♦ నెంచదు వనికే
నయమున సరుగు స్థిరువు, సయుక్తవ్యామే కోరుఁ జెం♦జలజాకరమున్. ౯౨

క॥ నాకాంతవార్తఁ దెలుపుము, లోకేక్షణ కర్మసాక్షి ♦ లోకములందున్
నీకొలఁది గలదె వేలుపు, ప్రాకటయశ మబ్బు నిట్టి♦పరిభవ మీఁగన్. ౯౩

తే॥ పిచ్చనో నొచ్చనో యెట్లు ♦ వెఱఁగుపడెనో
యేదురాత్ము నికృతిఁ జెసి ♦ యెడయఁగ నెనో
వినుమసూయ్య! జగత్ప్రాణ! వినుతశీల!
నాప్రియాంగన చరితంబు ♦ నయ మెఱింగి. ౯౪

ఆ॥ భూతధాత్రి నీదు ♦ పుత్రి వృత్తాంతంబు, దెలుపగాదె యేల♦నలనుఁ బాసి
యుంటి వొంటి నిట్టు♦ లోర్చ్చ దేమని నాదు, దీనదశకు నైన♦దిగులు లేదె. ౯౫

ఆ॥ అనుచు దీనుఁ డగుచు♦ననులాప మొనరించు, రాము సద్గుణాభి♦రాముఁ గాంచి
సరగ నను నదీన♦సత్త్వుండు సౌమిత్రి, భావికార్యగతివి♦పాక మెంచి. ౯౬

ఉ॥ శోకము వీడు మీపలుకు ♦ శుద్ధచరిత్ర గణింపు మెందు నే
ప్రాకృతుఁ డేనియున్ జతనఁ ♦ బాయక కర్జమున న్మెలంగినన్
బోకడ వెట్టు నాపదలఁ ♦ బొండిమి గాంచు సుఖించు నన్న న
ప్రాకృతపౌరుషుండ వెటు ♦ పాల్పడకుండును సిద్ధి నీకృతిన్. ౯౭

ఆ॥ అన నొకింత దేఱి♦యన్న! గోదావరి, మలయు మచటు లెల్లఁ♦గలయ వెదకి
యొండు గాంచువార♦మోయి నా నొదల, నాన మోచికొనుచు♦నాతఁ డరిగి.

క॥ కలచోట్లు లెల్ల నారసి, కలకంఠి న్గాన కట్టి ♦ గతి వివరింపన్
దలఁపుమెయిఁ దాను న ప్పాల, మొలసి వివేచించి యనె ర♦ఘూద్వహుఁ డార్తిన్

ఉ॥ భూతములార ! మీ రెఱుఁగఁ ♦ బోల ని దొక్కటి యున్నె దేవి ! యో
గాతమి ! నీసఖీమణినిఁ ♦ గానవె కాన వెలందిఁ డించి మీ
యూఁతము నమ్మి పోవ నిటు♦లూరక యుండుట మేలె పోక వి
ఖ్యాత మొనర్పఁ డాపయినిఁ ♦ గల్గు భరమ్మున కేన చాలెదన్. ౧౦౦

ఆ॥ అవధార్పఁ డెవఁడొ♦యాశంసన మొనర్పఁ, డనినఁ బొలసుదిండి♦యవినయంబుఁ
దలఁచి తలఁకు దోఁపఁ♦దా రెద్దియునుఁ బల్క, నోడి మిన్నకుండి♦రుత్పలాక్షి !

క॥ ఆస మొదలి యినవంశజుఁ, డాసౌమిత్రిఁ గని పగఱ♦కాపగ తానే
శాసటగా మనపాలిఁట, నేసఖు లున్నారు వారు ♦ నేనివెడఁగులే. ౧౦౨

క॥ పడరాని పాటు లెల్లం, బడి యడవిం దిరిగి మేలు ♦ వడయంగల యి
య్యెడఁ బడఁతిమిన్నఁ బాసెను, జడుఁ డీవిధి కింక మంచి ♦ జాడయుఁ గలదే.

ఆ॥ ఎల్లకష్టములకు ♦ నే నని తనబుఱ, మీఁగి చనియె సతి త ♦ దీప్సితంబు
లెవ్వి దీర్చినాడ ♦ నింతలు సేసి యే, నరిగి యెవరి మంచి ♦ కగుదు నింక.

ఉ॥ కూరుకు వచ్చునే కనుల ♦ కుం దరి త్రోవయుఁ గాన నౌనె యా
హారవిహారము ల్గలవె ♦ యన్య మనన్య మనంగఁ జెల్లునే
తీరగునంచు మేనిపయి ♦ దేజెతనంబున నాస సేసి యే
నూరికి నేగువాఁడ నని ♦ యొక్కెడఁ దిమ్మరిభావ మూంచినన్. ౧౦౫

క॥ ఈనది నీనేల జన, స్థానంబునుఁ బ్రిస్రవణము ♦ శైలము వరుసన్
ధ్యానించుచుఁ దిరిగెద న, మ్మానిని యేనాఁటి కెట్లు♦మలయునొ యనుచున్.

ఆ॥ కంటివే మెకములు ♦ ఘనసత్త్వములు నన్నుఁ
గాంచి యేఁమొ పలుకఁ ♦ గాఁ గడంగు
నట్టు లున్నయవి న ♦ మాదరమున వాని
యింగితములు కొన్ని ♦ యెఱుకగలవు. ౧౦౭

క॥ అని వేఁడినీరు సోనలు. గనుకొలుకులనుండి జాఱఁ ♦ గా నమ్మాయా
మనుజాఁడు వానిఁ దఱిసి మీ, ఘనుమవర్తిని జాడ దెలుపుఁ♦డన్ని యడుగుటయున్.

ఉ॥ తోడనె మోఱ లెత్తికొని ♦ తోఁకలు చక్క విదిర్చి వింటిపై
నోడని చూడ్కి నెక్కొనఁగ ♦ నుత్పలలోచన చన్న యుద్దెసం
గూడిన పద్ధతి న్నెఱసి ♦ కోవిదుఁ డవ్విభుఁ డోడుకొంచుఁ బో
నాడక మాట లాడుటయు ♦ నన్నెఱనన్నలు గాంచి చెచ్చెరన్. ౧౦౯

తే॥ అన్న! చూచితె మృగము లీ ♦ వఱుఁగఁగఁ దమ
కన్నయంతలు వివరింపఁ ♦ గాఁ దొడంగె
దక్షిణాపథమున దృష్టి ♦ తవులుసూప
నందు నైరృతసంచార ♦ మధిగతంబు. ౧౧౦

ఆ॥ కానఁ దద్గతాను♦గతులపై యద్దేవి, వలను గాంచఁగల మ♦వశ్య మనిన
నట్లె చేయువార♦మని రాముఁ డద్దెస, కనుజుఁ డనసిరాఁగ♦నరుగుటయును.

క॥ ఆదారి మొనసి నంతనె, యాదేవి ధరించు సుమము♦లం దగుపడినన్
గాదిలితమ్మునికిఁ జూపెనె, శ్రీదయితుఁడు తద్గతాను♦చింతన మొలయన్. ౧౧౨

మ॥ అవె యిప్పూవులు లక్ష్మణా! యరసి యే ♦ నర్పించితి న్నాఁడు నేఁ
డవలోకించితి జాత్ర వేసవికి వ్రేఁ ♦ గా సంకటం బైన ని
ట్లెవఁడో దుష్టుఁడు సాధ్వి నీడ్చికొనిపో ♦ యెం గావుత న్నాదు క
ర్మవిపాకం బిటు లుండ నిక్క మిదె యా ♦ మానింపుమీ చక్కఁగన్. ౧౧౩

క॥ వాడవు విరు లివి యిన్నెఱి, జాడ నెఱింగింప ధరణి♦శ్వసనుఁ డినుఁడుఁ గా
పాడుచునున్నా రనఁదగుఁ, బోఁడిమి చెడకుండ నాదు♦బుద్ధి న్నెఱయన్. ౧౧౪

తే॥ అనుచు నాత్రోవఁ బ్రస్రవ ♦ ణాద్రిఁ జేర
నరిగి గిరినాథ! కనుఁగొంటె ♦ యలరుఁబోఁడి
నని యడుగ నయ్యదియుఁ బల్క ♦ కట్లె యుండ
నెంచి తలయూఁచి యేమన్యొ ♦ నింతకనుచు. ౧౧౫

క॥ కుపితుఁ డయి క్షుద్రమృగమున్, ద్విపవైరియుఁబోలె శిఖరి♦వీక్షించి యిదే
క్షపణ మొనరింతు శరముల, సపరిచ్ఛదు నిన్నటంచు♦సంరంభమునన్. ౧౧౬

క॥ కన్నుల నిప్పులు రాలఁగ, నన్నగము న్నదినిఁ గాంచి♦యార్భటి నెఱయన్
గన్నియ వార్త దెలుపవే, కున్న ఫలం బేమి మీర♦లుర్వి నటంచున్. ౧౧౭

ఆ॥ ధర్షణం బొనర్పఁ♦దద్గుహాశయముల, మ్రోసె గిరియుఁ బలుకు♦రూఢి తనర
నీక త్రోఁచఁగాక♦నేర మియ్యాపద, నెఱిఁగి యెఱిఁగి తెలుప♦నే మటంచు. ౧౧౮

వ॥ అట్టియెడ దుర్నిరీక్ష్యతేజుం డగు నారఘూద్వహుండు తత్పర్యంతభూపరివర్తిత యగు నవ్వర్తనిపైఁ దనదు చూడ్కి నిగుడించి యాక్రించురక్కసుని యురుతర యగు పాదచిహ్నాసరణియు నద్దానిచక్కటిం దిస్తమై యీవల నావలం దొడిబడం బరువు లిడుచు జానకీదేవి యిడిన తప్పటడుగులును బదంపడి యన్నిచుండు వెంబడింబడి యొండొండం బొనరించిన పదక్రమణక్రమంబునుం గని

తోడ్తోడ నఱిగి భగ్నంబు లైన శరశరాసనతూణీరంబులును బహుధావికీర్ణం బైన స్యందనోత్తమంబును వీక్షించి వెండియు వెనువెంటం బొడకట్టుచున్న కొండొక లక్షణంబుల నుపలక్షించుచు సంభ్రాంతహృదయుండై యనుంగుఁదమ్మునిం గనుంగొని యిట్లనియె. ౧౧౯

ఆ॥ అడుగుజాడఁ దోఁచె ♦ నద్దేవి నొకదుష్టుఁ, డాక్రమింపఁ దొడరి ♦ నట్టి తెఱఁగు
తోఁచ కానుపించెఁ ♦ దునిసిన వి ల్లమ్ము, లట్లు దొనలు భగ్న ♦ మైన రథము.

ఉ॥ కంటివె లక్ష్మణా! మఱియుఁ ♦ గానఁగనయ్యెడుఁ గాన నెల్లెడన్
దుంటలు పూవుపెత్తులు వి ♦ ధూతవిభూషణహేమబిందువుల్
కొంకెల కయ్యె నిర్వురకుఁ ♦ గోమలికై పెనఁగంగ నంచు బ
ల్గంటుల రక్తధార లవె ♦ కళ్లమునం బొడకట్టి తెల్పెడున్. ౧౨౧

ఆ॥ ఎవ్వ రెట్లు పోరి ♦ యేనిఁ గోమలగాత్రిఁ, గోసి కోసి పంచు ♦ కొని భుజించి
రేమొ యేమి సేయ ♦ నెంచిరో వల దన్న, వారుఁ గలరె వారి ♦ వలను డాసి.

వ॥ దీప్తపావకసవిధంబై ద్యుతిమాలావసథం బగు సాంగ్రామిక రథంబు పడిన యచ్చోటున ముక్తామణిరత్నజాలసమావృతంబును దపనీయభూషణభూషితంబును మహోన్నతంబు నగు కోదండంబు వేదండంబునాఁగ నెట్లు పడియున్న యదియో చూడుము తరుణాదిత్యసంకాశంబును వైడూర్యగుళికాంచితంబును సమరోచితంబును నైన యక్కాంచనకవచం బట్లు విశీర్ణంబై నేల వ్రాలియుం గ్రాలుచున్నయది దివ్యమాల్యోపశోభితంబును శతశలాకంబును నగు నాతపత్రంబు శతశకలంబు భగ్నదండంబు నయ్యె నెందుఁ జూచినం దానె యనం దల మెల్ల నాక్రమించినయది స్వర్ణపుంఖంబులు రథాక్షమాత్రంబులు నైన విశిఖంబులు విశిఖంబులు విప్రకీర్ణంబులు నభిహతంబులు నైనయవి శరపూర్ణంబులగు రెండు శరావరంబు లెట్లు విధ్వస్తంబు లైనవియో కనుంగొనుము ప్రగ్రహప్రతోదహస్తుండై యున్న సారథి నిహతుండై కూలినాఁడు సోష్ణీషమణికుండలులు సచామరులు నగు చామరగ్రాహులు ధరణీతలశయానులై దీర్ఘనిద్రం జెందిరి. పోల్చి యియ్యది యంతయు విచారింపు మెవ్వండో దురాసదుఁ డగు రక్షోవీరుండు జీవితాంతం బగు నాతోడి వైరంబునకుం బన్నిదంబు సఱచి యిమ్మెయి నిమ్మరసినవాఁడై ప్రవర్తింపనోపు నెట్టులేనియు నగుంగావుత మాతపస్విని ఘోరాకారులు యథేష్టసంచారులు గష్టాత్ములు నగు పిశితాశనుల పాలంబడి నేలంబడ కింతవట్టు జీవించి యుండంగలదే నిజధర్మం బేనియు నద్దేవి నిద్దెసతటం గాపాడ నోపదయ్యె లోకకర్త యనం జాలి శూరుండనై కరుణావేది నగు నన్ని

య్యెడం గావ నేయాశ్వరులును సమర్థులు గారైరి భువనహితప్రియుక్తుండును దాంతుండును దీనావనలోలుండు నయ్యు మృదుభావంబున నున్న యాతండు సర్వభూతజాతంబులచేతను నిరసింపంబడుఁ జుమీ త్రిదశాధీశునిం దొట్టి దొరలెల్ల నన్ను నిర్వీర్యునింగాఁ దలంచి పొంచి నిరీక్షించుచుండిరి కాబోలు నాయందలి గుణసంఘాతంబెల్ల దోషాభిపాతాత్మతం బరిపాకంబు నొందె నింక గాఁగలకర్జం బవధానింపుము.

—♦ శ్రీరాముని క్రోధావేశము. ♦—

ఉ॥ చల్లని సద్గుణౌఘ ముప ♦ సంహృతముం బొనరించి తోఁచె నా
యుల్లమునందుఁ దేజ మిపు ♦ డుజ్జ్వలమై శశి జ్యోత్స్న నాఁగ భా
సిల్లెడు భానుమంతునకు ♦ బాసటయై కలభూతపఙ్క్తితోఁ
బ్రిల్లద మైన రక్కసుల ♦ పాళెము గూలెడుఁగాత దీనిచేఁ. ౧౨౪

తే॥ జగ మగంధర్వయక్షర♦క్షఃపిశాచ
కిన్నరనరంబు గాఁగల ♦ దిన్నయమున
నొడ్లు సుఖ మందుదురె యింక ♦ నురుశరాస
మెత్తి శస్త్రాస్త్రముల దివి ♦ కేను పఱుప. ౧౨౫

సీ॥ జగదంతచారుల♦సంచార ముడిగించి, గ్రహమండలం బెల్లఁ♦గట్టివైచి
చలువలతేని ప్ర♦సంగంబు వారించి, యనలార్క తేజంబు♦లట్టు లార్చి
వాయుప్రచారంబు♦వలను నిర్బంధించి, గట్టులఁ బొడిపొడి♦గాఁ దెరల్చి
నదనదీసాగర♦నాశనం బొనరించి, తరులతాకుంజము♦ ల్తద్దఁ గూల్చి
సర్వమును శూన్యమే యను♦జాడ నెఱయ
మచ్ఛరాగ్నులు విహరింపఁ ♦ మలయు నంత
లోన లోఁబడి వేల్పులు ♦ లోలనయన
నర్పణ మొనర్ప భావింప ♦ రైర యేని. ౧౨౬

ఉ॥ కందుర కాక విక్రమపుఁ ♦ గందువ లెల్లరు వెంటవెంట నా
క్రందనము ల్పొనర్చుచు వి ♦ కావికలై గతి గాన క్రొక్కటఁ
మ్రిందెడు నప్డు దే మనిన ♦ మానుసె యయ్యాది కల్పకాల పుం
బొందిక యిన్నిటిం దొడరెఁ ♦ బో యని నీ వెడఁ గాంచుచుండఁగఁ. ౧౨౭

తే॥ దూరుటకు సందు లేక ని♦ర్ఘాతు లౌదు, రొక్కెడ మెలంగువార లం♦దుక్కడంగి
మచ్ఛరాసననిర్ముక్త♦మార్గణములు, దివి భువియు నాక్రమించెడు♦తీరసంగ.

ఉ॥ నాదగు రోసమిమ్మెయి వి ♦ నాకృతసంస్థముగాఁ గడంగినన్
బోదురుగాక దేవతలుఁ ♦ బూర్వసుపర్వులు నొక్కపెట్టునన్
గా దనుమాట యున్నె యతి ♦ గాములు మోములు విచ్చుగాములై
మీఁద శరాళు లేర్పడఁ గ్ర ♦ మించుచు విశ్వము సంచలింపఁగన్. ౧౨౯

ఆ॥ జీవలోకమిట్లు ♦ జీవలోకము సేసి, యొండుసృష్టి యెడఁద ♦ నూఁచువాఁడ
నడ్డుగలదె జరకు ♦ నంతకునకుమిత్తి, కల్లవిధికి నాకు ♦ నఖిలగతుల. ౧౩౦

క॥ అని కార్ముకముం గొని యి, ట్లనరాని శరమ్ము దొడిగి ♦ యనుపమలక్ష్మిం
దనరె యనివార్యుఁ డైనన్, దన కేలుం దోయి మోడ్చి ♦ తమ్ముఁడుఁ దోడ్తోన్.

ఆ॥ మోమువాడ ముప్పు ♦ మొనయఁ జూడఁ బలిన్చి, జాడతోడ మురుపు ♦ సరవి పీడ
నయ్యపూర్వరూప ♦ మరసి వడంకుచు, నిట్టు లనియె శౌర ♦ దేందువదన. ౧౩౨

—♦ లక్ష్మణుఁడు రాముని తీవ్రత నివారించుట. ♦—

తే॥ సర్వభూతహితుండవు ♦ సరణి మృదువు
శాంతదాంతత్వములు నీకు ♦ సమ్మతములు
క్రోధవశమున నిజసత్త్వ ♦ రూఢి మఱచి
యిపుడు క్షయకాలహరు తేజ ♦ మెనయఁ గంటె. ౧౩౩

ఆ॥ చంద్రునందు లక్ష్మి ♦ జలజాప్తునెడఁ బ్రభ, గంధవహునియందు ♦ గతి ధరిత్రి
క్షమయు నెట్టు లట్లు ♦ సత్కీర్తి నీయందు, నియత యింతవట్టు ♦ నిర్మలాత్మ!

చ॥ వడఁకెడు సర్వభూతములు ♦ వారిజసంభవముఖ్యు లేగతిం
దడఁబడుచున్నవారో యిఁకఁ ♦ దక్కినవారల మాటలేల బి
ట్టడరెడు క్రోధవహ్ని నిశ ♦ రాసము నెట్టన నీవు దాల్చిన
ల్గడలు దహింతు నంచు లయ ♦ కాలునిఁ బోలఁగ నిట్టనిల్చినన్. ౧౩౫

చ॥ అరదము భగ్నమై పడియె ♦ సాయుధమున్ సపరిచ్ఛదంబు సై
ఖురహతి నేమిఘట్టనము ♦ గూడిన శోణితబిందుపాతమున్
సరణి నొకొండొ కానొకని ♦ సంభ్రమ మూరఁగఁ గిట్టి పోరి యం
తరమునఁ బాసినట్టి నెఱి ♦ దప్పని నావల నొప్పఁ జెప్పెడిన్. ౧౩౬

క॥ తీరెనసిన సంగ్రామము, ఘోరంబే యయిన సైని ♦ కుల సంమర్దం
బారూఢము గా దనియెడు, దేరుం బరికరము లతని ♦ దిట్టతనంబున్. ౧౩౭

క॥ ఇక్కలన స్నిదయితం, దక్కఁగొనంబోలు నంచుఁ ♦ దలఁపరు పరు లి
ట్లొక్కనికై మునజగములఁ, జక్కడవం జూచు జాడ ♦ జానై యున్నే. ౧౩౮

తే॥ నీకు విప్రియ మొనరింప ♦ నేర్తు రెవరు, దీక్షితున కన్యసాధుల ♦ తీరు నెఱయఁ
గాన నీయెడ నెవఁ డప ♦ కార మెంచె, వాని నరసి వధింప నో ♦ వలను మెఱయ.

చ॥ ననుఁ గొని విల్లు పూని ముని ♦ నాథులుఁ దోడుగ సాగరంబులున్
వనగిరికందర ల్జనని ♦ వాసములు న్సరసీసరిత్తతుల్
గనుఁగొని దేవి యచ్చోటులఁ ♦ గానఁగ నే గతి గల్గదేని నె
ట్టన నగు నింద్రముఖ్యుల క ♦ డ ల్పరి శోధనముం బొనర్పఁగన్. ౧౪౦

తే॥ అరసి కాన మనఁగఁబోల ♦ దట్లుగాక, తక్కనేనియు సుర లంత ♦ దనుక వార్త
దెలుపరేనియుఁ ద్వద్దీప్త ♦ తేజ మప్పు, డెప్పఁగిదినైన నెఱయించు ♦ టొప్పఁగలదు.

తే॥ నీవె శోకమోహములకు ♦ నెలవుగాఁగ, నొడ్లు సహియించువా రెవ్వ ♦ రుర్విలోన
నంతరాసర్షమున విశ్వ ♦ మడఁపఁ దలఁచి, తార్తులౌ ప్రజ లెవ్వారి ♦ నడుగువారు.

ఆ॥ పెద్దతపములోడి ♦ పెనుపొందు ధర్మము. ల్సేసి దశరథుండు ♦ శ్రీసమృద్ధుఁ
గాంచె నిన్ను సౌథ ♦ ఘటము నమర్త్యాఘు, మట్టు లట్టి నీదు ♦ మహిమ యసదె.

క॥ సరవి న్నిన్నే మది నిడి, యరిగెన్ స్వర్గమున కాతఁ ♦ డని భరతుఁడు త్వ
చ్చరణముల కెఱఁగి తెలుపఁడె, తరమే నీగరిమ వొగడ ♦ దైవతమూర్తీ!

ఆ॥ భ్రష్టుఁడై యయాతి ♦ నష్టపుత్రుం డయి, మనవసిష్ఠమౌని ♦ మాన్యు లింక
నెంద ఱెంద ఱెట్టు ♦ లెడలరు ధృతి నిష్ట, హాన మొనసి యార్తి ♦ కగ్గ మగుచు.

తే॥ అవని కదలుట చంద్రసూ ♦ ర్యగ్రహణము
లట్లు దోఁచుట భూతౌఘ ♦ మలఁతివడుట
గలుగుచుండు నెడలుచుండుఁ ♦ గాని దైవ
గతిని మీఱిన తెఱఁ గెందుఁ ♦ గానఁబడదు. ౧౪౬

క॥ శాంతి నెలకొనుచు వసుధా, కాంతులు తఱిమైనఁ దప్పు ♦ గని శిక్షింపన్
గాంతురు యుక్తం బగు గతి, నింత ప్రకృతి యనిన స్వీయ ♦ మెయ్యది యగునో.

ఆ॥ సర్వభూతములకు ♦ శరణంబ వీవ ని, న్గొలిచి సురలు మునులుఁ ♦ గోరుచుండ్రు
పరమగతియ తమకుఁ ♦ బాల్పడు ననుచు నీ, యరయరాని దొక్కఁ ♦ డవనిఁగలదె.

తే॥ దృష్టగుణదోషములు గాక ♦ ధృతి మొనయక
కర్మములు ఫలసంపత్తి ♦ గాంచి వెలయఁ
బోల వింతయు నీదివ్య ♦ బుద్ధి నరసి
మె ట్లొనర్పంగ నగు నది ♦ మొనయగనుము. ౧౪౯

మ॥ నను శిక్షించితికాదె మున్నడి జగ ♦ న్నాథా! సురాచార్యుఁడుం
దిను బోధింపఁగలాఁడె బోధమయుత ♦ న్నెక్కొంటి విట్లంచు నే
ననుశాసించుట గా దుపాధివికృతి ♦ వ్యాసంగముం గొన్న నె
మ్మనముం స్వాత్మపరత్వయోగకృతి సం ♦ భావింపఁ బ్రార్థించెదం. ౧౫౦

కం॥ జయ మెనయుమయ్య! రిపు న, త్త్యయమున మొనయించి స్వకమ♦హారాజ్యశ్రీ
నయలక్ష్మి గూర్ప మహిజా, సయుక్త్వ మొప్పార మూఁడు♦జగములుఁ బొగడం

వ॥ అని యిట్టు లాశంసించి. ౧౫౨

కం॥ పాదములు పట్టుకొని ప్రీతి, పాదితసకలార్థుఁ డగుచు భద్రయశా! న
న్నాదృతిఁ గని భువనవ్యా, పాద ముడుగు మని యనుజుఁడు♦ప్రథితుఁడు వేఁడం.

ఉ॥ పూర్వజుఁ డయ్యెఁ గర్జ మను ♦ పూర్వముగా వివరించు తమ్ము నా
నిర్వహణాఢ్య మా నుడి య ♦ నిందిత మంచుఁ దలంచి వాని ని
గ్గర్వత మెచ్చి రాఘవుఁ డ ♦ కాలవినిస్సృతకోపవహ్నితోఁ
బర్విడఁజూచు శత్రు మను♦భావమున స్మరలించెఁ గ్రక్కునం. ౧౫౪

కం॥ వి ల్లెక్కు డించి లక్ష్మణుఁ, డెల్లముగాఁ గాంచి యింకఁ♦దెలిఁ గెద్దియొ నీ
యుల్లమున నెంచి యను మా, సల్లలితాలాపఁ బడయు ♦ జాడ పొసంగం.

ఆ॥ అనిన నాతఁ డనియె, నఖిలాత్మ! నీయర యనిది కలదె యిచటు♦నందుఁ గలుగు
నెలవు లెల్ల గాంచి♦నెక్కొలు గైకొందు, మన్యతలము నెనయు♦నట్టి పనికి.

ఉ॥ ఇందుఁ గలారు రక్కసు ల ♦ హీంద్రులు కిన్నరు లన్యులుం ధరా
కందరశైలసానుఘన ♦ కాననసీమల నాక్రమించి సం
క్రందనవంద్య! యెల్లెడలుఁ ♦ గన్గొనఁగా నగు గాలి వీవఁగా
నెందును సంచలించు నె మ ♦ హీధర మట్టులు నీవు నావుడుం. ౧౫౭

కం॥ మెచ్చి ధరణీసుతావిభుఁ, డచ్చోటున నొండుభాగ ♦ మల్లనఁ గని యా
ముచ్చుఁ గనుఁగొంటె సీతం, గ్రిచ్చి హరించి గిరివోలెఁ♦గదలఁడు తోఁ స్తోం.

ఆ॥ ఒదిఁగె నొంట నెత్తు♦రొలుకు నో రితని, చెయిద మెఱుకపఱుపఁ♦జెట్ట బలువు
గలఁడు పులుఁగురూపు♦గైకొనిన ట్లున్న, వాఁడు వీనిఁ జంప♦వలయు ననుచు.

కం॥ ఘోరశరము దొడి యేయం, గా రాఘవుఁ డడరు సన్న♦గని పక్షీంద్రుం
డారాటపడుచు నిట్లనె, శ్రీరామా! యనుచుఁ జేరి♦చేడ్పడునుడితోం. ౧౬౦

—♦ జటాయువు శ్రీరామునిచే మోక్షముం బడయుట. ♦—

ఆ॥ ఏ జటాయువుం గ♦దే జీవనౌషధి, దేని నరయ నడవిఁ♦దిరుగుచుంటి
వదియు నాయసువులు♦నసుర రావణుచే హ, రింపఁ బడిన వైన♦రీతి వినుము.

ఉ॥ మిమ్ము మొఱంగి సీతఁ గొని ♦ మే లని తాఁ జన నాఁపె యార్వ నే
నిమ్మున నుండి పైదుమికి ♦ యేడ్తెఱ సూపి యలంచి యోరి! మా
యమ్మను వీడు మన్న వినఁ ♦ డాదట వాని రథమ్ము వింట్లుఁ దూ
ణమ్ములుఁ దూంట్లువోలె సుర ♦ ణా! పొడి సేసి నియంతఁ గూల్చితిన్. ౧౬౨

ఆ॥ ఎంత సేయనైన ♦ నేమాయె మాయికుం
డొండు రథముఁ గూర్చి ♦ యువిద నునిచి
నన్ను ఖడ్గనిహతి ♦ నఱికి యుప్పరమున
నరిగె నింక నెద్ది ♦ యనఁగఁ గలదు. ౧౬౩

క॥ న న్నన్యనిహతు సేయఁగ, నన్నా! యింకేల యనిన ♦ నడలుచు విలు దూఁ
వు న్నెఱియ వైచి యాతని, గన్నులఁ గని పొదివి పట్టి ♦ గద్గద వాడమఱన్.

ఆ॥ ఆటులె యార్తిఁ బొరలు ♦ ననుజునిఁ గనుఁగొని
మున్నె యాపదలకు ♦ మొదలుఁ దుదియు
లేక యుండ నిష్ఠ ♦ శ్రీకరుం డీమిత్రుఁ
డిట్టులయ్యె నింక ♦ నెడయుఁగలదె. ౧౬౫

క॥ నాదగు నలక్ష్మి యబ్ధిం, బా దగపడ నింకఁ జేయుఁ ♦ బావకు నార్చున్
శ్రీద యగు భూమి నూపర, మా దారిఁ బొనర్చు ననుట ♦ యనధిగతంబే. ౧౬౬

తే॥ ఈవ్యసనవాగురాబంధ ♦ మెట్లు ద్రెంతు
నీపితృవయస్యు చెలిమి నే ♦ నెట్లు మఱతు
నని యతనిఁ గ్రుచ్చి యన్న! మ ♦ దర్థ మిట్లు
పడితె యని బిట్టు ఘోషిల్లెఁ ♦ బద్మనయన! ౧౬౭

ఉ॥ వెండియుఁ దమ్మునిం గని ని ♦ వేదితవృత్తతఁ గాంచె నింత కీ
యండజ మండఁబాసి చన ♦ నయ్యెడు విక్లబ మయ్యెఁ జూఁపు నో
రెండెడుఁ బ్రాణము ల్నిలక ♦ యిట్టటు దూఁగెడు మత్కృతంబునన్
గండడఁగెంగదా పులుఁగు ♦ గండరగండఁ డటంచుఁ బొక్కుచున్. ౧౬౮

ఆ॥ పక్కితేని మేను♦పరుపార నిమురుచు, నన్న! యోపుదేని♦నతివ యున్న
పలుకు లసుర తెఱవు♦పాపి నిన్గూల్చిన, కడఁక వినుచు మనుచు♦నడుగుటయును.

క॥ దీనాత్ముఁ డయ్యు ఖగపతి, దీనత రఘువిభుఁడు వేఁడు♦తీ రారసి ని
ధ్యానించుచు గద్గదకం, ఠానద్ధముగాఁగ నిట్టు♦లనె గుహాజననీ! ౧౭౦

వ॥ రావణుండను రాక్షసేంద్రుండు బ్రహ్మపౌత్రుండగు విశ్రవువలనఁ గైకసి యను
నాదిమరాక్షసపుత్త్రియందు జన్మించినవాఁడు సముద్రగతయగు లంకాపురి నేలు

చుండు నాతండు నాఁగలని యోటమి సంభావించి వాతదుర్దినసంకుల యగు తన మాయం బ్రవర్తిల్లఁ జేసి యలమటపడియున్న నన్నీశ్వరవరలబ్ధం బగు ఖడ్గంబున నడఁచి కూలంద్రోచి రామరామా యని యడలుచున్న యద్దేవిం గొని దక్షిణాభిముఖుండై చనియె. నాతండు వాలినమగంటిమికలిమి సామాన్యు లెక్క-సేయం డనంతరవిధానంబు నడుప దేవరవారి యంతరంగంబే ప్రమాణం బవ్వాఁడు విందనామకముహూర్తంబున నీసాధ్వి హరించెం గావున బడిశంబు గొన్న మత్స్యంబుకైవడి నచిరకాలంబునన నశియించు నీధనంబు నిన్నుఁ జేరు నీవు సుఖం బెనయంగలాఁడ వియ్యంశం బమ్మదోన్మత్తుం డెఱుంగం డింకను బలు పలుకు లాడం జాలఁ గాలం బాసన్నం బైనయది యుశీరశీర్షకంబులగు సౌవర్ణ వృక్షంబులం దిలకించుచున్నవాఁడ లీలామానుషమూర్తి వగు నిన్నుం గనుంగొనుచు నీచే నుపలాలితుండ నగుచు నుసుఱులు వాయంగంటి నీ దయ యుంచవే యని యాస్యంబుననుండి శోణితం బురలం గన్ను లెఱ్ఱఁజేసి కాలు సాఁచి తల నేల వైచి యాచిరంతనమిత్త్రుం డగు పతత్త్రికులావతంసుండు గతాసుం డయ్యె నయ్యవసరంబున. ౧౭౧

క॥ పలవించుచు సమదుఃఖిత, నలమటఁ బడు తమ్ముఁగుఱ్ఱ ♦ నారసి యిమ్మైఁ
బలికె రఘుకులతిలకుఁ డ, క్కలాయనిలయేంద్రు నాఁచి♦కొను నెమ్మదితోన్.

మ॥ సుఖ ముండెన్ బహువర్షము ల్బలుఁడున్ ♦ శూరుండునా నొప్పి స
త్సఖుఁ డయ్యెం దమతండ్రికిం దమకు నీ ♦ తాశోకమోకంబు నెం
చి ఖరుం డాసురుఁ గిట్టి పోరి తెరలిం ♦ చె న్వాని ప్రాబల్య ము
న్ముఖుఁడై వార్తయుఁ జెప్పి మేనెడలెఁ బ్రా♦ముఖ్యంబు భావించితే. ౧౭౩

క॥ కాలము దురతిక్రమ మిం, కేలా విలపింప నితని♦కెయ్యది హిత మి
వ్వేలఁ బొనరింప నగు మ, త్ప్రాలంబనపరుఁడు ముక్తిఁ♦బడయక యున్నే. ౧౭౪

ఆ॥ ఎట్టిపుట్టులందు♦నేనియు శూరులు, సాధువర్తనులు ప్ర♦శాంతు లుందు
రట్టి ధర్మ వెనసి♦యస్మచ్ఛరణ్యుఁడై, సర్వతః పశస్తిఁ♦దవిలె నితఁడు. ౧౭౫

ఆ॥ తాతజనకమృతియు ♦ సీతాహరణమును, గృధ్రరాజవిగమ ♦ కృచ్ఛ్రకోటి
నెనయఁ జాల వింక ♦ నేర్చి తెమ్మింధన, వితతి లెమ్ము శుద్ధ ♦ విషయముగను.

క॥ అని యాతఁడు సమకూర్పఁగ, ననలుని మథియించి కొని మ ♦ హామతి సత్పా
జ్యుని మాన్యునిఁగాఁ బతగేం, ద్రునిఁ బొగడుచుఁ జిత నమర్చి♦శ్రుతమంత్రవిధిన్.

ఉ॥ ఆతని దానిపై నిడి శ ♦ యానునిఁగాఁ బొనరించి సంస్కృతం
బై తనరారు వహ్ని నెఱ ♦ యం దరికొల్పి పతంగముఖ్య ! భూ

దాతలు ధర్మశీలు రథి ♦ తత్త్వసమాహితు లాహితాగ్నులుం
బూతచరిత్రులుం బడయు ♦ పుణ్యపదం బగుఁగాక నీ కిటన్. ౧౬౮

క॥ అపరావర్తివ యైతివి, విపరీతునివలనఁ గెడయు ♦ విధ మైనను నా
యుపకారమువల నరసితి, వపరావృత్తము సువర్గ ♦ మయ్యెడు నీకున్. ౧౬౯

వ॥ అని యుగ్గడించి. ౧౭౦

ఉ॥ అండజరాజతృప్తికయి ♦ యన్నయుఁ దమ్ముఁడు రోహిమాంసపుం
బిండము లుంచి పుల్లుగుమిఁ ♦ బ్రీతిలఁ జేసి జలావగాహ మా
దండ నె గౌతమి న్సలిపి ♦ తర్పణము ల్పచరించి యన్నెయిన్
నిండుమదిం బితృక్రియలు ♦ నిష్ఠితులై పొనరించి రాదటన్. ౧౭౧

ఆ॥ రౌద్రియామ్యసూక్త ♦ రాజపారాయణం, బొనరఁ జేసి ముక్త ♦ యోగవిధియు
జరిపి సౌమ్య!నీవు♦సర్వోన్నతుండవై, పరమపదము సేరి♦పరఁగు మనిన. ౧౭౨

వ॥ ఆక్షణంబె యాగృధ్రాధినాథుండు. ౧౭౩

తే॥ దివ్యరూపధరుం డయి ♦ తేజరిల్లెఁ
బారిషదు లొంటఁ గొలువఁ బు ♦ ష్పకము నైద్యు
తాభ మొప్పార సురలు పు ♦ ష్పపఙ్క్తి
వృష్టి మొనయింప హార్షాబ్ధి ♦ వేల గడవ. ౧౭౪

క॥ ఎవ్వని నామస్మృతిచే, నివ్వాటిలునో కర్మయోగ ♦ నిష్ఠాఫలముల్
నొవ్వక తత్కృత సంస్కృతి, నవ్విహగము ముక్తిఁ గాంచు♦టబ్బురము చెలఁగా!

ఆ॥ కేలుదోయి నుదుటఁ ♦ గీలించి సంభ్రమ, హర్షకలన లొంటు ♦ సందడింప
రాముఁ జేరవచ్చి♦రాణించు భక్తి నా, తండు వొగడఁదొడఁగెఁ♦దలిరుఁబోఁడి!.

—♦ జటాయువు శ్రీరాముని నుతించుట ♦—

క॥ ఏ నెంతధన్యుఁడనొ ల, క్ష్మీశ్రనాయక నిన్నుఁ గొలుచు ♦ సిరి యొదవెఁ దప
స్థాన మనఁ దనరు మునులును, నీ నెఱి యిట్టి దని నొడువ♦నేర్చినవారే. ౧౭౫

సీ॥ గణియింపలేము నీ ♦ కల్యాణగుణము లో, యఖిలాత్మ!నీరూప ♦ మప్రమేయ
మెట్టులు వర్ణింతు ♦ మట్టిఁడా మాహాత్మ్య, మంతలంతలె విలా ♦ సాధిగమము
లెల్లకర్జములపై ♦ హేతువు నీశక్తి, లాలించు శ్రుతి యోగ ♦ లక్ష్మి నిన్నె
యపరుఁడ వయ్యుఁ బ ♦ రాత్మతత్త్వమ వైతి, నిరవధిసుఖదాయి ♦ నీదు చెలిమి

కల్పతరువుల నీడ ని ♦ కామభోగ
భోగిపర్యంకమున ♦ భక్తపుంజదుఃఖ
శమని సిరి గొల్వ నెగడి భా ♦ స్కరశతద్యు
తీద్యమానమై యొప్పఁ గయ్యది ♦ యిదియ కాదె. ౧౫౮

ఆ॥ పుట్టునట్టు లెనసి పోరలు ♦ వారల కెల్ల
దూరమగును నీపరి ♦ చారి యెప్పుడు
నభవ! భవము తెరువు ♦ నాదరింపని ఘనుల్
మునులు నిన్నుఁ గొలువ ♦ మొనయఁగలరు. ౧౫౯

క॥ భవజలనిధి దాటింపఁగ, భవవినుతము నీదు పాద ♦ పద్మమె పోతం
బవిరతసుఖదాయక మది, రవిశతనయాద్యుతిసమక్ష! ♦ రాజీవాక్షా! ౧౬౦

ఆ॥ సముఁడవయ్యు దనుజ ♦ సాహసరి మొడలింతు
వజుఁడవయ్యు జనన ♦ మందఁగాంతు
పరమపదము నంద ♦ పరఁగియు మునివృత్తి
లెనసి మెలఁగె దెవ్వఁ ♦ డెఱుఁగు నిన్ను. ౧౬౧

క॥ గిరివరధారీ! యెప్పుడున్, గిరిజాగిరిశులు భజించి ♦ కీర్తింతురు నీ
వరద మగు పదము నెట్టిన, సురాసురు ల్గొలిచి యెదలఁ ♦ జొక్కుట యరుదే.

క॥ పరహితనిరతాత్మకు లటు, పరగుణాభిఖ్యాతితుష్టి ♦ పరులు పరస్త్రీ
పరధనవిరతులు నిను రఘు, వర! కొలుతురు భాగ్యలక్ష్మి ♦ వరమిడ యనుచున్.

ఉ॥ ముద్దులు గుల్కు మేల్నగవు ♦ ముచ్చట లొల్కెడు మోము నీలపుం
బద్దులు దిద్ది కొప్పు నెమ్మెఱుఁగు ♦ పట్టగు మేను దయామయాబ్ధికిన్
హద్దనఁజాలి జాలి తెఱఁ ♦ గల్లనఁ బాపఁగనోపు చూపు నీ
యొద్దనె కాక యొప్పెకడ ♦ నొక్కెడనేనియుఁ గద్దె రాఘవా! ౧౬౪

క॥ హరి యని కమలజుఁ డని శం, కరుఁ డని త్రిగుణానువృత్తిఁ ♦ గల్పించితి వా
తరణి జలపూర్ణఘటమున, స్ఫురించి భిద నేర్పడించు ♦ పోల్కి నధీశా! ౧౬౫

క॥ రతిపతిశతకోటినిభున్, శతగతిగోచరమతిపరి ♦ చారవిదూరున్
యతికృతిసుమనోహితు రఘు, పతి నిను సేవించి భవముఁ ♦ బాసితి దేవా! ౧౬౬

క॥ అని యిటు లేకపరిజ్ఞన్, వినుతించు విహంగవిభు వి ♦ వేక మరసి య
మ్మనుకులతిలకుఁ డనియెం గనుఁ, గొనలు దయాప్రకృతు లతనిఁ ♦ గొని లాలింపన్.

ఆ॥ అన్న! నీయొనర్చి ♦ నట్టి యీ స్తవరాజ, మెవ్వఁడు ప్రియముఁ జదువు ♦ నేకభక్తి
విను నతండు నీవు ♦ గనినట్లు సారూప్య, మంది పరమపదము ♦ నందఁగలఁడు.

క॥ అను పద మను శ్రీరామున, కనుపదమే యెఱిఁగి యరిగె♦సల వైకుంఠం
బను పదమునకు జటాయువు, తనపదవిన్ సురలు మునులుఁ♦దస్త్రయుఁ బొగడన్.

ఉ॥ అచ్చటు వాసి వాసిఁగను ♦ నన్నయుఁ దమ్ముఁడు వింతతాపులుం
జొచ్చి విమర్శసేయుచుఁ బ్రి ♦ సూనఫలాంచితవృక్షషండముల్
మెచ్చుచు దక్షిణాపథము ♦ మేకొని పశ్చిమమార్గ మెంచుచున్
జెచ్చెరఁ బోయి రొండుదెసఁ ♦ జేరి మెలంగు తెఱంగు లేర్పడన్. ౨౦౦

—♦ రామలక్ష్మణులు జనస్థానము దాటి తిరిగి సీత నన్వేషించుట. ♦—

క॥ మించు జనస్థానమును గ్ర, మించి యవల సాలగుల్మ♦మేదుర మగు నా
క్రౌంచారణ్యముఁ గాంచిరి, పంచాననవిక్రమప్రపంచితు లచటన్. ౨౦౧

క॥ కలతలము లెల్ల నారసి, కలభగమనఁ గాన కదియుఁ♦గడచి ఘనవనం
బలఘుతరతరుదరీవృత, మలఘుపరాక్రములు సొచ్చి♦యలమటపడియున్. ౨౦౨

—♦ మతంగాశ్రమమార్గమున లక్ష్మణుఁ డయోముఖిని పరాభవించుట ♦—

క॥ ఆ శ్రమ మెన్నకయె మతం, గాశ్రమ పుందోవ నున్న ♦ యక్కొనను గ
ర్భాశ్రియమున దరి యొక్కఁడు, సశ్రీకులు గని సకాశ ♦ సంగతు లగుచున్.

క॥ ఆదరివోలె భయంకరి, యై దరిఁ జూపట్టె నొక్క ♦ యాసురి ఘోరా
పాదృష్టి యానినాదము, మీఁ దెఱుఁగనివారి నెల్ల ♦ మెలఁచి యలంపన్. ౨౦౩

చ॥ మెకములఁ బట్టి కీల్వఱిచి ♦ మెక్కుచుఁ జొక్కుచుఁ దీక్ష్ణదంష్ట్రికల్
వికృతకరాళవక్త్రమును ♦ వ్రేలు శిరోజము లుబ్బి జాఱు స్థూ
లకుఁ దగు గట్టిచర్మమును ♦ ఘాకవచింపఁగఁ ద్రోవ కడ్డమై
వెకలితనంబున న్నగుచు ♦ వెక్కస మౌ బలుసంభ్రమంబునన్. ౨౦౪

క॥ తా మున్నుగ నరుదెంచెడు, సౌమిత్రిం బొదివి పట్టెఁ♦జాలుదు పీవే
నా మేలు దలఁచి యేత్తెఱ, గాము మదం బడఁచి నెగడఁ ♦ గా సని పెలుచన్.

వ॥ వెండియు. ౨౦౫

తే॥ ఏ నయోముఖి యనుదాన ♦ నిచట నిన్నుఁ
గాంచి మోహించి యిటు సంభ్ర ♦ మించితి నిఁక
గోనల నదీపులినగిరి ♦ కూటములఁ బె
నంగు మిటు నీ బ్రదుకునన్ని ♦ నాళ్లు ననుచు. ౨౦౬

తే॥ గ్రొచ్చి యుపగూహన మొనర్చి♦కొసరుచున్న, చెట్టరాకాసిఁ దిట్టి వ♦శిప్రవరుఁడు
కర్ణనాసా స్తనమ్ముగి♦ఖండితమ్ము, సేయ నఱచుచు నది రక్త♦సిక్త యగుచు.

క॥ బిలముఖము సొచ్చి చనె న, వ్వల గహనం బైన యొండు♦వనమునఁ జనుచో
గలుగు శకునముల నారసి, కలఁగుచు సౌమిత్రి రాముఁ♦గనుఁగొని పలికెన్.

క॥ దాక్షిణ్యనిధీ! యేమొ యు, దక్షిణభుజ మదరె నిట్టి♦తఱి దారుణమహా
పక్షియు వంచుల కాఖ్యం, బక్షీణరవంబు గాఁగ♦నఱవం దొడఁగెన్. ౨౦౧

ఆ॥ మఱియుఁ గొన్ని చెడుగు ♦ మలకలు గనవచ్చె
నింక నెట్టి యొదరు ♦ లెదురుపడునొ
కాని యవల జయము ♦ గలిగెడు నని మదిఁ
గూర్పఁ బడియె నయ్య ♦ కోవిదేంద్ర! ౨౦౨

వ॥ ఎట్టులైనను దుర్గమం బగు నియ్యటవీగర్భం బుత్తరించు నంతవట్టు నెట్టన నవ
ధానపరుండవై యుండుము. ౨౦౩

తే॥ అనుచు శుచి శీలవంతుండు♦నైన లక్ష్మ
ణుండు వలుకంగ నలఘువీ♦రుండు రాముఁ
డట్లు మేకొన్న నన్నయు ♦ ననుజుఁడునుఁ ద
దంతరం బెల్ల నరయుచు ♦ నరుగునపుడు. ౨౦౪

క॥ విపుల మగు శబ్ద మొక్కఁడు, విపినము భగ్నంబుగాఁగ♦విన్నను మన్నున్
విపరీతముగా స్వర్గం, బపగత మగు ననఁగఁ దోఁచె♦నయ్యెడ నగజా! ౨౦౫

క॥ ఆరావ మట్లు పొడమఁగ, నే రాక్షసకృత్యమో మ♦హీయస్త్వమునన్
బోరామి వెట్టునో యని, యారాముఁడు తోఁడుతోడ♦నటు గను నంతన్.

—♦ కబంధవధ. ♦—

సీ॥ కాటుకకొండపైఁ♦గాలుద్రవ్వెడు మేను, చీఁకటిచెలిమికి♦చేయి సాప
నబ్ధిగర్భంబున ♦ నాఁబడ బాముఖ, మ ట్లుదరమున ని ♦ జాస్య మమర
నవి మిత్తి దాల్చు వా♦లమ్ములే యనఁగ నై, దీర్ఘవాలమ్ములు♦దివులుసూప
మందరమ్మున చుట్టు♦నులఁచిన వాసుకి, తలఁపోఁకలను బాహు♦వులునయింప
నమ్మెయిఁ గబంధమాత్రుఁడే ♦ యగుచుఁ దన్ను
బేరునఁ గబంధుఁడా యని ♦ పిలుచువారి
నోరు సెడఁ దోనె పెడలాగి ♦ నోటఁ బెట్టు
కొనెడు చెడుదానవుని రఘు ♦ కులుఁడు గాంచె. ౨౦౭

తే॥ వాని యోజనపర్యంత ♦ వర్తులైన, దీర్ఘభుజములఁ జిక్కి వి ♦ దీర్ణతఁ గను
మేటులం గని తనపడు♦పాటు లెంచి, చేరదే నాఁడు మృత్యువా♦ చెట్టఁబెరయ.

క॥ కొండ యన నైన యాపెను, మొండెములోఁ దలకుఁ జేర్ప ♦ మొగిఁ బ్రాఁకెడు బల్
దండలకుఁ దోఁడుగా వే, దండశతసహస్రబలయు ♦ తత్వముఁ దనరున్. ౨౧౯

తే॥ యోజనాయతతద్బాహు ♦ యుక్తిఁ దవులఁ
గాంచుగతి గల్గిన విముక్తి ♦ గలుగఁబోవ
దెంతబలవంతులకునేని ♦ నెట్టి సత్త్వ
ములకునేనియుఁ దద్గర్భ ♦ మును మొనయక. ౨౨౦

తే॥ అగ్నికుండం బనఁగ నొక్కఁ ♦ డాయత మయి
కన్ను వక్షస్థ్సలంబునఁ ♦ గ్రాలుచుండు
నాశుదర్శిత్వ మద్దాన ♦ నలవడుఁ బెను
కోఱ లన్నాల్క యచటనే ♦ గ్రాలుచుండు. ౨౨౧

క॥ ఉమిసినఁ బెడవాఁతఁ దెరలు, నెముకల ప్రోవులును గొండ ♦ లే యనఁగా న
య్యము ద్వారము ప్రాప్తప్రా, ణిమృతిక్రమలబ్ధఘోర ♦ ణిం దెలియ నగున్.

తే॥ ఇట్టి మార్గంబు గొని వచ్చు ♦ నెటఁగి యసుర
దిట్ట భుజపంజరమున బం ♦ ధించి తివిచెఁ
గూర్చు గాచిల్కలను వారుఁ ♦ గ్రోశమాత్ర
ముననె కాంచియు లోఁబడి ♦ మొనసి రంత. ౨౨౩

క॥ ధైర్యమునను సాహసమున, నర్యమతేజుండు రాముఁ ♦ డలఁతిపడఁడు సం
ధార్యత బాలత్వము నని, వార్యము లౌట ననుజన్ము ♦ వద్యుఁ డలుకునన్.

తే॥ అన్నతో నిట్టు లనె వీని ♦ యలఁతి గాని
సందిఁటం జిక్కితి మొకొండు ♦ సరణి దోఁప
దిచట న న్నిడి యెందేని ♦ నెయిదు మవల
నె ట్లగు తలంపు విధిమది ♦ నెనయఁ గలదొ. ౨౨౪

క॥ మొనసి సుఖ మందు తటి నను, మనమున నిడి మేలిగతికి ♦ మలయించెద వి
మ్మనకు నగు మార్గ మియ్యదె, యన రఘుకులసింహ మిట్టు ♦ లనె నాతనితోన్,

ఆ॥ ఇంత కిట్టు లయ్యె ♦ దే నాఁటిసత్త్వంబు. దలఁపవలదె భూమి ♦ తలను మోఁచి
ననుచు నీ వెడల మ ♦ నస్విత గాపాడు, వార లెవ్వ రింక ♦ వసుధలోన.

క॥ ఆపదలు రాఁదొడంగినఁ, జూపట్టదు తుదియు మొదలు ♦ శుద్ధాత్మ! యటే
ప్రావరయు శుభము లొక్కట, నేపట్టుననేని విధియె ♦ హేతువు తలఁపన్, ౨౨౭

ఉ॥ శూరులయేనియు న్నుపరి ♦ శుద్ధులయేనియుఁ బుణ్యులేనియున్
నేరుపుమీఱఁ గర్జముల ♦ నెట్టనఁ దీర్చినవారలేనియున్
గా రొకవేళ నొక్కతృణ ♦ కంబున కైననుఁ బోల్ప నంతతోఁ
బోరు మహాత్ము లాదురు వి ♦ భుత్వముఁ గాంతురు మంచి దా గతిన్. ౨౨౯

క॥ కాలము దుష్ట మగుచు మన, పాలఁ బడెన్ సీత నరయు ♦ పని యని కాక
వ్వేలఁ గడచి యఘుకల్లో, లాలంబన మైన యాప ♦ దబ్ధియుఁ బెరసెన్, ౨౩౦

ఆ॥ ప్రాప్తకాల మరసి ♦ పైఁబడు నది మెల్లఁ
ద్రోఁచి పుచ్చుచు న్ని ♦ రూఢి తనర
నున్నయంత మీఁద ♦ నొదవదే యొండొక్క-
తటియుఁ దటియు మేలు ♦ దలఁపరాదె. ౨౩౧

మ॥ అనుచుం జేరఁగవచ్చువారిఁ గని య ♦ య్యాదిత్యవిద్వేషి యే
మనువా రెవ్వరు మీర లేమి పనికి ♦ ట్లత్యర్థ మప్రావ్య హా
వనకృత్యం జొరఁగంటి రిచ్చటనె మీ ♦ వ్యాపార మేపారెనే
కనరో కాలముఁ గర్మముం జెనయఁగాఁ ♦ గావే యకార్యంబులున్. ౨౩౨

చ॥ పొడవగు కొమ్మ లొప్ప ♦ దరి పోటున కోపిన కోఁతు లట్లు మీ
రడరుచు వచ్చి రీశరశ ♦ రాసనము ల్బలమీఱి నెక్కొనన్
దడ పొకయింత గల్గిన వి ♦ ధానము లెంతురుగాక యిమ్మెయిన్
బడుదురు నోట నాపయినిఁ ♦ బాల్పడునే కథ మాయకుండునే. ౨౩౩

ఆ॥ క్షుధ యలంచుచున్న ♦ చొప్పించి విధి మిమ్ముఁ, జూపె నిదియకాదె ♦ శోధనం బ
హంబు పెక్కునాళ్ల ♦ కమరె నా కాహార, మొడసియున్న కొఱఁత ♦ యింత దీఱ.

క॥ రం డని గర్జిల్లుచు నా, తం డటు కర్షింప రాముఁ ♦ దమ్ముఁడు గని యిం
కొండు దలఁప నేల భుజా, దండ మొకఁడు నఱుకు మొందు ♦ తన పని య యగున్.

ఉ॥ వీఁ డిటు వ్యాపరించె నగు ♦ వ్రేయఁగ నింకిట నూరకుండినన్
వాఁడిమగంటుము ల్గలుగు ♦ వారలు చంపరు వాని జన్నమం
దోడిన యప్పసింబలె ర ♦ ఘూద్వహ! భీషణుఁ డం చెఱింగియుం
జూడఁగరా దనంగ బల ♦ సూదనవంద్యుఁడు రాముఁ డో మనన్. ౨౩౬

ఆ॥ వాఁడు వెకలినవ్వ ♦ వఱల నెట్టెట్టు లే
దేది యని గ్రసింప ♦ నెగువ శితము
లైన ఖడ్గములను ♦ దానవు దక్షిణ
వామభుజము ఱడఁచి ♦ వైచుటయును. ౨౩౭

క॥ రోహిణశాఖ లన జగ, ద్ద్రోహికరము లవనితలము♦నుర్వింగఁగఁ బడఁ బ్రా
త్స్నేహుఁ డగుచు వాఁ డయ్యెడ, నాహరియుగ్మంబుఁ గాంచి♦ యనె నిట్లు సఖీ!

క॥ నాపాలిభాగ్యదేవత, లో పరదేవతలొ మీర♦లొక్కటఁగ నన్నై
యీపగిది కర్జము న్వాఱ, పేపఱ నెఱపితిరి తెలుపుఁ♦డీ దయ వెలయన్. ౨౩౯

తే॥ అనిన వానికి శుభలక్ష♦ణాంచితుండు
లక్ష్మణుం డిట్టు లనె గుణా♦లయుఁ డితండు
రాముఁ డే లక్ష్మణాఖ్యుండ♦ రహిఁ దనర్చు
నన్నదమ్ముల మే మర్త్య♦ మాన్వయులము. ౨౪౦

క॥ ఇమ్మహనీయుని సతి సీ, తమ్మ న్నే మింట లేని♦యను వారసి గొ
ద్రిమ్మరియో కొనిచనె వాఁ, డెమ్మె యి పిమ్మటిపడంగ♦నెంచెనొ పదపన్. ౨౪౧

ఉ॥ ఆయమ నారయ న్వనవ♦ నాంతరము ల్గనుచుం గడంగి రా
నామెను నీపాలంబునకు♦ నన్యవిలక్షణ మైన మేనితో
నీయెడ నుంటి వెందులకు♦ నెవ్వఁడ వీ వభుజుండ వయ్యు ని
ష్ట్రేయను వెంచి సంతసిలె♦ దేర్పడఁ దెల్పుము మాకు నాప్తుడన్. ౨౪౨

వ॥ అద్దేవారి హర్షపారావారంబునఁ దోఁగుచు నిట్లనియె. ౨౪౩

క॥ స్వాగతమె మీకు సద్గుణ, యోగాశ్రయులార! నను మ♦హాహాన్నతుఁ జేయన్
గాఁగల కర్జ మరసి యి, ట్లీగతి నరుదెంచితిరె స♦మీహితబుద్ధిన్. ౨౪౪

తే॥ ఏమికతననొ యిమ్మహా♦ హిపప్రిసార
మైన భుజయుగ మొకవేళ్టు♦ నంది తెగియె
వజ్రిసారం బనఁగ నేల♦ వత్తు రెట్టు
లీరు మద్భాగ్యము ఫలాప్తి♦ నెనయకున్న. ౨౪౫

—♦ కబంధుని పూర్వజన్మవృత్తాంతము. ♦—

ఉ॥ నాయెడ లిట్టులైన తొలి♦ నాఁటి దొసంగు తెఱంగు దెల్పెదన్
శ్రీయుతులార! చక్కఁ జెవిఁ♦ జేర్పుఁడు నేర్పున నేఁడు రామనా
మాయిత మిమ్మహాస్పదము♦ మానిత మాదృతి మీఱఁ దన్నుఁ దా
నై యెలయించి ధన్యతమ♦ తాంచితుఁ జేయఁగ నైన యిన్నెఱన్. ౨౪౬

ఆ॥ తనరినాడ మున్ను♦ దను వను గంధర్వ
సుతుఁడ నగుచు స్త్రైణ♦ సుఖమనోజ్ఞ

రూపయౌవనప్రౌఢ ♦ విలాసోద
యుండవై చరించు ♦ చుంటిఁ గడఁగి. ౨౪౭

క॥ అంచితతపఃప్రసక్తి వి, రించను మెప్పించి చనని ♦ శ్రీవిభవము చే
మించిన యవధ్యతను న, ర్థించి పడసి సాటి లేక ♦ రెమ్మి మదమునన్. ౨౪౮

క॥ అక్రమము నెఱయ నష్టా, వక్రమునీంద్రుని సురేంద్ర ♦ వంద్యచరణు ని
ర్వక్రునిఁ గాంచి హసించితి, విక్రాంతి పెరల్పదే వి ♦ వేకనిరూఢిన్. ౨౪౯

తే॥ అమ్మహాత్ముని క్షమ కోరిధుఁ ♦ డాక్రమింప
స్త్రీస్వభావశాలీనతా ♦ స్థితిభజించెఁ
దోనె క్రాలుచు ననుఁ గాంచి ♦ ధూర్తుఁడ! పిశి
తాశనుండవు గమ్మని ♦ యుఱుముటయును. ౨౫౦

తే॥ పాదములపైఁ బడి మహాను ♦ భావ! సదయ!
నేరమి క్షమింపవే యని ♦ నియతి దనర
వేఁడుకొన వేడబంబులు ♦ విడువు మింక
నేని నానుడి దెస నవ ♦ ధాని వగుము. ౨౫౧

తే॥ దశరథాత్మజుఁ డగుచుఁ ద్రే ♦ తాయుగమున
దానవారి జనించుఁ ద ♦ ద్దయుఁ బ్రసక్తి
మౌనివర్యులఁ గాచు దు ♦ ర్మదుల నడఁచు
వచ్చు నద్దేవుఁ డీ పున్న ♦ వనమునకును. ౨౫౨

క॥ అన్నయుఁ దమ్ముఁడు నన్నెఱిఁ, గొన్నవిలుతుఁ డిరురూపు ♦ గొనె ననన్నై రా
మన్నన సెడ సీ వడరఁగ, వెన్నెలరాయని హసించి ♦ వెలయు మొగములన్.

క॥ తనరారుచు నే నీయో, జనాయతమము ప్రబల మగు భు ♦ జద్వయము త్రెగన్
ఘనభుజు లడఁచి తొడుసుమే, ననలముచే నిడి దహింప ♦ నగు యోగమునన్.

ఆ॥ తొంటిచందమునను ♦ దొడరు సంగున మించి
యాపరాత్ము కొలువు ♦ నందఁ గాంచి
పరమపదముఁ బడయు ♦ భాగ్యమ్ము నీ కగుఁ
బొమ్మటంచుఁ దపసి ♦ పొదలుటయును. ౨౫౫

ఉ॥ రక్కసి రూపు బల్మొగిలు ♦ రాయిడి వెట్టడు మేను మించు వే
రుక్కున బీరముల్ సుజను ♦ లోర్వని చెయ్యములుం దలిర్పఁ జేఁ
జిక్కినవారి వెక్కసపు ♦ సిల్గులపా లొనరించువాఁడవై
యొక్కట నింద్రుపైఁ గవిసి ♦ యాంత విధాతృవరమ్మె యస్మదిన్. ౨౫౬

క॥ ఆతనిఁ బీడింపఁగ వ, జ్రాతత పాతమున శిరము ♦ నంఘ్రులుఁ జొరఁగన్
గోత మొనరించె నుదరముఁ జేతులు విడనాడె నేమి ♦ చింతించెనొకో. ౨౫౭

ఆ॥ చావరాని వెతయె ♦ సంభవించెను వర
యుక్తి ననుచు నేడ్వ ♦ నొడ్డు దెలుపఁ
గరుణ నింద్రుఁ డిట్లు ♦ గన్ను నో రురమున
నుండఁ జేసి బ్రదుకు ♦ మోరి యనియె. ౨౫౮

క॥ ఆదట నిచ్చో టొకఁడే, నాదైవము బలిమి కలిమి ♦ నందఁగని యి
ట్లీదరిఁ జేరెడు ప్రాణుల, వా దనకే మెసవి యొంటి ♦ వర్తిలుచుంటిన్. ౨౫౯

తే॥ ఇట్టి యుదరంభరినిఁ దరి ♦ యింపఁజేయ
మీర లరుదెంచితిరి దీని ♦ మించు మేలు
గలదె దహియింపుఁ డిమ్మేను ♦ గంప వెట్టి
యన్నలార ! దయాపర ♦ మూర్తులార !. ౨౬౦

క॥ తొల్లింటి రూపుఁగని యా, తల్లి శుభ మ్మరసి తెలుపఁ ♦ దావల నూఁపన్
బల్లిదు లగు మీ కెయ్యది, యొల్లనిపని నెఱపుఁ డిప్పుడ ♦ యొలయుదు ననుచున్.

శా॥ ప్రార్థింపం బరమార్థ మంచు మది సం ♦ భావించి యవ్వాని మే
నర్థిన్ లోయ దొరల్చి వన్యగజక ♦ ట్యాభజ్యమానంబు లం
తర్థామంబులు నైన కాష్ఠములు సం ♦ ధానించి దీప్తాగ్నిచే
నిర్ధూమంబుగఁ గాల్చి రాసురలు మా ♦ నిశ్రేష్ఠులు న్మే లనన్. ౨౬౨

క॥ ఘృతపిండోపమ మగు న, య్యతిబలు మే నొరసి యల్ల ♦ నల్లనఁ దుస్స్య
న్మతిఁ గాల్చుచుండె సీతా, పతి మెచ్చుచు ననలుఁ డపుడు ♦ పర్వతతనయా !

ఉ॥ ఆహుతి సేసి యగ్ని కటు ♦ లన్నయుఁ దమ్ముఁడుఁ గాంచుచుండ ధా
మాహితుఁడై దెస ల్వెలుఁగ ♦ నంబరచారిత శంబరాంతక
శ్రీహిత మైన డంబరము ♦ చెల్వము దోఁపఁగ నైన రూపమున్
సోఽహ మటంచు రామ ! సుకృ ♦ తోఽస్మి యటంచు ధరించెఁ జెచ్చెరన్.

క॥ విరజస్కాంబరములు సుం, దరతరభూషణము లచ్ఛ ♦ తరసురభిమిళ
ద్ధరిదంతరసుమదామము, లరు దరు దన్నఁ దాల్చి వితత ♦ హర్షాంచితుఁడై.

ఉ॥ అంచలఁ గట్టినట్టిది మ ♦ హావిభవంబుల మించునట్టి ద
మ్మించుల మండలం బనఁగ ♦ మేలగు పేరు వహించి నట్టి నా
కాంచనపుష్పకం బొకఁడు ♦ గ్రక్కునఁ దోఁచిన రాచవారి రా
యంచలమేటి రాముఁ గని ♦ యాదృతి భక్తి ప్రసక్తియుం దగన్, ౨౬౬

క॥ దనుతనుజుఁడు నయవినయా, వనతుండై కేలు మోడ్చి ♦ వర్ధిష్ణుకలా
వననిర్నిమేషదృష్టిం, దనుపారుచుఁ బొగడె నిట్లు ♦ తత్త్వరసజ్ఞా! ౧౬౭

క॥ మునివరుఁ డాచార్యుఁడుగాఁ, దన కాలిఁటి సుకృత మబ్బె ♦ తారసిలంగా
జనిసాఫల్య మెనయఁగా, ననన్యసామాన్యసిద్ధి ♦ నందితి దేవా! ౧౬౮

క॥ ఉత్సాహ మొనసె మది మహి, తౌత్సుక్యము కలిమి నినుఁ బ♦రాత్ము నుతింపన్
వాత్సల్యనిధివి సంవి, ద్వత్సుఁడ ఏ వెఱుఁగకున్న ♦ తెలువులు గలవే. ౧౬౯

తే॥ అజుఁ డనంతుఁ డనాద్యంతుఁ ♦ డాతఁ డెపుడ
వాఙ్మనసగోచరుం డని ♦ వాస్తవంబె
తెలుపు శ్రుతి యైన దాని కీ ♦ తెలివి గలుగ
నెద్ది హేతువో యయ్యది ♦ యెఱుఁగఁబడదు. ౧౭౦

తే॥ స్థూలసూక్ష్మప్రపంచము ♦ లూహ్యచుచుండు
వెపుడు దృఙ్మాత్రుఁడవ కాన ♦ నిట్టి నిన్ను
జడము వ్యతిరిక్త మసదు దృ ♦ శ్యంబు నైన
మది గనంజాలునే పూని ♦ మాన్యచరిత!. ౧౭౧

తే॥ ఆత్మభాసంబు మఱియు నై ♦ క్యంబు బెరయ
జీవసంజ్ఞుఁడై యాత్మ ♦ చెలఁగుచుండు
నట్టి బుద్ధ్యాదులకు సాక్షి ♦ యైన యట్టి
మదియె బ్రహ్మంబు నీ వటె ♦ యగుదు వెపుడు. ౧౭౨

క॥ ఆనిర్వికారునం ద, జ్ఞానవశంబునన యెల్ల ♦ జగ మారోప్యం
బౌ నడఁగు నన నెఱు నెఱిచే నీ నెల వరయుదురు ఘనులు♦నిఖిలాధీశా! ౧౭౩

వ॥ అట్టి నీసూక్ష్మజగన్మయం బగు రూపంబు హైరణ్యగర్భం బనియు స్థూలభూత ప్రపంచాత్మకం బగు దేహంబు వైరాజం బనియుం దనరుచుండు నందు సూక్ష్మంబు భావనావిషయంబై ధ్యాతృధ్యానమంగళాస్పదం బగుచుండు బూర్వాపూర్వ ప్రధానంబులు నుత్తరోత్తరగుణభూతంబులు మహాదాదుల వలనం బరఁగి తదావృతంబైన స్థూలకోశంబున సకలవైకల్ప్యధారణాశ్రయుండ వైన నీవె విరాట్టునా నొప్పారుచుండుదు. నట్టి నీవైరాజమూర్తికి లోకంబు లన్నియు నవయవంబులై యుండు నందుఁ బాతాలంబు పాదమూలంబును మహాతలంబు పార్ష్ణిదేశంబును రసాతలంబు గుల్ఫస్థానంబును తలాతలంబు జంఘాప్రదేశంబును సుతలంబు జానువులును వితలం బూరువులును నతలంబు కటియు భూమి జఘనంబును నంతరిక్షంబు నాభియు జ్యోతిశ్చక్రం బురస్థలంబును మహర్లోకంబు కంఠంబును జన

లోకంబు వదనంబును దపోలోకంబు శంఖాస్థియు సత్యలోకంబు శీర్షంబును నై
యుండు. నింద్రాదు లయిన లోకపాలకులు బాహువులును దిక్కులు శ్రోత్రం
బులును నాసత్యులు నాసికలును వహ్ని వక్త్రంబును సవితృ దృష్టియుఁ జంద్రుండు
మనంబును గాలుండు భ్రూభంగంబును వాక్పతి బుద్ధియు రుద్రుఁ డహంకారం
బును ఛందస్సులు వాక్కులును యముఁడు దంష్ట్రలును నక్షత్రంబులు దంతంబు
లును జగన్మోహిని యగు మాయ హాసంబును సృష్టి యపాంగ మోక్షంబును
ధర్మంబు పురోభాగంబు నధర్మంబు పశ్చాద్భాగంబును రేఁబవల్లు నిమిషోన్మేషం
బులును సప్తసముద్రంబులు కుక్షియు నదులు నాభియు వృక్షౌషధులు రోమం
బులును వృష్టి రేతఃప్రసారంబును జ్ఞానశక్తి యనుభావంబు నై ప్రకాశించు
చుండు. ౨౨౪

క॥ ఇట్టి దగు స్థూలరూపము, నెట్టన భావించు యోగ♦నిష్ఠితు లెలమిం
గ ట్టైనయుదురు మహాంబుధి, యట్టిద యా భవము దాఁటి♦యఖిలాండపతీ!

తే॥ ఘనుఁడు సర్వజ్ఞుఁ డెపుడు శం♦కరుఁడు దీని
నద్రిజాతకు దెలుపుఁ దా♦నరయుచుండు
సంతతధ్యాననిష్ఠాని♦రంతరతను
దనరు నీరూపనన్యసా♦ధారణంబు. ౨౨౫

తే॥ తారకబ్రహ్మవాచక♦త్వమునఁ దనరు
ప్రణవమున కగు నీపేరు♦పట్టుఁగొమ్మ
యదియె యుపదేశ మొనరించు♦నందఱకును
గాశి విశ్వేశ్వరుఁడు హర్ష♦కలితుఁ డగుచు. ౨౨౬

ఆ॥ ఎట్లు నీదు రూప♦మెంచు సాధకుఁడు త, దాత్మభావ మొనయు♦నంతమునకుఁ
బ్రేమరసము నిచ్చ♦పెరుగ గద్గదపుల, కాంకహర్షపూరి♦తాంగుఁ డగుచు.

సీ॥ విల్లు నమ్ముల వంక♦వేడుక నెఱపుచు, నెనరులకోట నా♦నగవు చూడ్కి
మరుని నిర్యాణంబు♦మాటు సేయఁగఁ జాలు, శ్యామలవర్ణంపుఁ♦జక్కదనము
జడలు వల్కలములు♦సన్న్యాసులకు నేల, యనిపించు తద్భూష♦ణాదరణము
నిత్యానపాయిని♦నిర్మోఘగాత్రి యా, జ్యాపుత్రి నెమకెడు♦సంభ్రమంబు
తోడు తోడ జోడు♦గూడ నౌ పాడియుఁ
దనర మేలిపంట♦మొనయు పొలము
నీదు రూప మెపుడు♦నేఁ దలంతుఁ దొలంతుఁ
గర్మచయము ముక్తిఁ♦గాంతు రామ! ౨౨౭

క॥ ఇది యొక్కటియే చాలును, ముద మొదవింపంగఁ దన్ను♦మా ర్తికిఁ గూర్పన్
సదమలమతి దయసేయవె, యద నిదె కదె రామ! సద్గు♦ణాంచితధామా!

క॥ పరమాత్ముండ వగు నీమా, య రహస్యం బరయనేర♦రయ్యా యది నన్
బెరయక తలంగఁ జేయుము, వరదా! ప్రార్థింతు నిడుదు♦వందనశతముల్.

—♦ శ్రీరాముఁడు కబంధునకు వరము లొసఁగుట.

ఆ॥ అనిన వాని భక్తి♦కచ్చెరు వంది గం, ధర్వరాజ! తుష్టిఁ♦దనరి నాఁడ
యోగిగమ్య మాత్మ♦భోగనిరంతరం, బైన మత్పదంబు♦నందు మయ్య! ౨౮౧

తే॥ ఎవరు నిచ్చలు నీస్తోత్ర♦మిచ్చ నిలిపి, నన్ను భావింతు రవ్వారు♦ననుచువారు
భావభవభవపీడలఁ♦బాసి నాదు, లోకముం గాంచ నంచితా♦లోక మెనయ.

క॥ అని యానతి సేసిన య, మ్మనువంశవిభూషణమ్ము♦మాలిమి గని యి
ట్లనె గంధర్వుఁడు తనమో, మునవికసితకమలలక్ష్మి♦నరసికొనంగన్. ౨౮౪

తే॥ నీ మొఱుంగనియది యొంట♦నెఱయఁగలదె, యైన నఖిలాధినాధ నే♦నంటి మున్ను
దేవిఁ గైకొనఁగా నగు♦తెఱఁగు వినుచు, వాఁడ నని కాన నానుడి♦జాడఁ గొనుము

తే॥ లోకమా ఱగు యుక్తుల♦లో విమర్శ
సేయఁబడుచుండు నొకట ల ♦ క్ష్మీసమృద్ధి
గోరువానికి సాయంబు ♦ గొన కెనయుట
పోల పెందునుఁ గాలం బ ♦ పూర్వవిధను. ౨౮౬

క॥ దశభాగ మెనయు నాతఁడు, దశాంతపరిమృష్టుఁ జేరఁ ♦ దగు నటుగాకీ
వశమున నె దారహరణం, బశనినిభాస్త్ర గణింప♦నయ్యెను నీకున్. ౨౮౭

ఆ॥ కాన నొండు దలఁపఁ♦గా దింకఁ దగునట్టి, మిత్రుఁ జేర్చికొనుట♦మేలు కార్య
సిద్ధి తోనె దాన♦జేకూరు నయ్యది, దెలుపువాఁడ నింత♦దెలిసి వినుము. ౨౮౮

—♦ కబంధుఁడు శ్రీరామునకు మార్గము సెప్పుట. ♦—

సీ॥ సుగ్రీవుఁ డనువాఁడు♦సూనృతచరితుండు, భానుసూనుం డొండు♦పరఁగుచుండు
వానరనాథుండు♦వాఁ డింద్రతనయుండు, వరపరాక్రమశాలి♦వాని భ్రాత
కొండొక కతమున♦గొనకొనె నవ్వారి, కనయంబు విడరాని♦దైన గొంటు
దారవియోగంబు♦దలకొనఁ దరలింప, నై జగం బంతయు♦నరసి కనుచు

మరలి ఋశ్యమూక♦మహీధరంబున గుహా, మేలి తా వటంచు♦మెఱుఁ గెఱింగి
యలఘుమతులు నలువు♦రనుపముల్మంత్రులు, గొలువనున్న వాఁడు♦కొంతదలఁచి.

వ॥ ఆరవిసంభూతుండును బలపరాక్రమతేజోవిశేషంబులం దనరారువాఁడు సత్యసం
ధుండు వినీతుండు దక్షుండు ప్రగల్భుండు ధృతిద్యుతివిద్యాబుద్ధిసంపన్నుండు గామ
రూపి కృతజ్ఞుండు గారణాంతరంబున నట్లొదిఁగియుండెం గాని సాధారణుండు గాఁ
డవ్వాని నలఁతి సేయక సానుజుండ వై యరిగి సానుమంతంబున సానుచరుం
డై యున్న వానరేంద్రునితోఁ వహ్నిసాక్షికం బగు సఖ్యంబు సంధానించుకొనుము.
సహాయార్థి యగు నాతని కర్జంబుఁ జక్కఁ పఱిచి శాఖామృగవాహినుల
పొందికత్తోడం గూడ నయ్యసదృక్షుని సాహాయ్యకంబు వడసి రావణాలయంబున
భవద్వియోగంబునం గృశయై నీకై శోకించుచున్న మహీసంభూత సీత సమా
హిత నారసి యారక్కసుల నుక్కడంచి యద్దేవిం గొనివచ్చి ముదితాత్ముండవై
ప్రజలం బ్రోవం గనుము. మున్నడి యన్నరాదు లున్న సలవులు సడిసన్నలు
నెన్ని యేనియుం బన్నియేనియు నన్నిపుణుం డెఱిఁగి యెఱింగింపంగలవాఁడు నీకుం
జేదోడు వాదోడు నై మేరుగిరిశృంగంబుననో పాతాళలోకంబు గుహానో యా
యమ నునిచి నట్టులైనం గొనితెచ్చి యిచ్చి నీపాదపద్మంబు లర్చింపంగలండు.
సందేహింపవలవదు రామచంద్రా! నీదుమార్గంబు శివంకరం బభ్రంగావృత
మయ్యా యయ్యవియే ప్రత్యగ్దిశం బుష్పితంబులు ఫలితంబులు నగు మహామహీ
రుహంబులు నీరంధ్రంబులుగ దారితల నొరసికొని చూపట్టుచున్నయవి తెర
లించియో తెఱపిసేసికొనియో యధిరోహణం బొనర్చియో యన్నప్రదేశంబు
గడచి చనిన నందనప్రతిమంబు నుత్తరకురూద్దేశనిర్విశేష్యంబును నగు మతంగాశ్ర
మంబు పంపాసరోవరంబు చెంతన చూపట్టంగలదు. దానిం గాంచి పొంచి
తీరెంచి యనన్యసామాన్యప్రచారంబగు నప్పట్టునం బెట్టని విఱుపూవులును ముట్టని
మధుఫలంబులును గొట్టని మృగచయంబులును బడయంగని యామోదలహరిం
దేలుదురు. బహుయోజనాయతయుఁ బాచగిరిసంభూతయు నగు పంపాపుష్కరిణి
కమలోత్పలశాలినియు నమృతరసవాహినియు హంససారసచక్రాదిపతత్రిమిథున
సంచారవినోదినియు నై యొప్పారుచుండు నందలి పద్మపరాగవాసితంబులు శివం
బులు శీతంబులు మధురంబులు సుఖకరంబులు ననామయంబులు నగు రసంబులు
గ్రోలినంతన క్షుత్పిపాస లెడయంగలవు. వలయునేని ఘృతపిండోపమంబు లగు
వివిధమత్స్యంబులు నక్షతంబులుగా నందు మెలంగుచుండు నవ్వాని నసతిప్రయా
సంబున నందుకొనవచ్చు. మున్ను మతంగముని శిష్యు లాచార్యునకు సమర్పింప
వన్యపుష్పఫలాదులు గొని వచ్చునెడ నవ్వారి మేనుల నుండి దొరలిన స్వేద
బిందువు లమూల్యమాల్యంబులై యెల్లెడల నీనాఁటికిం గనువారికిఁ గనులపండు
వొనర్చుచున్నయవి. అమ్మునీంద్రులయొద్ద శుశ్రూషలచేఁ గృతార్థ యై నలు
వొందుచున్న పరిచారిణి శ్రమణ యను శబరాంగన ధర్మమూర్తివి సర్వభూత

నమస్కృతుండ వగు నిన్ను సేవించి దేవలోకంబున కేగ నీరాక నిరీక్షించుచున్న
యది యట్లుగాన నెట్లును నమ్మహితాశ్రమంబున కవశ్యంబు మీర లరుగవలసి
నదియు యాయమఁ బుణ్యం బొనరించి యయ్యమేయతపస్థలంబునం బొడకట్టు
వింతలెల్ల నారయం గని సంతసించి పంప సేవించి తత్తీరదేశంబుఁ గొని చని
కట్టెదుర ఋశ్యమూకపర్వతంబు వీక్షించి దఱియం జని మునియుంగలవారు.
మతంగముని ప్రభావంబునం బుణ్యాత్ముల కక్కొండచఱియలం బన్నుండి స్వప్నం
బునం గాంచునవి యెల్ల మేల్కాంచినంతనె ప్రత్యక్షసిద్ధంబు లగుఁ బాపాత్ము
లద్దాని నధిరోహింపనేరరు. నెట్టనం బెరసి యొక్కెడ శయనించిరేనియు నాసు
ప్తుల నెవ్వరో రాక్షసులు ప్రహరించి యొండెడం బాఱవైచెదరు. తదీయాశ్ర
మంబుం బీడింపక యనేకపద్ధతులఁ జరించు ననేకపంబుల ఘీంకారంబు లెప్పుడును
మేఘనిస్వనంబుల ననుకరించుచుండు. శిశునాగంబుల యాక్రందనంబులును
సుందరమూర్తులును స్పృహణీయంబులు. అగ్గిరిం గనుంగొని శిలాపిధానయగు
దద్గుహ నిరీక్షించి తత్పూర్వభాగంబున రమ్యఫలపుష్పతరులతానికుంజశోభితకూల
వలయితం బగు నొక్క హ్రదంబు చేరువ మిత్రనందనుం గనంగాంచి మైత్రి
నిష్పాదింపుము. మిహిరకులమణీ! మద్భాగ్యమణీ! నా కానతి యొసంగవే యనిన
రఘురాముండు సానుజన్ముండై సంతసిల్లి యింక విమానరాజం బధిరోహింపు
మమ్మహనీయపదంబు సౌఖ్యంబు చూఱఁగొను మని యనుజ్ఞ సేసిన. ౨౯౦

ఆ॥ సంతసించి మ్రొక్కి ♦ చని పుష్పకం బెక్కి, యప్పరాత్ముఁ బొగడి ♦ యమరవరులు
పొగడ గనియె వాఁడు ♦ పుణ్యలోకం బిది, రామసేవ సామ ♦ రస్య మబల! ౨౯౧

క॥ ఆదట నతఁ డెఱిఁగించిన, యాదారియె దారి గాఁగ ♦ ననుజన్మునితో
నాదారులఁ బ్రోవఁగఁ దిరఁ, మహా దైవతతరువు రాముఁ ♦ డరిగెఁ బ్రియసఖి!

ఉ॥ కొండల దండ నేగుచు న ♦ కుంఠితవిక్రము లాత్తకార్ముకుల్
మండితమండనుల్ వెలసి ♦ మానుగఁ దేనియ లొల్కు పూవులుం
బండులు మెండుకొన్న నెఱఁ ♦ బ్రస్తుతము ల్తరువు ల్లత ల్పొదల్
నిండుమనంబులం గనిరి ♦ నేతలు శ్రీలతలు వృత్తు లొప్పఁగన్. ౨౯౩

—♦ రామలక్ష్మణులు శబరి యాశ్రమంబుఁ జేరుట. ♦—

క॥ అయ్యానందంబునఁ జెలు, వయ్యారే యనఁగఁ దనరి ♦ యయ్యెలమి మెయిన్
డయ్యక చని బోయకొలము, తొయ్యలి గల మేలిపాలము ♦ ద్రొక్కిరి గిరిజా.

క॥ పంపాతీరంబున నై, లింపనదిం గదియు వనము ♦ లీల న్నగు నా
యిం పెనయింపంగల సిరిఁ, బొంపిరివోవుచు ధరిత్రి ♦ పున్నెం బనుచున్. ౨౯౫

ఆ॥ ఒలయు రుచుల నూఁట•లూరించు నత్తావ, సాశ్రమంబు చేరయు•నరిగి నంతఁ
దనరు తపము గురుల•తచ్ఛాసనముతోడి, మెలపుఁ దలఁపులోన•మెయికొనంగ.

—• శబరి రామలక్ష్మణుల సేవించుట. •—

సీ॥ మెఱుఁగారు చక్కని•మేనుల పొదలిక, ల్పొదలు పూవులఁ గాంచి•పొదలుచుండ
నొండొరు లుర్మరు వొప్ప•నోలయించు ముచ్చట, లక్ష్రత్తి విని చిల్క•లబ్రిపడఁగ
నెమ్మోముదమ్ములనీ చెంచి నేఁటివే, యని తేఁటికొమ లాట•లాడి పాడ
వి ల్లమ్ము లరసియు•వెఱ పేద హరిణము, ల్కల్యాణదృష్టుల•కలిమి వొగడ
వచ్చువారి తీరు•వారక గనుఁగొని, యెదురు వోయి హర్ష•మొసక మెసఁగ
బ్రామ్రుకొనియె నేమి•భాగ్యమో తత్పదా, బ్జములఁ గనుల శబరి•కమలనయన!

క॥ పాదములు గడిగి తజ్జల, మాదృతి శిరమున ధరించి • యలరారఁ గనెక్
మోదం బామోదము సం, మోదం బానందమును స•మూహాహఁ బొదునక్.

చ॥ కొని చని యన్నదమ్ములనుఁ • గోటికి నొక్కఁడె చాలు నన్న య
య్యనుపమభక్తి నెక్కొనఁగ • నంచితపీఠము లుంచి చేర్చి య
య్యనువునఁ బూజసేసి రుచు • లారసి వన్యల నేర్చి తెచ్చి యుం
చినయవి యంచు నొండొకట • జిక్కని చక్కని పం ళ్లొసంగెనక్. ౨౯౯

క॥ అందుకొని యెలమిఁ గని ముద, మందిరి రఘునాథుఁ డని యెౕనమ్మరొ చెఱుపుల్
పొందవు కద గురువుల యా, నం దలఁతే ననుచు తపసు•నం బ్రాఁకిడెచే. ౩౦౦

తే॥ నిగ్రహించితే క్రోధమ్ము•నియతి గలదె
యంచితాహారవర్తన • లందు మెలఁగఁ
బుణ్యమూర్తులు తపసుల • ప్రోరువు వాసి
యొంటి నిలిచియుఁ దలఁగని • యొరిమ మనెదె. ౩౦౧

ఆ॥ అనుచుఁ గుశలవార్త•లరయు నమ్మాయమ్మ, నుష్యుఁ గాంచి తండ్రి•నోము లెల్లఁ
గొఱత లేక పండె•గూలంకష ఘఘౌఘు, మడఁగె నెసఁగె గురుస•పర్చనములు.

క॥ నిను సౌమిత్రిసమేతుని, ననిమిషదృగ్వర్తనమున • నారసి పూజల్
మొనయించి మురియు భాగ్యము, వొనరారె న్నాదు పూర్వ•పుణ్యమున హరీ.

తే॥ నిన్నుఁ గనఁ గంటిఁ గనుఁగొంటి • నిఖిలజగతి
నీసపర్యలఁ దనిసిరి • నెఱయు వేల్పు
లతులతంబులు సుకృతంబు • లయ్యె నింక
నయ్యెడు ఫలం బదెట్టిదో • యరయ రాదు. ౩౦౪

ఉ॥ ఇచ్చోటున న్మతంగముని ♦ యిచ్చకు వచ్చిన శిష్యు లాఘునుల్
వొచ్చె మెఱుంగ దన్న నడి ♦ బోలున వో యని నాదు సేవలన్
మెచ్చుచు దివ్యవర్షశత ♦ మేయును కాలము సత్తపస్యలన్
నిచ్చనలం గడించిరి స ♦ నిష్ఠత బ్రహ్మపదోపలబ్ధికిన్. 305

ఉ॥ అంచలఁ బూన్చినట్టివి స ♦ మంచితమూర్తులు వ్యోమయానము
ల్మించు వెలుంగుల న్మొనయ ♦ మేకొను నయ్యెడ నన్నుఁ గాంచి నీ
వెంచక మొండొకొం డిచట ♦ నెక్కటి రామమయాంతరాత్మ వై
మంచి దలంచుచుండు మన ♦ మానసము వైభవ మబ్బు నీ కటన్. 306

తే॥ అవ్యయుండు సనాతనుఁ ♦ డప్రగాత్ముఁ
డచ్యుతుండను దాశరథి యయి ♦ యవతరించెఁ
జెడుఁగుల నడంపఁ జేకొని ♦ శిష్టజనముఁ
బ్రోవఁ బరమార్థతత్త్వను ♦ భూతి నెఱప. 307

క॥ తమ్మునితో నాథునుఁ డీ, యిమ్మునయుఁగ నరుగుదెంచు♦నీ వంతకుఁ జి
త్తమ్మున ధృతిమెయి నుండుము, సమ్మోదాంబుధి మెలంగు♦నంతయు మొదవున్.

ఉ॥ అన్నయుఁ దమ్ముఁడు న్మొనయ ♦ నంతిన తత్పదపద్మరేణువుల్
గన్నుల నద్దికొంచు నన ♦ ఘంబులు సద్విధిదృష్టము లక్ష్యాతుల్
పన్ని పొనర్పు మర్హణలు ♦ పావనవృత్తిని నాదట న్మహా
భ్యున్నతిఁ గాంతు మే నెడలి ♦ యుత్తమకీర్తి జగంబు నిండఁగన్. 309

తే॥ నెనరు తేనియ లొలుక న♦న్నేలి కనులఁ, గాంచు నంతన కలుగు న♦త్రియ సదం బ
టంచుఁ దెలిసి వెసం జని♦రయ్య! నీవు, చిత్రకూటాద్రి చేరువఁ♦జేరు నప్పుడు.

క॥ ఏ నట్టులై నిలిచితిఁ దప్, ధ్యానపరాధీన నగుచు ♦ నమ్మెయి సఫలం
బై నెగడె గురుల యానతి, యీనీదర్శనము వారి ♦ నెర వన నయ్యెన్. 311

ఆ॥ అప్రమేయమూర్తి!♦యాఁడుదానను మూఢ, హీనజాతిజాత♦నెట్టు లేను
దగుదు నీదు దాస♦దాసపరంపరఁ, జేరువారిఁ గొలుచు♦సిరికి నైన. 312

ఆ॥ అట్టి నాకుఁ గలిగె♦నధికార మిా నిన్నె, కొలువ నందు నేమి♦గురుల దయయొ
నీకటాక్షదృష్టి♦నేరిమియో కాక, యింత వైభవమున♦కే నగుదునె. 313

క॥ వాఙ్మనసాతీతుండ వటు, దృఙ్మాతృఁడ వైన నిను నుతింపం గన నీ
దృఙ్మార్గవు నొసఁగితి పరిత్యజ్యాస్త్రీ! నీదు కీర్తి♦తరమే పొగడన్. 314

ఆ॥ ఏమి మహిమ లెంచి యెట్టెట్టు లేమంచు, నిను నుతింప నెందు నేర్తు నెవఁగా
యింత గానఁ దండ్రి యెడయక నీసేవ, సేయు మనిన నట్లొ సేయుదాన. ౩౧౫

వ॥ ప్రసన్నుండ వై యెయ్యది యనుజ్ఞాతం బొనర్చెదో యనిన వాత్సల్యరసభరి
తుండై భరతాగ్రజుం డాయమతో నిట్లనియె. ౩౧౬

—♦ శ్రీరాముఁడు శబరికి భక్తిమార్గముం జెప్పుట. ♦—

సీ॥ వత్సరో! జాతివివాదంబు భావింపఁ, బేరు పెద్దఱికంబుఁ జెప్ప సేయ
స్త్రీత్వంబు పుంస్త్వంబు చిన్నెలు గణియింప, నాశ్రమస్థైశేష్య మాదరింప
దర్పించి పొనరించు దానము లెక్కింప, నట్టి తపశ్చర్యలనుమతింప
జన్నంబు లను నంతఁ జయ్యన నరుదేర, వేదాధ్యయన మెంచి వేళ్లుసూప

భక్తిపరు లగు వారు నా ♦ భాగ్య మనుచు
వారి కష్టసుఖమ్ముల ♦ వలను గనుచు
మొనయువాఁడఁ జుమీ తద్వ ♦ ముఖుల పొత్తుఁ
గోరఁబో నింత నిజము వా ♦ క్రుచ్చినాఁడ. ౩౧౭

వ॥ అట్టి భక్తియోగంబునకు సజ్జనసాంగత్యంబు మొదలి సాధనంబు మత్కథా
లాపంబు ద్వితీయంబు మద్గుణప్రసక్తి తృతీయంబు మద్వాచోవ్యాఖ్యాతృత్వంబు
చతుర్థంబు నిర్మాయికవృత్తి యగు ప్రపత్తియు నిజాచార్యోపాసనంబునుఁ బంచ
మంబు నిచ్చలుం బెచ్చుపెరుగు పుణ్యశీలత్వంబును యమనియమాభిరతియు
మత్పూజననిష్ఠాగరిష్ఠతయును షష్ఠంబు మదీయసాంగమంత్రోపాసనంబు సప్త
మంబు మద్భక్తారాధనంబును సర్వభూతగతమద్భావనంబును బాహ్యార్థవిరాగం
బును శమాదిసంత్తియు నను నియ్యది యష్టమంబు మచ్చేతస్వ్యాపారంబు నవ
మంబు నై పరఁగుచుండు. ౩౧౮

ఆ॥ అబల యైనఁ బురుషుఁ డైన నుత్తమజనుం, డైన హీనజాతి యైన నొండు
జంతు వైనఁ బ్రేమ సంజ్ఞిత మద్భక్తిఁ, జెందెనేని ముక్తి నొందు నిజము. ౩౧౯

క॥ సంజాతమాత్ర యగుచు స, మంజస యై తనరు భక్తి మద్భావైక్య
వ్యంజన యగు ముక్తికిఁ దా, నంజన మగు నప్పుడె నిరంజనచరితా. ౩౨౦

ఉ॥ కావున ముక్తికిం బరమ ♦ కారణ మియ్యదె యంచుఁ బెద్దలీ
త్రోవనె నిశ్చయించి రది ♦ త్రోవని చిత్తమున న్మలంగి తే
నీ వనవద్యభావవు మ ♦ నీషులఁ గొల్చితి నన్ను నిచ్చలుం
భావనఁ దాల్చి తింతగని ♦ భావిని! నీ యనువృత్తిఁ గాంచితిన్. ౩౨౧

— ♦ శబరి రామలక్ష్మణులకు మతంగాశ్రమప్రదేశంబులు సూపుట. ♦ —

క॥ ఏకాంతతలు లే వింకిట, నీ కయ్యెను ముక్తి సులభ ♦ నీగురువుల సు
శ్రీకరతపస్థలంబులు, మా కాదృతి నెఱుకపఱుపు ♦ మా తలఁపొప్పన్. ౩౨౨

ఆ॥ అనిన సంతసిల్లి ♦ యవ్వారిఁ గొని చని, యల్లకాననంబు ♦ నందుఁ గలుగు
మేలి తలము లెల్ల ♦ మేకొని తెలుపంగఁ, బూనె నిట్లు శబరి ♦ పుణ్యమూర్తి! ౩౨౩

క॥ ఇదినిత్యతృప్తఖగమృగ, ముదితవికాసము సమంచి ♦ తోర్వీజలతా
స్పద మాఢ్యసరస్తీరము, సదమలమతులార! గనుఁడు ♦ సంయమివనమున్. ౩౨౪

సీ॥ ఎల్లతీర్థమ్ములు ♦ నెలయించి రిచ్చోట, మంత్రాస్త్రములుగ న ♦ మ్మంత్రవేత్త
లుపవాసకృశులు పో ♦ నోప కిం దొనగూర్చి, రాసప్తసింధుస ♦ మాశ్రయణము
వేదులు గాంచితే ♦ విశ్వాత్మ! నినుఁ గొల్చి, వారిదే జెల్లెడ ♦ ల్వాఱఁ జేయు
వానిలోనఁ బ్రీతిచి ♦ వలసు మీఱినయది, పొసఁగింతు రిచ్చటఁ ♦ బూలఫ్రాజ
ఘనులు స్నాతులై సచిన ♦ కచ్ఛదములు
నేఁటి కాఱవు చెట్లపై ♦ నెఱసి యుండి
కువలయము లర్చితము లన్య ♦ కుసుమములును
వాఁడ వయ్యవె యవియు ని ♦ క్ష్వాకుతిలక! ౩౨౫

క॥ అని పలికిన విని యన్నియుఁ, గని సంతస మంది రత్న ♦ ఖని రాముఁడు నీ
వనితరమతి వవనిజ మ, ద్వనిత చనిన తెరు వెఱింగి ♦ వచియింపు మనన్. ౩౨౬

వ॥ అయ్యోగినీవతంసంబు రఘురామనరేంద్రుని సముల్లసితదృష్టివిశేషంబున విలో
కించి. ౩౨౭

ఆ॥ మాయలాని కిట్టి ♦ మర్మంబు తగదె మా, యన్న! యరయ కీవు ♦ నన్నడిగెద
వన్న సన్న నొడువ ♦ కగు నెట్లుపేక్షింపఁ, దెలుపుదాన వినుము ♦ తేటపడఁగ.

తే॥ రావణుఁడు గొని చనె సీతఁ ♦ బావనాత్మ
యున్నయది యిప్డు లంకలో ♦ నుచితవృత్తిఁ
బొమ్ము సుగ్రీవుఁ గై కొమ్ము ♦ పొడవుపడుము
రమ్ము తలఁచి నంతలు సేసి ♦ రామఁ బెరసి. ౩౨౯

క॥ నీమెఱుఁగనియది గలదే, మాయూహాల నెంతు గాక ♦ మహిజాధిప! నా
కీయవె సెల విఁక నీదయఁ, బోయెద మే నగ్గి కొసఁగి ♦ పుణ్యపదవికిన్. ౩౩౦

ఆ॥ నిను స్మరించి ముక్తి ♦ నెటిఁ గాంతు రన్యులు, నీవు చూచుచుండ ♦ నీయనుజ్ఞ
వడసి వహ్నిలోన ♦ నైతు నిమ్మేను నా, కెట్టి యూహితమ్ము ♦ లిడఁ దలంతో.

క॥ ఒక గడె యిచ్చో నిలువుము, సకలాత్మకు నిన్నుఁ గనెదు ♦ జూడ నె పరమా
ర్థకలక్ష్యపదము గాంచెద, నకలంకశశాంకముఖ ద♦యామయహృదయా! ౩౩౨

—♦ శబరి యగ్నిప్రవేశము సేయుట ♦—

ఆ॥ అనుచు వేఁడి వారి♦నామంత్రిణ మొనర్చి, తత్ప్రసాద మెనసి ♦ తత్క్షణంబె
యఖిలబంధనమ్ము ♦ లాహుతాశనునందు, వ్రేల్చి దివ్యరూప ♦ విహృతి మించి.

వ॥ తత్కాలోపనతం బగు విమానరాజం బధిష్ఠించి యసమానతేజోవిరాజిత
యుత్తమశ్లోకితం బగు పురుషోత్తమపదం బాస్పదంబు సేసె. ౩౩౪

ఆ॥ అధమజన్మ యయ్యు ♦ నాశబరాంగన, యట్టు లయ్యె ననఁగ ♦ నధికు లెవ్వ
రేల ముక్తిఁ గాన ర ♦ ధీశు శ్రీరాముని, భక్తవత్సలునిఁ బ్రపత్తిఁ గొలిచి.

ఉ॥ కావున భక్తియోగము ప్ర ♦ కాశితముక్తిపథంబు తత్కృతిన్
భావనసేసి రామపద ♦ పద్మములం దనివోవ నిచ్చలున్
సేవ లొనర్చువారలకె ♦ చేకురు సర్వమతత్ప్రకారులై
పోవుదు రొంట నొడ్లు పుఁ ♦ బోఁడి తలంపకు మవ్విచారముల్. ౩౩౬

తే॥ శ్యామతనుఁ బుండరీకాక్షు♦సర్వగతునిఁ, బూజితు నొనర్చు నారలే♦పూజ్యు లెంచు
నందఱకుఁ బ్రియ మదె నాకు ♦ నభిలషితము
గాన నెఱిఁగించితిని దీని ♦ క్రమ మరయుము. ౩౩౭

ఉ॥ అంతట రామచంద్రుఁడు మ ♦ హాత్ముఁడు తమ్ముడుఁ దాను సంతసం
బెంతయు నగ్గలంబుగ మ ♦ హోచ్చత నమ్మను లిడ్డ పుణ్యతీ
ర్థాంతరము ల్గణించుచుఁ ద ♦ దాశ్రయసత్క్రియలన్ సముల్లస
త్స్వాంత మొనర్చె దేవపితృ ♦ సంయమిలోకము లోకపూజితా! ౩౩౮

క॥ నాఁ డచ్చో నిలిచియె మఱు, నాఁ డుదయము గాకమున్నె ♦ నందితచరితుల్
పోఁడిమి వెలయఁ దరలి రిరి, బోఁడీ! పంప యను సరసి♦బొందుస్ఫు తలఁపులన్.

—♦ రామలక్ష్మణులు శుభనిమిత్తముల కలరుచు పంపం జేరఁబోవుట. ♦—

ఆ॥ పోవుచుండి రపుడు♦భూజన్మజాని యి, ట్లనియెఁ దమ్ముకుఱ్ఱ♦యనువుఁగాంచి
యన్న! మేలు గంటి♦మఖిలకిల్బిషములు, బాసె నిట్టి పుణ్య♦పదముఁగనుట ౩౪౦

క॥ అలరుచు నున్నది మది యీ, స్థలప్రభావంబె యనఁగ♦సందియమే య
య్యలఘుతపోనిష్ఠితు లి, ట్లలవార్చుటఁ దీర్థరాజ ♦ మయ్యెం జుమ్మీ. ౩౪౧

క॥ కృత్యవిధు లెల్లఁ దీర్చితి, మత్యయములుఁ దలఁగు నింక♦నని హృద్గతి సం
ప్రత్యయము దెలుపుచున్నది, సత్యాప్త్యాలంబనంబు ♦ సమకూరెడునో. ౩౪౨

క॥ త్వరపడుచున్నది నాయం, తరంగ మిపు డుత్తరంగ ♦ తారాధిత వా
నరరాజు చెలిమి పనుపడ, విరతము లగు నంతరములు ♦ వేయును నేలా. ౩౪౩

ఆ॥ పంప సరసి కలిమి ♦ పాలించి యీనాఁడు
ఋశ్యమూక మెనసి ♦ యెలమి దానుకఁ
గీశవిభుని చెలిమిఁ ♦ గీర్తింతు మన మన
స్కార మొప్పఁ దదను ♦ జన్ముఁ డపుడు. ౩౪౪

క॥ అన్నా! నాకును నటులే, యున్నది మది సరభసముగ ♦ నొనరెడుఁ గర్జం
బిన్ని యన నేల నీతలఁ, పెన్నన యది తలఁగనేర్చు ♦ నే మొండొంటన్. ౩౪౫

మ॥ అదె పంపాసరసీసరిత్పంక్తి యదె యా ♦ నాఋశ్యమూకంబు సం
పదలం బొంపిరివోవు వాయుపదుఁ డ ♦ వ్వైతాళికుం డిప్డు మే
ల్పదము ల్పాడెడు సుప్రభాతములుగా ♦ విస్తార మొప్పారఁగా
నద నంచు న్నినుఁ జేరఁ బద్మవని చా ♦ యం గొంచుఁ దోఁతెంచెడిన్. ౩౪౬

చ॥ కలరవము ల్సెలంగ స్ఫుట ♦ కంజవనాంతరసీమ నాటవా
టల నలిరేగి క్రొన్ననల ♦ డంబర మంబర మాక్రమించు చా
ప్పులుఁ దులకింప ని న్సరసి ♦ పూజ లొనర్ప నెదుర్పడంగ రాఁ
దలఁచు కృతార్థు లట్లు పరిమ ♦ దంబున నొప్పెడుఁ దద్విహంగముల్. ౩౪౭

క॥ తరఁగల చప్పుడు లునుఁ దుగ, పురులుం బురికొని చరించు ♦ పోఁడుములున్ శం
బరలక్ష్మీమాహాత్మ్యము, సరసీసాన్నిధ్య మొంట ♦ జాటెడు ననఘా. ౩౪౮

క॥ ఇప్పటి నిమిత్తములె యిడుఁ, దప్పక మే లనుచుఁ దనదు ♦ తమ్ముఁడు నొడువన్
విప్పారెడు మోమున నా, యొప్పులకుప్ప సిరిఁ గాంచి ♦ యెలయుచు నడిచెన్.

వ॥ అని యిట్లు లయ్యదంభుండు శంభుం బ్రతిబింగించిన శాంభవీదేవి సముజ్జృంభిత పరిహార్ధాంభోనిధి యై యనంతరశుభసమారంభప్రియంభావుకంబు లగు భవద్వాగ్గుంభంబులు చయ్యన నెలకొల్పవే యని నెయ్యంబు సూపుటయు. ౩౫౦

ఉ॥ లింగవిశిష్టజాతిభృద ♦ లీకవికారవిదూర భావనా
సంగతభక్తలోకచయ ♦ సంస్కరణాత్తవిచార చేతనా
లింగితనిత్యతృప్తికృద ♦ లేపసుఖార్ణవవృత్తిధీర స
త్ప్రాంగణసంప్రసాదనవి ♦ ధానవిభాసురభావభాస్వరా. ౩౫౧

క॥ నియతవ్రతసంస్థాని, ర్ణయసారవశిష్ఠనిర్భ ♦ రవేభ్రమరసో
దయహేతుభూతకరుణా, మయవీక్షణలక్ష్యమాణ ♦ మానసనిష్ఠా. ౩౫౨

మాలిని॥ సదయమనవినివేద్యా ♦ సంస్తుతాస్థానహృద్యా
మదవదరినిరాసా ♦ మంత్రితోద్దామభాసా
సదరవిదూరలోకా ♦ శాభృదంచద్విలోకా
సదసదుపరికక్ష్యా ♦ సర్వవేదాన్తలక్ష్యా. ౩౫౩

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
దరణ్యకాండంబున సర్వంబును జతుర్థాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ శివాయగురవే నమః.

# శ్రీరామకథాఽమృతము

## కిష్కింధాకాండము.

ఇది

బ్రహ్మశ్రీ తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రిగారిచే

రచియింపఁబడి







వారి పుత్త్రుఁడగు

రాఘవనారాయణశాస్త్రిగారిచే

ప్రకటింపఁబడియె.


నిడుబ్రోలు:

తాతా ముద్రాక్షరశాల యందు

ముద్రితము.




1935

[వెల రు ౧-౦-౦

శ్రీశివాయగురవేనమః

# విషయసూచిక.

---

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథాఽమృతము

## కిష్కింధాకాండము.

### ప్రథమాశ్వాసము.



సంప్రసాదసంజ్ఞిక
భాసురసౌహృదరసప్ర ♦ వాహోన్మజ్జ
ద్దీనసహితవిమతనిజపర
త్రాణసముచితసామ్యలక్ష్మి ♦ తా! జగదీశా! ౧

తే॥ అవధరింపుము దేవ ది ♦ వ్యాంతరంగ
సీమ నాదు విజ్ఞాపన ♦ చిద్విలాస
మొలయ లలనావతంస మ ♦ క్కలన వేఁడ
సభవుఁ డిటు చిల్కెఁ రామక ♦ థాఽమృతంబు. ౨

—♦ శ్రీరాముఁడు తమ్మునితోఁ గూడి పంపాసరస్సున కేగుట ♦—

ఉ॥ ఈసు దొలంగి క్రోలనగు ♦ నీసుధ నాన సుధాఽవహాసివా
చాసముపేయుషీ! విను వి ♦ శాంపతి యాశబరిన్ ధృతవ్రతన్
భాసురపుణ్యలోకచయ ♦ భాగినిఁ జేసి విలాసినీసము
ల్లాసితఁ గాంచె నంచితక ♦ లామయిఁ బంప నిలింపకాంక్షితన్. ౩

ఉ॥ వాసవకాననోపచిత ♦ వైభవయోగితటద్రువల్లరీ
శ్రీసముపేత నిర్మలిన ♦ శీతలరస్వరసానపేత సం
వాసితదిక్కగంధవహ ♦ వల్లభలాలనసంప్రతీత ల
క్ష్మీసకలార్థలక్షితని ♦ కేతనభూతయు నై శుభాకృతిన్. ౪

క॥ చూపట్టెడు నద్దాని ని, రూపించుచుఁ జేరఁజని ప్రి ♦ రూఢమనస్కా
రాపూరణోచితములు వి, పాపము లగు తజ్జలముల ♦ బడలిక దీఱన్. ౫

ఆ॥ స్నానపానవిధులు♦జరిపి త త్తీరమ్ము, మొనయు దారి ఋశ్య♦మూకమునకుఁ
బోవుచుండుతఱిని♦బొనర నిట్లనె రాముఁ, డనుజుతోడ హృద్య♦వార్త్తి వెలయ.

— ♦ శ్రీరాముని భావవిహారము ♦ —

ఉ॥ పొంపిరివోవు సంపదలఁ ♦ బొల్చెడు నియ్యది కంటె లక్ష్మణా!
పంప యటందు రీసరసి ♦ భాగ్యము కల్గినవారి సొమ్ము న
న్నంపల నేఁచు మన్మథుని ♦ యాయుధశాల యనంగఁ గాననై
యింపొనరించుచున్నయది ♦ యింపనిదయ్యెఁ దలంపు లుబ్బఁగన్. ౭

ఉ॥ ఊడిగము ల్పొనర్పఁ గమ ♦ లోత్పలపాళికి షట్పదాళు లే
నాఁడును గొల్వఁ బాయనివి ♦ నాఁ జను నంచలు జక్కవ ల్కవ
ల్వీడ వనంగు నూల్కొలుపు ♦ వెజ్జు మధుం డనిలార్భకుండు పోఁ
గూడని చుట్ట మిక్కొలను ♦ గూర్చిన పున్నె మదెట్టిదో కదా. ౮

సీ॥ ప్రొద్దుప్రొద్దునఁ దమ్మి ♦ పూవులసిరితోడి, వయి భృంగగీతమ్ము ♦ లతిశయిల్ల
మేల్కాంచి మెలఁకువ♦మెయికొనఁ గమ్మతె, మ్మెరలు సేవింప నె♦మ్మెలు దలిర్ప
బాలభానున కెదు ♦ ర్పడి ప్రీతి ఘటియించి, చక్రచక్రము నేలు ♦ జాడ నెఱపి
తటరుహాగమవృత్తిఁ ♦ దనరు ద్విజాతిథి, సత్కారమున కల్మిఁ ♦ జాల నెగడి

నిత్యసౌభాగ్య మనఁ దన ♦ నెలవె కాఁగ
మహితమానసలీల ని ♦ ర్మలిన యగుచు
నీసరోజిని రసవహ ♦ యింపు గులుక
నామదిఁ గరంచుచున్న దీ ♦ నాఁట వత్స! ౯

ఉ॥ పువ్వులుఁ బండ్లుఁ గొంచుఁ దట ♦ భూజము లోజ మెలర్ప దీనికిం
ద వ్వనరాని చుట్ట లయి ♦ తార్కొని ఛాయ లొసంగి పాంథులన్
మవ్వ మెసంగఁ దేర్చు జన ♦ మానిత మీస్థల మిట్టిచోట నా
జవ్వనితోడ నున్నయెడ ♦ స్వర్గ మయోధ్య స్మరింతునే మదిన్. ౧౦

తే॥ నిత్యకల్యాణి యీనేల♦నేఁడె యనఁగ, నేల యైన విజృంభించె♦నిపుడు మధుఁడు
దేశకాలమ్ము లొకఁడైన♦తీ రెఱింగి, మండుచున్నాఁడు వహ్నికి♦మాఱు మరుఁడు.

మ॥ చివురుల్ కోయిలబంట్లకున్ శుకహయ ♦ శ్రేణుల్ భుజింపంగఁ దీ
పవు పండ్లు న్మధుపానుజీవులకు దీ ♦ వ్యత్సూనగుచ్ఛంబులున్
వివరం బొప్పఁగఁ గూర్చి శాతశరము ♦ ల్విఖ్యాతము ల్తద్విశే
షవిధిం దార్చెడు వీఁ డలంతియె మరు ♦ న్సామ్రాజ్య మేలించుచోన్. ౧౨

తే॥ తేనె పూసిన కత్తి యు♦ద్దీపకుండు, మాధవుం డనఁ జనునె యి♦మ్మారసఖుని
విప్రయోగినిపీడన♦విధిని నీతఁ, డస్త్రకృద్దూషితత్వమ్ము♦నందకున్న. ౧౩

తే॥ శ్వసను ప్రేరణ నిమ్మహా ♦ సరసిలోని
యలలు దోఁతెంచు నని వేడ్క ♦ కరయరాదు
వరుణపాశంబు లవి వాని ♦ వరుసఁ దొడరు
నబ్జములు కామసంమోహ ♦ నాశుగములు. ౧౪

ఆ॥ పుష్పవృష్టిఁ గురియుఁ♦బొలుపందు లతలతోఁ, వృక్షరాజి వీరి♦పక్షమెనసి
రాజుతోఁడివారు♦రా సమృద్ధు లొనర్తు, రిట్టి పనులు నైజ♦మెంచఁబోరు. ౧౫

క॥ చేయు మని చేయ సంతస, మాయె ననం గలదె దర్ప♦మా యది వలపా
నాయాయువ్యము నాసిరి, పాయక యుండఁజను నోడ్ల ♦ పా ల్లైటులైనన్. ౧౬

ఉ॥ కొండల యండదండ నెల ♦ కొన్నది యీసరసీస్రవంతి యీ
కొండలఁ బోని మ్రాఁకు లటు ♦ కోరినకాఁపులు దీని కివ్వసం
తుం డనిలుండు శిల్పమునఁ ♦ దోడ్పడ శూరుఁడు రాజు మెచ్చ ను
ద్దండత మారకర్మములఁ ♦ దార్కొనుఁ బద్మవికాసహాసయై. ౧౭

తే॥ తనరు నాపాతరమణీయ ♦ తరము లగుచుఁ
దలము లొకకొన్ని యంతయుఁ ♦ దలఁప విషమె
యతిథిపూజ లొనర్తు ర ♦ య్యసురు లిరువు
రాదట వధింతు రను వార్త ♦ యరయ లేదె. ౧౮

తే॥ అనిలుఁ డాడించుచున్నవాఁ ♦ డవనిజముల
నేలఁ బూజించు నవి పూల ♦ నిష్క్రియముగ
మహిజఁ బాయుట నన్నియు ♦ మలఁగి నేఁడు
శత్రుకోటిని బెరసె ని ♦ స్సంశయముగ. ౧౯

క॥ మ్రాఁకుల కొనకొమ్మలకుం, బ్రాఁకిడి తల లెత్తి లతలు♦ప్రకటశ్రీలై
నాకష్టదశకు నగుచు వి, లోకించెడు తెఱఁగె యింత♦లోఁ గననయ్యెన్. ౨౦

తే॥ కొన్ని మ్రాఁకుల నుండంగఁ ♦ గొన్ని వ్రాలఁ
గొన్ని యంతరాంతరములఁ ♦ గొమరుమిగులఁ
దేటగీతుల నవ్వానిఁ ♦ దేంట్లు పాదువ
నాట లాడెడుఁ బూలతో ♦ ననిలుఁ డిపుడు. ౨౧

మత్తకోకిలము॥ మత్తకోకిలరావము ల్దగ ♦ మారుతాఖ్యనటుండు భూ
భృత్తటావనికీచకస్వన ♦ భృంగగీతు లెసంగ సం
సక్తి సంనహానం బెలర్పఁగ ♦ సాధునర్తకవృత్తి వి
రుత్తు లాడఁ బొనర్చి కూర్చెడు ♦ రూపకీయనిరూపణన్. ౨౨

తే॥ పూలపాగాలు తనరంగఁ ♦ బొలుచు తలలు
ద్రిప్పుచు ద్విరేఫగీతి సం ♦ ప్రీతిఁ దెలియఁ
జేయుచున్నవి తరువులు ♦ వాయుయుక్తిఁ
దమ తెలివి వింతయే వసు ♦ ధాతలమున. ౨౩

ఆ॥ ఎట్టి జతన మెంచె♦నీవసంతుఁ డనంగుఁ, డెట్లు వేఁపఁ దొడరె♦నింత మెఱఁగి
యట్లు హృష్టపుష్ట♦మైన యీకోయిల, నన్నుఁ బిలిచి తెగడు♦చున్న దిపుడు.

క॥ చందనశిశిరతఁ బువ్వుల, యందలిపొడిఁ గొంచు మందుఁ♦డా ననిలుఁడు రా
ముందటిచందము మార్పడఁ, దుందుడుకుతనమ్ము నూపఁ♦దొడరెడుఁ గంటే.

సీ॥ శిఖి యాడు నెఱి నాడు♦శిఖిని ఱెక్కలు విప్పి, కదిసి నగ్నేలు కే♦కలు సెలంగ
నళినితో నళి మధు♦వాని పాటలు పాడి, యూరించు నామది♦యుక్కుసెడఁగ
నిగురులు గొఱికి కో♦యిల ప్రియ కందించి, కను లెఱ్ఱపడఁగ న♦న్గాంచి గదుము
శుకికిఁ బండుల పేస♦ముకటఁ బెట్టుచు శుకం, బూగించు ననుఁ జూచి♦యుత్తమాంగ
తే॥ మిన్నిటికి మూల మామని ♦ యే యటంచు
నెఱఁగి మెఱఁగియుఁ జేయంగ ♦ నేమి గలదు
నామనోహర యొక్కెడ ♦ నవయుచుండ
నొడ్లొనర్చెడు కొలల కే ♦ నోడిఁగియుంటి. ౨౪

వ॥ సౌమిత్రీ! మైత్రి పాటించి మధుమాససమయం బనక యనాలోచితంబుగా నీ పంపాసరోవరవనోద్దేశంబునం జొరఁబాఱితిమి మొక్కలం బగు నిక్కాలంబున నిక్కాలనునయందున గొజ్జంగిపన్నీటి తేటదనంబున మాటకు బాటన నగు బాటు గూర్ప నోపు తియ్యని క్రియ్యాట మాటుపఱుపంజాలి యిట్టలంబుగ మిట్టలపై నుండి దిగజాఱి యంశుమంతుని కిరణస్ఫురణంబులలోని క్రొత్తతళత్తళలు సంగ్రహించి యాణిముత్తియంపుఁ గోవలు పెట్టి పెందోవ నిద్దాని కలంకారంబు

గూర్చిన తెఱంగుదోఁపం బ్రపాతస్థలంబుల కవతరించు సెలయేళ్ల వారిధారల
వలనను సహస్రకరస్పర్శనంబున నెమ్మేను లుప్పొంగ నొప్పారు పులకజాతంబు
లకు సహజాతంబు లగుచు సరోజినుల వదనకమలంబులం గనుపట్టిన దట్టంపు
వికాసపరిమళంబులకు నీడుజోడు లన వెనువెంటన యుద్భవిల్లి రంగారం బొంగా
రిన యుత్తమోత్తమాధరామృతరసధారలవలనను నొయ్యారంబునం బొదలు
సయ్యాటంబుల వాటంబు లగు నాటపాటలతోడి నెయ్యంబునం దోఁతెంచు
మలయపవనుని మేలి శిక్షం బ్లవమానంబు లగుచుఁ బావమానస్వస్త్యయనాను
వాకంబు లధ్యయనం బొనరించు ద్విజసమాదృతవసంతశాఖినికురంబంబుల డంబగు
కలాభ్యాసనంబున వికసనంబు లపేక్షించి యౌత్సుక్యంబునం బొంచి యాలించు
చున్న వాసంతికాప్రముఖవల్లికామతల్లికల లతాంతగుళుచ్ఛంబుల నుబ్బి గుబ్బ
తిల్లు నమందమరందనిష్యందంబుల పేరం గొనితెచ్చి సమీరకిశోరంబులు సమ
ర్పించు నుపహారసంభారంబులవలనను పుటపుటనై పెనుపారు తీరునన మిన్నుముట్టి
యచ్చోటునన వన్నెకెక్కిన వేలుపుల కొలను నేనిఁ ద్రోపాడి మేలమాడుదుం
జూడుం డని రాజహంసకాదంబకదంబం లశబ్దవిశేషంబులం దెలుపుచుఁ బ్రోదిని
యనం బొనరుపడి యొప్పు మీఁజు దుమారంబుల నుప్పతిల్లి యొప్పులకుప్పలై
మగఱాల తిప్ప లననై కప్పుకొనిన యుప్పుల రాయిడి యనెడు పెనుముప్పునం
బొలివోక యాఁకపడి నిలువంబడిన మేని పుప్పొడుల సముద్దీపితంబు లగు
ద్వీపంబుల ద్వీపవతియై యపారజలసారపూరప్రసారంబున స్రోతోవహయై
యుద్దామతరంగరింగణంబులఁ దరంగిణియై ప్రసూనఫలభార నమ్రవివిధ
తరులతాకుంజపుంజ శీతలచ్ఛాయానపేత శశికాంత శిలామయతటశోభి
త్వంబునఁ దటినియై గారుత్మతరత్నసోపాననిచయసచ్ఛాయశైవలవిశేషసమా
సత్తి కలిమి శైవలినియై యతిశయిల్లి యిప్పర్వంబునం బరిసరవర్తిపరికరసంపత్తి
నిప్పద్మ రాజధాని యప్పద్మాకుమారుని జగదేకసామ్రాజ్యపట్టభద్రుం గావింప
నెంచు నక్కార్జంబునకు మొనకొను రాజబంధువర్గంబునకు మునుమున్న యవని
కుమారికాసుకుమారావయవంబులం బోని కుసుమగుచ్ఛంబులం దాల్చి యందం
బలరార నందందు శోభిల్లు మాధవీలతాంగనలకు సౌవర్ణవర్ణప్రసూనాభర
ణంబులు సమర్పించు కర్ణికారంబులతోడి యైకమత్యంబునం బద్మరాగంబు
లందిచ్చు పలాశపలాశితతుల చెంత సుమనశ్శేఖరము లనువొంద నలువొంద
మాకందసందోహంబులకన్న మిన్నలై విరిపాగాలు పెట్టిన తల లెత్తి చధ
లొరయు తిలకవకులకురంటకప్రముఖమధువృక్షతిలకంబుల ముకులంబుల వెంట
నవికలంబులుగాఁ దిరుగు మధుకరమాగధుల గీతివిశేషంబులు జనకనందినీనవనవో
న్మిషన్మధురగీతివిశేషంబులై వనుపడ నదనునం బదనున కెక్కిన పరభృతికాస్వరం

బక్కలకంఠకంఠి కంఠస్వరంబు స్మరణంబుఁ బొనరింప శుకశారికల కలరవోచితంబు లగు నప్పలుకులు కంతుని ములుకులకు లక్ష్యంబు సూపుచు నయ్యకలంక చంద్రవదన రుచిరోక్తుల కనుమాపకంబులు గానోపఁ బ్రతిక్షణంబును నిర్దాక్షిణ్యత్వంబునం బ్రవర్తిల్లు దక్షిణదిశాగంధవహుని గంధవత్ప్రచారంబు లాశుభాచార నిశ్వాసపవనాంకురమ్ముల యనుపమసంపదల నువలాలింప నింపున నిలింపులనేని నలరుటంపల ముంప నడరు గుంపులమారి మారుని యిన్నాఁటిసన్నాహంబున గ్రచ్చికొను కార్చిచ్చు నడిచిక్కం జిక్కువడిన హరిణం బనంగ నైతిఁ దమ్ముఁడా! యీయమ్మలికమ్మనకుం బారమ్ము గలదే యనుచు నప్రాకృత వైభవుం డయ్యుం బ్రాకృతుని విధంబునం బనివెడుభ్రాంతం గని సౌభ్రాత్రంబు పెనుపొంద సుమిత్రానందనుండు శ్రీరామా! జయరామా! కల్యాణనామా! పరంధామా! నామనవిని నేమఱక చేకొనం బ్రార్థించెద. నరిదళంబుల నున్మూలించుటకును నాశ్రితవర్గంబులం బాలించుటకును నర్థిజనదారిద్ర్యధ్వంసనంబున కలిమి నమరవరవనవాటీశాఖిశాఖం బోలం బోలి త్రిలోకరాజ్యలక్ష్మీ పరిగ్రహణ ప్రశస్తం బగు నీదు దక్షిణహస్తంబు స్ఫురించుచుండ నింతలు పడ నీబోంట్లకుం జనునే పురుషోత్తమా! యాగంతుకం బగు వియోగదుఃఖం బుపసంహరింపుము. సహజధైర్య మవలంబింపు మతిస్నేహపరిష్వంగంబున సార్ద్ర యైన వర్తియు నగ్నిచే దహింపఁబడున కాదే. పుడమినయేని నాకసంబుననేనిఁ ద్రివిష్టపంబుననేని బుడమికన్నియఁ దాచి యుంచె నేనియుఁ ద్వత్ప్రసాదంబునం బడసిన శస్త్రప్రవిశేషంబుల నద్దానవకులపాంసనుని బడలుపఱచి దాసునిం జేసి న్యాసద్రవ్యం బట్టు లాసాధ్వీమణి నర్పణం బొనర్ప భవత్సన్నిధానంబునకుం దోడితెచ్చెద. నష్టార్థుం డుత్సాహంబునన కాని సమృద్ధిం బడయనేరఁడు గదా. నీదు మహానీయం బగు దివ్యానుభావంబు సంభావింపు మేకొఱంతయు మేకొనంబోవ దనవుడు వేషధారి వింతవేషభాషణంబుల నట్టులు శోకమోహంబులం బరిత్యజించి రామచంద్రుం డభిరామదర్శనుం డై తోడుతోడం దోడుతోడన ఋశ్యమూక గిరిం దరియవచ్చు నవసరంబున. ౨౭

—◆ శ్రీరామలక్ష్మణుల రాకకుఁ జలించి సుగ్రీవుఁడు పాఱిపోవుట. ◆—

క॥ ఆతని మది మెలఁగుచు స, ర్వాతీతవికాసభాసి ◆ యగు లక్ష్మణుఁ డ
మ్మాత నెల వరయుజతకుఁ ద, దాతంక మెడల్చుచుండె ◆ ననలసుఁ డగుచున్.

సీ॥ త్రిజగజ్జయశ్రీలఁ ◆ దివియఁజాలిన మేలి, కరముల విం డ్లమ్ము ◆ లురవడింప
నెమ్మోములందుండి ◆ నెరయు దీధితు లున్న, భాను చుట్టఱికమ్ముఁ ◆ బ్రస్తుతింప

నిరురూపు లిడెఁ దన♦కిట్లంచు విధినేర్మి, వెనుకటిమరుసిరి ♦ వెల్లడింప
లావణ్యవీచీల♦లచ్ఛందర్రియుగ్మంబు, జనదృక్చకోరాళి♦సంతరింప
నొలయు తాపసవేషమ్మ ♦ లొఱపు మాఱు
పఱుప నెంచిన నెఱికి లోఁ ♦ బడక కడల
కడరెడు ప్రభావములుపింత ♦ లై తలిర్పఁ
బెరయు నరకేసరులఁ గాంచె ♦ హరివిభుండు. ౨౯

క॥ కని తోడివారిఁ గని య, య్యినజుఁడు వాలి వనుపంగ♦నేతెంచెద రీ
ఘనసత్త్వులు మాఱ్వేసం, బను నివురున డాఁగి నెఱయు♦నగ్గులు వోలెన్. ౩౦

మ॥ అని శంకింపుచుఁ బల్కు వారు విని య ♦ ట్లౌనేమొ యంచుం దలం
చి నగాగ్రంబుల శైలశృంగముల ల ♦ క్షీభూతులుం గాక రా
క నిజం బారయఁ గోరి ప్రాఁకిడిరి పేఁ ♦ క నాగ్రిలు రాల న్లతా
వనిజాతంబులు పేర్రిల సత్త్వములు ని ♦ ల్వంబోలమిం దూలఁగన్. ౩౧

క॥ కొండొకతడవున కందఱు, నొండెడకుం జేరి యొడయఁ♦డురుసత్త్వం డ
ట్లుండ సెడి యుండ నాతని, దండ న్నిలఁబడి విధేయ♦తావశులగుచున్. ౩౨

తే॥ పరిపరివిధంబులం దల♦పట్లు పట్టి, కొనునెడఁ బరావరవిభక్తి♦కోవిదుండు
మంత్రివర్యుండు నా హనూ♦మంతుఁ డతనిఁ, జేరి యిట్లనె నిజవచ♦శ్శ్రీ రహింప.

—♦ హనుమంతుఁడు సుగ్రీవునితో సంభాషించుట. ♦—

ఆ॥ నీతికోవిదుఁడవు♦నెఱిగల్గువాఁడవు, ధైర్యసాహసములఁ♦దక్కువడవు
నీవె యిట్టులైన♦నేత యొండొకఁ డేమి, సన్నఁ గృతినిఁ జాలుఁ♦జక్కఁపఱుప.

క॥ ఎదిరిజనము స్వీయం బని, యొదవదు కద మదికి వివర♦మోహా యెడ ని
ట్లుదిలపడి పఱవ నే మగు, నది కడపటి తెఱవు దాని♦కడ్డొకఁ డున్నే. ౩౫

ఆ॥ ఒండు వనుప వచ్చి ♦ రొక కీడరసి యంటి
వట్టులైన నట్టిఁ ♦ డైన జనము
తపసివేసములన ♦ తారొక్కంచు శరశరా
సనవిశేషకలనఁ ♦ బొనరుపడునె. ౩౬

చ॥ అరి కిటఁ జేర రాద కద ♦ యాతఁడు వంప నలంపవచ్చు వా
రరయరె యిట్లు పైకొన న ♦ యం బని యొక్కఁడు లేదె యాఘనుల్
సురుచిరమూర్తు లేపనికిఁ ♦ జొచ్చిరొ యిత్తల ముత్తలంబునన్
జరుగఁగ నేల యేమివిధి ♦ సంగడ మవ్విధికూర్పు నొందెనో. ౩౭

క॥ ఎవ్వఁ డుపకారి దుష్టుం, డవ్వాలియుఁ దోడుతోడ♦నరుదేరఁడ నీ
కివ్వానట యేల పొడమెను, బుర్వ్వంజూచెదె సమృద్ధి ♦ బుద్ధిజళుకునన్. ౩౮

ఆ॥ పురుషకార మలఁతి ♦ వోవ నీ విట్లైన
నరియు నతనివారు ♦ నంత వింత
లనరె యొక్క తెఱఁగు ♦ నన యున్న కాలమ్ము
దైవమున విభక్తిఁ ♦ దలపవలదె. ౩౯

ఆ॥ పెద్దఱికముఁ గంటి ♦ పెనఁకువ లోర్చితి, పాలనమున తెఱఁగుఁ ♦ బా టరసితి
విట్టి నిన్నుఁ బోటి ♦ నింతలు చేసిన, యది ప్లవంగమత్వ ♦ మనఁగరాదె. ౪౦

క॥ దారితలఁ నెరయురీతి యు, దారాకృతికలన సముది ♦ తత్త్వము నెఱయన్
దా రుచితగతికిఁ దలఁగని, వా రను వల నెఱుక సేయు ♦ వచ్చెద రనఘా! ౪౧

ఆ॥ సుప్రసన్నభావ ♦ సూచన ల్మాహాత్మ్య, మున తెఱంగుతోడ ♦ మొనయుదేర
నరసి కనుము వీరి♦యాంతర మెడఁబాటు, తెవులు వాపి బుద్ధి♦దిటవుపఱచి. ౪౨

క॥ అని పలుకు హనుమ పలుకులు, ఘనశోభనమంత్రరాజ ♦ కలితాక్షర యో
గనిరూఢిఁ దనర రవిజుఁడు, తననెమ్మదిఁ జేర్చి తగవు ♦ తగ ని ట్లనియెన్. ౪౩

— ♦ సుగ్రీవుఁడు రామలక్ష్మణుల యొద్దకు హనుమ ననుచుట. ♦ —

ఉ॥ రాజులు దూరదర్శు లవ ♦ రక్తుల రంధ్ర మెఱింగి కూల్తు రే
యోజను వారి నమ్మి మను ♦ టొప్పదు గూఢచరు ల్మహాబలు
ల్నాఁ జను మిత్రు లద్దొరల ♦ లావున లా వెనయింప నొడ్డ ని
ర్వ్యాజుల నొంప నా సమయ ♦ మారయు వృత్తిన చేరి యుండఁగన్. ౪౪

ఆ॥ లోన మొసళు లుండ♦లుప్తకాలుష్య మౌ, సరసుమాడ్కిఁ దాఁబ్ర♦సన్న మయ్యుఁ
జొచ్చువారి మ్రింగఁ♦జూచుచునే యుండు, రాజకమ్ము నమ్మ♦రాని దెపుడు. ౪౫

క॥ వాలి దవజ్వాలి యు కద, కాలకయే కాలు నన్నుఁ ♦ గని కానకయున్
గీ లెఱిఁగి నేను మెలఁగెద, నీలో నిటరాక యతని ♦ కెరవై యుంటన్. ౪౬

ఉ॥ కాన నుదీర్ణవిక్రములు ♦ కార్ముకయుక్తులు దీర్ఘబాహు ల
స్థాన మటంచు నెంచక న ♦ సంభ్రము లై పఱతెంచుచున్నవా
రీనెఱివారి నొడ్డ నిటు ♦ లెన్నఁడుఁ గాంచియెఱుంగకుంట మ
న్మానసవృత్తి చంచలత ♦ మై రిపుపక్షము శంక నొందెడిన్. ౪౭

ఉ॥ ప్రాకృతరూపముం గొని పి ♦ పాపము వర్తన మొప్ప వారి న
ప్రాకృతమూర్తుల న్దొరసి ♦ ప్రాఁపునఁ బ్రోఁపున రాక వీఁక నొం
డేకలుషమ్ము లేమిఁ గని ♦ యింతయు సన్న పొనర్పఁ జూడు మ
వ్యాకులభావము న్బెరసి ♦ యాదటఁ గర్జము తీ రెఱింగెదర్. ౪౮

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ ననుచు కౌతుకమున
హనుమ భిక్షురూప ♦ మవధరించి
కార్యసిద్ధి మొనయఁ ♦ గావచ్చె నేమొకో
యి ట్లటంచు వార ♦ లెంచఁ గదిసి. ౪౯

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణులం జేరి భాషించుట. ♦—

క॥ కేలున్దోయి వినీతి, న్ఫాలతలంబునకుఁ దార్చి ♦ ప్రభుమర్యాదల్
జాలుగ నెరపి మృదువచో, లీల సుధాగుణనికాల ♦ లినముగఁ బలికెన్. ౫౦

ఆ॥ ఇంతగా ఫలించె♦నేనాఁటి సుకృతంబొ, యన్నలార! నాదు♦కన్నుదోయి
కొదవె మేలిపండు♦వోరుల కలభ్యమై, తనరు యుష్మదీయ♦దర్శనమున. ౫౧

సీ॥ ఆత్తకాములకె కా♦కలరునే సంప్రసా, దనకలాద్యోతి మం♦దస్మితంబు
సత్యసంకల్పసం♦శ్రియులకే కాక యి, ట్లొప్పునే నియమల♦క్ష్మోల్లసనము
స్వకజనాభయదాత♦లకె కాక పొసఁగునే, కారుణ్యరస మెఱుఁ♦కన్నుదోయి
సకలశాసనరమా♦స్పదులకే కాక తాఁ, బరఁగునే విక్రమ♦స్ఫురితవృత్తి
లలిత కల్యాణగుణగణ ♦ లాలితులకె
కాక సౌభాగ్యలక్ష్మికి ♦ కాసయోగ
మమరునే జన్మసాఫల్య ♦ మందఁగాంచి
కాక కంటినె భవదంఘ్రి ♦ కంజవనము. ౫౨

తే॥ దుర్గమస్థలసంచార♦దూషణమున, కేమి యపరాధ మొనరించె♦నీపదాబ్జ
యుగ్మములు మేలి సౌందర్య♦యోగమునన, కాక దండనవిధిని నై♦కట్యంబె కలుగ

తే॥ చొచ్చినంతన కొల నిది ♦ శుద్ధగంగ
యయ్యె నిమ్మోలిచూడ్కుల ♦ నమరవనము
మ్రోఁకులై నవి తీరద్రు ♦ మములు మీఁద
నేది యేసిరిఁ గాంచునో ♦ యెఱుకపడదు. ౫౪

ఆ॥ ఎదిరియగ్గిరీంద్ర♦మీతనుద్యుతులచే, రత్నసానువైక ♦ రమ్ము మెఱసె
మదను ముదము పెనుచు♦మాటకుఁ బోలదే, సింహసంహననము ♦ శ్రీభవనము.

చ॥ సిరి తనఁ బంటిదే యనెడు ♦ చెల్వము జెల్వగు సింహవిక్రమం
బగసము పేర్మియుం బెరసి ♦ యాకృతు లొనెనచంద మైన మీ
రిర వెడఁగోసి చేష్టడుచు ♦ నేకత మేకతనం జొరంగనై
శిరో తరువల్కలము ల్మునుల ♦ తీరునఁ గట్టి వనాంతభూములన్. ౫౬

ఆ॥ రాజభోగముల వి ♦ రాజమానులై కొ
కాలినడకతోనె ♦ కదలివచ్చి
యేల యుడుకఁజేయ ♦ ని ట్లూర్పుపుచ్చుచు
మమ్ముఁబోటి ప్రజల ♦ మానసముల. ౫౭

సీ॥ ధరణీతలం బిది♦ధన్య మయ్యెను భవ, చ్చరణముద్రాప్రస క్తిఁ♦జాల నెగడి
యానరనారాయ♦ణాఖ్యులే యన మున్నె, బాదరక్షేత్రమ్ము♦పావనమ్ము
మునివేసముల పైని♦ముచ్చటగా కొంట, నెల్లలోకంబుల♦నేలలేదొ
రూపయౌవనకలా♦రూఢిఁ బెంపొందు ని, య్యనఘున నిల్గాట♦యరయఁబడదు
రోజుచున్నవి యిష్టాని ♦ రుద్ధమార్గ
ములు శరశరాసనాసులు♦ముక్తకంచు
కమ్ము లౌ పన్నగము లట్లు ♦ గాట్ల కెదుర
నున్నవాఁ డెవ్వఁ డొక్కొ యీ ♦ యుర్వియందు. ౫౮

తే॥ కన్నుఁగవ కన్న భాగ్యంబె ♦ కారణముగ
వినత యాశ్రితి యున్నది ♦ వివశ యగుచు
నీరసంబునఁ బోనీక ♦ యింత దెలిపి
వినుతఁ జేయుఁ డక్కటికమ్ము ♦ విశ్రుతముగ. ౫౯

ఆ॥ కలసి మెలసి యింత♦గాఁ బల్కరించిన, నుత్తరం బొసంగ♦కుండి రనఁగఁ
బోల వాదరమునఁ బ్రోచువా రని దర, స్మితముతోఁ బ్రసాద♦స్పృష్టి తెలుప.

తే॥ ఏను సుగ్రీవసచివుండ♦వానరుండ, ననిలుని ప్రసక్తి సంజన♦యందుఁ బొడమి
నాఁడ హనుమంతుఁ డందురు♦నను వరాత్త, రామగతిరూపకలనలు♦గలుగువాఁడ.

ఉ॥ మోసము గాదు మీవలని ♦ మోహనరూపవిలాససంపదల్
భాసురశౌర్యధుర్యతయు ♦ భావన సేసి ప్రభావయోగలు
శ్రీమనుసమేతులం చతఁడు ♦ కృత్యవిదుం డనుపంగ దర్శనా
భ్యాసవశంబునం దలఁపు ♦ లారసి సఖ్యముఁ గూర్ప వచ్చితిన్. ౬౦

క॥ సుజనప్రియుఁ డాతఁడు స, త్త్వజవోపేతుండు సూనృ ♦ తప్రసితుఁడు స
ర్వజనీనచరితుఁడునుఁ దన, నిజ మరసిన నొసఁగుఁ జనవు ♦ నేస్తం బొడలున్.

ఆ॥ ఆతఁ డన్నవలని ♦ యుపకారమునఁ జేసి, నెలవు వీడి యిచట ♦ నిలిచియుంట
కారణముగ శంక ♦ గదుర న న్వేఁడంగ, భిక్షురూప మూని ♦ వెరసినాఁడ. ౧౪

క॥ నెనరు గల దొరలు సుముఖా, వనయే యింకిటఁ బ్రమాణ ♦ వస్తు వనుచు న
య్యనుపమమతిగీష్పతి యి, ట్లని యూరకనిలిచెఁ జిన్మ ♦ యాత్మవికాసా! ౧౫

—♦ శ్రీరాముఁడు హనుమని పలుకుల విని లక్ష్మణునకు నచ్చెరువడుచుఁ దెలుపుట. ♦—

తే॥ తనమనం బుల్లసనమునఁ ♦ దనరుచుండ
హనుమ నుడు లట్లు విని రాముఁ ♦ డాక్షణంబ
మ్రోల నెలకొన్న లక్ష్మణు ♦ మురువు గాంచి
పలికె నమ్మోయి గంభీర ♦ భాషణముల. ౧౬

మ॥ కనఁ గాంక్షించిన లక్ష్మి స్తా నెదుర నై ♦ కన్పట్టె నన్నట్టు ల
య్యినసంభూతుఁడై పంపఁ దత్సచివుఁ డి ♦ ట్లేతేరఁగాఁ గల్గె ని
య్యనఘు న్దేవనిభు న్సుధామధురవా ♦ క్యస్నిగ్ధసంభావన
ల్పొనరం దృప్తునిఁ జేయు మీతని కృతి ♦ న్బొల్పారు మే లెంతయున్. ౧౭

తే॥ పొనర ఋగ్వేదమున శిక్షఁ ♦ బొలుపుగాంచి
యాయజుర్వేదమున ధృతి ♦ నవధరించి
సామవేదవిదగ్ధతఁ ♦ జాల నెగడి
కాక యితని నెనయఁ బల్కఁ ♦ గలరె యొరులు. ౧౮

సీ॥ ఏనాఁడు చదివినో ♦ యిన్ని వ్యాకరణమ్ము, లపశబ్ద మని నుడు ♦ లందుఁ జొరదు
త్వరితమ్ము నానుడు ♦ తనము సందిగ్ధత, విస్తర మనరాదు ♦ వెదకి కనిన
కల్యాణి సంస్కార ♦ కలిత వాగ్దేవియే, యాడింపజాలె ని ♦ ట్లనఁగవలయు
నక్షరమ్ములు తావు ♦ లంది వ్యంజనలత్తో. మధ్యమస్వరమున ♦ మానితములు

గాఁ బలుకు వీనిపై వైరి ♦ కత్తి యెత్తి
యేని మఱలఁడె తనబుద్ధి ♦ నీసడించు
కొనుచు నవయువముల స్పృష్టి ♦ యనఘ! యీతఁ
డెవరి చిత్తవృత్తుల హరి ♦ యింపలేఁడు. ౧౯

క॥ ఇతనిం బోలిన సచివుఁడు, పతి కబ్బిన నెట్టి దొనఁగు ♦ పాల్పడునేనిన్
గతి సెడనీయ కతనిఁ దన, మతిబలమున నొడ్డు సేర్చి ♦ మనుపక యున్నే. ౨౦

ఆ॥ దూతకృత్య మెనసి ♦ దొరసిన యిమ్మేటి, పలుకుకతన నేని ♦ పాయఁగంటి
ముంచి తేల్చు శోక ♦ మోహాహార్మికలఁ గార్య, కలనఁ గాని దొండు ♦ గలదె యింక.

క॥ సిద్ధిం బడయఁగ నగు నీ, సిద్ధార్థుని తెలివి బలిమిఁ ♦ జేసి యొన మనం
బద్ధము గానేరదు నీ, బుద్ధి నితని పొందు కలిమి ♦ పొలప మరయుమీ. ౨౨

తే॥ అనిన సౌమిత్రి హనుమతో ♦ ననియె నిట్టు
లన్న! నీ వేది తెలిపితి ♦ వదియ సేయ
నున్నవారము సుగ్రీవు ♦ నోజ మెఱుకఁ
గన్నవారము నీనుడి ♦ కలిమి వెలయ. ౨౩

క॥ ఏ మతనిన కని నెయ్యం, బా మెయిఁ గొని సేసి మెనయు♦నరుదెంచితి ము
ద్దామగుణుఁడ వగు నీనుడి, మామది సందియము లెల్ల♦మలఁగె సహృదయా!

ఆ॥ అనిన సంతసిల్లి♦యామ్రోతి యే బుద్ధి, దలఁచి వచ్చినాడఁ♦దదభిలషిత
మదియ యయ్యె నేస♦యున నేల యన్నిఁట, ధర్మ్యుఁ డయ్యె నింకఁ♦దపనసుతుఁడు.

క॥ ఇమ్మెయి నాలో నెంచుచు, ని మ్మెఱిఁగినవాఁడు హనుమ♦యినకులతిలకుఁ
నెమ్మిఁ గనుఁగొనుచుఁ దా ననె, సమ్మతి సంభ్రమము లేక♦సరణిఁ దలిర్పన్.

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణుల వృత్తాంతము తెలియఁగ వేఁడుట. ♦—

ఆ॥ అయ్య మీర లిట్టు♦లతిఘోరవిపినమ్ము, లందు మెలఁగఁ గాంచ♦నైన కార
ణం బదేమొ తెలుపు♦మింబు లౌ మేనులు, కఱకుఱాల ముండ్లఁ♦గాసిపడఁగ. ౨౭

క॥ ఒకయెడ నుండిరె మహిమను, సకలము జగ మేలఁ జాలు♦సామివి మాని
ప్రకృతికవేషకలనఁ ద, మ్ముకుఱ్ఱతో రాఁగ నేమి♦మొనసెనొ చెపుమా. ౨౮

క॥ అన విని రాముఁడు లక్ష్మణుఁ, గని శస్త్రిత మొనరింపు మయ్య♦కర్జము తెఱఁగీ
వన నాతఁడు పవనజునకు, వినిచె న్దమవృత్త మిట్టి♦వెరవున మహిళా! ౨౯

—♦ లక్ష్మణుఁడు హనుమంతునకుఁ దమవృత్తాంతము వినుచుట. ♦—

ఆ॥ శ్రీయుతుండు సుప్రసిద్ధుండు దశరథా
ధీశుఁ డవనితలము ♦ నేలెఁ బెద్ద
కాల మతఁడు ద్వేష్ట ♦ కాఁడు ద్విష్టుఁడు లేఁడు
మే లటంచుఁ బ్రజలు ♦ మెచ్చి పొగడ. ౩౦

క॥ ఇష్టాపూర్తసమృద్ధి న, దుష్టతఁ గని తుష్టుఁ డగుచుఁ♦దోడ్తో నింద్రుం
డిష్టునిఁగ నతనిఁ గొని తన, కష్టములం బాసెఁ బాపెఁ♦గర్బురతతులన్. ౩౧

తే॥ తాఁ బితామహు నట్లు భూ ♦ తముల కెల్లఁ
బతియుఁ బ్రాణము ప్రాణమై ♦ పరఁగు నమ్మ

హోమహవ్యన కేమి పుత్రుల ♦ మగ్రజుం డి
తండు రామాఖ్యుఁ డేలక్ష్మ ♦ ణుండ ననఘ! ౮౨

తే॥ ఎల్లసుగుణమ్ములకుఁ బుట్టి ♦ నిల్లు శరణ
మఖిలభూతమ్ములకుఁ జెల్వి ♦ కాటపట్టు
నాఁగ నొప్పు నీఘనుఁ బ్రిజా ♦ రాగలహరి
తోడ నృపలక్ష్మియునుఁ గవఁ ♦ గూడ నెఱయ. ౮౩

ఉ॥ ఆడినమాట తప్పని న ♦ యంబునకు న్నరిగాఁగఁ గీడుమా
టాడఁగలేని తండ్రిఁ గని ♦ యానతిఁ గైకొని వైభవంబులన్
బోఁడిమితోడ వీడి ముని ♦ షోలిక వెల్వడఁ గాంచి సాధ్వియుం
దోడని తల్లి నే నటులె ♦ తోఁ జెడఁబాయఁగలేక వచ్చితిన్. ౮౪

తే॥ పాయక విభాకరునిఁ గొల్చు♦ప్రభ యనంగఁ, గూడివచ్చిన యద్దేవి♦క్షోణిపుత్రి
సీతనాఁ జను నాయమ♦పూతచరిత, నెవ్వఁడో మొఱంగి కొనిచనె♦నేమి లేమి.

క॥ చింతిలి యాయమ వెదకుచు, హంతల మర్దించుచును మ ♦ హాటవిలోనన్
గొంతవఱకు రా మమ్మ న, గాంతకుఁ డొకఁ డాక్రమింప ♦ నాతనిఁ జంపన్.

ఆ॥ దనువనంగ నొప్పు ♦ దానవుం డవ్వాఁడు
దివ్యరూపుఁ డగుచుఁ ♦ దేజరిల్లి
యినజు చెలిమి కలిమి ♦ నెనయుంగ నగు మే ల
టంచుఁ బలికి చనియె♦ నమరపురికి. ౮౭

క॥ అదటఁ దోర్వం గైకొని, యాదైవము కాల మొక్క ♦ డై నెఱి నూఁవన్
బోరిది యగు తెఱవుగానక, కా దెదియును ననెడు తలఁపు ♦ గ్రందుకొనంగన్.

అ॥ తఱిమి వచ్చి పంపఁ♦దరిగాంచి యద్దాని, మురువు మెచ్చిఋశ్య♦మూకమునకుఁ
జేరఁ బాఱుతఱిన ♦ చేరంగవచ్చితి, నీవు సుకృతరూప ♦ నియతి వెలయ. ౮౯

తే॥ తాతతండ్రులు మున్ను గా♦దయితు లొడ్లఁ, బోవఁ జాలినవా రట్లు♦ప్రోచినారు
తారె యట్టికులమున నీ♦తరమునందు, మాముఖంబున నర్థులై♦మలసినారు. ౯౦

సీ॥ తపనుఁ దేజనకల్మిఁ ♦ దాక్కాణ గావించు, తేజస్వి తపసియై ♦ తెలుఁగుఁ బాసె
నర్థులపాల నే ♦ నని ప్రోచు దార యొడ్ల, నర్థింపనై యిట్టు ♦ లలఁతిపడియె
శర ణన్న నరి నేనిఁ♦జాలి మన్పుదయాళు, వభయ మం చనువారి♦యండఁగోరె
మాయదారుల రూపు♦మాప నేర్చినప్రోడ, మాయరక్కసు చేఁత♦మలఁకమలఁగె

నెంచి ముల్లోకములొకంట ♦ నెత్తివచ్చె
నేనిఁ దలఁకని దంట యి ♦ ట్లెడలి బడలె
నోడలం బండ్లు బండ్లపై ♦ నోడ లెత్త
నైన విధి కివి వింతలే ♦ యనిలతనయ ! ౯౧

క॥ జగదర్చ్యుఁడు విశ్వజనీ, నగుణాఢ్యుఁడు నాకలోక ♦ నాయకునైనం
బొగడఁ దగుడుపడఁ డిన్నేరి, నొగు లొందుట చోద్య మయ్యె♦నుతసచ్చరితా !

తే॥ అవనిజ నయోనిజాశమ ♦ హానుభావఁ
జెనయఁజూచెడు చెఱుగడ్పై ♦ చెడకపోవఁ
డిమ్మహామహు నెదిరించి ♦ యేనిఁ బ్రదుకఁ
డమ్మహిత యొంటి నవయుట ♦ కడలవలసె. ౯౩

క॥ ఈ వడిగినవృత్తాంతఁ, బావంతయుఁ దిక్కుకుండ ♦ ననలసఖసుతా !
నే వినిచినాడఁ గర్జం, బేవలనునఁ జక్కపఱుతొ ♦ యిది నీయదిగాఁ, ౯౪

—♦ హనుమంతుఁడు రామలక్ష్మణుల సుగ్రీవునిదరిఁ జేర్చుట ♦—

తే॥ మిత్రినందనుతోడి స ♦ న్మైత్రికలిమి
మేలు గూర్పంగ నదియు నీ ♦ మేలె యనుచు
సాశ్రులోచనుఁ డై పల్కె ♦ హనుమ యలరి
మిత్రినందనుఁ డైన సౌ ♦ మిత్రికనియె. ౯౫

ఉ॥ ఇంత మహానుభావు లని ♦ యి ట్లరయందగు భావ మబ్బె మీ
చింత తలంగుఁ డింక విధి ♦ చేకురఁజేసెను మేలు పొల్పడెన్
సంతస మొక్కట న్సవిత్రు ♦ సంతతివారలు మీర లాతఁడున్
మంతన మొప్పఁ జేరఁ గని ♦ మాలిమిమీఱ మెలంగఁ గల్గుటన్. ౯౬

ఉ॥ పోవుద మయ్య యాతఁడునుఁ ♦ బోఁడిమి దక్కె సహాయయోగ మె
ట్లేవగనేనియుం దనకు♦నేర్పడునో యని వేచియుండె నా
కావరుఁ డింద్రిజుండు తనుఁ ♦ గాసిలఁజేసి న కారణంబు తా
నే సమకూర్చు నొండొరుల ♦ యిష్టముల న్విధి ప్రేరణంబునన్. ౯౭

క॥ సమదుఃఖసుఖులు తా ర, త్యమలహృదయు లవుటకతన ♦ నన్యోన్యసహా
య మొనర్చికొని స్వరాజ్యా, గమమున మే లెనయువారు ♦ గాఁగలరింకన్.

వ॥ అని శ్రీరాముని నెమ్మొగమ్ము సమ్ముఖమ్ము సేసికొని. ౯౯

తే॥ రమ్ము నాయన్న! యినజుఁ డె ♦ రంగ నిపుడె
తమ్ముఁడును నీవు సమ్మతిఁ ♦ దనరుచుండ
నేము నాతండునై ♦ న మహీతనూజ
నందఁజేసెద మాయుమ ♦ నరసి కాంచి. ౧౦౦

ఆ॥ అనిన సంతసించి ♦ యాతని నగ్గించి
తాను ననుజుఁడును వి ♦ ధాన మరసి
సమ్మతమ్ము నూప ♦ సామీరి మెయి వెంచి
తనభుజముల వారిఁ ♦ దనరఁ జేర్చి. ౧౦౧

క॥ మొనయఁ గని ఋశ్యమూకం, బున వారల డించి భీతిఁ♦బొదలెడు చిత్తం
బున మలయమువంకకుఁ జని, తన రాకను వేచుచున్న♦తపనతనూజున్. ౧౦౨

వ॥ సందర్శించి యెల్లవృత్తాంతం బెఱింగించి యాతనిం దోడ్కొని వచ్చి రఘువీరుల
సన్నిధానంబు వడయం జేసిన. ౧౦౩

— ♦ సుగ్రీవుఁడు శ్రీరామునితో సవినయముగఁ బల్కుట. ♦ —

క॥ వంత తలఁగ సంతస మ, త్యంతసమృద్ధంబుగా న♦నావిలవృత్తిన్
స్వాంతము తనరఁగ నెలగొని, చెంత న్నిలువఁబడి పలికెఁ♦జిత్కళ లొలయన్.

ఉ॥ ధర్మవున న్వినీతిమెయిఁ ♦ దద్దమెలంగెదు విక్రమంబున
న్మర్మము నీకవో తెలియు ♦ మానితనృత్తిపి వత్సలుండ వీ
నిర్మలమూర్తియందు నలి ♦ నీవిభు తేజము బింబితంబుగా
దుర్మతవర్గము న్దోలఁపఁ ♦ దోఁచిన యియ్యవతారసంపదన్. ౧౦౫

ఆ॥ తెలిపెనయ్య! నాకుఁ♦దేట తెల్లంబుగ, నీదుగుణము లెలమి♦నిర్మలాత్ముఁ
డీసమీరసూనుఁ♦డిన్నియు భవదీయ, దర్శనమున స్పష్ట♦తరము లయ్యె. ౧౦౬

క॥ కాదే మహాప్రసాదము, నీదర్శన మిదు లె కాక♦నెమ్మిని సఖ్యం
బీఁదలఁచి వచ్చితిని నే, నీదయితున కంటి కోర్కి ♦ కిది సుగమంబే. ౧౦౭

తే॥ సిద్ధముగ నున్న దీచేయి♦చేయి సాపు, మింక జాగేల రవిజుండె♦యితఁడు భాను
వంశపావనులరు మీరు♦వచ్చెఁ జెలిమి, యెట్టి మర్యాద నెలయింప♦నెంతొ రామ!

క॥ తమ్ములు నీ కిందఱలోఁ, దమ్ముఁడ నే నొకఁడఁ జుమ్ము♦తాత్పర్యమునన్
గొమ్మింకిట నీభారమె, నమ్మము కింకరుఁడ మీఁద♦నా కెవి సెలవో. ౧౦౯

ఆ॥ అనిన రాముఁ డతని♦హస్తమ్ము హస్తమ్ము, నేర్చి చెలిమి యిదియె♦సిద్ధ మనుచుఁ
గౌఁగిటం గదించెఁ♦గర్మసాక్షితనూజుఁ, దేజు పెనుపుఁ దోనె♦తెలియఁ బడఁగ.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునితోఁ సవినయముగఁ బలుకుట. ♦—

చ॥ అనలునిఁ బ్రజ్వలించు నటు ♦ లయ్యనిలాత్మజుఁ డ ప్లొనర్చినన్
మనములు పొంగ సత్కృతిస ♦ మాహితులై వలగొంచు వచ్చి య
య్యినకులవర్యాళి భానుజుఁడు ♦ నేకవచస్కత నైతిరికల్మిఁ బా
యని నియతిం జరింతు మిఁక ♦ నంచుఁ బ్రతిజ్ఞఁ బొనర్చి రయ్యెడన్. ౧౧౧

క॥ నిండుమనంబుల నవ్వా, రొండొరులం గనుచుఁ దృప్తి ♦ నొలయని దృష్టు
ల్కొండుకొని నెఱయ నమ్మెయిఁ, గొండొకతడ వుండి రాస ♦ గొనకొనుచుండన్.

క॥ అంతటఁ దాపని కంటక, దంతురితశరీర మొప్ప ♦ దాశరథిపద
ప్రాంతరఘటితకరుండై, సంతసమున ననియె నిట్లు ♦ సంయమివినుతా! ౧౧౩

ఆ॥ కష్టమైన సుఖము♦గానంగ నైన లే, దర యొకింత రఘుకు♦లాబ్ధిచంద్ర!
యోవయస్య! యిట్టి♦యో జ నీకును నాకు, నేమి సుకృత మిడెనొ♦యింత ఫలము.

మ॥ అని పూవు ల్దళము ల్దలిర్ప లలితం ♦ బై యున్న యొండొక్క శా
ఖనుఁ జేచే గొని తెచ్చి రామునకు శ్రీ ♦ కల్యాణసౌగుణ్యధా
మునకు న్విష్టరము న్బొనర్చి భుజము ♦ ల్పొంగంగ నద్దేవు నా
జ్ఞను గూర్చుండె సహాసనస్థితి సమై ♦ శ్వర్యంబు చేకూరఁగన్. ౧౧౪

ఉ॥ చందనవృక్షశాఖ నటు ♦ స్వర్ణనసూనుఁడు తెచ్చి భక్తిమ
చ్ఛందనశాఖ యమ్మగధ ♦ జాతను జాతున కుంచె నంద ఱిం
పొందుచు నిష్టగోష్ఠి మెయి ♦ నుండఁ బురస్కృతు లొప్ప రాము మో
మందున చూడ్కి నిల్పి మిహి ♦ రాత్మజుఁ డిట్లనె హర్ష పూర్ణుఁడై. ౧౧౬

—♦ సుగ్రీవుఁడు తనకష్టములఁ జెప్ప రాముఁ డభయ మిచ్చుట ♦—

క॥ జీవింపఁగ శుభ మెనయుం, గావచ్చు నటన్న నీతి ♦ కడుఫలవతియై
నావలనున గనుపట్టెను, దేవ! త్వదాశ్రయము తనకు ♦ దిట వొనగూర్పన్.

తే॥ అన్న నను గిట్టి నాదార♦నపహరించి, వాలి కడువాలి తోలంగ♦వలను లేక
చేరితిని దీని నీకొండఁ♦జెనయఁబోఁడు, మౌనిశాపాత్తురస్మృతి♦ఁ బ్రమానుపఱుప.

ఆ॥ అతనితోడి వైర♦మంత లింతలు సేయు, నున్న యూపు సెడఁగ♦నుంటి నిట్లు
నాదు భయము గెడపి♦ననుఁ గొమ్ము నీయాన, మెలఁగువాఁడ నెలమి♦మేకొనంగ.

వ॥ అని విన్నవించిన. ౧౨౦

ఉ॥ తేజున గన్నగారవము ♦ తెల్వినిఁ దేటను బ్రస్తుతింప నా
యోజనె ధర్మసంగ్రహము ♦ హీయాన్నతి వాఙ్మనసప్రయుక్తిమై

రాజిల రాజయోగమున ♦ రాణఁ దలిర్చుచు రూపు పెంపు ని
ర్వ్యాజత నైజమంచన న ♦ హార్పతివంశకిశోర మిట్లనున్. ౧౨౧

ఆ॥ భానుగోత్ర విదిత ♦ మనఘ! మైత్రిఫలంబు, పాపమనక నీదు ♦ భార్య నొడిచి
కొన్న వాలిఁ దున్మి ♦ కొనకొని యాతని, సిరికి నిన్నధీశుఁ ♦ జేయువాఁడ.

తే॥ అశనిసదృశము లై గఱు ♦ లంది నిశిత
ములు సుపర్వములు నగు తూఁ ♦ పులు ఘను లనఁ
దొడరుచున్నవి కడఁక నా ♦ ధూర్తు దెసకుఁ
బుట్టలం బోలు నమ్ముల ♦ పొదులనుండి. ౧౨౩

క॥ పీడుము భయ మింకి నీ, సూడగు నతఁ డెదిరి మనఁగ చూచెదు పవి నా
వాఁడిని తెక్కలు తెగి గిరి, పోఁడిమిఁ జెడి కూలుభంగిఁ బుడమిం బడఁగన్.

ఆ॥ అనుచు భానుజనకు ♦ నవ్విభుం డభయం బొ, సంగు నప్పు డె జనక ♦ జకుఁ బ్లవంగ
దానవేంద్రులకు న ♦ దరె వామనేత్రము, ల్పద్మహేమశుచిని ♦ భమ్ము లగజ!

—♦ సుగ్రీవుఁడు శ్రీరాము నారాధించుట ♦—

క॥ అంతట సుగ్రీవుఁడు శ్రీ, మంతుఁడు రఘురాముతోడి ♦ మాలిమిఁ బొడ వా
నంతసమున హృద్గతశు, క్సంతమసము విరియఁ బలికె ♦ జతనము మెఱయన్.

ఆ॥ అన్న తెలిపె సచివుఁ ♦ డాప్తుండు హనుమ ని
ర్జనము వనము మీఱ ♦ లెనయు నైన
యానిమిత్త మట్టు ♦ లాదట మొనసిన
యంతరాయ మదియు ♦ నంతవట్టు. ౧౨౭

ఆ॥ మీరు లేనితఱిని ♦ మెయివెంచి యాచెట్ట
రక్కసుఁడు హరించె ♦ రాణివాస
మెఱిఁగి యడ్డుపడిన ♦ హితు జటాయువుఁ దున్మి
యైన నామె శక్య ♦ మగునె తనకు. ౧౨౮

క॥ శక్రాదులకేనియు ని, ర్వక్రచరిత జనకదుహిత ♦ వలనే చెనయన్
విక్రాంతు లగుచు సాధ్వుల, విక్రమమునఁ జెడరె మున్ను ♦ బాహాత్ము లిలన్.

ఉ॥ ఏగతి జీర్ణ మాను విష ♦ మింతయుఁ జేరిన యన్న మీఁగతోఁ
దోఁగిన నేయియున్ సతుల ♦ ధూర్తత నాఁచికొనంగ నెంచియున్
దాఁ గెడయు న్వినింద్యుఁ డగు ♦ ధర్మమయి న్పవదంగనామణిన్
లోఁగొన నెంచెనేని నటు ♦ లోఁబడు దైత్యుఁడు నాదు శక్తికిన్. ౧౩౦

క॥ ఆయమవియోగమున కీ, వోయయ్యా! యడలవలవ♦దొగి శుభ్రితి నట్ల
మ్మాయామిఁ గెడపి సతి నే, నే యొసఁగెద నీదుచిత్త♦మెలయఁగ రామా!

తే॥ ఇంక సందియ మందకు ♦ మినకులాబ్ధి
చంద్ర! మాయమ్మఁ గాంచిన ♦ చంద మిప్పు
డనుమితం బయ్యె రామరా ♦ మా యటంచు
నాకసంబునఁ జనిన య ♦ య్యానువు దలఁప. ౧౩౨

క॥ అద్దేవి నిన్నుఁ బాసి వి, పద్దశ తనుఁ జుట్టఁ గురరి ♦ భంగి నడచుచుఁ
మొద్దు దివిజారి కొనిచను, నద్దారిని జూడనయ్యె ♦ నయ్యా! నాకుఁ. ౧౩౩

తే॥ పన్నగేంద్రవధూమణి♦భంగి నున్న, యబలఁ జేకొని రక్కసుం♦డరుగుచుండ
నిచట నుంటిమి నలువురు♦నేను స్వీయ, కృత్యచింతనమున మది♦గిరికొనంగ.

తే॥ ఎంత యుద్దేశ ముండెనో ♦ యెఱుకపడదు
తనదు చేలాంచలమున నా ♦ తల్లి ముల్లె
నేసి యాభరణమ్ములు ♦ చేరవిడిచె
నేము గొనితెచ్చి యునిచితి ♦ మింతవట్టు. ౧౩౪

క॥ ఆముల్లియ యాచేలము, నీమదిఁ దొలుతఁ బరికించి♦నెఱుపు మనఘ! యా
శ్రీమతి నారయుతలఁపున, కా మంగళసంవిధాన♦మనుబంధముగఁ. ౧౩౫

ఆ॥ అనినఁ బ్రియవయస్య! ♦ యాలస్య మిం కేల
యదె మహార్హ మదె మ ♦ హాప్రసాద
మిట్టివలనువలన ♦ నెడపెట్టు మీసఖు
జీవితాశ మలఁచు ♦ చెట్ట తలఁపు. ౧౩౬

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు సీత సొమ్ములమూటఁ జూపుట. ♦—

మ॥ అన నుప్పొంగుచు నర్కజుండు గహనం ♦ బౌ తద్గుహాగర్భసీ
మ నసామాన్యతఁ జెట్టియున్న యవి నే ♦ మం బొప్పఁ గైకొంచుఁ జ
య్యన శ్రీరాముని కర్పణం బొనరఁజే ♦ య న్బాష్ప సంరుద్ధుఁ డ
య్యెను నీహారము గ్రమ్మఁ జందురునియ ♦ ట్లీక్షింప లోకేక్షణా! ౩౩౭

తే॥ గద్గదిక దోఁప ధైర్య మె ♦ క్కటఁ దలంగ
హాప్రియే యని యవనిపై ♦ నతఁడు వ్రాలె
నంతమాత్రన సామాన్యుఁ♦డనఁగ రాదు
స్నేహబంధ మ్మెనర్చెడి ♦ స్థితి యెఱింగి. ౧౩౮

—♦ శ్రీరాముఁడు దుఃఖించుట. ♦—

క॥ అసదృశుఁ డాతఁడు బిలమున, బుసకొట్టెడు సర్పమట్లు♦పొరిపొరి నురుని
శ్శ్వాసమరుత్తులు పైకొన, దెసగొనె నమ్మూడియు నెదకుఁ♦దివిచి వయస్యా!

ఆ॥ అశ్రుపాతవేగ ♦ మపు డవిచ్ఛిన్నమై, యయ్యమూల్య భూష ♦ ణాంబరాఖ్య
మగు ప్రపాతితలము♦నంద తో పైయున్న, యనుజుతోడ రాముఁ♦డనియె నిట్లు.

క॥ అన్నా! లక్ష్మణ కంటివె, యన్నారీమణియు వీని ♦ నడలున వీడ౯
దిన్నని పచ్చికపైఁ బడెఁ. యున్నవి యున్నట్టె రూప ♦ మొప్పఁగ నింకా. ౧౪౨

ఆ॥ అదియ యుత్తరీయ♦మాభరణమ్ములు, నవియ కాఁగ నోపు♦నరయుఁడయ్య!
తవిలి యువిద పాట్లు♦ధారణ నెడలించె, ననిన నాతఁ డిట్టు♦లనియె నపుడు.

తే॥ ఎఱుఁగనయ్యా! కేయూరమ్ము ♦ లెఱుఁగఁ గుండ
లమ్ము లటు లాఁతిసొమ్ముల ♦ యిమ్ము లెఱుఁగ
నమ్మ నూపురములమాత్ర ♦ మరయఁ గాంతు
నిచ్చలుఁ బదాభివందన ♦ నిరతిఁ జేసి. ౧౪౪

క॥ అని యడలిన నినజునిఁ గని, యనఘా! సుగ్రీవ! రాక్ష ♦ సాధముఁ డమ్మా
నిని నెమ్మెయిఁ గొనిచనె నే, మని యాసతి యఱచె నరిగె ♦ నతఁ డేమెడకు౯.

సీ॥ నాబహిఃప్రాణంబు♦నవయంగ నెచ్చోట, సుగ్రీవుఁడు దైత్యు♦డునిచినాఁడొ
నా కెగ్గు పొనరించి ♦ నాఁడు తా నెల్లరా, క్షసులఁ జంపింపన ♦ కాకయున్నె
మిత్తి వాకిలి దీయ♦ మేకొనె నిట్లది, తనచేటుమం దంచుఁ♦దలఁపవలదె
యెదిరనేనియు వాని♦నిప్పుడే పరిమార్తు, దొంగవాఁ డెచ్చోట♦దొరకునొక్కొ
యుసురు లున్నవి రక్కసు ♦ నుక్కుమడఁపఁ
గానిచోఁ బ్రియ నెడఁ బాసి♦గాసిపడవె
యింత విధి నేర్పు వెర యింక ♦ నేమి గలదొ
తెలుపుమోయయ్య హరిముఖ్య! ♦ తేటపడఁగ. ౧౪౬

—♦ సుగ్రీవుఁడు రామునకు శోకోపశమనము సేయుట ♦—

క॥ అని దీనత రాముఁడు పలి, కినఁ గేల్గవ మోడ్చి తోనె ♦ కీశవిభుం డి
ట్లనె నెఱుఁగనయ్య! యప్పా, పుని స్థలబలపౌరుషములఁ ♦ బోలఁగ నెపుడు౯.

ఆ॥ ఐన నేమి వాని నంతర మరసి నా, థింప మహీజవార్తఁ ♦ దెలిసి తెలుప
నేన చాలువాఁడ ♦ నిదె యత్నమొనరింతు, నీవు మానసమున ♦ ఖేద ముడుల.

క॥ దేవ! యచిరకాలముననె, దేవి భవత్సన్నిధి న్నొ ♦ దిత యగా నిజ మీ
నావచనము సేవింపఁగ, నై వెలసెద యుష్మదంచి ♦ తాంఘ్రినళములన్.

సీ॥ అవికారిపేశుండ ♦ వగు నీకుఁ దగునయ్య!, వైక్లబ్యమున కిట్లు ♦ వశవడంగఁ
దేజమ్ము ధృతిఁ దెల్పి ♦ తేటలఁ దెరలించు, శోక మాంతరసీమఁ ♦ బ్రాకినంత
నన్నుఁబోంట్లనుఁ దేర్చు ♦ విన్నను వుచితంబ, యగా నాదు విన్నప ♦ మాలకించి
యాత్మస్థితస్థైర్య ♦ మవలంబనము సేయు, నెఱిసత్త్వమునకల్మి ♦ నెగడు మింక

మలఁచు నార్తిఁ గర్జమ్మున ♦ మలఁకఁ బ్రాణ
భీతి నేనియు సదసద్వి ♦ వేచనంబు
నీయెఱుంగనిదే యిది ♦ నిర్మలాత్మ!
దీనజనపాల భక్తవి ♦ ధేయ! రామ! ౧౫౦

క॥ భారం బెక్కుడుగా జల, పూరమున న్మునిఁగి యోడ ♦ పొలియదె శుక్సం
భారం బట్టిదకాదే, పూరుషునిం బొడవడంపఁ ♦ బురుషోత్తంసా! ౧౫౧

క॥ ఇది యుక్త మయుక్తం బిది, విదితం బిది యనఁగ నొందు ♦ వేత్త గలఁడె ని
న్నెదిరి వచియింపఁ ద్వత్సౌ, హ్యాద మిటు ప్రేరేప దీని ♦ కేదొరకొంటిన్. ౧౫౨

తే॥ నీకు మ్రొక్కెద నీతివి ♦ నీతినిపుణ
కావిశేషంబు లొప్పారఁ ♦ దలఁపుమయ్య!
యాత్మతేజమ్ము దాన న ♦ య్యరుల గెలిచి
స్వీయసామ్రాజ్యలక్ష్మిఁ గై ♦ సేయుమయ్య! ౧౫౩

వ॥ అని యిట్లు మృదుమధుర సాంత్వనవచనరచన లనువొంద సుహృద్భావభావనాయోగంబునం దలకొన్న తిన్నని చనవున సుగ్రీవుం డంచితగ్రీవుండై మన్నన పెనుపార విన్నవించిన. ౧౫౪

ఉ॥ అంకిలి దేఱి తీయఁదన ♦ మందిన కన్నుల బాష్పరోధవుం
బింకము దీర్చి వత్సలత ♦ పేరఁటి పేరిమి నించు చూడ్కులా
వంకకుఁ దార్చి యర్కజుని ♦ వల్లభుఁ డంచితగాఢయోగము
ద్రాంకితుఁ జేసె బాహుయుగ ♦ ళాంతరసీమఁ గదించి నేర్పునన్. ౧౫౫

ఆ॥ పలికె నిట్లు బంధు ♦ భావమ్మునకు స్నిగ్ధ
ధర్మమునకుఁ దగిన ♦ దారి నొడివి
సమయమునను దేర్పఁ ♦ జాలితి నినుఁబోలు
హితుఁడు గలఁడె గెలిచి ♦ తిన తనూజ! ౧౫౬

తే॥ ఇంక జతనంబు సలుపుము ♦ హితుఁడ! సాధ్వి
వల నరయ రక్కసుండు రా ♦ వణుఁడు రౌద్రిఁ
దతిదురాత్ముండు పోయిన ♦ యట్టి పోక
తెలిసి యమ్మూర్ఖు శిక్షించు ♦ తెఱఁగుఁ బెరయ ౧౫౭

ఆ॥ నీవు కర్జ మిపుడె♦నేఁ దీర్తుఁ దొలకరి, యందు మంచి ఫలము♦నంది పైరు
లట్లు నన్నుఁ జేరు♦న వ్వారి కోరికె, లెన్నియును ఫలించు♦నింత నిజము. ౧౫౮

క॥ అని పలికిన మంత్రులతోఁ, నను మోదితుఁ డగుచు రవిజుఁ♦డాదట శ్రీరా
ముని సౌమిత్రిసమేతుని, గని యిట్లనె నుత్సాహము♦గడలుకొనంగన్.

ఉ॥ దేవత లెల్ల నావెతలు ♦ దీర్పఁదలంచిరి నోము లెల్ల ని
ష్పే వెలసె న్స్వబాంధవుల ♦ నిష్టులఁ గూడి మనంగఁ గంటి నో
దేవ! స్వరాజ్య మేల సుర ♦ దేవుని రాజ్యమ యేని నేల నా
నీవె హితుండ వై యెనసి ♦ యెంతయు నేనియుఁ బూనియుండఁగన్. ౧౬౦

ఆ॥ పొరయఁబోవ దనఘ!♦పొరపొచ్చె మొకయింత, సుజనమైత్రికలన♦చొప్పడంగ
నైనఁ జాలు నెల్ల యర్థంబులం దేమి, యుసురు లొసఁగు నంత♦లొదవనేని.

తే॥ నిన్నుఁ బోలు మహాత్ముండు ♦ నెఱయు టరిది
యొలసెనేనియు విడుమఱ ♦ యుండఁబోదు
సంయముల ధృతి యట్టిఁడె ♦ సజ్జనౌఘ
మందఁ గనినట్టి ప్రీతియు ♦ ననఘచరిత! ౧౬౨

ఆ॥ ఆఢ్యుఁ డైనఁ బేద♦యైన శక్తుం డైన, శక్తిహీనుఁ డైన♦సఖ్య మొదవె
నేని నతఁడ చూవె♦యిందు నందును గతి, యందు రెవుడు మహితు♦లైన జనులు.

క॥ నాకూర్చు భవత్సేవయు, నాకాధిపనంద్యచరిత ♦ నలినాప్తకుల
శ్రీకర! నీచిత్తమునకుఁ, జేకూర్చు స్వప్తి నింకఁ ♦ జెప్పఁగనేలా. ౧౬౪

క॥ అభయముఁ బ్రతిజ్ఞ నొసఁగెదు, విభుఁడవు నీ వుండఁ దనకు♦వెఱ పేల యిఁకన్
శుభముల గాంచెద నిట ని, య్యుభయము సమసుఖము పొల్పు♦నుర్వీజాప్తా!

క॥ అనిన రఘురాముఁ డిట్లను, ననఘా! యుపకారఫలము♦నందును మిత్రుం
బనయ మపకారఫల మరి, గనుఁ డెఱఁ గిదె కాదె యొందు♦గామన గునే.

—♦ శ్రీరాముఁడు వాలివిరోధకారణము సుగ్రీవునడుగుట ♦—

ఆ॥ నీవు సోదరునకు ♦ నెఱి దప్పి యిప్పగ, యేల పొడమె నిక్క♦మే వచింపు
మింతవ స్త్రుతింగి ♦ యే ననంతరకృత్య, మాచరింతుఁ గని బ♦లాబలములు.

తే॥ సఖుఁడ! నీయుపమానమ్ము ♦ సరణి విన్న
యది మొదలుగాఁ దొడరుచుండె ♦ నత్య మర్ష
మేను శర మొండు సంధించి ♦ యేసి నంత
నతఁడు మనఁబోవఁ డందుల ♦ కడుగవలసె. ౧౬౯

క॥ అని విస్పష్టముగా నొడి, విన సచివవరేణ్యు లార ♦ విపరీతభువు మే
లనువుపడె ననుచు సంతస, మునఁ దేలిరి హరివిభుండు ♦ మునుకొని పలికెన్.

—♦ సుగ్రీవుఁడు శ్రీరామునకుఁ బ్రత్యుత్తరమిచ్చుట ♦—

తే॥ ఋక్షవిరజుండు నాఁగ హ ♦ రీంద్రుఁ డొకఁడె
యయ్యె జనకుండు జననియు ♦ నయవిశేష
గతి హరీంద్రులసంయమ ♦ కలన మాకు
నతఁడు వాలి సుగ్రీవుండ ♦ నైతి నేను. ౧౭౦

మ॥ అనఘా! తండ్రి చనంగ రాజ్యమును న ♦ య్యర్థంబుఁ పాలింప జ్యే
ష్ఠు నిమంత్రించిరి మంత్రు లాతఁడు మహా ♦ శోభాఢ్యుఁడై యేలె నే
నునుఁ దత్సేవఁ బొనర్చుచుంటిఁ జెలుము ♦ ల్మాత్సర్యంబులా యంచు నొ
డ్లనయం బాదృతి మీఱ సన్నుతులు సే ♦ యం గల్మి పెంపొందఁగన్. ౧౭౧

ఉ॥ కావర మొప్ప స్త్రీకృతి నొ ♦ కం డరిఁ జేసికొని న్వరీసు మా
యావిపదుండు రక్కసుఁ డ ♦ హమ్మని మన్కికిఁ జేరి యొక్కనాఁ
డావిభుఁ బిల్చె యుద్ధమున ♦ కంబరముం బరసీమఁ ద్రోవఁగా
నావికృతస్వనం బెసఁగ ♦ నద్దమరేయి నతండు మూర్ఖుఁడై. ౧౭౨

క॥ ఆదుందుభిసుతు దర్పం
బాదివిజాధిపతనూజుఁ ♦ డారసి సుష్టి
స్వాదత్యాజనమునఁ గ్రో
ధోదయ మత్యధిక మగుడు♦నుజ్జ్వలుఁ డగుచున్

ఆ॥ ఎగసి దుముకఁబోవ♦నేనాక్షు లాగి రే, నేమి చెడియె నింత♦కిపుడె యంటి
నంగఅను నదల్చి♦యాతండు వానిపై, నుఱక త్రోడుతోడ♦నొలయఁ గంటి.

చ॥ ఇరువుర మమ్ముఁ గాంచి మతి ♦ హీనుఁడు వాఁ డెడలంగఁ బొచ్చె న
త్వరముగ నేను ముట్టఁ జనఁ ♦ దత్తఱపాటున రక్కసుండు కం
దరమున దూఱెఁ జందురుఁడుఁ ♦ దా నొలసె న్దిశలందు వెన్నెలల్
దొరయఁగ నబ్బిలం బెనయు ♦ త్రోవయుఁ దోఁప నతం డభీకుఁడై. ౧౭౫

క॥ నీ విచట నుండు మీ సు, గ్రీవ! గుహాంతరము సొచ్చి ♦ క్రించుపిసాచిన్
జావనడఁచి వచ్చెద నని, వేవిధముల వేఁడికొనిన ♦ వినక కడంకన్. ౧౨౬

ఆ॥ అడుగు లాన సుమ్ము ♦ టంచు నొట్టిడి సొచ్చి
నంతరాంతరాళ ♦ మహాబలాఢ్యుఁ
డవలఁ గడచె నొక్క ♦ హాయన మే నుంటి
నాన మీఱి కచట ♦ నంతవట్టు. ౧౨౭

క॥ ఆతఱి నాతఁడు రామికి, భ్రాతృస్నేహమున వగచి ♦ పరిపరివిధముల్
చేతోవృత్తి నలంప న, నేతాదృశదశ ననిశ్చ ♦ యోత్వరమతినై. ౧౨౮

ఉ॥ ఉండ సఫేనరక్తనది ♦ యొయ్యనఁ బాఱె గుహాముఖంబునన్
గండలు దుండగిం డ్రిఱచు ♦ కావరపు న్నదుపు ల్వినంబడెన్
గొండొకట న్నిరస్తుఁ డయి ♦ క్రొశన మీతఁ డొనర్చె నట్టిఁడై
యుండకుఁ బాసె నయ్యదియు ♦ నాదట నే నరయంగ రాఘవా! ౧౨౯

వ॥ ఇత్తెఱంగున నత్తలంబునం గానవచ్చు నిమిత్తంబు లుపలక్షించి యయ్యాది విప
క్షుల విజయంబ కా నెంచి యెన్నరాని తత్తరంబున నన్ను రామిం దలంచి నిహ
తుం డయ్యెనేమొకో యని శంకించి చింతాపరవశుండనై యరాతు లీదరిద్వారం
బునం బఱతెంచి కిష్కింధానగరంబు నెట్టన ముట్టడింప మొనకొందురో యను
తలంకునఁ గొండంబోని గండశిల నాసుషిరముఖంబున ఘట్టించి శోకించుచు
భ్రాతకుఁ దిలోదకంబులు సమర్పించి పురంబునం బ్రవేశించి యావేశికం బగు
నయ్యార్తి వెలిబుచ్చకయు కొండొకకాలంబు దనకు దైవానుగ్రహంబునం జేసి
యాతండు రానోపునో యని మే లెంచి నిరీక్షించుచుండ మర్మం బరసి ప్రధా
నముఖ్యు లెల్ల నేకీభవించి యరాజకం బగు రాజ్యంబు మననేర దను యోజన
మేకొనం బలాత్కారంబునం దదీయప్రజాపరిపాలనంబునకుం దన్ను నియోగించి
యభిషిక్తుం జేసిన. ౧౩౦

తే॥ అతని రాజ్యమె యని భావ ♦ మందుఁ జేర్చి
న్యాయ మెడలంగనీక మ ♦ హాభరమ్ము
మోచికొని యుంటి నేనాఁట ♦ మొనయు నవుడె
యప్పన మొనర్తు నియ్యది ♦ యనుచు రామ! ౧౩౧

క॥ అయ్యసురునిఁ బోరిగొని తా, నయ్యెడఁ జనుదెంచి తత్త్వ ♦ మరయు కడఁక
న్నెయ్య మెడలి నా నెయ్యురఁ, జయ్యన బంధించి కృద్ధ ♦ శంవదుఁడగుచున్.

ఆ॥ నన్నుఁ దూలనాడ♦నాయభిప్రాయమ్ముఁ, దెలిసి మ్రొక్కి యిది త్వ♦దీయ మర్థ
మే సమర్పణంబు♦న్యాస మట్టు లొనర్తు, నరసిగాఁ బొనర్ప♦ కేలికొనుము.

ఉ॥ ఈ వరుస న్సహోముఖము ♦ నేమఱ కబ్దము నుంటి నానతిం
ద్రోవక రక్తనిర్ఝము ♦ ద్రోవను వెల్వడ గుర్తు లట్టివే
కా వెఱఁగంది రక్కసుల ♦ కావర మెంచి శిల న్గదించి యి
ట్లీవిధి స్వీయ తేర్పఱుప ♦ నిష్టము లేకయుఁ దాల్పఁ బూనితిన్. ౧౫౪

క॥ నాయన్న! నీవు మేల్గని, యీయిమ్మునఁ జేరు టొక్కఁ♦డే చాలును నా
యీ మెఱుఁగమి మన్నింపుము, బాయం జాల భవదీయ♦పద సేవనమున్. ౧౫౫

క॥ అని నిగ్రహింపనోపియు, ననుగత సౌహార్దమున మఱి♦దగ్రజుఁ డని చేఁ
డిన వేఁడి చూపుల న్గనుఁ, గొనుచు న్బలువురు వినంగ♦గొంకక పలికెన్. ౧౫౬

సీ॥ పగతుని మాయావి♦బరిమార్ప నే నేగ, వచ్చెఁబో త్రోడ్తోన♦వల నెఱింగి
యాతండు పరువెత్తి♦యంతర్గుహం జేర, నచటఁ ద న్నునిచి లో♦నరిగి తిరిగి
వానిఁ గాంచితి నొక్క♦వత్సరంబున కట్టె, వారె కొండఱుఁ గడు♦వాలి యఱువ
నందఱఁ బోకార్చి♦యటు నిటు తేర్లాడి, నిర్గమమార్గంబు♦నెఱి గనంగ
నేరక శిలం దెరల్పంగ♦నేర్చినాఁడ, నెట్టకేలకు నఱచుచు♦ముట్టఁగదిసి
వీఁడు భయ మింత లేక న♦న్వీడి రాజ్య, మేలుచున్నాఁడు కంటిరే♦మేలటంచు.

క॥ క్రొవ్వఱ దండితుఁ జేసెడు, నవ్వాలనున కీతఁ డర్హుఁ♦డనఁదగు నైనన్
మవ్వము సెడ నెడయించిన, దవ్వానఁ బడి తలఁచుఁగాక♦తన కైతవమున్. ౧౫౮

ఆ॥ అనుచుఁ జెడుఁగు కర్జ ♦ మనక నాప్రియురాలి
నాఁకపడి హరించి ♦ యలఁతి సేసి
కట్టుపుట్ట మొకఁడు ♦ గా నన్ను వెడలంగ
నడచెఁ దెలువఁగలదె ♦ యధిప! యింక. ౧౫౯

ఉ॥ దిక్కుల నెల్ల నేన యయి ♦ త్రిప్పులపాల్పడి తిరుగాన కే
దిక్కునరాక సన్నవడి ♦ తెల్వి సెడం దిరుగంగ వీర లీ
చిక్కుకుఁ దార్చి రొక్కముని ♦ శాపమున న్స్వరయంగ నేరఁ డా
యుక్కులుఁ డిచ్చ టంచుఁ గత ♦ మొక్కఁడు దెల్పి కలంక దేర్చుచున్. ౧౬౦

క॥ ఈహరిముఖ్యులు నలువురు, స్నేహితులై యెపుడు నన్నుఁ♦జేరి మెలఁగ మ
మ్మోహాటిలఁ జేయ స్వీయుల, సాహసమున ననిచి వారిఁ♦జంపించికొనెన్.

తే॥ రఘుకులోద్వహ! యదియె కా ♦ రణము గాఁగ
నేఁ దలంకున ననిచితి ♦ నీహనుమని
లోకమున తరబడి యున ♦ రాక మీఁర
లేకతం బేకవీరు లి ♦ ట్లేగుదేర. ౧౯౨

క॥ నాపాలిభాగ్యదేవత, వే పనిచెను మిమ్ముఁ గడమ♦యెట్లనవలె ని
య్యాపదఁ గడవం బెట్టఁగ, నీపయి బలు విడితి నీదు♦నెనరే మనునో. ౧౯౩

—♦ శ్రీరాముఁ డభయ మొసఁగ సుగ్రీవుఁడు వాలి బలపరాక్రమము లెఱుకసేయుట. ♦—

ఆ॥ అనిన రాముఁ డనియె ♦ నన్న నీ వన నే న
నంగ నొండు గలదె ♦ నాదు చూడ్కి
కాతఁ డెదురు పడిన ♦ యప్పుడే కడతేఱఁ
గలఁడు వేయునేల ♦ కాంచె దదియు. ౧౯౪

క॥ నాకష్టమట్టు లనుకొని, నీ కథయుం బొసఁగినాడ ♦ నెఱిదప్పి యిఁకం
జాకుండు నాతఁ డెమ్మెయి, నేకశరము చాలు వాని ♦ నిద్ధరఁ గూల్పన్. ౧౯౫

తే॥ మేలు గాంతు వింక ♦ మెలఁకువఁ గను మన్న
రాముఁ బూజసేసె ♦ రహిఁ దలిర్పఁ
బొగడె నర్కజుండు ♦ పొంగారు సంతసం
బునఁ బొసంగెఁ బలికెఁ ♦ బొనరుపడఁగ. ౧౯౬

ఆ॥ లోకనాథ! నీవు♦లోలత మైఁ బల్కు, తరమె కోపగించు♦తఱియ యేని
మూఁడు చోటు లోకు♦మొగిన కొల్పవె శర, జాలకీల లెగువఁ♦జాల నెగడి.

క॥ ఐన రిపుబలాబలముల నానెఱిఁ గని నెఱపఁబోలు♦నాదటఁ గర్జం
చె నాతని పౌరుష మి, ప్డీనుడులం దెలుపువాఁడ♦నినకులతిలకా! ౧౯౮

తే॥ అతఁడు పడమటనుండి తూ ♦ ర్పుందు దక్షి
ణమున మునుకొని యుఱుకు లుత్త ♦ రమున కెగయు
నినుని రాకకు మున్నె తా ♦ నిన్ని సంద్ర
ముల మునిఁగి చేరుఁ గిష్కింధ ♦ కలఁత యనక. ౧౯౯

తే॥ పేరుఁ బెనుపును గాంచిన♦పెద్దకొండ, లెక్క శిఖరమ్ము లూటాడి♦యెగయ వైచి
పట్టుకొను బంతు లాడించు♦పగిది నట్టి, చెట్లఁ దనగాలిఁ బెరలంగఁ♦జేయు నదరి.

క॥ దుందుభి యను మహాపాకృతి, నొందిన పొలదిండిమేటి♦యొకరుఁడు రణకా
ధ్రిం దెగడఁజాలు మేనున, బొందగు వారణసహస్ర♦పూర్ణబలమునన్. ౨౦౧

తే॥ మఱియు వరదానమహిమ స ♦ మ్మదము మదముఁ
బెరుఁగ ద న్నదిరింగను ♦ పేర్మి దక్క
యేఁటిబోఁటిమగనిఁ గాంచి ♦ యెసక మెసఁగ
రమ్ము నాతో దురమ్ము తి ♦ రమ్ము గాఁగ. ౨౦౨

క॥ అని యఱచిన నంతకుఁ జా, లినవాఁడం గాను చనుము ♦ లీలం దుహినా
ద్రి నినుం బోలినయది యా, తనికి స్త్రీకు నగుఁ బోరి ♦ తము తగురీతిన్. ౨౦౩

తే॥ అతఁడు ముక్కంటి మామ శై ♦ లాధినాథుఁ
డేఁడుగడయు జేజేలకు ♦ నెల్ల తపసు
లకును నింతింత యనరాని ♦ లావు గలఁడు
నీకు సరియగుఁ గాంచెదు ♦ నీవ తొడరి. ౨౦౪

మ॥ అనిన స్ఫీతుఁడు వీఁడటంచు మదిలో ♦ నంకింతఁగా నెంచి చ
య్యన నయ్యద్రిశుఁ జేరి పిల్వ నతఁ డి ♦ య్యాగమ్ము నాకేల మా
ఋనితో నంచగు గూర్పు గొంచుఁ దపసుల్ ♦ గూర్చుండ నిల్లుండ నై
తిని గా కిద్దెసఁ బౌరుషం బరసిన ♦ న్నెల్లంబు గాకుండునే. ౨౦౫

క॥ నాకూర్పు కర్జ మెఱుఁగుము, నాకౌకశ్శత్రువర! య ♦ నమున్ఁడు గలఁ డ
ప్పాకారిసుతుఁడు వాలి యు, నేకులఁ గెడపె నతఁ డొక్కఁ డేలుఁ ♦ బ్లవగులన్.

క॥ వాలి యనఁగఁ గిష్కింధం, బాలించెడు వాఁడు నీకుఁ ♦ బ్రతిభటుఁ డగుఁ బో
ర్మ్రాలమున వానిఁ గెలిచిన, నేలెద విజ్జగతి కొక్కఁడ ♦ వేలిక యనఁగన్. ౨౦౭

ఆ॥ అనినఁ గొన్ని తాల ♦ నట్టు లిట్టులుఁ జిమ్మి, అంకె లిడుచు వీఁడు ♦ బింక మెడలెఁ
బొమ్మటంచుఁ దిట్టి ♦ బొమ్మ యగ్గిరిపతి, కట్టె కట్టి దుర్మ ♦ దాంధుఁ డగుచు.

ఉ॥ ఆశరుఁ డద్రిఁ బాసి శర ♦ మట్టులు వాలి పురంబు సొచ్చి దు
ష్టాశయుఁడై యదల్చి ప్రితి ♦ హారముఁ గొమ్ములఁ జిమ్ముచుం దరు
ద్దేశముల న్దెరల్చుచు క్షి ♦ తి న్ఖురదారితఁ జేయుచున్ రణా
వేశమున న్మహాజలద ♦ వృత్తి నభస్థలిఁ బర్వ నార్వఁగన్. ౨౦౯

ఉ॥ దుందుభి దుందుభిస్వనము ♦ తోన మొఱింగి కడంగి తారక
ల్చిందురు నట్లు దార లను ♦ సంగతి వీడక తోఁకొనంగ న
మ్మందునిఁ జేరి నీదురభి ♦ మానము మానుము జీవితాశ తే
కుందువ యేని నిల్వు మిటు ♦ లొప్పని యార్చుటు లేల నావుకున్. ౨౧౦

మ॥ కను లెఱ్ఱంబడ వాఁడు స్త్రీలకడ ని ♦ క్కాఱు ల్గడింపంగ నే
మన నా నీబల మే నెఱుంగెదను ర ♦ మ్మా సన్నఁ గాకున్న భో
గినులం దేర్పుము సౌఖ్యవార్ధిసిరికి ♦ స్గీలోక్కుల్పు మన్యు న్బురిన్
గను మాప్తౌఘము సత్కరింపు మిటు లీ ♦ నాఁ డెల్ల ని న్వేఁడెదన్. ౨౧౧

ఆ॥ మత్తు సుప్తు నటు ప్రి ♦ మత్తు నెక్కటి యగు
వాని భీతుఁ డైన ♦ వానిఁ జంపఁ
జూడ రెన్నఁడేని ♦ శూరాగ్రిణులు మాన
హీన మఘము దానఁ ♦ గానఁబడుట. ౨౧౨

తే॥ అనిన వెడనవ్వు నవ్వి య ♦ య్యతిబలుండు
తార మున్నగు కోమల నం ♦ తఃపురమున
కనిచి పితృదత్త మైన య ♦ క్కనకమాల
నరసి సవరించుకొని క్రోధ ♦ మగ్గలముగ. ౨౧౩

ఆ॥ పలికె నోరి! వీర♦పాణజం బిది రిత్త, మదము గాదు నిలుము♦మత మెఱింగి
నిన్నుఁ బనుచువాఁడ♦నీ వేగి జముని వా, హనముతోడి చెలిమి♦నందఁగనుము.

క॥ అని నొడివి వానిఁ గొమ్ములఁ, గొని కొండంబోల నెత్తి♦కూల రణక్షో
ణిని వైచెఁ జెవుల ముక్కుల, ఘనరక్తస్రావ మెడలఁ♦గా గర్జిలుచున్. ౨౧౪

ఉ॥ వాఁడును దెప్పిరిల్లి బల ♦ వైరిసుతుం బడవైవ లేచి చే
వాఁడిని బార్ష్ణిఘాతములఁ ♦ బాదపశైలశిలాప్రయుక్తిఁ బే
ర్వాడి యలంచె స్వీయబల ♦ వర్ధన మాతని త్రైణ్య మెంచి తో
డ్తోడన త్రిప్పి నెట్టుపయి ♦ దోర్బల ముప్పఁగ బిట్టు మోఁదినన్. ౨౧౫

ఆ॥ అంగసంధు లవియ♦నమ్మహారాక్షసుం, డుసుఱుబాసి తెరల♦నుఱక యెత్తి
యోజ వైచె వాని♦యోజనాంతరసీమఁ, జలము బలము నెఱయ♦శక్రసుతుఁడు.

ఉ॥ శోణితధార పై కెగసి ♦ సూరెఁ బొసంగు మతంగకానన
క్షోణిపయిం బడం దనువు ♦ సోకున బిందువు లందఁగాంచి యే
ప్రాణియొ యిట్టి డంచు ముని ♦ భావనసేసి యెఱింగి తో వని
దారుణరుపాకసాయితవి ♦ ధానవతాంచితచిత్తపద్ముఁడై. ౨౧౬

సీ॥ క్రొవ్వెక్కి తఱి నొడ్లఁ♦గూల్చున కాకేమి, యిచటి కీవీనుంగు♦నేల చిమ్మె
నిష్ప్రాలం బిమ్మెను♦నేవంపు నెత్తుటఁ, దోఁగ మేల్త్రాఁకులు♦దునిసివడఁగ

నంత చుల్కన తాప♦సాశ్రమం బయ్యెనే, మర్యాద గలదె ప్ర♦మత్తులకును,
మా కెందు లే రని♦మసలుచున్నాడు, తన కింద్రవరము సా♦ధక మటంచుఁ

గాలుఁ బో దీనిచుట్టును ♦ గలుగు నొక్క
యోజనము మేరఁ ద్రొక్కిన ♦ యుక్కుమడఁగి
పోవు నిమ్మార్గుఁ డీతని ♦ పొరుపువారు
శిలలు గాఁగల రిమ్మెడఁ ♦ జేరఁగనిన. ౨౧౯

క॥ క్రోఁతు లని మిన్నకుండిన, నాతరువుల ఫలము లెల్ల♦నమలుచు నేఁ డీ
ట్లేతరఁబడి మే లెంచిరి, పాతక మగుఁగాదె చెడుఁగు♦పందలఁ జేర్పన్. ౨౨౦

ఆ॥ అని శపింప వినిన ♦ యంతనే యచ్చోట
నున్న క్రోఁతు లెల్ల ♦ నుఱికి యురక
వాలిఁ జేరఁబోవ ♦ వాలి మీరిట్లు రా
నేల యనిన వార ♦ లింత నొడువ. ౨౨౧

పృథ్వి॥ మతంగముని వేఁడఁగా ♦ మలయునంత నమ్మౌన్యుఁడున్
వితండ మిఁకఁ జాలు నీ ♦ వెడఁగుతోడ నంచుం దదా
దృతిం దొఱఁగి యాంతర ♦ స్థితి భజింప నిర్విణ్ణుఁడై
యతండుఁ బురికేగ న ♦ య్యద నెఱింగి నే నాప్తులున్. ౨౨౨

ఆ॥ అమ్మహాత్ము వేఁడి ♦ యాతని యనుమతి
వడసి యుంటి మింత ♦ వట్టు వట్టి
యాకళేబరమ్ము ♦ నమ్మెయి గిరివోలె
నున్నయది హరీంద్ర ♦ నోజఁ దెలుప. ౨౨౩

క॥ ఏవిధి నబ్బలవంతుని, నీ వెడలించెదవొ రామ!♦నే నీబలస
ద్భావ మరయనేరమి నెది, యో వల నని యుంటిఁ దొంటి♦యోజన నెఱయన్.

—♦ సుగ్రీవునకు నమ్మకము గలుగ రాముఁడు తనబలముఁ జూపుట. ♦—

ఆ॥ అనిన సౌమిత్రి నీ కెద్ది♦యానవాలు, గాఁగఁ బొనరింప నెద నమ్మ♦కము జనించు
ననఁగ నయ్యస్థిపంజర♦మ్మంఘ్రి నొకట, నెలమిమైఁ జిమ్మెనగు న న♦నినసుతుండు.

క॥ నవ్వుచుఁ బదియోజనముల, కవ్వలఁ బడఁ జిమ్మె దాని ♦ నంగుష్ఠమునన్
మవ్వ మొలయ రాముఁడు దా, నివ్వెఱపడియెను బ్లవంగ ♦ నేత వెరవునన్.

ఆ॥ ఇట్టు లనియె రామ! ♦ యిది మాంసపూర్ణమై
బలువు గలిగి యుండ ♦ బడలియుండి

యతఁడు వైచె శుష్క ♦ మై యున్న యద్దాని
హార్షకలనఁ జిమ్మె ♦ నైతి వీవు. ౨౨౭

శా॥ కానం గానఁగ నేర నీబలువు చ ♦ క్కం గాంచు మా చాల్పునన్
సానుస్థం బదె సాలసప్తకము ని ♦ ష్పత్రింబుగాఁ జేయ న
గ్రానువ్యాధము దోఁప నన్ని యొకఁడే ♦ యైయుండ ఘట్టింపఁగాఁ
దా నేర్చు న్లవగేంద్రుఁ డద్దెసను నీ ♦ దార్ఢ్యమ్ము రూపింపవే. ౨౨౮

వ॥ అని యిట్లు రవిప్రతిరూపుండు నిరూపించిన. ౨౨౯

ఉ॥ అల్లన నవ్వుచు న్రఘుకు ♦ లాగ్రణి కార్ముక మంది యొక్క మే
ల్భల్లము వానిపై విడువఁ ♦ బాదపసప్తకముం దెరల్చి తో
నల్లలి నద్రిభేత్తృత ధ ♦ రాంతరసీమవిహారహారిత
న్నెల్లమ్ము గా గడించి శర ♦ ధిస్థితిఁ గాంచె ముహూర్తమాత్రలోన్. ౨౩౦

క॥ అబ్బలువుంబోడి మెలఁకువ, యుబ్బుర మొదవింప జగము ♦ లన్నియు నొకటన్
బ్రిబ్బికొన నోపు విధి కితఁ, డబ్బ యగుం గాత మని ప్ర ♦ హర్షాంచితుఁడై.

ఆ॥ ఫాలతలము నందుఁ ♦ బరఁగ నంజలి సేర్చి
సాగి మ్రొక్కి నిలిచి ♦ సంభ్రమమున
రాము మోము కలిమి ♦ రాణకై చూడ్కులు
పాదలఁ బొగడె భాను ♦ పుత్త్రుఁ డగజ! ౨౩౧

—♦ సుగ్రీవుడు శ్రీరాముని శక్తి నమ్మి కొనియాడుట ♦—

క॥ నిన్నెదిరి నిలువ నోపునె, యున్నాళీకజుని సృష్టి ♦ నైన జన మెటో
కన్నవి నాయీకన్నులు, సన్నుతఁ యిన్నిలవు గడచు ♦ సంపద కలదే. ౨౩౩

చ॥ జగముల కెల్ల నాథుఁడవు ♦ చాలు దొనర్పఁగఁ బెంపఁ ద్రుంప నీ
మగఁటుము లెన్న నాతరమె ♦ మాలిమి కైతిని వాలి గీలియున్
దెగరె యెదిర్చి రేని నిను ♦ దేవుఁడ వీ వీఁక నందియుంబు లే
దగణితవైభవం బెనయ ♦ నయ్యెఁ బురాకృతపుణ్యసంపదన్. ౨౩౪

ఆ॥ వాలితోడి వైర ♦ వర్తనమునఁ గొన్న, వ్రతము నిష్ఠ నేఁటి ♦ పఱుఁ బెరిగి
నిన్నుఁ గూర్చెఁ గాక ♦ నేర్తునే భవశత, ములకు నేని నిట్టి ♦ కలిమిఁ బెరయ.

సీ॥ కర్మబంధవిముక్తి ♦ గాంచు నెట్టి మేటి, కర్మము ల్బొనరింపఁ ♦ గాంచి న్నరుఁడు
అవి దానిఁ బెనుచు నం ♦ చరయఁడు త్వన్నామ, [illegible]

నిశ్చలదీపంబు ♦ నియతిఁ జిత్తం బెప్పు, నీపదధ్యానంబు ♦ నెఱిఁ దనర్చు
నప్పుడె నశించు న ♦ నర్థావహం బది. నానానిబంధాఽపి ♦ నాకృతంబు
గాన నీదు పాద ♦ కమలయుగ్మము నేఁడు, గానవయ్యె నొండు ♦ గాంక్ష సేయ
నొల్ల నింక భావ ♦ మొలయింతు నిత్యసం, సేవనంబె తనకు ♦ జీవనముగ. ౨౩౬

మ॥ తల నీయంఘ్రుల మోవఁ దద్ద్విజము తీ ♦ ర్థం బాడి సర్వాంగము
ల్వెలయ న్దవ్వత్తనుసంగిత స్వరము లే ♦ వేళ న్దవ్వదీయార్చలన్
మెలఁగ న్నీదుకథ ల్వినం జెవులు ని ♦ న్వీక్షింపఁ గన్ను ల్విని
ర్మలగీతి న్నుతిఁ గూర్ప వాణియుఁ దలి ♦ ర్పం జేసి లాలింపవే. ౨౩౭

ఆ॥ నీదు భక్తు లున్న♦నెలవున కరుగంగ, నెమ్మి వారిఁ గూడి♦ని న్నుతింపఁ
గనెడువాఁడు పాత♦కవ్రజ మెడలించి, ముక్తిఁగాంచు నిత్య♦మోద మెసఁగ.

క॥ ఆలుం బిడ్డలు సంపద, లేలా త్వత్పాదభజన♦మే సౌఖ్యము నా
పాలుగఁ బొనర్ప నిమ్మయి, జాలితి సంసారబంధ♦సంక్షయకృతికిన్. ౨౩౯

క॥ కడు బడలితి సంసృతిఁ బడి, విడఁగంటి న్నిన్నుఁ గాంచి♦విశ్వాత్మ! యిఁకన్
బెడఁదోయకు మొం డొకఁడే, నడుగం ద్వద్భక్తిభిక్ష♦నర్థి నొసఁగవే. ౨౪౦

ఆ॥ అనిన సంతసిల్లి♦యర్కజుఁ జేసాచి, కదియఁ దార్చి బిగ్గఁ♦గౌఁగిలించె
రాముఁ డతఁడు దుష్కృ♦తామయదూరుఁడై, చాల నెగడఁగ నె వి♦శాలనయన!

మ॥ కృతకృత్యత్వము గంటి తత్త్వ మెడఁద♦న్గీల్కొల్పి తిబ్భంగి ని
న్నితరు ల్పోలఁ గలారె రాజ్య మిపుడే ♦ యేలింతుఁ దొల్లింటి యా
వెత లెల్లం దలఁగంగఁ గాంచెదు ధృతి ♦ న్వేవేగ నాదృష్టి కా
పతితుం బాల్పడఁ జేయఁ జూడు మవల ♦ న్బాణాగ్నిపా ల్సేసెదన్. ౨౪౨

క॥ కిష్కింధదారి చూపుము, నిష్కంచనుఁగాఁ బొనర్తు♦నీపగతుని శో
చిష్కేశనిభాస్త్రంబున, శుష్కప్రియవచనుఁ జేయఁ♦జూచెదె నన్నున్. ౨౪౩

ఆ॥ అనుచుఁ బలుకుచున్న♦యాజగన్మోహను, నుడుల నెఱికిఁ జిక్కి♦నూత్నకలనఁ
దనరి వారిఁ గొంచుఁ♦దత్పురవనవాటి, కరిగె భానుసూనుఁ♦డబ్జవదన! ౨౪౪

—♦ సుగ్రీవుఁడు రామలక్ష్మణులతోఁ గిష్కింధ కేఁగుట. ♦—

తే॥ వృక్షషండాంతరస్థు ల ♦ వ్వీరు లనువ
ద్వారతల మంది రవిజుండు ♦ తఱిమి పిలువ
నైంద్రి యుద్ధప్రియుఁడు మదా ♦ హతుఁడు తోన
యెదురుగు దెంచెఁ గడంక ది ♦ వ్యాళిసేవ్య! ౨౪౫

క॥ ఆయోధన మాయిగుపుర, కాయె న్యాయ్యయామ మనయ♦నందనిదై
హేయసపథమున బుధభా, మేయగ్రిహాములకుఁ బోల్చెమితసంభాషా: ౨౮౭

వ॥ అట్టియెడ. ౨౮౮

ఆ॥ ఆశ్వినులకు నట్టు♦లవ్వారి కొక్కింత, యంతరంబు రూపు♦లందు లేమి
కలికి శర మమోఘు♦మాదట నే మానో, యనుచుఁ దడసె రాముఁ♦డమరవంద్య!

ఆ॥ వరముకలిమి బలము ♦ వర్ధమానము గాఁగ
మిగులఁ గ్రాలి వాలి ♦ మిత్రిసుతుని
ముష్టితలనిహాతుల ♦ మొగికొని నొప్పింపఁ
దెరలి రక్తసిక్త ♦ దేహుఁ డగుచు. ౨౮౯

క॥ మదమత్రి తొల్లిఁటి యాశ్రిమ, పదస్థలిం జొరఁగ శ్రిమము♦బాపికొనుము పో
బ్రిదికితి వని యవ్వాని, న్వదలి హరిప్రిభుఁడు నిజని♦వాసం బెనసెన్. ౨౯౦

—♦ శ్రీరామ సుగ్రీవ సంవాదము ♦—

ఉ॥ ఆదట రామలక్ష్మణులు ♦ నాశుగసూతిఁ ఋ భానుసూనునిం
బ్రీఁది మెలర్పఁ దేర్పఁ జనఁ ♦ బోఁడిమి చేడ్పడ నాన పెల్లున
న్మోదము పీడి నెమ్మనము ♦ నొవ్వగ నెవ్వగ నున్న వాఁడు సీ
తాదయితుం గనుంగొనుఁడుఁ ♦ దద్దయు రోసము వొంగ నిట్లనున్. ౨౯౧

ఆ॥ ఎదిరి పాలు సేయ ♦ నేల నీ వింతకుఁ, జాలవోటు పగ్గె ♦ సఖచి నిన్న
కున్న నేమి యనుచు♦నొడుఁగ నాయుసుఖవో, నవల సీతలంచి♦నదియ కాదె.

క॥ సఖ్యము తెలఁగిట్టిదె ప్రి, త్యాఖ్యానము సేసి తొక్కొ ♦ యాసంగరముక్,
ముఖ్యాముఖ్యత లరయ కు, పాఖ్యాన మెనర్ప నిట్టు ♦ లయ్యెనె రామా!

క॥ నీకులము స్థలము ధృతి మహి, మాకూతం బ్థజనస♦మాదృతిఁ గని నే
నాకాంక్షించితిఁ గాకే, పాక్రితుఁడవో యనిన నెలవు ♦ బాయఁ దలఁతునే.

తే॥ అనిన నాతని యడరున♦కడలి రాముఁ, డన్న! యొడ్డు పొడవు రూ♦మున్న తీరు
నొక్కఁ డననయి కనుపట్ట ♦ నోజ దక్కి, స్వీయహాతివంక శంక ని♦ క్షేయనైతి.

క॥ నీకొండు పొసఁగె నేనియు, నాకడిమి సెడంగ నైన ♦ నగరే యొరు లిం
కేకలనఁ గడవఁ జాలుదు, శోకాంబుధితోడి దుర్య ♦ శోనిర్ఘరిణిన్. ౨౯౬

ఆ॥ ఆకి తప్పనేర్తు ♦ రయ్య! రాఘవు లొంట
నోట గలదె తమకు ♦ నుర్విలోన.

హృదయ మెఱియ నయ్యె ♦ నిట్టి యీ యలమట
కే మనంగ నేర్తు ♦ నెఱిఁగి యెఱిఁగి. ౨౫౮

క॥ అని చిక్కనికౌఁగిట నిడి, యనునయమునఁ దేర్చి యింక ♦ నఱమఱ మొకట నీ
వనటఁ దొలంచెద గుఱు తెఱు, తను తనరఁగఁ జేసి లక్ష్య ♦ తాత్పర్యమునన్.

తే॥ ఇంక శంకింపఁ వలవ దో ♦ యినతనూజ!
పిలువు మీతఁడేఁ బోవఁ డా ♦ బిరుదు మరలి
మఱలఁ జనుదెంచి నాచూడ్కి ♦ మలసె నేని
నింతయు నెఱింగి యే వచి ♦ యించువాఁడ. ౨౫౯

శా॥ సౌమిత్రీ! గజపుష్పిక స్గసుమల ♦ త్క్య స్గంబై యుద్దాన సు
శ్రీమంతం బొనరింపు మీతని మెడన్ ♦ శ్రేయమ్ము నేఁ గూర్తు ను
ద్దామప్రఖ్యుఁ డటంచు రాజ్యరమ తా ♦ త్వరంబున న్మించి యు
ద్దామశ్రీ విలసిల్లఁ జేయ నగు చం ♦ దం బిట్లు చె న్నొందఁగన్. ౨౬౦

—♦ రామాజ్ఞచే లక్ష్మణుఁడు సుగ్రీవు నఱుగఁ బుష్పమాల నుంచుట ♦—

క॥ అనిన నా ప్రముని యానతి, ననఘుఁడు లక్ష్మణుఁడు తన్మ ♦ హార్థంబున ని
మ్మున మునిచి తీర్చెలర్పఁగ, ఘనకౌతూహలము పొనరఁ ♦ గావించుటయున్.

తే॥ అతఁడు నక్షత్రమాల ము ♦ న్నలమికొనఁగ
రాక నుదయించు చంద్రుని ♦ రాకరించు
మించె నట్లు బలాకాలి ♦ కాంచితమ్ము
సాంధ్య మేఘమ్ము హాసప్రి ♦ సాదలలిత! ౨౬౧

క॥ అంతట లీలానిధి శ్రీ మంతుఁడు రఘురాముఁ డెలయు ♦ మాలిమి మై భా
స్వంతు సుతుఁ దేర్చి సంతస, మెంతయుఁ దనరారఁ దరలె ♦ నింద్రిజు పురికిన్.

చ॥ శరములు స్వర్ణపుంఖములు ♦ చారుతరం బగు చాప మొప్ప నా
స్మరరుచిరాంగుఁ డమ్మెయి స ♦ సారత నగ్రనరుండుగాఁగఁ దో
వరిగిరి తమ్ముఁడు న్రవిజుఁ ♦ డంజనసూనుఁడుఁ దక్కువారు ము
వ్వురును సముత్సుకత్వ మటు ♦ పొంపిరిపోవఁ దలంపు లుబ్బఁగన్. ౨౬౨

—♦ రామలక్ష్మణులతో సుగ్రీవాదులు మరల కిష్కింధ కరుగుట ♦—

తే॥ అలరు లలరారఁ గన్నువారి ♦ నాహ్లరింపఁ
జాలి నలువొందు మేలి వృ ♦ క్షముల లతల
మహితరసపూర మొప్పార ♦ మగనిఁ జేర
నరిగెడు తరంగిణులఁ బ్రసా ♦ దాఢ్యగతుల. ౨౬౩

ఉ॥ అందము చందముం గల గు ♦ హాముఖముల్ శిఖరంబులు న్దరుల్
పొందిన పూపొద ల్దసరఁ ♦ బోఁటిమి నెక్కొను భూధరమ్ములన్
మందవిహారిగంధవహ ♦ మానితపద్మవనాంతశోభిసం
స్పందిమిళిందఝంకృతిల ♦ సద్రసనారసరోవరంబులన్. ౧౬౬

ఉ॥ అండలు దండలు న్సరసు ♦ లై తఱి కుండఁగ హంసచక్రకా
రండవముఖ్యనీరఖగ ♦ రాజివిరాజిత పాదమేదురా
ఖండితశాద్వలోత్కమృగ ♦ కాండపిగండకరండమత్తవే
దండవిహారవర్తరుల ♦ తాపరిశోభితటస్థభూములన్. ౧౬౭

క॥ కాంచుచుఁ గాంచీరవము, ఖ్యాంచితవిలసనవిభావ ♦ నావహనగశా
ఖాంచలవిహారద్విహగవి, పంచీపంచీకృతిప్ర ♦ వర్తి సరయుచున్. ౧౬౮

క॥ సుగ్రీవుఁ డాగ్రహం బను, నాగ్రహ మెడల న్వశంవదా ♦ త్మకుఁడై తా
నగ్రిమస్మృతి వివరింపఁగ, నాగ్రహపతితేజుఁ డట్టు ♦ లరిగె మృగాక్షీ! ౧౬౯

క॥ కొండొకఁడు వృక్షషండా, ఖండితవనమండలమ్ము ♦ గాంచి నవీనా
ఖండలుఁడు రాముఁ డిట్లనె, మెండగు కౌతూహలమున ♦ మేనాతనయా! ౧౭౦

తే॥ గగనవీధికిఁ దొలుకారు♦మొగులువోలెఁ జాలి యున్నది యియ్యది♦శాల్మతలమున
కొప్పు గూర్పంగఁ గదళీప్ర♦యుక్తయుక్త సాంద్రచరిద్రకితాగమ♦షండ మగుచు.

క॥ దీని తెఱంగెఱిఁగింపు మ, దీనప్రతిభాసఖా! మ ♦ దిం దెలిసి యనం
గాననమున నడ దనరం, గా నని రఘువరుఁడు మెచ్చఁ ♦ గా నవఫణితిన్.

—♦ స ప్త ఋ ష్యా శ్ర మ ము ♦—

తే॥ అనఘ! సురరాజమందిరో ♦ ద్యాన మన్న
ననుచు నాశ్రమ మిది శ్రమ ♦ నాశనంబు
స్వాదుఫలమూలరససార ♦ సంశ్రయంబు
కుసుమసుకుమారతరులతా ♦ గుంభితంబు. ౧౭౩

ఆ॥ సప్తసప్తినిభులు ♦ సప్తజనాఖ్యులు, సప్తసంఖ్యఁ దనరు ♦ సన్మునులు ప్ర
సక్తి సప్తవర్ష ♦ శతములు వ్రతనిష్ఠ, సలిపి రిందు రామ ♦ చంద్ర! వింటె.

ఆ॥ ఏడునాళ్ల కొకట ♦ నింత గాలి భుజింత్రు, గాంత్రు నీట నుండఁ ♦ గాఁ బ్రశస్తిఁ
దలఁగ కుందు రెపుడుఁ ♦ దలక్రిందుగ వనాధి, వాసనియతి వారు ♦ ధీసమేత!

క॥ సశరీరస్వర్గమన, మ్మ్మ శశిప్రతిభాసియశులు ♦ మొనసిరి వారల్
విశదమవుఁ దత్ప్రభావా, తిశయం బిప్పటికి సంప్ర ♦ తీతవికాసా! ౧౭౬

ఉ॥ పట్టనికోట యై తరుని ♦ వేశితసంవృతి గట్టిసేయు ము
న్నట్టులె యుండు నేఁటికి సు ♦ రాసురకోటుల కప్రధృష్యమై
నెట్టన నిండుఁ జొచ్చి వెలి ♦ నెక్కొనఁ బోవ దొరకండు జంతు వే
పట్టున మూఁడు వహ్నులును ♦ భాసిలు ధూమము మిన్ను ముట్టఁగన్. ౨౭౭

ఆ॥ దివ్యగంధ మొక్క ♦ తెఱఁగునఁ బొసఁగుచు
నుండు భూషణముల ♦ నొలయు ధ్వనులుఁ
దోఁచు సాక్షరములు ♦ తూర్యనిస్వనములు
మధురమధురములుగ ♦ మలయు నెపుడు. ౨౭౮

క॥ వందన మొనరింపుము శ్రిత, మందార! ప్రపత్తి మాని ♦ మండలి నెడఁదన్
బొందించి యిప్పొలమునకు, సందర్భం బొప్ప ననుజ♦సహితుఁడ వగుచున్.

ఆ॥ ఏశరీరధారు♦లేని నిం దమ్మహి, తాత్ములకు నమస్య♦లాచరించు
వారొ వార లెనయఁ♦బోరు దోసంగుల, నఖిలసిద్ధిపదము♦లందఁగలరు. ౨౮౦

తే॥ అనుచు రవిజుఁ డుఱింగించు ♦ నాక్షణంబె
సానుజుం డయి తత్ప్రస ♦ క్తాత్ముఁ డగుచు
నత్తపోధనులకు మ్రొక్కి ♦ హర్షకలనఁ
దనరె శ్రీరాముఁ డత్తఱిఁ ♦ దరళనయన! ౨౮౧

క॥ ఆసప్తజనాశ్రమ మటు, లాసంభృతయశులు గడచి♦యవ్వలఁ జని స
త్ప్రాసాదమహిత కిష్కిం, ధాసంజ్ఞిక వాలిపాలి♦తం గనిరి పురిన్. ౨౮౨

క॥ వాలిచెనం గుపితుండై, వాలిన మగఁటిమిఁ బ్లవంగ♦వరుఁ డిట్లనె నా
స్ఫాలన మొనర్చి యుబ్బుచు, శ్రీలలితము రఘుపృథుకముఁ♦జేరి జితారీ!

సీ॥ హరివాగురావ్యాప్త♦యదె కంటె తప్తకాం, చనతోరణాంచిత♦ఘనపతాక
దృఢబహుయంత్రాఢ్య♦దీపితమణిరత్న, వైద్యుతకలనాప్ర♦వర్ధమాన
వాలిపాలిత యగు♦వరపురి రిపుఁ డందు, వఱలుచునున్నాఁడు♦వానిఁ జెనయ
రారు సురాసురు♦లారియిడివెట్టెడు, నొడ్డ నీతఁడు వర♦మోజఁ బెనుప

దేవ! నీప్రతిష్ఠఁ ♦ దీర్పఁ బూనుము తఱి
యిదియ తడయ వలవ ♦ దింక ననిన
రవితనూజుతోడ ♦ రాఘవేంద్రుఁడు వల్కె
నుత్సహానము నెఱియు ♦ నుల్లసిల్ల. ౨౮౪

చ॥ పిలువుము వైరి నిప్డె యెడ ♦ పెట్టక పేర్కొని యాతఁ డల్కపైఁ
గలవర మందు మున్నె జిత ♦ కాశి రణప్రియుఁ డుద్ధతుండు నీ
పలుకు సహింపఁ డంగనల ♦ పజ్జస యున్కిఁ దటాలునం జలం
బెలయఁగ వచ్చు నిన్నటుమ ♦ నే నది గాంచి మదం బడంచెదన్. ౨౮౫

క॥ నాదృష్టిపథమునం బడి, యాదట మఱిలంకఁబోవఁ♦డంతిపురికి వాఁ
డేదెసఁ బారయుక మనిన, న్నా దర్పము నగుదుగాక♦నలినాప్తసుతా. ౨౮౬

తే॥ పౌనరుపడియుంటి వీగజ ♦ పుష్పికతన
ని న్నెదిరిఁ గాంచి కర్జమ్ము ♦ నెఱి ఫలింపఁ
జేయుదుఁ బొసంగు కఱి మేలి ♦ చేన నిడిన
యమ్మొలకపైరు పర్జన్యు ♦ నట్లువోలె. ౨౮౭

చ॥ అని రఘురాముఁ డుత్సహాన ♦ మందఁ బొనర్చిన నుల్లసిల్లి యా
య్యినతనయుండు తేజము స ♦ మిద్ధముగా నలలం దగర్చు న
బ్ధినిఁ ద్వరగర్జల న్మొగిలుఁ బె ♦ ర్కొనఁ జేయుచు వైరిఁ జీరె న
య్యనువున రోదసీకుహర ♦ మాగున్ తీఱునొ నాఁగ నుద్ధతిన్. ౨౮౮

తే॥ రాజవిప్లవమున నిల్వ ♦ రాక తెరలు
కులసతుల యట్టు లాలు ది ♦ క్కుల భ్రమించె
గతరథాశ్వంబు లట్లు మె ♦ కములు పఱచె
లుప్తపుణ్యులగతిని. బు ♦ ల్గు లిలఁ బడిరె. ౨౮౯

ఆ॥ అంతిపురి సుఖాప్తి♦నలరువాఁ డవ్వాని, క్రూరనాద మరసి♦క్రుద్ధుఁ డగుచు
నెగువఁ జూడఁ దార♦మగని సాహస మెంచి, యిట్టు లనిరె విదిత♦మెఱుకపడఁగ.

—♦ తార వాలిని యుద్ధమునకు పోవల దనుట. ♦—

సీ॥ అలుక వీడుముభుక్త♦మగు గ్రసజంబునుఁబోలెఁ, గర్జ మెంచుము తొంటి♦గతిఁదలంపఁ
బోకుము పెన్ప్రాపు ♦ లే కీతఁ డిప్పటి, కిప్పుడె తొడరంగ ♦ నెట్లు వచ్చు
జర్ఘరితాంగుఁడై ♦ శాంతి వాయకమున్నె, పిలుచుచునున్నాడు ♦ పేరుపెట్టి
తలఁకులేమియు మేటి ♦ దర్పమ్ము నెఱికల్మి, వింతలై బీరమ్ము ♦ విధ మెఱుఁగఁ

జేయుచున్నవి కావునఁ♦జెనయవలవ. దొనరుపడఁ గూర్చుకొనుటయు♦నొప్పు నేల
దీర్ఘవైరమ్ము కాలమ్ము♦దేశ మెంచి, మమ్ము మనుపుము నాథ♦సమ్మతము నెఱయ

క॥ ఏతావన్మాత్రుండే, సీతమ్ముఁడు బలుపు గలఁడు ♦ నెఱిఁ జాలినవాఁ
డీతఁడెఁ దొడరుచునున్నాఁ, డాతతబలుఁ డొకఁడు సాయ♦మై యొనయంగన్.

క॥ అని యాఁగిన వీరుఁడ నై, యనికిం బిలువంగఁ బోవ ♦ న ట్టె తలఁగు మీ
వని కడవఁజూడ నెట్టన, ననితరనయ తార యిట్లు♦లనె మెలపొలయఁ. ౨౯౩

సీ॥ ప్రాణేశ! విను నాదు♦పలు కంగదుఁడు దెల్ప, వింటి దాశరథి ప్ర♦వీణుఁ డధిపుఁ
డతఁ డయోధ్యకుఁ దండ్రి♦యనుపఁ దమ్ముఁడుఁదాను, జనుదెంచి కానన♦మ్మునవసించి
దుష్టనిగ్రహమును ♦ శిష్టపాలనమునుఁ, బొనరింప నమ్మేటి ♦ పోలు పెఱింగి
యారాముఁ గొలిచె నీ♦యనుఁజన్ముఁ డన్నెత, నగ్నిసాక్షిక మయి♦యమరె సఖ్య
మమ్మహాత్ముఁ డొసఁగె ♦ నభయమ్ము నీవెత, ట్రిర్తు మేలి సిరికిఁ♦గూర్తు ననుచు
దానఁ జేసి యిట్లు♦తఱుముచునున్నాఁడు, తినదు రాణ వెలయఁ♦దపనసుతుఁడు.

క॥ రక్కసుఁ డెడయించిన తన, మక్కువగల జనము జాడ♦మలయ నితఁడు నీ
చక్కటి పగఁ దీర్ప నతఁడు, నక్కరణిం బ్రతిన నెఱపి ♦ రని నే వింటిఁ. ౨౯౪

చ॥ పరబలముం దెరల్పఁ దన ♦ పక్షముఁ గాచికొనంగ నాగుణా
కరుఁడు సమర్థుఁ డాశ్రితను ♦ కల్పక మాపదు పేత తారకుం
డరిగణభీముఁ డారఘుకు ♦ లాగ్రణి రాముఁడు దోడుగా సురా
సురులకు శక్యమే తపన ♦ సూతి నెదిర్చి రణం బొనర్పఁగఁ. ౨౯౫

మ॥ తొడరంజూడకు మమ్మహాత్ము న్వక మతా ♦ దోర్దర్పము న్నమ్మి యే
యెడనేని న్దనసాహసిక్యమున మే ♦ లెంచంగ నా నెట్టు లి
ప్పుడమిం గావ జనించినాఁడు హరి యా ♦ పొంపొప్పఁగా నంచు నే
ర్పడ నూహించి తలంగు మయ్య నఘునిం ♦ బ్రార్థింపు మిష్టార్థివై. ౨౯౬

తే॥ నీదుపౌరుష మరయని ♦ నెఱియ కాదు
తొడరి నినుఁ దూలవుచ్చెడు ♦ దొసఁగు గాదు
కోపగింపకు మోనాథ! కోసలేంద్రు
రాము నెదిరించి యిల మన ♦ రాదు సుమ్ము. ౨౯౭

క॥ వైర ముడిగి సీతమ్ముని, సారబలుని యౌవరాజ్య ♦ సంపద కభిషే
కారూఢుఁ గూర్చు మియ్యది, నేర దనక నాదు పలుకు ♦ నెఱిగను మధిపా!

క॥ శరణార్థిసులభుఁ డారఘు, వరుఁ బ్రార్థింపుము సుఖైక ♦ వశ్యుఁడ వగు మీ
వెరవున ననుసుతుఁ గులముం, బరిరక్షణముం బొనర్చి ♦ పాలింపు మిలఁ. 300

తే॥ అనుచు సాశ్రునయన ♦ యై యంఘ్రులం బడి
యొత్తి వేఁడ నాతఁ ♦ డువిదఁ గ్రుచ్చి
యెత్తి యూరడించె ♦ యిట్లనెఁ గాలక
ర్మములు తనదు తెలివి ♦ మఱువ్వ పఱువ. 30౧

—♦ వాలి తారను ఊఱడించి యుద్ధమునకు వచ్చుట. ♦—

ఆ॥ ఇట్లు భీత వైతి ♦ వేల బాలగో వీర, పత్ని వయ్యుఁ బగతు ♦ పా పెఱింగి
యగునె నన్ను నాఁగ ♦ నరివీరహంత నై, పిలువఁ బోవకున్నఁ ♦ బెనుపు సెడదె.

ఉ॥ ఏనును వింటి రాఘవుఁ డ ♦ నీదృశుఁ డీశుఁడు భూభరావనో
దానుగృహీతదేహుఁడు మ ♦ హామహుఁ డచ్యుతుఁ [illegible]చుఁ బక్షపా
తానృతవృత్తు లమ్మహితు ♦ నందు జనింపవు భక్తిగమ్యుఁ డ
మ్మానితుఁ గొల్తు న న్ననుచు ♦ మానిని! నీ కనుమాన మేటికిన్. ౩౦౩

క॥ అండజవాహనుఁ డతఁ డై, యుండినఁ దోడ్తెత్తు నెఱిఁగి ♦ యొండై యున్నం
జెండాడుదు నయ్యిరువురఁ, జండితనముతో నెదుర్చి ♦ జలజాతాక్షీ! ౩౦౪

ఆ॥ ఇంకఁ బగతు భీతి ♦ నే నోడ నవ్వానిఁ, బట్టభద్రుఁ జేయుఁ ♦ బందమాట
లాడ నేల యెల్ల ♦ యరసియు నరసిక, వృత్తి ధైర్య ♦ యుక్తి వెలితిపడఁగ. ౩౦౫

క॥ ఇర వెడలకుండుమీ నీ, వరతనయుఁడు గలఁడు వంశ ♦ వర్ధనుఁ డిటఁ జెం
పరు లరులఁ గెలిచి నే సు, స్థిరత్వముం గాంతు వనటఁ ♦ జెందకు మబలా! ౩౦౬

ఆ॥ అని యుదారఁ దార ♦ నాఁకఁ దూరడిలంగఁ
బలికి యుఱికె ననుజు ♦ పైని దుమికె
వాఁడు నన్న బలుపు ♦ పాటింపక యు రఘు
రాము బలిమి నమ్మి ♦ రాజవదన! ౩౦౭

—♦ వాలిసుగ్రీవుల యుద్ధము. ♦—

క॥ వృత్రగిరిభేత్తలకు న, ట్లాత్రి మెఱుఁగనీని కడఁక ♦ నతిభీషణమై
యతాగ్రిసదోష మై గిరి, పుత్రీ! యాయిరువురకును ♦ బోరిత మొప్పెన్. ౩౦౮

క॥ త్వరపెట్టుచు నొండొరులం, బోర నెట్టి కుదించి వైచు ♦ పొంచి నెఱయుచున్
బోరిపోరిఁ బిడికిటిపోటుల, దెరలించుచు నొదిఁగి కదియు ♦ తేఁకువ గనుచున్.

ఆ॥ సరిగఁ బోర వరము ♦ శక్తి వాలికి బల్మి
హెచ్చె బడలి రవిజుఁ ♦ డింత నంత
రాముదెసకుఁ జూడ్కి ♦ వ్రాలంగ నన్నతోఁ
బెనఁగులాడుచుండెఁ ♦ బృథునితంబ! ౩౧౦

వ॥ అయ్యెడ నారఘుకేసరి కిశోరంబు. ౩౧౧

ఉ॥ ఎప్పుడు చూచెనో సమయ ♦ మెట్లు గణించెనో జ్యాప్రచారణం
బెప్పగిది ఘటించెనో య ♦ నీదృశ మాశరవర్య మెమ్మెయిన్

దెప్పునఁ గూర్చెనో తెలియ ♦ దేవునకే యది వాలి విక్రమం
దప్పుడె క్రాలెఁ గూలెఁ గిలి ♦ శాహతి శైలము వోలె వాఁడటఁ. ౩౦౨

ఆ॥ రాముఁ డైంద్రిబాణ ♦ రాజంబునన యైంద్రిఁ
బుడమిఁ ద్రోఁచి యింత ♦ బోధసేసెఁ
గారణంబుఁ గడిపి ♦ కాని యడంగదు
కార్యవస్తు వనుచుఁ ♦ గంజనేత్రి! ౩౦౩

ఆ॥ కదలెఁ గడలు బాణ♦గతికి విమానాళి, మిడిసిపడె నతండు♦మిట్టిపడఁగ
వడఁకెఁ బుడమి వాఁడు♦వ్రాలంగ ఘూర్ణిల్లె, నద్రిగుహాలు నాతఁ♦డఱవఁ దెఱవ!

సీ॥ మేఘకాలము దీఱ♦మేదినీతలమునఁ, బఱచిన గోత్రభి♦ద్వజ్రి మనఁగఁ
బున్నెంబు పొలివోవ♦బుడమిపై వ్రాలంగ, నైన యయాతిభూ♦జాని యనఁగఁ
గల్పావసానని♦ర్గతికత్వమున నేలఁ, బడిన యాదిత్యబిం♦బం బనంగ
దక్షరోషంబునఁ♦దవిలి భద్రుం డేయ, మేను వైచిన యజ్ఞ♦మృగ మనంగ

నడరి విశ్రాంతిఁ గనిన దా ♦ వాగ్ని యనఁగ
నమ్మహాసత్త్వుఁ డెడలియు ♦ నలఁతిపడక
విస్మయ మొనర్చె నారఘు ♦ వీరులకును
నరవి వీక్షించు నంబర ♦ చారులకును. ౩౦౪

ఆ॥ శరము పుంఖ మెనసి♦స్వర్ణపుష్కరమాల, యింద్రదత్త మెఱుఁగు♦లీనుచుండఁ
దత్ప్రసక్తిఁ బ్రాణ♦ధారి యై యతఁ డుండె, మేనికాంతితోడ♦మించుఁబోఁడి!

క॥ సంధ్యాపయోద మట్టుల, వంధ్యపరాక్రముఁ డతండు♦వ్రాలిన-చో నై
ర్గంధ్యమ్ము పొదలఁ గపిలో, కాంధ్యము చూపట్టె ననఁగ♦నమ్మెఁ బ్రియసఖి!

తే॥ ఒక ముహూర్తమ్ము మైకమ్ము ♦ నొంది తెలిసి
దెసలు పరికించి కొండొక్క ♦ దెసకు మరలఁ
దనదు సుకృతమ్ము తఱి వేచి ♦ తారసిల్లి
రూప మొందిన తెఱఁగు ని ♦ రూపణముగ. ౩౦౫

—♦ వాలి శ్రీరాము నెగ్గు లాడుట. ♦—

సీ॥ వలచేతి తూఁపు డా♦పలిచేతి కార్ముకం, బరిదురాసదుఁ డీతఁ♦డంచుఁ దెలుప
వల్కలాజినముల♦వరుస జటాచ్ఛట, లాశ్రితావనదీక్ష♦ననువదింప
మిఱుమిట్లు గొలుపుచు♦మితిమీఱు తేజమ్ము, నిఖిలాతిశాయిత♦నిర్ణయింపఁ
గారుణ్యరస మొలుకు♦కల్యాణదృష్టు ల, య్యనజానుజుల వంక♦నిరవుకొనఁగ

లలితదూర్వాదళశ్యామ ♦ లంబు మేని
మ్రిదిమ నిజవనమాలాను ♦ మాపకముగ
నున్నత మురమ్ము దీర్ఘబా ♦ హువులుఁ గలుగు
నమ్మహాపూరుషుఁడు చూడ్కి ♦ కబ్బె గిరిజ! ౩౧౯

క॥ నివ్వెఱపడియును నవ్వగ, దవ్వరయఁగనీని కష్ట♦దశఁ జేడ్పడి తా
నవ్వాలనున ధృతిసెడ నతఁ, డవ్వనజాతాక్షుఁ గాంచి♦యనె నిట్లు సఖీ! ౩౨౦

మ॥ తగునే నీ కిది మానవాన్వయము శు ♦ ద్ధం బందు జన్మించి మే
లగు క్షాత్రంబున మించి కొండొకనితో ♦ నాయోధనాసక్తి నుం
డఁగఁ జాటొంది మొఱంగి వేఁచి యిటు క ♦ ట్టా తీవ్రబాణంబునన్
బగ సాధింపఁగ నేమి నేర మిచటం ♦ బాటించితో రాఘవా! ౩౨౧

ఆ॥ కీర్తిఁ జంప నీకుఁ♦గోరిక బొడమిన, నది యభక్ష్య మగుట♦వ్యర్థ మయ్యె
వ్యాధధర్మ మేని♦వఱల దన్యాసక్త, మైన మెకము నేసి♦నంత రామ! ౩౨౨

క॥ నమ్మితి ధర్మిష్ఠుఁడ వని, యమ్మయిఁ గాకున్నఁ దొలుత♦నారసి నిన్నే
రెమ్ముకొనఁ జూచి యాతని, దిమ్మవ్వల నెడలఁజేయు♦తెరు వెడయుదునే.

క॥ ఎదురుపడి న న్నదల్చినఁ, గుదు రగు నీపౌరుషంబు♦గూర్చిన వెర వ
య్యదనున నే మయ్యెడినో, విదితం బగు లోకమునకు♦విస్పష్టముగన్. ౩౨౪

క॥ నాచేసినయపకారం, బేచతురతఁ గాంచఁగంటి♦వినతనుజుం డే
ప్రేచాయఁ జేసె నుపకృతి, దాచిన ఫల మేమి చెపుము♦దశరథతనయా! ౩౨౫

ఆ॥ ఎంత కాల మేలె ♦ నిల నాతఁ డెమ్మెయి, మే లొనర్చెఁ బ్రజలు♦ మేకొనంగ
నట్టి ధర్మమూర్తి♦కనఘున కేభంగిఁ, బొడమితొకొ ప్రథితి♦సెడఁగ రామ!

ఆ॥ రావణుఁడు హరించె ♦ రాణివాసం బని, తగినవాని నేర్చి ♦ తార్చికొంటి
వితని సాయ మేల ♦ యే నైన నవ్వానిఁ, బురిని సీతఁ దెచ్చి ♦ పొంత నిడనె.

క॥ అద్దుష్టుఁ గెడపి పావని, సద్దేవి సితాశ్వతరిని ♦ నజునకు హరియ
ట్లుద్ధర యున నర్పింపనె, కొద్దివడితి వేల దీని ♦ కోఱ కినవంశ్యా! ౩౨౮

ఉ॥ నీచపుఁ గృత్య మిం చనక ♦ నీ వొనరించితి కాని దీన నీ
కేచతురత్వ మేర్పడియె ♦ నిందును నందును దుర్యశంబ కా
కాచపలుండు ని న్సెరసి ♦ నందులకు న్ఫల మేమి కల్గునో
తోఁచెనె యెంత మోసమును ♦ దోసము నొందితి వాజినందనా! ౩౨౯

తే॥ అనుచు బహుభాషలాడున ♦ య్యేంద్రిఁ గాంచి
పలికె నెఱవాది రాముండు ♦ ప్రౌఢి వెలయ
నెదిరివంకల విద్దంగ ♦ నెత్తేఁగి యైనఁ
దనదు తప్పు లరయకున్న ♦ ధన్యుఁ డగునె. ౩౩౦

—♦ రాముఁడు వాలిమాటలకు సమాధానము సెప్పుట ♦—

క॥ పెద్దల సంసేవింపక, తద్దయు ధర్మమ్ము సరణి ♦ దార్కొన కిటు లీ
వుద్దవిడి మాటలాడినఁ, గద్దా ఫల మింతవట్టు ♦ గానవు వింటే. ౩౩౧

శా॥ ఏమీ సోదరుఁ దోలి వాని వసమా ♦ నిల్లాలి నల్లాడఁగాఁ
గామిత్వంబున బల్మిఁ గొంటి వన ని ♦ న్నాదే వధింపంగ నీ
వే మానింపుము బిడ్డ తోడు స్నుష య ♦ న్స్త్రీ తమ్ము పూఁబోఁడియున్
గా మర్యాద చెడంగఁ దోఁచి మను నా ♦ కష్టుల్ స్టను మెత్తురే. ౩౩౨

మ॥ చెఱఁగుంగర్జముల న్బొనర్పఁ గనుచు ♦ న్శ్రేయంబు లర్థించుచున్
గడుదర్పించు శఠుండు తత్ఫలముగాఁ ♦ గష్టంబు పాలింప నె
న్నఁడు స్వీయ మ్మగు దోస మన్యులదె య ♦ న్యాయం బను న్స్త్రైపునిన్
దొడరుం దిట్టఁగ నంతమాత్రమున నే ♦ దుష్టత్వముం దోఁచునే. ౩౩౩

ఉ॥ తప్పు లొనర్చువారు నృప ♦ దండ్యులు దండితు లైన వెంటనే
ముప్పుల నొందకే సుకృత ♦ ముం బొనరించినవారి యట్లు దా
రొప్పుదు రుత్తమస్థితికి ♦ సోదరు లోకభయావహంబ యౌ
నప్పతి పాశబంధమున ♦ కామరసంస్తుతులందఁ గాంచుచున్. ౩౩౪

క॥ భరతుని శాసన మిప్పుడు, ధరఁ జెల్లెడు దానిఁ బూని ♦ తాత్పర్యమునన్
జరియింతు మేము దుష్టులఁ, బొరిగొందు మభిన్న యైన ♦ బుద్ధి హరీంద్రా! ౩౩౫

ఉ॥ ఏ నిటు వేషధారి నయి ♦ యింతట నంతట సంచరింతు ధ
ర్మానుగుణోపపన్న మగు ♦ నర్థము మున్కొని శిష్టరక్షణం
బేని నశిష్టశిక్షణము ♦ నేనియుఁ జేయుదు దైన్యయుక్తులే
మానితు లట్లు దర్పితులు ♦ మాకు విరోధులు శక్రనందనా! ౩౩౬

ఆ॥ ఏఁ బ్రతిజ్ఞ సేసి ♦ యిట్టట్టు లొనరింప, నంతమాత్ర మనఁగ♦ నగుదు నెట్లు
వేఁటకాఁడు పొంచి ♦ వ్రేయఁడే మెకముల, ధర్మపాలనమ్ము♦తగదె పతికి.

ఆ॥ మెకము పాటి గాక♦మేకొన్న వరశక్తి, నొడ్డ చెఱువు గోరి♦యున్న నిన్ను
మొఱఁగి కూల్చితిని న♦మోఘమ్ము దేవతా, గౌరవ మ్మడల్పఁ♦గామి నిట్లు.

క॥ కావున నన్యులఁ జెగడిన, నీ వంగఁగ నేమి కలదు♦నిర్ణీతం బై
యావిధి యావిధిఁ జేసెను, దోఁవఁగ నెల్లగును గర్మ♦దోషము హరిపా! 33౯

ఆ॥ ఏలి తీవ యగుచు♦నెల్లవానర రాజ్య, మని జయించి తవని♦నధికబల
జూఱఁగొందు పింక♦సురలోకవిభవంబు, గొఱత గలదె యింతఁ♦గ వినంత.

క॥ వైనస్మృతి నింకిట సం, భావింపము భావికలనఁ బాటించి గుణో
ద్భావిని యడు యుద్యానవనె, నీవిషము నెవ్వ చను న♦నిమిషేశసుతా! 3౪౧

తే॥ అనుచు విస్పష్టముగఁ బల్కు ♦ నవనిజామ
నోహరుని పల్కు విని తమో ♦ నోదనంబు
పనుపడ నతీంద్రియజ్ఞాన ♦ భంగి దనరి
నిట్టు లనె వాలి తాటంకి ♦ తేందు హేలి ! 3౪౨

—♦ వాలి శ్రీని దెచ్చుకొని శ్రీరాము నుతించి వరము లర్థించుట ♦—

ఆ॥ కంటి నిన్ను రామ !♦కల్యాణధామ! ర, మామనోహరుఁ డవు♦మనుకులమ్ము
పావనముగ నిట్లు పఱతెంచినాఁడవు, భూభరముఁ బాపు♦బుద్ధి నెఱయ. 3౪3

క॥ నాతప్పులు మన్నింపుము, శ్రీతరుణీరమణ! నీదు♦చెయిదము లరయ
న్నాతర మే చెప్పను ధృతి, పాతక మెడలంగ ద్వత్ప్ర♦పత్తి యొసంగన్. 3౪౪

తే॥ ప్రధనమున బిట్టు బడలి త్వ ♦ ద్బాణవేధ
వేదనాపీడితుండ నై ♦ వెరవు లేక
పలికితిని గాక యమ్మెయిఁ ♦ బావనాత్మ !
నీకు స్వీయులు భిన్నుల ♦ న్నెఱియుఁ గలదె. 3౪౫

ఆ॥ ఏవని నంతకాల♦మే తేర స్మరియించి, యెవని భవ్యనామ♦మే పఠించి
పడయు బ్రహ్మపదము♦భదాస్త్రుఁడై నరుం, డట్టి నీపదాబ్జ♦మందఁ గలిగె.

ఉ॥ ఎన్నఁగరాదు దివ్యులకు ♦ నేనియు నిప్పద మిట్టి దౌనె నా
పున్నెము నాయెదం బెరసెఁ ♦ బూజ్యము నీశర మిట్టి నిన్ను నా
కన్నులఁ జూచుచుం దొడరు ♦ కమ్మని పల్కులు వించుఁ ద్వత్ప్రభా
వోన్నతి నెంచుచుం దను వ ♦ హో రఘునందన! వీడఁ గాంచితిన్. 3౪౬

తే॥ నీదు కైంకర్యమున కల్మి ♦ నెగడువాఁడు
నాకు సరివచ్చువాఁడు మ ♦ న్నందనుండు
వాని నంగదనాముని ♦ వరద ! ద్వత్కృ
రాజ్యమున నిడినాఁడ న ♦ ట్లరయు దొడ్డ. 3౪౭

క॥ వానిమెడఁ గలుగు ప్రేమిడి, మేనిపయిం గాని సగము•మేనిపయిన నే
న్గాని తనకుఁ బొనరదు నీ, వానిం బొనరించి యింక • వదలుము రక్తిన్. ౩౪౯
క॥ వందన మొనరించెద శ్రిత, మందార! సమస్తలోక•మాన్యచరిత! సం
క్రందననందిత యభయా, నందప్రద భద్రమూర్తి•నలినాక్ష! హరీ! ౩౫౦

చ॥ అని ప్రార్థించి సరోరుహాస్తసుతు నె • య్యం బొప్పఁగాఁ జేరఁ బి
ల్చి నయం బొప్పఁ జరింపు మీహరికృపన్ • శ్రీగంటె వర్థిన్సుతున్
బనిగొమ్మేలుము మన్నిహత్యవధిగాఁ • బాటింపుమా వైరమున్
గను మాత్మీయులఁ గాంచు మోజ మెసఁగం • గా సర్వసౌఖ్యంబులన్. ౩౫౧

తే॥ తార నయవేత్త్రి యద్దాని • తలఁ పెఱింగి
నీవు వర్తిల్లు మద్దాన • నెరయు భద్ర
మంగదుఁడు నీకు నాకును • నతఁడె సుతుఁడు
వాఁడు నీయాన మీఱెడు • వాఁడు గాఁడు. ౩౫౨

క॥ ఆయుష్మంతుఁడ వగు మం, చాయింద్రవితీర్ణ మైన•యధిసౌవర్ణ
ప్రాయము తోయజమాల్యం, బాయదనుస నాతఁ డతని•కర్పణ సేసెన్. ౩౫౩

ఉ॥ ఆదట రాముఁ గన్గొని గు • ణాకర! శ్రీకర! రామచంద్ర! యి
వ్వేదనఁ బాపవే శరము • వేగ వెలార్చి త్వదీయపాణి యో
గోదితసంప్రసాదనమ • హోన్నతి నెక్కొనఁ ద్వత్పదమ్ము సం
మోదము మీఱఁ గాంతు భవ • మోహనిరాకరణమ్ము పాల్పడన్. ౩౫౪

—• శ్రీరాముఁడు వాలి యిష్టంబుల నొసఁగుట. •—

ఆ॥ అనిన నందువాఁడ•వత్యతిశయితము, పుణ్యలోకసుఖము•పూనితుండ
వగుచు నిందు గొఱఁత•లని లేవు ప్రతిరూపుఁ, డంగదుండు ప్రాభ•వాప్తి నెగడు.
క॥ నీవలనిగారవం బెట్టు, లీవఱ కతఁ డందుచుండె•నినజునివలన
న్నావలన నట్టిమన్నన, లేవేళం గాంచు దీని • కెఱియుకు మెదలోన్. ౩౫౬

ఆ॥ అనుచు రాముఁ డుభయ • మౌ శల్య మెడలింప
నైంద్రి మేను బాసి • యింద్రరూప
మంది కనె విముక్తి • హరికరస్పర్శన
చ్ఛిన్నబంధుఁ డగుచు • స్త్రీలలామ! ౩౫౭

ఆ॥ రామబాణనిహతి•రణరంగమున వాలి, కూలినంతఁ గపులు•దూలి తార
కెఱుకసేసి రెయిది యిద•మిత్థ మని కార్య, భంగితోడఁ గూడఁ•బద్మనయన.

శా॥ దేవీ! వాసరరాజమౌళి త్రిదివో ♦ ద్దేశంబు సేర న్మహా
ప్రావీణ్యంబున నేలె నెల్లకపుల ♦ న్విఖ్యాతుఁ డద్ధన్యు సే
నావారంబున కాన సేయ నగు ను ♦ న్మోదంబునం బోవ రా
దేవంక న్బరు లేచి తోఁచికొని రా ♦ నేని న్వ్యసం ద్రోవఁగన్. ౩౫౮

ఆ॥ ద్వారములు బిగించి ♦ తగినవారల నెల్ల, పట్టు లందు నిలిపి ♦ ప్రాభవమున
కర్హుఁడగు కుమారు ♦ నంగదు రాజ్యాభి, షిక్తుఁ జేసి యొందు ♦ సేయవలయు.

ఉ॥ చాలుదు మెల్ల యర్థమును ♦ సంగతముం బొనరింప నింతకు
న్నేలయుఁ బ్రొద్దుఁ జేర్చి సువి ♦ నీతులు మంత్రులు దెల్ప నీ వను
జ్ఞాలవ మొనరిల్ల కిడ ♦ జ్ఞాతులు దుర్వ్యవసాయ మెంచు నా
లో లలితాకృతి స్మృతి న ♦ లోలతఁ దీర్పొనఁగూర్ప నొప్పగున్. ౩౬౧

క॥ చాలింపుము శోకము మదిఁ, గీలింపుము ధృతిఁ దదీయ ♦ కీర్తి వెలయఁగా
నేలింపుము నీకొమరునిఁ, బాలింపుము మమ్ము వీర ♦ పత్నీ ప్రతిభన్. ౩౬౨

—♦ తార శోకించుట. ♦—

ఆ॥ అనినఁ బతివిపత్తి ♦ యాయమ విని పెను, గాలి వీవఁ దెరలు ♦ కదళివోలె
వ్రాలెఁ దోడిసఖుల ♦ ప్రావు నెదుర్కొని, పలికె నిట్లు దీన ♦ పాలనాథ్య!

ఆ॥ ఏల రాజ్య మింక ♦ నేల సంతానంబు, పురము ధనము సర్వ ♦ భోగములును
నేల నాదు జీవి ♦ తేశుండు దివి కేగ, నతని మనికిఁ జేర ♦ నరుగు నాకు. ౩౬౪

మ॥ అని చివ్వాలున లేచి ముక్తకచయై ♦ హావల్లభా! యంచు నా
ననము న్వక్షము మోదుకొంచుఁ గురరీ ♦ నాదానువాదంబునన్
దన యెల్గొప్ప సపత్నులున్ సఖులుఁ దోఁ ♦ దార్కొంచురా జన్యభూ
మిని డాయంజని నాథు మేనివయి నె ♦ మ్మె న్వ్రైచి శోకార్తయై. ౩౬౫

ఆ॥ అడలె దయిత! యిట్టు ♦ లైతె యే మయ్యె నీ, యాదరంబు రతియు ♦ నాముకొనిరె
సౌరతరుణు లెదురు ♦ సనుదెంచి కాంచి న, న్ననదఁ జేసి తరలి ♦ నంతలోన. ౩౬౬

క॥ నీకన్న నాకయువతులు, నా కెక్కుడు గా రటంటి ♦ నాయమె త్రుటిలో
నాకన్ను మొఱఁగి వారల, యేకాంతముఁ గోర మగల ♦ యేఁకట తిరమే. ౩౬౭

మ॥ అరివీరు ల్భాగడొంద నిర్జరులు చా ♦ టందంగ నై కాంచఁ గి
న్నరు లెల్ల న్నుతిగీతు లోలి నెఱప ♦ న్నాగంబునం బన్నఁ దెం
పరి వై నీవఱుమంగ ముజ్జగముల ♦ న్బ్రావీణ్య మొప్పార నీ
సరి చూడ్కిం బడ నిల్వరించి మనఁగా ♦ శక్తుం డొకం డుండెనే. ౩౬౮

ఆ॥ పట్టిపైని ప్రేమ ♦ పలుక బాఱెని వానిఁ, నేమిసేయఁ దలఁచి ♦ యింతపట్టి
నాయదృష్ట మైన ♦ నాయమే యాతనిఁ, గన్ను లెత్తి కాంచ ♦ గాన కునికి. ౩౬౯

త॥ యూథపతిఁ బాసి దేవులై ♦ యున్న యూక, రేణుకల భాతి నెగడరా ♦ రీతి నీదు
ప్రీతిఁ గాంచిన సుందరుల్ ♦ పిలిచి వీరి, గారవింపంగ రాదె స్వ ♦ ర్గతమె సతమె.

తే॥ వీరచందనమున తావి ♦ విరులుకొనఁగ
నెగడు నెఱజాణ విప్లేల ♦ నేలఁ బొరలి
ధూళి వొరయంగ రక్తంబు ♦ దొరుగ నుంటి
వలఁతిగా నెంచి యింక నీ ♦ యరులు నగరె. ౩౭౦

క॥ ధీరుఁడ వని నిన్నెడపెన, ధీర న్ననుఁ దలఁపరాదె ♦ దేవున కేనిన్
గారణము పక్షపాతమె, నేరం బననేల యంత ♦ నియతులు గలరే. ౩౭౧

మ॥ అని దిక్కు ల్పరికించి కాంచె జలద ♦ శ్యాము న్మహోద్దాముఁ బా
వననామున్ సుగుణాభిరాము ధృతభా ♦ స్వద్ధాము శృంగారధా
ము నసత్యేతరకాము శ్రీవిజితకా ♦ ము న్సజ్జనస్వాశ్రితా
వనకాము న్మఖలక్ష్యసోము ధృతి ♦ దీప్యద్భ్రాము శ్రీరామునిన్. ౩౭౩

క॥ రవిజానుజసహితు రఘు, ప్రవరు న్గని విస్మయోప ♦ పత్తి నెఱయ శో
కవిహతతతకాతర్య, ప్రవాహనిర్మగ్న యగుచుఁ ♦ బలికెఁ బురంధ్రి! ౩౭౪

తే॥ స్వామి! పత్నీవియోగసం ♦ భవము దుఃఖ
మయ్యె నీ కనుభూత మ ♦ ట్లగుట భర్త
నన్నుఁ బాసి సుఖింపఁడు ♦ నాకమందు
నేని ననుఁ గూర్పఁ దలఁపు మి ♦ య్యెడరు తలఁగ. ౩౭౫

క॥ క్షితిజను నిన్నెడఁబాపిన, మతిహీనుం డరసెనే స ♦ మరసత్వం బ
య్యతివకు నీకును విదితం, బతిలోకుఁడ వీవ తగుదు ♦ వాలోచింపన్. ౩౭౬

తే॥ అన్నదమ్ముల తగవున ♦ యందు మేలు, గూర్చి తనుజున కన్నకుఁ ♦ గొఱఁతపడియె
నాశరమ్మున ననుఁ గూల్చి ♦ యతనిఁ జేర్ప మేలుకొను మిట్టిమేలున ♦ నేలుకొనుము.

క॥ స్త్రీవధ దోషము గామియు, నీవెఱుఁగుదు భర్తృలోక ♦ మేఁ గాంచెదఁ బ
త్నీవిశ్రాణనపుణ్యము, తావక మగు ధరణి వెలయుఁ ♦ దద్దయు యశమున్. ౩౭౭

తే॥ కంటి సుగ్రీవ నేఁటి క ♦ ఘమ్ము దలఁగ
రాముకరుణావలోకమ్ము ♦ రాణ నెఱయ

రుమను గూడి సుఖింపు మా ♦ గూఢ మైన
ప్రేమ యేనాఁటికేనియుఁ ♦ బెనుపు సెడునె. ౩౭౯

క॥ అన్నకుఁ దమ్మున కొదవిన, యన్నాఁటి విరోధ మగ్గి యట్టిద యయి యో
లి న్నెఱసి తోడికోడం, డ్రి న్నెఱిగని కాల్పఁగాఁ దిరం బయ్యెనొకో. ౩౮౦

—♦ రాముఁడు తారకు జ్ఞానోపదేశము సేయుట. ♦—

ఆ॥ అనుచు ఱాలు గరుఁగ ♦ నారటమున దీన
యగుచుఁ నేడ్చు తార ♦ ననునయించి
పలికె రాముఁ డపుడు ♦ ప్రజ్ఞావిశేషంబు
శ్రుతులఁ బెరసి సత్వ ♦ శుద్ధి బెనుప. ౩౮౧

క॥ వ్యర్థముగా నేడ్చెద వీ, వర్థం బరయకయ యిట్టు లగుదురె ధీరల్
నిర్ధారణ సేయుము త్వ, త్ప్రార్థిత మది మేనొ జీవ పదయోగ్యంబో. ౩౮౨

శా॥ మేనే నీపతి యన్న భూతమయ మ ♦ మ్మేళమ్ము మాంసాస్థిమ
ఖ్యానద్ధమ్ము జడమ్ము కాలగుణక ♦ ర్మాపాద్య మాపాతభో
గానుస్యూతము ద్వంద్వదూషితము నే ♦ యం బద్ది నీచెంత నే
కానంగా నయి యుండె నే మనుచు నీ ♦ కాతర్య మబ్జాననా! ౩౮౩

తే॥ వనిత! జీవాత్మ నీపతి ♦ యనిన నతఁడ
నామయుఁడు పుట్టుగిట్టు లా ♦ యాతయాత
కలన లెనయఁడు స్త్రీత్వపుం ♦ స్కత్వషండ
భావములు వానిఁ బెరయవు ♦ పద్మనయన! ౩౮౪

తే॥ కాంచు మాకాశవత్సర్వ ♦ గతుఁ డలేప
కుం డశోకం డద్వితీయుండ ♦ జుండు పరుఁడు
నిత్యవిజ్ఞానసుఖమూర్తి ♦ నిర్మలాత్ముఁ
డతనికై యేడ్వ నేమగు ♦ నంబుజాక్షి! ౩౮౫

—♦ తార సందియంబులకు శ్రీరాముఁడు సమాధానము వచించుట. ♦—

ఆ॥ అనినఁ దార యిట్టు లనెఁ గాష్ఠవ జ్జడం, బంటి దేహ మీశుఁ డంటి జీవుఁ
డరయ సుఖము దుఃఖ మాది యీ సంసార, బంధ మెవని దెలుక వలుపుమయ్య

క॥ అనినన్ శ్రీరాముం డి, ట్లనె నాలోచించు తత్త్వ మరయుము దానన్
బనుపడు సందేహవినో, దన మది బంధచ్ఛిదం బుదారమనీషా! ౩౮౬

తే॥ ఎంతవఱ కహం మని మమ ♦ యనియుఁ దనువు
నింద్రియార్థమ్ములను గాంచి ♦ మెంచుచుండు
నంతవఱ కుండు సంసార ♦ మవల నెడయు
దాని కాత్మవివేకమం ♦ తంబు గాన. 3౮౯

ఆ॥ స్వప్నమందుఁ దోఁచు♦సర్వార్థజాలంబు, మిథ్య యయ్యెఁ దెలివి♦మేకొనంగ
నెట్టు లట్లు తెలియఁగు♦మీసర్వసంసార, మాత్మదృష్టి మిథ్య♦యగు నటంచు.

ఆ॥ తన కనాద్యవిద్య♦తజ్జ యహంకృతి, కారణములు గాఁగఁ♦గలుగఁజేయుఁ
బ్రాప్తి మై మనమ్మె♦రాగవిద్వేషాది, సంకులమ్ము మాయ♦సంసరణము. 3౯౦

తే॥ ఆత్మసాన్నిధ్యమునఁ దన ♦ యందుఁ గలుగు
దోషముల నెల్ల నతనిపైఁ ♦ దోఁచియుచుండుఁ
జేతనత్వం బతనిసక్తిఁ ♦ జేసి కాంచు
నింక నెంతెంతలకుఁ జాల ♦ దిమ్మనమ్ము. 3౯౧

క। ఇదె బంధం బిదె మోక్షం, బిదె సుమ్ముఖలేంద్రిజాల♦మిదె త్రైలోక్యం
బిది గాని దొండు గలదే, మదిలో నూహింపు మింక♦మహితవిచారా! 3౯౨

తే॥ ఆత్మఁ దనయంతవానిఁ జే ♦ యంగ శుద్ధుఁ
డయ్యు స్ఫటిక మలక్తాది ♦ కానుసృతి వి
రక్త మై నట్లు దాను వి ♦ రక్తి వంక
బోమిఁ దదూప్రమున ♦ నుండుఁ బొలుపుదక్కి. 3౯3

క॥ కలికామదోషగుణనం, కలితుండై జీవసంజ్ఞఁ♦గని జన్మజరా
దుల సుఖదుఃఖప్రత్యయ, ముల స్వప్నాదులనుఁ గాంచు♦మూఢుం డగుచున్.

ఆ॥ మూఁడు గొనము లంది♦మూఁడు వర్ణంబుల, కర్మములు గడించి♦గతులఁ దత్స
మానములన తదభి♦మానమ్మునం గాంచు, నవశుఁ డగుచు జీవుఁ♦డబ్జవదన!

తే॥ భూతసంప్లుతమా ♦ నంత ప్రొద్దు నంభ్రి
మించును లయించు మఱల ని ♦ ర్మితినమయము
గా మనోవాసనలతోడఁ ♦ గానుపించు
నతఁడు ఘటయంత్రి మట్టిఁడై ♦ యలఘుచరిత! 3౯౬

సీ॥ పున్నెంపుఁజేతల♦పొడవున మద్భక్తు, లతిశాంతు లగువారి♦నందఁగాంచుఁ
గాంచి యవ్వారి సం♦గతి సద్విషయముగఁ, జిత్తప్రబోధమ్ము♦నేయ నెంచు

నెంచి దుర్లభయు సం♦మంచితయును నైన, మత్కథాశ్రవణాస్థ♦మతిని బెంచుఁ
బెంచి యాత్మానాత్మ♦పృథుల విచారణ, నధ్యాత్మదృగ్యోగ♦మలవరించు
నలవరించి యద్దాని చే♦నధిగమించు, మించు స్వగురూక్తవాక్యప్ర♦పంచితార్థ
విదితమున ముక్తుఁడై బ్రహ్మ♦పదవిలాస, మంగనామణి! నావాక్కు♦లరసికొనుము

కం॥ నాఁ నొడివిన యీతత్త్వం, బానందాత్మస్వరూప♦మద్వయ మనుచున్
స్వానుభవాప్తి నెవఁడు తన, లో నెంచు నతండు ముక్తి♦లోఁగొను సుగుణా!

కం॥ మే నింద్రియములు లహంకృతి, నే ననకే సాక్షిరూప♦మెంచుము నీ ప
జ్ఞానజము బంధ మెడలి సు, జ్ఞానావస్థితి భజింతు♦వందుదు సుగతిన్. ౩౯౯

తే॥ నీవు తొలిజన్మమున భక్తి♦నియతిఁ గొలిచి, తల్లుగాన నిమ్మెయిఁగాన♦నైతి నన్నుఁ
దలఁపు మెద మత్పదం బందఁ♦గలవు శోక, మోహవీచిభవాబ్ధిని♦ర్ముక్త వగుచు.

*కం॥ దేవేంద్రపదము దొరకిన, నీవిద్య న్వెలయు సౌఖ్య♦మెనయఁ గలదె నీ
భావము మన్మయ మగు నెడ, భావిని! భావుకము లెల్లఁ♦బడసెదవు బళే. ౪౦౧

కం॥ అని హరి కరుణామయుఁడు, ట్లనితరసులభ మగు భంగి♦నాడిన నుడు ల
వ్వనితామణి విని విస్మయ, మునఁ బొదలుచుఁ దత్పదాబ్జ♦ముల కెఱఁగె ధృతిన్.

తే॥ ఆపె దేహాభిమానజం♦బయిన శోక
మెడలి యాత్మానుభవతృప్తి♦నెనయఁ గాంచి
యఘము బాసి జీవన్ముక్త♦యయ్యె నపుడె
రాము నుపదేశమున నగ♦రాజతనయ! ౪౦౩

కం॥ వావిడిచి వగచె నటు సు, గ్రీవుండును దొలుతఁ దనదు♦కీడెంచి యతం
డావగ వీడెను రాముని, శ్రీవిలసితవాక్ప్రసక్తిఁ♦జిన్మయమూర్తీ! ౪౦౪

తే॥ రఘువరుం డిట్టు లనె నప్డు♦రవిజుఁ గాంచి
యౌర్ధ్వదైహికకృత్య మ♦త్యంతభక్తి
నెఱపు మంగదుఁ దోడ్కొని♦నెగడుగనిన
వాఁడు నీయన్న సద్గతి♦వడయువలయు. ౪౦౫

ఆ॥ బాంధవప్రయుక్త♦బంధమ్ము వీడంగ, నమ్మహాధ్వరమ్ము♦నాచరించి
శుద్ధు లగుచు రండు♦శుభవర్తనంబున, మెలఁగువార లవల♦మే లెఱింగి. ౪౦౬

మ॥ అనిన న్వల్లె యటంచు భక్తిమెయి న♦య్యర్థమ్ముఁ గైకొంచుఁ జ
య్యన మంత్రు ల్నిజబాంధవు ల్మనసిరా♦నయ్యైంద్రి మే నుజ్వలం

బు నమూల్యంబును నైన పుష్పకమునం ♦ బొందించి నందిస్తుతు
ల్పొనర న్వాద్యము లోలి మ్రోయ విభవ♦స్ఫూర్తిప్రయుక్తంబుగన్. ౪౦౭

ఆ॥ పుత్త్రుఁ డంగదుండు♦పొలుపారు భక్తిఁ ద, త్కృత్యమై తనర్చు♦ నలిని మెలఁగ
సతతనిత్యోడివాఁడై♦యగుచు సర్కుజుఁ డేగ, భ్రాత సంస్కారంపుఁ♦బద్ధతి వేఁడు.

క॥ తారాప్రముఖస్త్రైణ ము, దారస్థితి వెంటరాఁగఁ♦దత్తాపుచితసం
స్కారము లొప్ప విధిసమా, చారమునం జేసి రెల్ల♦సంస్కారములన్. ౪౦౯

తే॥ అమ్మెయి నివాప విధులు స ♦ మాదరమున
నెరపి పరిశుద్ధుఁడై మహా ♦ నియతి వెలయఁ
గృత్యశేషమ్ము లొదవించి ♦ కీర్త్యమానుఁ
డతఁడు శ్రీరాముఁ జేర యి ♦ ట్లనియె భక్తి. ౪౧౦

— ♦ సుగ్రీవుఁడు శ్రీరామునకు వానరరాజ్యము నప్పగించుట. ♦ —

క॥ శ్రీనాయక! పాలింపుము, మానుగఁ గిష్కింధ సకల♦మాన్యుఁడ వగుచున్
మా నేర్చినపను లంగదుఁ, డేనునుఁ బొనరింపఁ గోరి♦యెలిందఱుఁ గొలువన్.

తే॥ మాతలంచిన కర్జ మి♦మ్మంత్రులెల్ల, మే లనిరి మేటిగొనముల♦పే లుబంతి
ప్రాంచితశ్రీ సమృద్ధికిఁ♦బట్టుగొమ్మ, యిమ్మహాయు సీకుఁ గైవసం♦బిఁకఁ గులీన!

క॥ నను లక్ష్మణు నొక్కఁడుగా, మనమున భావింపు మనుడు♦మామాసితుఁ డి
ట్లను నీ వన నే నన నొం, డనఘా! లేదరయ మేటి♦వర్గము మదిలోన్. ౪౧౩

ఆ॥ ఏలు మెల్లకపుల♦కేలికవై నీవ, యిప్పురమ్ము మొనసి♦యిత్త రాజ్య
మేను నగరు సొరఁగ♦నెంచ నేరెడు వ, త్సరము లనిన ప్రీతిన♦చక్కనైప.

క॥ అంగదుని యౌవరాజ్యము, నం గూర్పుము దాన మే ల్గ♦నంగాంతువు నీ
కుం గడుఁ గూర్పు మదనుఁజుఁడు, సంగాతిగ వచ్చు సిరుసంపద లరయన్.

తే॥ వైభవోన్నతిమై నుండి♦వానకారు, గడవ జతనం బొనర్పుము♦క్ష్మాతనూజ
తా వరసి మే లెఱింగింప♦నే వసింతు, నంతదనుకఁ బ్రివర్షణా♦ఖ్యాద్రిదరిసి.

— ♦ రామాజ్ఞప్తుఁడై లక్ష్మణుఁడు సుగ్రీవుని వానరరాజ్యమున నభిషేకించుట. ♦ —

ఆ॥ అనిన రాముఁ బొగడి♦యభివాదన మొనర్చి, సీయనుజ్ఞ మేర♦నేఁ జరింతు
నని సలక్ష్మణుండు♦ననుగతసచివుండు, నగుచుఁ జేరెఁ బురికి♦నగకుమారి! ౪౧౭

తే॥ నగరి భూషించి నాయికా ♦ నాయకుల న
లంకరించి కుమారుఁ గ ♦ లంక దేర్చి
మాంగళికతూర్యనిస్వన ♦ మహితముగను
నాథుమణి రత్నసింహాస ♦ నమునఁ జేర్చి. ౪౧౮

శా॥ శ్రీమంతుం బొనరించి రవ్వనచరుల్ ♦ శ్రీరామదేవాజ్ఞ నా
ద్యోమాణిక్యముసూను వైభవసము ♦ ద్యోతంబుగా రాజ్యల
క్ష్మీమత్తేభకరోచ్చలద్రసము ♦ త్సేకాభిషేకంబుతో
స్వామిత్వంబున నుంచి యాశశిరవి ♦ స్థాయిత్వముం గోరుచున్. ౨౯౯

తే॥ ఎలమిమై నంగదుని నట్టు♦లెనసి కూర్చి, శ్రీకరకుమారరాజ్యాభి♦షిక్తుఁ జేసి
రమ్యమహోత్సవములఁ గాంచి♦యర్కజాత, సత్కృతుం డయి వీడ్కొని♦సరభసముగ.

క॥ రామానుజుఁ డరుదెంచిన, రాముఁ డతనిఁ గౌఁగిలించి♦రహి మించెఁ బ్రీతి
స్థామహితుఁ డగుచు హరిపతి, సేమంబునఁ దనరు చెంచి♦సిద్ధార్థుండై. ౩౦౧

క॥ విదితుఁడు రాముఁడు తో నం, గదు నభిషేకింపఁ బనిచెఁ♦గద యని కపు ల
య్యదనునఁ బొగడిరి మెచ్చిరి, త్రిదశులు రవిజుఁడు తదాన♦తిం గొని మెలఁగెన్.

తే॥ అంగనామణి! వింటె రా♦మావనీంద్రు, చరితము నవోల్లసద్రస♦భరిత మనిన
నభవ! యవ్వలికథఁ జెవి♦కానఁ దెలుపు, మని నగాత్మజ గిరిధన్వు♦నడుగుటయును.

ఉ॥ ప్రాజ్యవిభూతిదాయక ప్ర ♦ భాకరమండలలక్ష్యహేతుతా
పూజ్యమహావిధాయక! వి ♦ భుత్వవిలాసవిశేషణాప్తసా
మ్రాజ్యకలాధినాయక! స ♦ మస్తజగత్కలితావనప్రియా
భాజ్యరమానునాయక! ప్ర ♦ భంజనజావ్యమనోనిధాయకా! ౩౦౪

క॥ ఔపయికాంచితసౌహృద, తాపత్రయవారణైక♦తత్పర మంత్రా
ధ్యాపక శ్రీపరమార్థ, ప్రాపకతావిద్యమాన♦పదసంస్మరణా! ౩౦౫

వనమయూరము.

భానుభవభాఽనుభవ♦భంజనరిపుస్వ, శ్రీనయనధీనయన♦సీమమహిమాఢ్యా!
కాననచరాననచ♦కాసదుపదృష్టి, స్థానగతతానగత♦తద్విమతదార్ఢ్యా! ౩౦౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్యసేవాసమాసాదితానవద్య
కవితాయోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ
విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన
వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన
శ్రీరామకథాఽమృతంబను మహాప్రబంధంబునం
గిష్కింధాకాండంబునఁ బ్రథమాశ్వాసము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## కిష్కింధాకాండము.

---

### ద్వితీయాశ్వాసము.

---



విలసద్యోగీశ్వర
భావశ్రీసన్నివేశ ♦ భావితనిజ త
త్త్వావిష్కరణరసాత్మక
జీవంజీవపదజీవ ! ♦ చిన్మయరూపా ! ౧

ఆ॥ అవధరింపు మార్య!♦యమ్మెయి వేఁడంగ, నిట్టు లనె మహేంద్రుఁ♦డెలమి రామ
భద్రుఁ డినజుఁ బట్ట♦భద్రుఁ జేసి సుఖాత్ముఁ, డగుచు నాతఁ డుండు♦నవసరమున.

క॥ గ్రీష్మావసాన మని య, ర్చిష్మన్నిభుఁ డొదిఁగి యుండె♦శిఖరిగుహాం దా
నూష్మలతాంచితుఁ డయ్యు వ, పుష్మత్సామాన్యలీలఁ♦బుష్పసుగంధీ! ౩

సీ॥ అగ్గిరిశృంగమ్ము♦నంతర్గుహామె తన, కుచిత మహా నావాస♦మోల మనుచు
మెచ్చి స్ఫాటికయుక్తి♦మేకొన బహురత్న, చిత్రితస్థలకలా♦శ్రీవిశేష
మగుచు దివ్యమ్మ వ♦ర్షానిలసహము స, త్ఫలపుష్పశోభాఢ్య ♦ భవ్యతరు
తాంచిత మనవద్య♦మతులసరోవర, ప్రాంతమ్ము♦మృగపక్షి♦భాసితమ్ము
నైన యచ్చోట ధరణిక ♦ న్యాప్రసక్తిఁ
దవులు నెమ్మది నొండిచ్చ ♦ దలఁగ నామె

గానము లెనయించు ధృతిఁ దమ్ముఁ ♦ గుఱ్ఱతోడ
రాము డుండెను రాజమ ♦ రాళగమన ! ౪

ఆ॥ వెలఁది వానకారు విరహి♦దుస్సహ మని, యెఱిఁగి యెఱిఁగి యేల♦యినకులీనుఁ
డధివసించెనొక్కొ♦యాప్రవర్షణగిరి, నధిపు చిత్త మరయు♦టలఁతి యగునె. ౫

—♦ వర్షర్తు వర్ణనము. ♦—

సీ॥ విడిదిమట్టు లొనర్చె♦విద్యుల్లతికఁ గూడి, గట్లు చుట్టఱికమ్ము♦ఘనతఁ గూర్ప
నాక్రమించెను దిక్కు♦లన్నియు నెఱితోడి, గాడుపు సంగడీ♦కాఁడు గాఁగఁ
గర్జిల్లె నుత్సాహ♦కలనఁ బెంపునఁ దన, సరిగా రొకొం డ్లను♦సన్న నెఱయఁ
గురియించె శరధారఁ♦గుంభిని యుప్పొంగి, పులకాంకురమ్ముల♦పొలుపు దెలుప

గాసిఁ బాసి కృషీవలాం ♦ గనలు మేలి
కూర్మి చూడ్కులు దనపైనిఁ ♦ గ్రుమ్మరింపఁ
జాతకము లార్తి పీడంగఁ ♦ జంద్రికితతు
లాడఁగఁ బ్రశస్తిఁ గాంచె వ ♦ ర్షాభ్రవిభుఁడు. ౬

మ॥ తనరాక న్బరరాజహంసతతి స్వ ♦ స్థానంబులం బాసి చ
య్యన నమ్మానసభూమికై తరల సం ♦ స్త్యాయంబులం బొంది పాం
థనికాయంబు సుఖింప జీవనరమో ♦ ద్యద్దాత యీతండె పో
యని యెవ్వారును సన్నుతుల్నెఱప న ♦ బ్దాధీశుఁ డొప్పెం గడున్. ౭

తే॥ ఘనుని ధాటికిఁ దమవారు ♦ కదలిచనఁగఁ
గమలినులు గాసి నొందుట ♦ గాదు తలఁపఁ
గువలయక్షేమ మిరువంకఁ ♦ గుదురుకొనుట
కన్న మే లెన్నఁడేనియుఁ ♦ గానఁబడునె. ౮

మ॥ కడిమ ల్పూచెను జాజు లుల్లసిలె శ్రీఁ ♦ గాంచెం దొవ ల్కుందలు
ల్పాడమె న్మొగ్గల తోడఁ బుట్టువులుగాఁ ♦ బుష్పించె నామూలముం
గొడిసె ల్విచ్చెను నాగకేసరములు ♦ న్గొజ్జంగిగేదంగు లా
జడివేళ న్విలసిల్లె నన్నియు ధరా ♦ చార్వంగికి న్భూషలై. ౯

తే॥ అభ్రగర్భిణి యాద్యోల ♦ తాంగి సూతి
వాతయుక్తిఁ బ్రసవవేద ♦ నాతిఖిన్న
యై పొదలఁ దోఁచు హుంకృతు ♦ లయ్యె నుఱుము
లాడలిభూషల ద్యుతులు వి ♦ ద్యుత్తు లయ్యె. ౧౦

తే॥ రోదసీగర్భశుక్తికా ♦ రూఢి నెరయు
స్వాతివృష్టివిశేషసం ♦ పాతమునను
జలదుఁ డెల్లెడ నింపి ని ♦ స్తందుఁ డగుచు
మౌక్తికావళి బ్రహ్మాండ ♦ మండలమున. ౧౧

వ॥ వెండియు నెల్లెడ నిండారు రసపూరం బేకరసం బై యజ్జ్యోతిస్సనాథుం డగు పర్జన్యునిమహేశ్వరత్వం బెఱింగింప వ్యక్తం బయ్యు నవ్యక్త మన నొప్పారు నద్దానం బాడకట్టు లోహితశుక్లకృష్ణంబు లను మూఁడు గుణంబుల స్ఫురణంబుల కాటపట్టు లై తనరారు కోకనదకైరవేందీవరంబుల వికాసంబు లతిభాసమానంబు లై దెసల కెక్కి యపూర్వలక్ష్మీవిశేషానుసంధానం బొనరింప నచ్చోట నేనియుం దామ యై పించెలు విప్పి జోడుపిట్టల చిత్తంబు లనువర్తింప నర్తించు నాటపులుంగుల మెలుంగు లైంద్రజాలికవిడంబనలం బురుడింప గిరిమల్లికాదితరువల్లికాతల్లజంబులు పల్లవకుసుమశోభాసముల్లసితంబు లై సంపల్లలితము లగు గేస్తుల శోభనాయతనంబులం బోని విజనికుంజంబుల కలిమి నెదిరిచూడ్కుల కతిథిసత్కారంబు లాచరింప సముద్రయానంబు నిషిద్ధం బని యెఱింగియు వల్లభానుసరణంబునం గల మే లారసి రసోల్లసిత లగు స్రోతోవహాలు తటరుహామహీరుహావివిధవర్ణసుమగుళుచ్ఛప్రసాధనాంచిత లై వేతసకంటకితంబు లగు నెమ్మేను లుప్పొంగం బొంగారు తరంగరింగణంబులకుం బై పెచ్చు లగు జలపక్షుల వాశితంబులు నెచ్చెలుల యభినందనాలాపంబులుగా సమాశ్రితులకు శ్రీఫలసమృద్ధి లొసంగు నయ్యనువున మొల్లం బై వెల్లివిరియు యశఃప్రవాహంబు నాఁ గొమరారు వెల్లువ పెల్లున ముజ్జగంబులు నాముకొని బ్రహ్మకూఁకటి ముట్టంజాలుదు మను సంరంభంబున విజృంభించి నాథుని సన్నిధి వడసి సకలసౌభాగ్యంబుల విలసిల్లఁ దటీ షరాబు మెరాబా లైన చోటు లెల్ల నాదుకొని మాదిరిసూపం బఱచి యుంచిన పచ్చికపట్టుల పచ్చలతోడి మేలికెంపు లనఁగు నారుద్రపురువుల నెమ్మేనుల పైనిఁ దులకించు జిగి మెఱుంగులు కడలు గలయం బెరసి యయ్యదనునం బుడమి కన్నియ మొడనెడం బసరువన్నియ పొనరుపడు కెంబట్టుకొంగ్రొంబచ్చడంబు డంబు మీఱం దాల్చి కనుపట్టు నత్తెఱంగు రంగున నై రంగారు నొండుకారు నాఁచి కొనం బూచిన మోదుగుల కెంజాయ బెడంగులం దలపింపఁ గడంగఁ బ్రపంచం బెల్లఁ దానయై తమఃపరిధానపరిష్కృతి యావరించెనో పోషణకర్త యగు భార్గవీభర్త నెమ్మేను సాఁచి యోగనిద్రాపరుం డై యుండం దదీయచ్ఛాయలు హరిదంతరంబుల నలముకొనియెనో భూతధాత్రి యెచ్చోటుల నేనియుం దమాలవృక్షంబుల నావిర్భవింపఁ జేసెనో యెల్ల భూతంబులకు నేని నేన తానకంబనై యుండియు

శూన్యపదం బను నప్రతిష్ఠం గాంచనేల యని తనలోఁ దా నెంచి యాకసంబు నిజస్వరూపం బవధరించి యాక్రమించెనో నేఁడు మొదలుగా రేయుం బవలు నను విభాగంబు జగంబునం జెల్లనేర దని సమయవిధి విధించిన శాసనంబుఁ బాక శాసనుం డాచరణంబునం బెట్టెనో యనఁ జెలరేఁగి యెంతయుం బొనరించిన యనంతమణిం గప్పిపెట్టి వారివాహుండు బలాకాపంక్తు లనెడు కపాలమాలికలం దాల్చి యపరనీలకంఠుఁ డనఁ బొల్చి తదీయకంఠచ్ఛవియ యవిచ్ఛిన్న మై నిజాకారస్ఫురణాలం బెనుప భైరవారావంబులం బోని వజ్రనిర్ఘోషంబులం బరఁ గింపుచు వింతపంచాననత్వంబున బ్రహ్మాండకర్పరంబు పేరి హస్తిమస్తకంబు విదా రించు నద్దారిని జల్లుజల్లుమని రాలు క్రొత్తముత్తెంబులో దిక్కాంతలు మొగి ళ్లనం జెల్లు జల్లెడ లెత్తి జల్లించినఁ జిల్లుల నుండి క్రొల్లలుగా దొర్లు తెల్లని మేలి తండులంబులో యనం బొలుపారు జలధారల నుదారత్వంబునం గుఱియఁ దత్కాల స్వర్ణకారుండు బయలుకమ్మచ్చు బెజ్జములం గ్రొచ్చి కారునం బట్టి తివియం దళతళలాడుచు వెలువడు మేలిపసిండితీఁగెలో యన దిక్కులకుం బ్రాఁకు క్రొమ్మె ఱుంగులం దలిర్చు మెఱుంగుఁదీవియల సాహచర్యంబు స్వకీయప్రాభవంబునకు మెఱుంగు వెట్టఁ దదేకాధిపత్యంబు ప్రవర్తిల్లు నయ్యెడ సర్వసర్వంసహాచక్రంబు నూతనసస్యసంపత్సమృద్ధినిర్వక్రం బై వెలయఁ జాతకయాచనికుల దైన్యంబు వాయఁ బరభృతౌఘంబులు నోళ్లు మూయఁ గురరీచయంబు లౌత్కంఠ్యంబున మ్రోయ వర్షాభూమినివహంబులు స్తోత్రపాఠంబులం బొనరం జేయ నాలపోఁ షులు అంకెలు వేయఁ బాంథులు నిజనివాసంబులం డాయ నమేయసుఖాస్పదం బియ్యది యనం దనర్చు నయ్యవసరంబున. ౧౨

తే॥ సంగరం బెంచి యాసత్య ♦ సంగరుండు
ప్రియ వెసఁ దలంచి భూమిపు ♦ త్రీప్రియుండు
తమ్ముఁ గని హితనయుఁడుమ ♦ తమ్ము నెఱయఁ
బలికె రామవిభుం డిట్లు ♦ కులుకులాడి! ౧౩

సీ॥ ఇంత యొప్పు నె వత్స!♦యిచ్చోటునం గుహా,యాయయోధ్యకు సాటి♦యనఁ దనర్చి
మూఁడు చాయల శిల♦ల్మానసి ప్రకాశింప, నిరుగెలంకుల నదు♦లింపుగూర్ప
జాజులు కడిమెలు♦సర్జకార్జునకురం, టకసింధువారాది♦సకలతరువు
లొద్దున విలసిల్ల♦నొడిక మై యున్నది, యీసరోజిని కల్మి♦కిక్క యనఁగఁ
బ్రాగుదక్ప్రవణం బవా♦క్పశ్చిమోన్న, తం బవాతప్రవేశ మీ♦తలము సమశి
లాముఖాఢ్యము ప్రాంచత్క♦లామనోజ్ఞ, మిట్టి నెలవున ననుభావ♦మేమి కలదో.

తే॥ ఒప్పు భిన్నాంజనచయోప ♦ మోచితంబు
కొండ యుత్తరమున నొండు ♦ గూర్చు దక్షి-
ణమునఁ గైలాసనిభ మొకం ♦ డమలమూర్తి
ప్రథితధాతుప్రకాశమ్ము ♦ పర్వతమ్ము. ౧౫

క॥ శ్రీరమ్యమూర్తులే నదు, లీరెండునుఁ బ్రాక్ప్రవాహ♦యిది యెప్పుడు భా
గీరథి త్రికూటమున న, క్లార గుహాపూర్వలక్ష్మి♦తాకృతి యగుచున్. ౧౬

ఆ॥ సకలతరులతోల్ల♦సత్తీరపులినాఢ్య, చక్రవాకలక్ష్య♦శకునరసిత
భృంగగీతిలలిత♦ప్రియహంసగతియు నై, ననిచె నిదియు ననుచు♦నాతివోలె. ౧౭

క॥ చందనసరళమహీజము, లిందుఁ గలవు సిద్ధభూమి♦యిది యిచట శతా
నందనిభులు మునివృషభు ల, మందతపశ్చరణయుక్తి♦మలయుదు రెపుడున్. ౧౮

క॥ ఇవ్వానకారునందున, మవ్వ మెడలనీని విడిది♦మ ట్టానఁగూడెన్
నెవ్వగలమాట కెమ్మెయి, నవ్విధి విధిఁ దనదు తలఁపు♦నం దిడినాఁడో. ౧౯

తే॥ గట్టు లెగచి యంతర మెల్లఁ ♦ గ్రమ్మినట్టు
లాక్రమించెను మేఘంబు ♦ లాకసంబుఁ
గంటె జలదాగమంబునఁ ♦ గలిమిఁ గలఁడె
త్రాత యిఁకఁ బాంథులకు సుమి ♦ త్రాతనూజ! ౨౦

తే॥ పసిఁడికొఱడాలఁ బోలు శం♦పాలతికల, నంబుదాగమసంజ్ఞఁ డ♦ట్లుఱిమి కొట్ట
వ్యోమ మంతస్తనిత ఘోష♦యుక్తిఁ జేసి, సవ్యథం బైన దన నయ్యె♦సద్గుణాఢ్య!

క॥ విద్యుత్పతాకికాది, ప్రద్యోతితమై న మేఘ ♦పటలి నెఱసె యు
ద్ధోద్యతహస్తిఘటాస్థితి, నుద్యద్గంభీరనిస్వ♦నోచిత యగుచున్. ౨౨

తే॥ రవి సముద్రరసము నిజ ♦ రశ్మిసమితిఁ
ద్రావి తాల్చిన గర్భమ్ము ♦ ద్యోవధూటి
తాల్చెఁ దొమ్మిది నెల లిది ♦ తఱియ కాఁగఁ
గనియెడు రసాయనమ్ము జ ♦ గమ్ము మనుప. ౨౩

క॥ సురయువతిహారమౌక్తిక, వరములు రతిరాయిడి న్వి♦భక్తములగుచున్
ధరఁ దొరఁగెడునో యన నం, బరతలమునుండి పడెడుఁ♦బాథోధారల్. ౨౪

ఆ॥ అడఁగె ధూళి చల్ల♦నయ్యెను గాలి ప్ర, శాంతిఁ గనె నిదాఘ♦సంభవంబు
దోషచయము నిల్చె♦దొరల యాత్ర ప్రవాసు, లరుగు దేరఁగాంచి♦రిరవులకును.

క॥ ఒక్కెడ బాష్పావిద్ధము, లొక్కెడ వర్షోత్సుకమ్ము♦లున్మిషితము లీ
చక్కని గిరిసానువుల, న్నెక్కొనె నాభోంట్ల వేఁచు♦నెఱిఁ గుటజమ్ముల్. ౨౬

తే॥ కొడిశె లర్జునములు దండ ♦ గూర్చి మొగిలు
మెట్ల దివి కెక్కి సంప్రీతి ♦ మేకొనంగ
శక్య మిప్డు దివాకరు ♦ సంశ్రితాఘ
హారునిఁ గై సేయుమని ధీమ ♦ దగ్రగణ్య! ౨౭

తే॥ కనుపడియుఁ గానుపింపని ♦ కలనవలన
నంబుధరకీర్ణ మంబరం ♦ బమరె నిప్డు
డెడనెడను గొండల నిరోధ ♦ మొనయుచుండ
శాంత మై యున్న యంబుధి ♦ చందమునను. ౨౮

ఆ॥ ఎలయ విప్డు కాము♦కేష్టద లయ్యు ఘ, నావరుద్ధ లగుచు♦నఖిలదిశలు
ప్రతిహతగ్రహేందు♦ఖద్యోత లై యుంటఁ, బథికనివహవిషని♦భమ్ము లగుట

తే॥ సంజచాయఁ గెంపెక్కి యం ♦ చలములందు
సితము లై యున్న ఘనపట ♦ చ్ఛేదములను
గగన మెల్లెడఁ గట్టులు ♦ కట్టినట్లు
గానుపించెడుఁ జూడు ల ♦ క్ష్మణ! నిజముగ. 30

తే॥ సంజకెంజాయ గంధంపుఁ♦జర్చ దనర, వెల్లబాటు నమ్మెయి మబ్బు♦వెల్లడింప
నాలి గాలి నిట్టూర్పులఁ♦జాలె నిప్డు, డంబరంబు కామాతురం♦బయ్యె ననఁగ.

తే॥ మొగిలు నడిచక్కినుండి ని ♦ ర్ముక్తిఁ గాంచి
కలువకొలఁకులఁ జొచ్చిని ♦ ప్రాక్రాంతము లయి
మొగలిపూవుల తావుల ♦ మునిఁగి తేలి
యందు గాడ్పులు ద్రావ నౌ ♦ నంజలులను. 3౨

తే॥ నలిఁ గులాయనిలీయమా ♦ నంబు లైన
పక్షులు నిమీలితము లగు ♦ పంకజములు
లలితపుష్పితమాలతీ ♦ లతలుఁ జాలు
నినుని యస్తంగతత్వంబు ♦ నెఱుకసేయ.

తే॥ అల్లనల్లన హరిఁ జేర ♦ నరిగె నిద్ర
యేటిబోఁటియు సాగరు ♦ నెనయఁబాఱె

హృష్టపుష్ట బలాకిక ♦ మెలమి ఘనునిఁ
గలసెఁ గాంత సకామ యై ♦ కవియుఁ బ్రియుని. ३४

ఉ॥ కైతకపుష్పగంధమున ♦ ఘ్రాణధృతిం బొనరించి దాన స
మ్మాత మెసంగ సమ్మదన ♦ మన్విత మౌ మద మొప్పఁ గాలమే
ఘాతికృతిం దనర్చుచుఁ ద ♦ దారవము న్విని హృష్ట కేకి సం
ఘాతరవాతివృత్తములు ♦ గా ఘటియించెడు ఘీంకృతు ల్గనుల్. ३५

తే॥ కదలి శైలవనోపమా ♦ ర్గమున వచ్చు
మదగజేంద్రమ్ము పరఁగు నం ♦ బుదరవంబు
విని ప్రతిభటేభశంక నె ♦ క్కొను రయమున
నెదురుకొని సన్నివృత్త మ ♦ య్యెను గుమార! ३६

తే॥ మేఘనిస్వనమును విని ♦ మేను లెగువ
నాచిరాక్రాంత యగు నిద్ర ♦ నపనయించి
యఱచుచున్నవి వారిధా ♦ రాభిహతిని
గోత్రుతులు విభిన్నవర్ణస్వ ♦ రూపగతులు. ३७

తే॥ అనువు సెడి యున్న దాతల ♦ నర్థు లట్టు
లంబుధారాభిహతము లౌ ♦ నబ్జములను
విడిచిపెట్టి సకేసర ♦ వికచనీప
పుష్పవనముల పై వ్రాలి ♦ పొసఁగెఁ దేంట్లు. ३८

తే॥ అధ్యయన మొనరించెడు ♦ నవనిధరము
లబ్దకృష్ణాజినధరము ♦ లమలసలిల
వర్షధారోపవీతము ♦ ల్వాయుపూర్ణ
కందరమ్ములు నై యవె ♦ కను మభిజ్ఞ! ३९

క॥ జలధారాధౌతంబు ల, చలములు సఫలామ్రములు ల♦సర్జురములు నై
విలసిల్లె స్వర్ణముక్తా, కలాపముల నొప్పు భూమి♦కాంతుల పోలెన్. ४०

సీ॥ గైరికాదికధాతు♦కలిత మై నవజలం బనురాగసంపద♦ననువదింపఁ
గడిమిపువ్వులు సర్జ♦కప్రసూనంబులు, శోభనాలంకృతి♦చొప్పు నొడువఁ
జక్రవాకాదిపక్షి♦సక్తత యవయవ, సంస్థానసామగ్రి♦చక్కి నెగడ
బర్హి కేకారవ♦ప్రస్తావమున బంధు, లామంత్రణము సేయు♦టనువుపడఁగఁ

దృష్టులై యొద్దు లారయుచుఁ ♦ దెలివిమీఱఁ
జరలు సంభ్రమ మెుత్తునగ ♦ త్వరబు దెలుపఁ
బూర్ణగోన్నతిఁ దనరుఁ ♦ బొలుపు నెఱయ
నాథుఁ జేరంగ నరిగెడు ♦ నదులు వత్స! ౪౧

తే॥ తేఁటితంతుల నాదము♦త్తైన లాలుకఁ, గంఠ తాళంబు లాప్లవం♦గములు గూర్ప
మేఘమార్దంగికారవ♦మేదురముగఁ, గేకు లాడంగ వనుల సం♦గీత మొప్పె.

క॥ మెండుకొని నెగడు నల్లని, పండుల జంబూద్రుమములు♦భాసిల్లెడుఁ దేం
ట్లుండ గొని యెడ ముసంగక, యుండిన గతి నున్న శాఖ♦లోజం దనరన్. ౪౩

సీ॥ ఉరుశిఖిన్నృత్తమ్ము♦లొప్పెఁ గాంతారము, లగె దినాంతములు సాం♦ధ్యరుచిరములు
పరఁగె సత్సుమకదం♦బములు కదంబము, గోకామగతు లయ్యె♦గోవృషములు
వెలసె నుత్తమసస్య♦వృద్ధి సుక్షేత్రము, లాఱలె మత్తమ్ములై♦కుంజరములు
వర్షించె మొగిళులు♦ప్రవహించె నదులు ప్ర, కాశించె గిరివన♦క్ష్మారుహంబు
గీ॥ లూఱడిల్లెను ప్లవగంబు♦లుత్సహిల్లెఁ, జాతకంబులు భాసిల్లె♦శాద్వలములు
విప్రలబ్ధలు పాలిఁటి♦వెతలఁపెల్లు, గాఁగ నెగడొందు నీజల♦దాగమమున. ౪౪

సీ॥ విజనస్థలుల శిఖు♦ల్విచ్చు పింఛమ్ములు, తడియార్చు కురుల సం♦గడము నొడువ
చిలుకపచ్చని-చీరె♦సిరి శాద్వలమ్మునఁ, బరఁగిన ఛాయ మ♦వ్వంబు సూప
నిందగ్రోపసమృద్ధి♦యిరవొందు కెంపుటా, నగల మేల్తళుకుల♦నగటు దెలుప
గిరికూటములనుండి♦గిరికొను సెలయేండ్ల, ధారలు మౌక్తిక♦హారములుగ

నటు తపాత్యయమున స్నాన ♦ మాచరించి
యుచిత మగు వేషమున కల్మి ♦ యొప్పుఁ గనియు
బాష్పనిశ్శ్వాసము లెడల్చి ♦ పట్టునందుఁ
దన తనయుఁ బోల నున్నది ♦ ధరణి యిపుడు. ౪౫

క॥ ఫుల్లార్జున మగు శైలం, బల్లదె గేదంగిపూల♦నధివాసితమై
యుల్లసిలెడు శాంతారిత, నల్లన నర్జుని రీతి♦నభిషిక్తంబై ౪౬

క॥ ఈవర్షాగమమున సు, గ్రీవుఁడు సుఖియించు దార♦కేళీపరుఁడై
యావగలు దక్కి రాజ్య, శ్రీవిలసితుఁ డగుటఁ బ్లవగ♦సేవితుఁ డగుచున్. ౪౭

సీ॥ సంచితార్థుండు నై♦సత్కర్మము లొనర్చు, నాషాఢి గని భర♦తాధినేత
యధ్యాయయోగంబు♦లనువొందు శ్రావణ, భాద్రపదములు రా♦బ్రాహ్మణులకు
వచ్చునన్నాంచి ని♦స్వనమయోధ్యకు నట్టు, లయి నిండుసరయుప్ర♦రయము హెచ్చు
స్వస్థచిత్తుంగ డగు♦శౌరిఁ బోలఁగ నుండు, రావణుండును లంక♦రాజ నేఱయ

నేను రాజ్య మెడలి♦హృతదారుఁడను నయి, శత్రువధకు నేని♦సమయ మనఁగ
రాక యిట్టు లుంటి♦రాపొందు నది యొద్దు, వోలె నెదియుఁ దలఁపు♦బోరయకునికి.

ఆ॥ కాలమేఘ మడరు♦కడఁ దోఁచెడు మెఱుంగుఁ, దీనెఁ గాంచినంతఁ♦జెరలు చిత్త
మసురపొంత నున్న♦యాతపస్విని సీత, దశ తలంపు లోనఁ♦దవులుకొనఁగ. ౪౯

ఉ॥ కాలము దేశము న్గని వి♦కారము నొందక నమ్రుఁ డైన య
వ్వాలి యనూదితు న్విడచి♦వానరరాజ్యవధూసుఖోర్మిలం
దేలు మటంటి నియ్యదను♦దీఱఁగ నాతఁడు బుద్ధిశాలి యి
మ్మేలు దలంచి నాయెడరు♦మేకొని త్రోవఁ గడంగకుండునే. ౫౦

క॥ ఉపకారజ్ఞుఁ డయినఁ బ్రి, త్యుపకార మొనర్పుఁ దోన♦యుపకృతుఁ డితఁడున్
విపరీతభావ మొందఁడు, నిపుణుఁడు నయవేది యింత♦నేరఁడె యనుజా! ౫౧

ఆ॥ ఎట్లు గడువనేర్తు♦నింత యెఱింగి యా, గడువు శత్రువుండు♦గడుసువాఁడు
దండయాత్ర కిదియుఁ♦దగనికాల మటన్న, విరహిదుస్సహము వి♦వేకమహిత!

క॥ ఈనెలలు నాల్గు గడువఁగ, నే నింకం గాంచువాఁడ♦నే జనకజఁ దా
నే నెటనుండెనొ కడు వగ, దానవుచేఁ జిక్కి దారి♦తల లేక నఘా! ౫౩

క॥ పొసఁగ దెదియు మది కన న, య్యసదృశమతియుక్తుఁ డిట్టు♦లనెఁ దగునయ్యా!
విస్మృమరము త్వత్ప్రభావము, దెస నన్యుల కనులు మూయు♦తెలఁగు మహాత్మా!

—♦ లక్ష్మణుఁడు రామప్రభావంబు వెల్లడించి యూఱడించుట. ♦—

శా॥ మాయామానుషవేషధారివి గుణా♦మ్నానక్రియానూగ్రి కి
ట్లీయుక్త ల్పచరింతు వింతె యెది నీ♦వెంచంగఁ గారాని దా
శాయోగోపమహాత్మవృత్తులకె సం♦సారంబు సర్వాధిభూ
శా యీ! త్వన్మహితానుభావ మెఱుఁగ♦న్శక్యంబె నాబోఁటికిన్. ౫౫

క॥ నీతరమె యీవిచారము, శ్రీతరుణీరమణ నిన్ను♦జేరి తమస్సం
పాత మెడలింతుమనిమును, లే తలఁతురు త్వద్విలాస♦మెంచంగలమే. ౫౬

క॥ తలఁపుము తావకసత్త్వము, మెలఁపుము రిపుఁ దృణము నొక్క♦మెయి మేళముగాఁ
గొలుపుము ధృతి నెమ్మనమున, నిలుపుము మహితం బ్రతిష్ఠ♦నిర్మలహృదయా!

ఆ॥ శోకమోహములకుఁ♦జో టొసంగిన మది, చెడి వివేకమునకుఁ♦జేఁటు దెచ్చు
దాన ననయ మొదవుఁ♦దజ్జమౌ జాడ్యంబు, కర్జములకు నదియు♦కాలిముల్లు.

తే॥ కానఁ జింతఁ ద్యజించి ర♦క్కసునిఁ గెడపు
పనికి ధృతి నెమ్మనంబునఁ♦బాదుకొలుపు

మెంతవాఁడేని నీచక్కి ♦ యెదుట నిలువఁ
బడి సబాంధవముగ భంగ ♦ పాటు గనఁడె. ౫౯

క॥ మడిసిరి ఖరప్రభృతు లౌక, గడెలోపల ని న్నెదిర్చి♦కాదన కిమ్మా
ర్ఖుఁడు నీ కొనర్చె నపకృతిఁ, జెడుఁబో యవిలంబముగ న♦శేషబలముతోఁ౯.

తే॥ అధిప! వీక్షింపుమా శర♦దాగమంబు, రహిఁ బొనర్తు జయశ్రీక♦రగ్రహంబు
నీకుఁ దెల్పెడువాఁడ♦నేనీదువిక్ర, మాగ్ని నాహుతి వెలయింతు♦నంతెకాక. ౬౧

క॥ అని లక్ష్మణుఁ డెఱిఁగించిన, విని మే లని మెచ్చి రామ♦విభుఁడు శరత్కా-
లనిరీక్షణ మొనరించుచు, ననుజుఁడుఁ దా నుండె నచట♦నగవంశమణీ! ౬౨

ఆ॥ పచ్చిమేతలు తేనెలు ♦ పండ్లరసము
లాదవ మృగపక్షిగణము ల ♦ య్యదనునందుఁ
గనులు విప్పి రాముని గాంచి ♦ కదలకుండు
జ్ఞాననిష్ఠులు మును లట్లు ♦ మానవతిరో! ౬౩

క॥ గిరికాననభూముల సం, చరించు రాముని మహత్త్వ♦సరణి నరసి య
ప్పురుసున రూపు లెనసి ముని, వరులు న్వరివస్య సలుప♦వచ్చిరి తరుణీ! ౬౪

మ॥ ఒకనాఁ డావసుధాసుతాధిపుఁడు చి ♦ ద్యోగప్రసక్తి స్వక
ప్రకటానందరసప్రవాహమున దా ♦ ప్పందోఁగి భవ్యప్రసా
దకలాస్ఫూర్తిఁ బొసంగుచున్నయెడఁ బ్రో ♦ ద్యన్మైత్రి సౌమిత్రి చే
రి కృతాభ్యర్థనుఁ డయ్యె నిట్లు ప్రణతి ♦ శ్రీయోగపూర్వంబుగ౯. ౬౫

సీ॥ తెలిపితి వధ్యాత్మ♦దృగ్వివేకమమున్ను, దీవ్యద్దయాస్ఫూర్తి♦తేఁటపడఁగ
విచ్చె దాన ననాద్య♦విద్యాతమిస్రంబు, నిర్మలత్వంబున♦నెఱియుఁ దనరెఁ
ద్వద్భక్తియోగాప్తిఁ♦దవిలి వర్తింతురు, బ్రహ్మాదు లటు యతుల్♦భవ్యమతులు
నందును భవదీయ♦మారాధనం బెక్కు, డందురు సులభ మై♦యలరుచునికిఁ
దలఁప నయ్యేను ముక్తిసా♦ధన మటంచు, వర్ణ లాశ్రము లటు లేక♦వర్ణ లబల
లెవ్వరేనియుఁ దరియింతు♦రిట్టు లింత, గోరి ప్రార్థింతు నది నాకుఁ♦గూర్పుమయ్య!

క॥ లోకోపకారకం బిది, నాకొకస్తు నిత్య భువన♦నాయక! కరుణ
న్నా కెఱిఁగింపుము భక్తుఁడ, నీ కనుజుఁడ నిన్నుఁ గొలిచి♦నెగడెద రామా! ౬౬

క॥ అని వేఁడిన సదయుండై, యనె రఘురాముండు సౌమ్యు♦యగు ముక్తికి సా
ధనము మదారాధన మది, తనరారు నపార మగుచుఁ♦దత్కాలోక్తి౯. ౬౭

ఆ॥ ఐనఁ దెలుపువాఁడ♦నంతయు సంగ్రహ, వచనరచనచే భ♦వత్ప్రపత్తి
కలరి దాని నిచ్చ♦లవధరించిన మత్ప్ర, సక్తి నగు భవాబ్ధి♦సంతరణము. ౬౯

తే॥ మానవుండు స్వగృహ్యోక్త ♦ మార్గమునను
దగిన గురుఁ జేరి మన్మంత్ర ♦ తత్త్వ మరసి
భక్తి నెక్కాన నాచరిం ♦ పనవుఁ దత్ప్ర
బోధితవిధి న్మదీయ మా ♦ రాధనంబు. ౭౦

తే॥ అనఘ! మదినేని వహ్ని సు ♦ ధ్యమున నేని
నర్కు దెసనేని స్వచ్ఛమై ♦ నట్టి ప్రతిమ
యందునేని సాలగ్రామ ♦ మందు నేనిఁ
బూజసేయంగ నగు భక్తి ♦ పూర్ణుఁ డగుచు. ౭౧

సీ॥ వేఁకువ మేల్కాంచి♦వే నన్ను స్మరియించి, కాల్యకృత్యంబులు♦గడపి కడఁగి
వేదోక్తముగ స్నాన♦విధి దీర్చి సంధ్యాది, నిత్యకృత్యమ్ముల♦నెఱిఁ బొనర్చి
మద్బుద్ధి గురుని సం♦భావించి పూజించి, పూజార్థములు శ♦క్తిఁ బోల నేర్చి
సంకల్ప మొనరించి♦సన్నియతాత్ముఁడై, ప్రతిమాదిసంశుద్ధి♦పరఁగఁ గూర్చి
లలి శిలఁ బ్రతికృతిని నలం♦కృతికృతి, యగ్ని ని హవిస్సుపూర్ణం♦బర్కు నెడను
స్థండిలార్చనమును నన్నుఁ♦దవ్రులు మదిని, జేయు సాధకు సంసిద్ధి♦చెనయు వత్స!
తే॥ చిత్రచేలాజినకుశప్ర♦సిద్ధశుద్ధ, విష్టరంబులయం దొండు♦వెతికి చేర్చి
కొని సమాహితుఁడై యర్చ♦కుండు భూమి, భూతశుద్ధిప్రకల్పనా♦పూర్వకముగ.

వ॥ సముంచితభక్తివిశేషంబు తిరంబుగా గోఘృతప్రయుక్తం బగు సాక్షిదీపంబు కల్పించుకొని బహిరంతర్మాతృకాన్యాసంబులు సంధానించి కేశవాదిసంబోధన పూర్వకంబుగాఁ దత్తన్న్యాసంబులు సంతరించి మదీయమూర్తిపంజరన్యాసం బొనరించి యతంద్రితుండై మంత్రన్యాసం బాచరింపవలయు. ౭౨

తే॥ దళకుసుమముఖ్యసామగ్రి ♦ దక్షిణమున
నర్ఘ్యపాద్యాచమనపాత్రి ♦ లమ్మెయి మధు
పర్కకలశంబు నివి వామ ♦ భాగమునను
జేర్చి పొనరింత్రు మునులు మ ♦ దర్చనంబు. ౭౩

తే॥ భానువిమల మత్కళ జీవ ♦ పదస్వదేహ
మాక్రమించి వెలయు హృన్న ♦ ళాంతరమున
దాని ధ్యానించిప్రతిమాది ♦ కానుసరణ
మమర నావాహన మొనర్ప ♦ నగుఁ గుమార! ౭౪

క॥ సదమలమతి! యుపచర్యలు, పదాఱు నఱువదియు నాల్గుఁ♦బరఁగును గల్పా
స్పదతద్విధానలక్షణ, విదితుండై యెనయ నోపు♦విధిఁ గొన నొప్పన్. ౨౭

క॥ లలితము లగు తులసీదళ, ములఁ బరిమళమిళితకుసుమ♦ములఁ బూజింపన్
వలె నన్యులు కలవా రో, యలఘుగుణా! పైఁడిపూల♦నర్చించు నెడన్. ౨౮

ఆ॥ అవ్విధమునఁ గుంకుమాగురుచందన, వస్త్రభూషణాది♦వర్గములును
సంభవించు వఱకె♦చాలు నద్దానిచే, భక్తి కేమి కొఱత♦పావనాత్మ! ౨౯

క॥ వే యేల దళకుసుమఫల, తోయమ్ములె చాలు భక్తి♦తో నిడఁగ సము
చ్ఛ్రియంబె భక్ష్యభోజ్యా, ద్యాయతవస్తుప్రచార♦మబ్బిన ననఘా! ౩౦

క॥ యావచ్ఛక్తిఁ గడంగి య, నావిలుఁడై పాద్య మర్ఘ్య♦మాచమనీయం
బావరుస స్నానముఖక, ల్పావిర్భూతోపచర్య♦లందింప నగున్. ౩౧

తే॥ నామసాహస్రమైన మ ♦ న్నామ మొక్కఁ
డైనఁ జాలుఁ దదావృత్తి ♦ నందఁ జేయ
వచ్చు సుమదళములు దశా ♦ వరణపూజ
నంబు మున్నుగ ని ట్లర్చ ♦ నం బొనర్చి. ౩౨

తే॥ విహితములు ధూపదీపనై ♦ వేద్యములును
నుత్తరోపచారమ్ములు ♦ నొప్పఁ గూర్ప
శ్రద్ధధానుం డయినఁ జాలు ♦ సాధకుండు
శ్రద్ధ కే సంతసింతు సౌ ♦ జన్యమూర్తి! ౩౩

క॥ హోమ మగస్త్యప్రోక్తం, బా మార్గంబుననయేని♦నభిపుంసూక్తం
బా మంత్రవిధినయేని, న్నేమంబున జరుప నగు న♦నింద్యచరిత్రా! ౩౪

తే॥ చరువు సమకూర్చియేని నా ♦ జ్యమున నేని
నధికృతాగ్ని యం దౌపాస ♦ నాగ్నియందు
నెందునేనియుఁ జేయ నౌ ♦ నిట్టి హోమ
మిద్ధచారిత్ర! నాచక్క ♦ యెదుటఁగాఁగ. ౩౫

తే॥ అమలకాంచనవర్ణు ది♦వ్యాభరణ వి, భూషితుని వహ్నిమధ్యస్థు♦బుద్ధిఁ జేర్చి
నన్ను ధ్యానింతు రవల స♦న్నద్ధములు వి, శిష్టపార్షదబలిహోమ♦శేషవిధులు.

క॥ సన్మతియోగగరిష్ఠత, మన్మంత్రజపానువృత్తి♦మలయఁజను విప
శ్చిన్మానిత యాదట విల, సన్మంగళగీతనృత్త♦సన్నుతు లొప్పన్. ౩౭

తే॥ అటుఁ బునఃపూజ నొనరించి ♦ ప్రాంజలి యయి
తనదు శీర్షంబు మత్పాద ♦ తలము మోవ
భూమి సాష్టాంగదండప్ర ♦ ణామ మిడి ప్ర
సాద మర్థించి భావించి ♦ చనుఁ గొనంగ. ౮౮

క॥ ఘోర మతఘోర మీసం, సారార్ణవ మీదఁజాల♦సంయమినుత! యు
త్తారణ మొనర్పు మని చి, త్తారూఢి న్వేఁడ నగు స♦మంచితచరితా! ౮౯

క॥ నిత్యు ననంతు న్ననుఁ దన, ప్రత్యగ్జ్యోతిఃపదమున♦భావింపఁ దగున్
ప్రత్యుద్వాసనవిధసం, ప్రత్యయమున సంవిభావ్య♦భవ్యమనీషా! ౯౦

క॥ ఇమ్మెయి నొనర్చు నెవ్వాఁ, డిమ్మెఱఁగి మదర్చనాఖ్య♦మీయోగ మతం
డమ్మహితుం డిమ్మహి సా, ఖ్య మ్మనయుం గాంచుఁ బిదపఁ♦గైవల్యంబున్. ౯౧

వ॥ అని యిట్లు నిజార్చనావిధానం బప్పద్మవాసినీమనోహరుండు. ౯౨

క॥ ఆసౌమిత్రికి నంతే, వాసికి శేషాంశజనికి ♦ వరసౌజన్య
శ్రీసౌభాగ్యనిధికి వి, శ్వాసముతోఁ దెలిపె మౌని♦వందితచరణా! ౯౩

—♦ శరత్కాలవర్ణనము. ♦—

క॥ అంతట శరదాగమము ది, శాంతముల నైజకీర్తి♦వ్యాపింపఁగ న
త్యంతసమృద్ధు లనంత న, నంతమున న్వెలయ నల్ల♦నల్లనఁ దోఁచెన్. ౯౪

ఆ॥ స్వచ్ఛుఁ డయ్యె నప్డు♦జలదుండు తన కెప్పు, విచ్చి చనఁగ మేలి♦వితరణమున
జీవనప్రదుండు♦చెడిపోవఁ జేనాఁడు, నసము దెసల వెలయ♦నలరుఁగాని. ౯౫

ఆ॥ నాఁడు వెలయఁ జేసె♦నాథు మేచకుని వి, ద్యుల్లతాంగి స్వీయ♦ద్యుతిఁ దనర్చి
రక్త యగుచు నేఁటి♦రాణ నాతనిత్రోడ, స్వచ్ఛరూపకలన♦సంశ్రయించె. ౯౬

క॥ దానము ప్రతిగ్రహీత యు, నూనమహిమఁ జేసి నిర్మ♦లోదయకలనా
ధాననిదానం బగు నని, తా నచ్ఛం బగుచు జలము♦తద్దయుఁ దెలిపెన్. ౯౭

ఆ॥ విచ్చునవియుఁ జేర ♦ వచ్చు నయ్యవియుఁ బో
నున్నయవియు నిలిచి ♦ యున్నయవియు
విమలభావ మొంది ♦ వెలసె నేకాకృతిఁ
గాలమహిమ మెన్నఁ ♦ గలరె యొరులు. ౬౮

క॥ విచ్చె సితాంభోజంబులు, వచ్చె న్మానసము వదలి♦వసుధకు హంసల్
విచ్చిచనె మొగిళుల టుద్యుతి, హెచ్చె శశికి గ్రహములకును♦ఋక్షంబులకున్.

ఆ॥ పూఁచియున్న తెల్లు•పొల్లు వోవకయుండఁ, దనదు కాంతిఁ జేర్చి•తారకేశుఁ
డెక్కుడైన తెలివి•దిక్కుడ్యముల మెఱుఁ, గార్చెఁ జుక్కదళుకు•లతిశయిల్ల.

ఆ॥ ఎట్టి రూపు లేక•యిట్టట్టు గాఁబోక, యుండు నభము భాది•మండలములు
మెఱయఁ గప్పు దాల్చి•మెఱుఁ గిడె వానికి, బెద్ద లెంతు రెదిరిఁ•బెద్దసేయ.

ఆ॥ ఆట లాడి యాడి•యలసి చాలించెఁ బో, యాటపులుఁగు లంచ•లందఁజేయు
కులుకునడలతోడి•నులివులు తెక్కల, ధాళధళియు నెన్నఁ•దరము గాదు. ౧౦౨

సీ॥ సస్యశాలిని యయ్యె•సర్వంసహాదేవి, యలసగామితఁ గాంచె•నావగాళి
సారసారవతౌర్య•సన్నాహ మొప్పారెఁ గమలవాసిని చేరెఁ•గమలవనికి
సప్తచ్ఛదద్రుమ•సౌరభం బెడఁగ్రమ్మె, బుష్పవద్ద్యుతు లట్లు•పొలుపు మీఱెఁ
దెలివి తేటల మించె•దిఙ్మండలం బెల్ల, నపచపలాబ్ద మై•యమరె నభము
వాజినీరాజనావిధు • ల్వాఱలఁ జొచ్చె
భృంగగీతిప్రచారము • ల్వైరయసాగె
నయ్యగస్త్యుని యభ్యుద • యంబు మున్ను
గా హరి ప్రబుద్ధుఁ డయ్యెడు • కాలమునను. ౧౦౩

క॥ అయ్యెడఁ గిష్కింధాపురి, నయ్యర్కతనూజుఁ జేర•నరిగి హనుమ తా
నెయ్యమున నెఱి ప్రధానత, వియ్యచనవుఁ దగ ననె వి•విక్తతలమునన్. ౧౦౪

—• హనుమంతుఁడు సుగ్రీవునకు రామకార్యావసర మెఱిఁగించుట. •—

సీ॥ తగునె వానరరాజ! • దాశరథులకూర్మి, మఱచితి వొక్కొ నీ • మంతనమున
నాత్రిలోకీవీరుఁ•డగు వాలి హతుఁ డయ్యెఁ, దత్ప్రాక్రమమునఁ•దలప వదియు
దొరసె దారయు నిన్ను•దుర్లభ రుమతోడి, దై సర్వసౌఖ్యంబు • లందఁగంటి
విట్టిసంపద వారి•నెలకటాక్షపుఁజూడ్కిఁ, గాక యొండొక్కటిఁ•గలదె కలుగ
నంతవారు కంద•రాంతరగతు లయి, కార్యగౌరవమునఁ•గా దనంగ
రాక యొదిఁగి నీదు•రాకఁ గాక్షించుచు, నుండ నూరకుంట•యుచిత మగునె.

క॥ వానరభావము తెలియం, గా నారీసక్తిఁ దెఱవు•గానక నీ వి
ట్లానాఁటిప్రతిన వీఁడగఁ, గానున్నది యెదియొ కాల•కర్మగతుల చేన్. ౧౦౬

ఆ॥ దేవిఁ బాసి విభుఁడు•తెరలుచునుండఁ ద, న్మార్గణమున కీవు•మలయకుండ
నెట్లు తోఁచె మదికి•నెది గతి తత్కోప, కాలవహ్ని యడరి•కాల్పఁ దొడర.

క॥ ఉపకృతుఁ డుపకారముఁ దా, విపరీత మొనర్చి యెందు•వెలయఁడు తత్కా
ర్యపరీతమానసుండై, సుపుణ్యగతి నొందు సిరియు•శుభములు గాంచున్. ౧౦౮

ఆ॥ ఇట్టి రాజ్యవిభవ♦మీ యెల్లసౌఖ్యంబు, లడఁగు నొంటఁ దొడరఁ♦గడఁగు నొకటఁ
గాన నస్థిరములు♦గలుగు సంపద లెన్న, మిత్రయోగలబ్ధి♦మేర గను నె. ౧౦౯

క॥ నేరక సకాముఁడై సం, సారాబ్ధి ననత్సుఖోర్మి♦సంగతిఁ గూలున్
బారమెనయు సన్మైత్రిం, జేరం గనెనేని జనుఁడు♦సిద్ధార్థుండౌః ౧౧౦

ఆ॥ అరయుమయ్య! కర్జ ♦ మన నయ్యె నీ మేలు
గోరి యిట్లు నాకుఁ ♦ గూర్మి గలవు
గాన వానకారు ♦ గడచె నింతకు వార
లూరకున్న వార ♦ లుచిత మెఱిఁగి. ౧౧౧

క॥ ఎఱిఁగి తఱిఁ గడపి హితుఁ న, క్కఱఁ దీర్పఁ గడంగు నెవఁడు♦కర్జము తెఱఁగే
ర్పఱిచియుఁ జేయనివాఁ డగు, నెఱి గన్గొన నిట్లు రాజ♦నీతి గుణజ్ఞా. ౧౧౨

క॥ నీదెస భారం బిడి సీ, తాదయితుం డున్నవాఁడు♦తాఁ దలఁచిన చో
మేదిని తలక్రిందై పడఁ, గా దిట్టతనంబు నూపఁ♦గలఁ డధివీరా! ౧౧౩

క॥ కాని కార్యము కాదు నీ ♦ కడఁగు టొకఁడె
యెడముపడెఁ గాక నినుఁ గొల్చి ♦ యెన్నికోటు
లున్నవారలు వారణ ♦ సన్నిభులు ప్ల
వంగవీరులు పిలిపింప ♦ వలదె వారి. ౧౧౪

క॥ రావించి యెల్లదెసలకుఁ, బ్రావీణ్యము నెఱయఁ దో నె♦పనిచి విభునకుం
గావింపుము కర్ణసుఖము, దేవి కుశలవార్తఁ దెలిపి♦దినకరతనయా! ౧౧౫

క॥ అని బోధించిన భీతియు, వినమ్రతయుఁ దోఁపఁగా ర♦వివ్రభవుం డి
ట్లనె మే లయ్యె సమయమ్ముం, గని మేల్కొల్పితి ధృతిం జ♦గత్ప్రాణసుతా!

తే॥ అన్నిటికిఁ జాలు దీవ మా ♦ యన్న! యిపుడె
పనుపుము కపిప్రవరుల ది ♦ గ్భాగములకు
యూథనాయకులకు మన్ని ♦ యుక్తిఁ దెలియఁ
జేసి సేనలఁ జెచ్చెరఁ ♦ జేర్చుటకును. ౧౧౭

ఆ॥ నాలు గైదు నో ది♦నంబులలోఁ రాక, జాల మెవ్వ రెట్లు♦జరిపి రేని
వారి కొదవు ననుము♦ప్రాణాంతికము దండ, మెల్ల నెఱపు మేల♦యేను దెలుప.

క॥ నీలుని నంగదు నిద్దెస, వాలాయముఁ గన్నిడంగ♦వలె నను మింకం
గాలిడి నిలువంజన దను, మీలోపల లోప ముంట♦యెసఁగ దనిలజా! ౧౧౯

క॥ భారము నీయదియే యని, యారవిజుం డంతిపురికి♦నరిగిన-చో సా
మీరి ధృతిమీఱి కృత్యం, బారూసి హరీంద్రుఁ డనిన♦యట్టు లొనర్చెన్.

క॥ అత్తఱి శరద్గుణము లు, ద్వృత్తమనోజప్రయుక్తిఁ♦దివిచి మహీజా
యత్తుఁ బొనరింప రాఘవుఁ, డుత్తలపడుచుండెఁ గృతిని♦యోజన కగజా! ౧౨౧

ఆ॥ తనదు చెంత నున్న ♦ తరలాక్షి నొండెడ
వెదకఁ జొచ్చె రామ ♦ విభుని చిత్త
మవశభావ మతని ♦ నందఁజాలె నటన్న
నొడ్ల మాట కింక ♦ యుక్తి గలదె. ౧౨౨

క॥ బంగరుకొండం బైపై, నంగనయుం దాను నుండు♦నాతం డుండెన్
జెంగటిగిరి పై భాగము, నం గేవలుఁ డగుచు స్మరవి♦నమ్రుం డగుచున్. ౧౨౩

సీ॥ వెన్నెలమైపూఁత♦వెలసె నీశారది, రజనినాథునిఁ గూడి♦రాణ నెరయు
సారసారవకలా♦సన్నాహ మొప్పార, మున్ను మత్ప్రియ నన్ను♦మొనసిపోలెఁ
గుత్తుక తడియూఱ♦గొదకొని యల్లదె, యఱచుచున్నది కోకి♦యధిపుఁ బాసి
యాసాధ్విఁ బోల్పంగ♦నై యిప్డు భానుని, రాకకై వేఁచి యా♦రాటమునను
నెట్టు లయ్యె నొకొ♦యే మనుచుండెనో, యేవిధమున సుప్తి♦నెనయఁగలదొ
యెటు ప్రబుద్ధ యగునొ♦యెద్ది భుజించునో, తలఁపరాదు తద్వి♦ధంబు మదికి.

క॥ అని తలపోసికొనుచు న, ఖ్యనకులమణి యుండఁ జేర♦నెనసె ననుజుఁ డ
వ్వని ఫలమూలాదికములు, గొని తేరంజనినవాఁ డ♦కుంఠితగతియై. ౧౨౪

ఆ॥ వచ్చి యేకతమునఁ♦వరవర్ణినిఁ దలంచి, యన్యు రీతి నున్న♦యన్నఁ గాంచి
పలికె లక్ష్మణుండు♦భాషితమ్ముల యొప్పు, దెలిసి దేవగురుఁడు♦తెల్లవోవ.

—♦ లక్ష్మణుఁడు సీతావియోగదుఃఖితుం డగు శ్రీరాము నూరార్చుట. ♦—

ఉ॥ కామవశంబునం బడినఁ ♦ గాదని పౌరుష మీసడించినన్
నేమము యోగము న్గెడపి ♦ నిల్చిన స్వీయసమాధి చేడ్పడం
గా మనుజుండు వ్యర్థుఁ డగుఁ ♦ గల్ల దొకప్పుడయేని శ్రేయ మి
క్లేమి పొనర్ప నెంచి వగ ♦ నిమ్మయి నుంట నరేంద్రనందనా. ౧౨౫

ఆ॥ తనమనఃప్రసాద ♦ దార్ఢ్యమ్ము లటు యోగ
యుక్తమైన కాల ♦ మోజ నెరయఁ
బెరయు సాహ్య మెఱుక ♦ పృథుకర్మసంస్కృతి
హేతుభావ మెనయు ♦ నిన్ని కృతుల. ౧౨౬

ఆ॥ నాథ! త్వత్సనాథ♦నసులభ యన్న్యన, కతిసుపూత యుర్వి♦రాత్మజాత
యగ్నిశిఖ సమిద్ధ♦నాక్రమింపఁ దలంచి, చెడక పోవఁ డొందు♦సిద్ధ మిదియ.

క॥ అనిన రఘురాముఁ డిట్లను, ననయమ్మునఁ బోక కర్జ♦మనువర్తింపన్
జను ననయము సాధకుఁ డి, మ్మున ఫలమున చింతఁ గొనమి♦మొనసి కుమారా!

—♦ శ్రీరాముఁడు శరల్లక్షణంబులు చెప్పుచు ప్రమత్తుఁ డైన సుగ్రీవునకై లక్ష్మణుఁ బనుచుట ♦—

సీ॥ పెంగంటివేల్పు గా♦వించెఁ బాటవలంతి, సర్వసస్యాఢ్య గా♦సలిలతృప్తి
మొగిళులు విశ్రాంతి♦మొనసిన చందంబు, గానవచ్చెడుఁ గృత్య♦కలన మెలఁగి
యిందీవరచ్ఛవి♦నీవనీనగరాజి, రాజిల్లె వింతయూ♦రాణఁ దనర
స్నాతానులిప్తముల్♦శైలమ్ములన నొప్పె, ధాతురాగద్యుతుల్♦ద్రవ్వ నెఱయ
తగ ననేకాశ్రయత విచి ♦ త్రరుచి యైన
లక్ష్మి నేఁడు శరత్కాల ♦ లాలిత యయి
రవికరాగ్రప్రబోధిత ♦ రమ్యపద్మ
వనవిహారమ్మునం బొల్చె ♦ వలను మెఱయ. ౧౩౧

తే॥ అమరె నేఁడాకులయనంటు ♦ లందు నట్లు
లుడుశశిదివాకరులయందు ♦ నోజ మెఱయ
మదకరివృషమ్ములందు ని ♦ ర్మలనదీస
రస్సరోజములందు శ ♦ రద్విభక్తి. ౧౩౨

తే॥ హంసలునుఁ జక్రవాకమ్ము ♦ లనఁగి పెనఁగి
యంగనలతోడ నాటలా ♦ డంగఁ జొచ్చెఁ
దొడరు ప్రక్కలఁ దమ్మికెం ♦ ధూళి నెఱయఁ
బులినతలముల శోభాప్ర ♦ బోధ మెలయ. ౧౩౩

సీ॥ విలసిల్లు తెల్లుపూ♦వెలిపట్టు నునుకట్టు, మృదుమారుతమ్మునఁ♦బొదలుచుండ
నల్లనల్లనఁ బులి♦నాఖ్యము జ్ఘనమ్ము, లంతరాంతరితమ్ము♦లనువుపడఁగ
మిట్టిపాటున మించు♦మీనుతళ్కులపేరి, మేఖలోత్థితము లా♦మెఱుఁగు లెగువ
సహచక్రశైవల♦తృష్ణత రోచనాంచిత, కస్తూరికాపత్ర♦కలన లొప్ప
సుప్రసన్నహ్రదాంబుజ ♦ సుముఖలక్ష్మి
నెఱయఁ గాంతోపభుక్త లా ♦ నెటె దలిర్ప
నలసగామినులై త్రియా ♦ మాంతమందు
నదులు కామినులట్లుగ ♦ నప్పెడు వత్స! ౧౩౪

క॥ జలదాహతిఁ బడి సుడివడి, బిలములలో నడఁగి క్షుధకు♦బిట్టడలి తఱిన్
దల లెత్తెడుఁ బలువిధముల, చిలువలు ఫూత్కృతము లుల్ల♦సిల నేఁ డనఘా!

తే॥ ఆలమందలలో నుండి ♦ యాలపోఁతు
లిడెడు ఱంకెలు హస్తిను ♦ లెనసి రామ
దేభము లొనర్చు మేలి బృం ♦ హితము లిదియ
తఱి యనఁ దనర్చుచున్నవి ♦ తరము మిగిలి. ౧౩౬

తే॥ చంద్రిచంచత్కరస్పర్శ♦జాతహర్ష, రససముస్మిలదచ్ఛతా♦రకయు కాఁగ
రాగవతి సంధ్య తా నంబ♦రమ్ము వదలి, పొరలుచున్నది పశ్చిమ♦పొదలకున్నె.

ఆ॥ ఇందుబింబవదన♦యిందీవరాంచిత, నేత్రి ఘాతఘనవి♦నిర్మలాత్మ
కౌముదీవిభాంశు♦కస్ఫూర్తి రాత్రి వో, సంగె సద్గుణాఢ్య♦సాధ్వి యట్లు. ౧౩౮

ఆ॥ సారసాంచితప్రి♦చారము ల్గనివాని, మోరిల వెలయ వేమి♦మురువుఁ బాసి
యొదుగఁ బొఱ నమ్మ♦యూరమ్ము లిప్పుడు, తమకుఁ గాని కాల♦దశఁ దలంచి.

తే॥ శ్యామలసనము ల్బంధూక♦సప్తవర్ణ, కోవిదారము ల్పుష్పించెఁ♦గొండచఱుల
నటు నదీపులినమ్ములు♦నందగించె, హంససారసచక్రాహ్వ♦యప్రసక్తి. ౧౪౦

క॥ గజిబిజిగాఁ జెలరేఁగుచు, విజిగీషులు నృపులు దండు ♦ వెడలుదు రిపు డ
ర్కజుఁ డిట రాఁ డెటు లేదో, విజయోద్యోగమున మెలఁగు ♦ విధి తన కింకన్.

తే॥ ఎంత కనికర మెడలెనేఁ ♦ డీకపిపతి
మద్యపానాభిరతి స్త్రీల ♦ మమతఁ జిక్కి
మఱచెఁ గాఁ బోలుఁ దా మున్ను ♦ మంతినమునఁ
జేసిన ప్రతిజ్ఞఁ గాకున్నఁ ♦ జేరకున్నె. ౧౪౨

ఆ॥ చక్రివాకి వోలెఁ ♦ జనుదెంచె దండకా, రణ్యమునకుఁ బాయ ♦ రాని చెలిమి
నుపవనమున కట్టు♦లువిద యేమయ్యెనో, నన్ను వీఁడి యొంటి♦నవసి యిపుడు.

ఉ॥ రావణమిత్రుఁ డైన కపి♦రాజు నిజాంగనఁ గొంచుఁ దోలఁ దా
నేవిధిఁ బాటులం బడెనొ ♦ యింత దలంపఁడు కావరంబునన్
నావగ లెన్నకే సుఖము ♦ నంబడి తేలెడు నింక వానికిం
గావలెనొక్క మచ్ఛరము ♦ ఖప్రహితోత్తమలోకసౌఖ్యముల్. ౧౪౪

తే॥ అర్థులన నయి చనుదెంచి ♦ యన్యు వేఁడి
యతని కుపకృతిఁ దొలుదొల్త ♦ నాచరించి
యాసపడువారి వంచించు ♦ నధము లున్నఁ
బున్నె మని పాప మని యున్నె ♦ పుడమియందు. ౧౪౫

ఆ॥ ఏది యెట్లు లైన ♦ నీవె చాలవె స్వీయ, కార్యసాధనమునఁ ♦ గలదె చింత
యతని కెఱుక సేయు♦మయ్య కిష్కింధకుఁ, జని కృతఘ్నులకుఁ బో♦సంగుగతులు.

ఉ॥ రక్కసుచే హరింపఁబడి ♦ రాయిడిపా లయి యెక్కడిక్కునన్
జిక్కెఁ బ్రియాంగనామణి న ♦ శించెనొ నిల్చెనొ త్రోఁచ దిట్టు లీ
చక్కి మెలంగుచున్నయది ♦ సాధ్వి యటంచు వచించు వారు లే
రక్కట యింత ప్రొద్దుపడిన ♦ నప్పురిఁ గాల్పనె వైరిఁ గూల్పనే. ౧౪౮

— ♦ శ్రీరాముని పారవశ్యము ♦ —

ఆ॥ చంద్రవదన ! నినుఁ బ్ర ♦ సక్తి మైమును సుధ
గరుడుఁ డట్లు లోక ♦ గడియలోనె
యాహరింపలేన ♦ యరులఁ బోకార్చి త్వ
ద్గతియు నున్నచోటు ♦ గాననైన. ౧౪౯

క॥ ఎక్కటి దనుజాలయమునఁ, జిక్కి యసువు లెడలితో వి♦శీర్ణ వస్త్రా! యిం
కెక్కడిగతి నినుఁ గనుఁగొను, నక్కలిమికిఁ దగిన భాగ్య ♦ మను వైనదియే.

తే॥ చంద్రుడా ! పోయి జానకి ♦ చరణముల స్పృ
శించి తత్కరముల నన్నుఁ ♦ జెనయుఁ గనుము
భానుసంగతిఁ గన్న గా ♦ ర్భాగ్యమునను
యితఁడు ఖరకరుఁ డయ్యె నిం ♦ కేమి గలదు. ౧౫౦

క॥ అని జనకజావియోగం, బున వెతఁ బాటించి యుర్వీ ♦ భుఁడు తఱి గడవన్
దనకడ కినజుఁడు రామికిఁ, గనలుచు నిట్లనిన రోష ♦ కలితుం డగుచున్.

ఉ॥ కంటికి ఱెప్ప వోలె నిను ♦ కర్జము వెంట మెలంగువాఁడు వేఁ
గంటికి నీడు నిద్దపు మ ♦ గంటిమి గల్గిన త్రోఁడు తోడ న
మ్మంటికి మింటి కొక్కడుగ ♦ మార్కొనఁ జాలి శరాసనంబు న
క్కంటునఁ బూని వానరునిఁ ♦ గాల్తునొ యంచుఁ గడంగు నంతటన్. ౧౫౨

తే॥ అతని యుద్రేక మెంచి రా ♦ మావనీంద్రుఁ
డనియె నీబోంట్ల కగునె నా ♦ యన్న యుపకృ
తుండు ప్రియహితుఁ డవ్వానిఁ ♦ దొడరి యెగ్గు
గూర్చి చేచేత నపకీర్తిఁ ♦ జేర్చికొనుట. ౧౫౩

క॥ కావున సామోపహితం, బౌ వాగ్యోగమున నతని♦నలరించి తదీ
యావిలభావం బెడలఁగ, వేవే గొని తెమ్ము కడమ♦విధి కే నొదుగన్. ౧౫౪

క॥ కౌటిల్యంబునఁ గొండొక, కోటిం గానినేని నచటి♦కోవిదులకు న
మ్మాట తెఱఁగెఱుక సేసి వి, పాటితరిపువర్గ! రమ్ము♦ప్రథితి వెలయఁగన్.

క॥ అని యుపదేశించిన న, మ్మనుజేంద్రసుతుండు విభుని♦మతము తనశిర
మ్మున మోచికొని యనుజ్ఞం, గొని చనె నాతఁడును కదలి♦క్రోత్రుల పురికిన్.

తే॥ కారణాశ్రితజననుఁ డి♦క్ష్వాకుతిలకుఁ, డనుజుఁ బనిచి నిరాతంకుఁ ♦ డై తనర్చె
నిర్మలాత్ముల దెస నెప్పు♦నేటుకొనునె, కాలకర్మప్రసక్తర♦క్తత్వ మబల! ౧౫౭

ఆ॥ అతఁడు కర్మసాక్షి♦యచ్యుతుఁ డాయమ, యోగమాయ నిత్య♦యోగమహిత
మెట్లు వారిఁ గలఁచు♦నీయవిద్యాకృతి, సంన్నియోగకృతము♦సంసరణము. ౧౫౮

—♦ లక్ష్మణుఁడు మహావేగమునఁ గిష్కింధ కరిగి సుగ్రీవునకు రామాజ్ఞ నెఱిఁగించుట. ♦—

ఉ॥ శృంగముతోడి మందరము ♦ శ్రీధనురుద్యతహస్తుఁ డౌచు సా
రంగము లట్లు వ్యాళములు ♦ రాయిడి కోర్వక పాఱఁ జెట్లుఁ దూ
లంగ శిలోచ్చయంబు లుర ♦ లంగఁ బురాబ్ధిఁ గలంచు నోజ వె
ప్పంగఁ దనర్చె లక్ష్మణుఁ డ ♦ పారబలుండు మహారయంబునన్. ౧౫౯

మ॥ తివ్రరం జూచెడు రోషము న్దిగియుచు ♦ న్దేవేజ్యతుల్యుండు భ్రా
తృవచస్సంగతి బుద్ధి నేమఱక సం ♦ దేశోపదేశౌచితిం
గపియ న్నెక్కొనునంతమాత్రికె కపు ♦ ల్గర్వాంధులై శైలసా
*లవహాద్యత్నరులై యెదిర్చి రటుకే♦ల్కొంబాఱు చిత్తంబులన్ ౧౬౦

తే॥ ఎదిరి యుద్యమ మెంచి బ ♦ హ్వింధనుఁ డగు
జ్వలను గతి ద్విగుణంబు రో ♦ షంబు గాఁగ
నెగువఁ గని నివ్వారింప లే ♦ కింత నంతఁ
జనిరి తమపాలి మిత్తియో ♦ యనుచుఁ దెరలి. ౧౬౧

వ॥ కొంతవడికి నూహాసేసికొని. ౧౬౨

క॥ వా రరిగి పురద్వారముఁ, జేరంగా వచ్చె నలుకఁ ♦ జెలరేఁగి మహా
వీరుఁడు లక్ష్మణుఁ డిదె యని, తా రెఱిఁగించిరి ప్లవంగ♦తారాపతికిన్. ౧౬౩

తే॥ తారతో మంతనంబునఁ♦దవిలియున్న, పారవశ్యంబునను జొరఁ♦బాఱఁదయ్యె
వాని కావలు కట్టిఁ డా♦వల నెఱింగి, యంగదుం డప్పుడతివిహ్వ♦లాత్ముఁ డగుచు

క॥ ఆమెయిన చేరఁగాఁ జని, రామానుజు భవ్యచరణ♦రాజీవములం
దా మస్తకమ్ము మోవఁగ, నేమము తనరార మ్రొక్కి♦నిలువంబడినన్. ౧౬౪

తే॥ వత్స! నీ వేగి సౌమిత్రి ♦ వచ్చె ననుచుఁ
దండ్రి కెఱిఁగింపు మాసంధఁ ♦ దలఁచికొనఁగఁ
జగఁ బ్రబోధింపు మని యన్న ♦ తన్నుఁ బనిచె
నిది రుచించిన రమ్మను ♦ మెలమి గనుము. ౧౬౬

క॥ అని నెనరునఁ దనుఁ గని పలి, కిన లక్ష్మణు రోషకీలి♦కీలాస్ఫురితం
బున కలిమికిఁ దలఁకుచుఁ జని, పినతండ్రిం గాంచి తన్నుఁ♦బేర్కొనెఁ దోడ్తోన్.

తే॥ తల్లులకు మ్రొక్కి తనకు వం ♦ దన మొనర్చి
కర్జ మెఱిఁగించు తనయుని ♦ యార్జవమ్ము
గానఁగా నేరఁ డయ్యె న ♦ క్కపివరుండు
మదమదననిద్ర లటుః తన్ను ♦ మలఁచికొనఁగ. ౧౬౮

ఆ॥ అక్కుమారుతోడ ♦ నరుదెంచి నట్టి ప్ల, క్షుప్రభావు లనెడు ♦ సచివు లిరువు
రానసేయ నప్పు ♦ డఱచిరి కిలకిలా, ధ్వనులు మిన్నుముట్టఁ ♦ బ్లవగవరులు.

క॥ దానం బ్రబుద్ధు డగుచుం, దా సంగదువలనఁ గార్య ♦ తత్త్వ మెఱిఁగి సం
ధాన మొనరింపుఁడు సమా, ధాన మరసి మీర లని ప్ర ♦ ధానులతోడన్.

ఆ॥ పలికి మఱియు ననియెఁ ♦ బలుకగాని దోకండు
నొం డొనర్ప నెపఁద ♦ నూహసేయ
నెట్టు తెలిపిరో య ♦ నిష్టులు వార లి
ష్టేల కుపితు లైరొ ♦ యెఱుకపడదు. ౧౭౧

క॥ నెఱిఁ దప్పి నడువ హితు న, క్కఱ మఱవ నుదగ్రు లైనఁ ♦ గాని వెఱవ ని
న్నెఱపిందు లేల యలుకకు, గుఱిసేసిరొ త న్నటంచుఁ ♦ గుందెద మదిలోన్.

క॥ చెలికానిఁ బడయు టెంతయు, సులభం బగు వెక్కసంబు ♦ చొప్పడకుండం
గలకాల మరసికొనుటే, తలఁపం గష్టములలో మొ ♦ దలి దై యుండున్. ౧౭౩

ఆ॥ పచ్చ లోక్క తెరువు ♦ నెఱయపు చిత్తమ్ము
లెంతమాత్ర కైన ♦ నెడయుఁ బ్రీతి
యంతరంబు నెమక ♦ నై యుందు రరు లింత
యెఱిఁగి మైత్రికలిమి ♦ నెనయవలయు. ౧౭౪

క॥ అని యనిమిత్తత్రస్తుఁడ, నన నైతి మహాత్ముఁ డాతఁ ♦ డాధృతి నొనరిం
చిన యుపకృతి యింతింతని, యనరా దప్రతివిధేయ ♦ మై యుండుటచేన్. ౧౭౫

ఆ॥ అనుచు ననుశయమున♦నారాటపడెడు న, య్యినజుతోడ హనుమ♦యిట్టు లనియె
నబ్రమానె యనఘ!♦యంతటి యుపకారి, మహితుఁ డ్వాదృశుండు♦మఱవకుంట.

—♦ హనుమ సుగ్రీవునకు హితము తెలుపుట ♦—

సీ॥ ఈరేడు జగముల ♦ నేలంగ సురపతి, నెనయునో మిగులునో ♦ యనఁ దనర్చి
పెనఁకువ గని పెచ్చు♦పెరుగు బీరంబున, ముక్కంటి కనుచిచ్చు♦ముచ్చటించి
యార్తుల మనుపఁ దా ♦ నైన యాదరమున, హరివత్సలతతోడ ♦ నైక్య మొంది
వంగడం బొండె యా♦వాసియే యని పల్క, నెఱి హరిశ్చంద్రుని♦నేమ మెంచి

తన్నుఁ బోలంగ నొకఁ డెందుఁ ♦ దవులఁ డున్న
నన్న యంతటి తోఁడు తో ♦ డై పొసంగ
నింతవానిఁగ నినుఁ జేసెఁ ♦ బంత మలర
రాముఁ బొగడందరమె కపి ♦ రాజచంద్ర! ౧౭౧

ఆ॥ వేయు నేల రాము ♦ వెరవుతోఁ బరఁగు బీ
రమ్ము నెనయఁ బోల్ప ♦ నమరవరుఁడు
గురుఁడుఁ జాల రనఁగఁ ♦ గుంభినిలో లేఁడు
పురు డనంగఁ దగిన ♦ పుడమిఱేఁడు. ౧౭౨

ఆ॥ తడసి తిట్లు స్త్రీల ♦ తవులునఁ దవులు మ, త్తతను జేసి గడుపు ♦ దప్పకుండ
వారిఁ జేరి వాసి ♦ వలనొప్పఁ దత్కార్య, కలన మెలఁగు భాగ్య ♦ గతికిఁ బాసి.

ఆ॥ వానకారు గడపి ♦ వత్తు నంటి శరత్తు, ప్రౌఢ యయ్యె నింకఁ ♦ బ్రాప్తకాల
మరసి రాముఁ గొలువ♦నరుగ నైతి వనంగ, నెట్లు మెత్తు రయ్య!♦యెవ్వ రేని.

క॥ కరుణాకరుఁ డాతఁడు గా, న రుషాతత్పరుఁడు గాక♦నయమున నినుఁ దే
ర్ప రహిం దన తమ్ముని బని, చె రుమాధిప రాముఁ బోలు♦స్నిగ్ధుఁడు గలఁడే.

క॥ తరణిసుతా! వడఁకరె యా, సురాసురు ల్వింటి వంకఁ♦జూచిన రామే
శ్వరుఁ డరులకు సాధ్యుఁడె యొ, క్కరి సాయం బెనయఁ గోరఁ♦గా నగువాఁడే.

తే॥ నీయదృష్టంబుకతన న ♦ న్నెఱిఁ బొసంగె
మైత్రి సీతామహాలక్ష్మి క్షే ♦ మహిత యున్న
తల మెఱిఁగి తెల్పు పనికి నే ♦ స్తమునఁ బ్రీతిన
చఱచి యద్దెస మసలుట ♦ సంభవించె. ౧౭౩

శా॥ ఆర్తుండై నిజమిత్రుఁ డాసపడ న♦య్యర్థంబు చేకూర్చి త
జ్జార్తిం బాపుదు నంచుఁ గాల మొగుడవం♦జూడంగ నా చొప్పునన్

వర్తింపం గని యాతఁ డొండనిన న ♦ వ్వాక్కు న్సహింపంగ నోఁ
గీర్తిం గోరెడువాఁడు మేల్మి గని త ♦ త్కీర్తింప నౌ నంతట . ౧౮౪

ఉ॥ కావున నీవు ప్రమాదమునఁ ♦ గల్గిన యియ్యపరాధ మీఁగ న
ద్దేవు భజింపు మాఘనుఁడు ♦ ధృష్టుఁడు గాఁ డపకారదృష్టికిం
బోవఁడు తొల్త లక్ష్మణునిఁ ♦ బూజ్యుని సాంత్వన మొప్ప వేఁడుమా
సుగ్రీవ మెలంగ నౌ హితము ♦ శ్రీఁ గృతకృత్యుఁడ వౌదు వాదటన్. ౧౮౫

ఆ॥ నీదు మేలె కోరి ♦ నేఁ దెల్పినాఁడ ము
న్నటులె నోడువ నయ్యె ♦ నయ్య! యిపుడె
చనుము చనవు గొనుము ♦ సహపుత్త్రబంధుండ
వగుచుఁ బూజసేయు ♦ మధిప! యతని. ౧౮౬

తే॥ అనుడు నీ వంగదుండు ము ♦ న్నరిగి యతని
వలఁగొని ప్రవేశపెట్టుఁడు ♦ వల నెఱింగి
యే నెదుర్కొని పూజింతు ♦ నెలమిఁ గాంచి
కాక లజ్జింతుఁ దొలుదొల్తఁ ♦ గదియ ననిన. ౧౮౭

క॥ వల్లె యని యరిగి తోడ్కొని, బల్లిదుఁ డాతనికి రాజ♦పథమున వింతల్
దెల్లముగఁ దెలియఁజేయుచు, సల్లలితము నగరి గుఱినిఁ♦జనుదెంచు నెడన్. ౧౮౮

—♦ హనుమదంగదులు లక్ష్మణు నెదుర్కొని సుగ్రీవుని హజాగమునకుఁ జేర్చుట. ♦—

సీ॥ తులలేని రతనాలఁ♦దులకించు మించుల, హంగారు యాధవా♦యతనములను
సర్వకామఫలాను♦సంధాననిపుణవ, ర్ధిష్ణుతాంచితవనో♦ద్దేశములను
చందనాగురుఘన♦సారసౌరభయోగ, విస్తారచణపణ్య♦వీథికలను
మైరేయమాధ్వీక♦మాధురీవహ మద్య, కుల్యోపచితపాన♦గోష్ఠికలను
గాంచె సౌమిత్రి వారితోఁ♦గలసి మెలసి, తదుపపాదితతత్త్వ♦దప్రశంస
లాలకించుచు భర్తృశాసనో♦ద్యుక్తచిత్త, వర్తనత్వరమానుఁ డై♦వారిజాక్షి!

క॥ పరిస్పందనముఖపరిమళ, యుక్చతురవిలాసినీగృ♦హోపాచిరరసభృ
ద్వాక్చయతౌర్యత్రికగుణ, భాక్చిత్రితకలనలెఱుక♦పడె వాని కుమా. ౧౯౦

శా॥ ద్వారస్థుల్ దారు లున్నతాకృతు లవ ♦ త్రాసు ల్మహాద్వారు ల
న్వీరు న్బ్రాంజలులై నమస్కృతికృతి ♦ న్వీడ్కొల్పఁ గక్ష్యాంతర
శ్రీరమ్యాపణచిత్రకాననసర ♦ స్తీర్థాగ్ర్యహర్మ్యాదివి
స్తారోదారకలావిశేషముల చం ♦ దంబు ల్ప్రశంసింపుచున్. ౧౯౧

తే॥ శస్త్రపాణులు హరులు సం ♦ సక్తు లగుచు
గొలువ నొప్పారు నేడు ♦ కక్ష్యలఁ గ్రమించి
హైమరాజతమంచాస ♦ నాంచితంబు
రాజమందిర మెనసె న ♦ య్యాజిసుతుఁడు. ౧౯౨

క॥ స్ఫటికప్రాకారాంతర, ఘటితేంద్రవరోపలబ్ధ ♦ కమ్రఫలాంచ
ద్విటపికలనావిశేష, స్ఫుటసురసదనప్రకార ♦ శోభితమగుచున్. ౧౯౩

శా॥ కైలాసోపమనర్మహర్మ్యశిఖరా ♦ కాంతాభ్రమై వైజయం
తీలీలావినివర్తితారుణసము ♦ ద్వేగంబునై తోరణ
శ్రీలాలిత్యకృతేంద్రచాపకలనా ♦ చిత్రోపచిత్రంబునై
వేలాతీతగుణాభినాఁ దనరు న ♦ వ్వేశ్మోత్తమోత్తంసమున్. ౧౯౪

తే॥ చేరఁ జను నప్డె విన నయ్యె ♦ శ్రీపదములు
మధురమధురస్వరోద్గతి ♦ మంజిమములు
సురుచిరాంబరమాల్యసం ♦ శోభిరూప
యౌవనాఢ్యము యౌవతం ♦ బటఁ దనర్చె. ౧౯౫

తే॥ నూపురారవములు కింకి ♦ ణీపినద్ధ, కాంచికానినదమ్ములుఁ ♦ గదియవచ్చె
నంతలో విననయ్యె న ♦ భ్యంతరమున, నాంతరామర్ష మెసఁగ రా ♦ మానుజునకు.

క॥ లజ్జపడి ధాత్రినిర్వ్వే, దోజ్జృంభితచిత్తవివశ ♦ తోద్వృత్తుండై
సజ్జ మగు వింట నెఱపె ద్వి, షజ్జాలనిహంత యతఁడు ♦ జ్యాఘోషమ్మున్.

ఉ॥ ఆరవ మాలకించి భయ ♦ మంది తటాలున లేచి విన్ననై
నేరమి గల్గె నంగదుఁడు ♦ నేర్చి వచించిన యప్డె పోయి య
వ్వీరునిఁ దోడి తెచ్చి తగ ♦ వేఁడక పోయితి ధాత్రివత్సలుం
డీరస మెత్తి యేమనునొ ♦ యింతకు నంచుఁ దలంచి గ్రక్కునన్. ౧౯౮

క॥ అనుచరులం బూజార్థము, లను గొని చనుఁ డని యనిచి క ♦ లానిధి రవిజుం
డనితరసదృశం దార, న్గని పొ మ్మాఘునుని సాంత్వ ♦ నం బొనరింపన్. ౧౯౯

ఆ॥ అనిన వల్లె యనుచు ♦ నన్నాఁతి తరలె న
య్యధికృతులును మున్నె ♦ యరిగి తదుప
వేశనోపయుక్త ♦ విధి గూర్ప యువరాజు
మానుమఁ గూడి యచట ♦ నాత్మఁ డుండె. ౨౦౦

—♦ సుగ్రీవుని పనుపున తార క్రుద్ధుఁడైన లక్ష్మణుని భక్తిచేఁ బ్రసాదోన్ముఖుం జేయఁగడఁగుట ♦—

క॥ మధ్యద్వార మొనసి యును, మధ్య నిపుణ తార ప్రియుని ♦ మంత్రిత యై సా
మాధ్యానకలిత యగుచు, స్నిగ్ధ్యానాతిథ్యయోగ ♦ నిష్ఠిత యన్యోఁ. ౨౦౧

ఆ॥ తోట్రుపాటు నడక♦తో మదావిలదృష్టి, తోఁ బ్రలంబకాంచి♦తో స్మితాస్య
రక్తిమతోఁ దనర్చి లక్ష్మ♦లక్షిత యైన, యానతాంగి నాతఁ♦డట్టె చూచి.

క॥ ఆనతముఖుఁ డై యుండఁగ, నానెఱిఁ దా నెఱిఁగి తార ♦ యన మీ కగునే
యానమ్రుఁ డైన మిత్రుని, పై నలుగఁగ నేర మెంచు ♦ వల నేర్పడెనే. ౨౦౩

ఆ॥ తనదు చెలిమికాని♦వలని మే లరయంగ, వచ్చి యీర్ష్య నొంద♦వలసె నెట్లు
సఖ్య మనఁగ నెప్డు♦సమసుఖదుఃఖ మా, తెలివు సూపుఁ గాదె♦దివ్యమూర్తి!

ఆ॥ అనిన నాల్గు నెలల♦యాన త్రోడుగ మమ్ముఁ, ద్రోఁచి వచ్చి నట్టి♦దోరకు లేదె
యిపుడు నీవనంగ♦నిమ్మెయి నగు నీతి, పక్షపాత మొనసి♦పలుకనగునె. ౨౦౫

తే॥ ఏకసక్తుండ యై ధర్మ♦వెఱుకఁ బాసి, వాసి చెడి మద్యసేవ జీ♦వన మటంచు
నోలయునాతండు మహితార్థ♦యుక్తి కగునె, సఖ్య మని యున్న వానికి♦జగతిలోన.

క॥ కార్యరహస్యజ్ఞవు నీ, వార్యవ పో యాడి తిట్టి♦యనువున నది ని
ర్ధార్య మొనరింపు మీతని, చర్యకు మాచేయఁ దగు ప్రి♦చారం బెదియో.

వ॥ అని యివ్విధంబున. ౨౦౮

తే॥ అడరి సౌమిత్రి నొడివెడి ♦ నుడికి నడికి
తనరు ధర్మార్థసంహి ♦ తత్వమున కలరి
యుడుపతినిభాస్య తార యే ♦ ర్పడ వచించెఁ
జనవుమెయిఁ గార్యయోగప్రి ♦ సాధనముగ. ౨౦౯

సీ॥ అలుక మెమ్మెయిఁగాన♦నయ్యె నీ కాభంగిఁ, గామోపహతుఁ డయ్యెఁ♦గపివరుండు
సకలసౌఖ్యంబులు♦సంపత్తియును గల్గె, మీకృతంబున నేఁడు♦మిహిరజునకుఁ
బడరాని పాట్లెల్లఁ♦బడెఁ జిరకాల మ, ట్లగుట సౌఖ్యాప్తి కి♦ట్లలఁతిపడియె
మముఁ బాయనేరమి♦మనికి గైకొని యుంట, గడచె నొక్కించుక♦నుడికి గడువు

తపసు లేనియుఁ గృత్యము ♦ ల్తలఁపఁ బోరు
స్త్రీల వలనునఁ జిక్కిన ♦ చిత్తములను
గ్రోఁతి యావెంటఁ జన నోట ♦ కుచ్చితంబె
భక్త మన్నించి కర్జ మే ♦ ర్పఱుపఁ గనుము. ౨౧౦

తే॥ ఈవు గుణవృద్ధుఁడవు కిన్క ♦ నెనసెదే కు
మారనిభ! మారహతసత్త్వ ♦ మనుపవలదె
యర్థధర్మము లత్తి నేల ♦ యనియుఁ గాన
వచ్చునే ప్రాణికి రజఃప్ర ♦ వర్తనమున. ౨౧౧

చ॥ ఎఱుఁగుదుఁ గార్యభార మటు ♦ లీహరివీరుఁడు మత్ప్రసక్తిచేఁ
దఱి యొకయింత పోనడఁచి ♦ తాలిమి మేకొని యుంటయేని నే
నెఱుఁగుదు మీఁ సహించుటయు ♦ నిత్థచరిత్రుఁడు రామదేవు న
క్కఱ కని జీవిత మ్మొసఁగఁ ♦ గా నితఁ డెంచుటయుఙ్ శ్రితాదృతా! ౨౧౨

క॥ ఆయువు సౌఖ్యము సిరియుఙ్, మీ రొసఁగిన యవియ దీన ♦ మీరు గానినదో
యా యొక కీర్తియ కాన వి, ధేయు నలంపంగ దాని ♦ తెఱ వెడపడదే. ౨౧౩

తే॥ శాంతుఁడవు గమ్ము కపిరాజ ♦ శాసనమునఁ
గోట్లకొలఁదిగ వత్తురు ♦ క్రోఁతు లింత
నంత రక్కసిమూఁకల ♦ యడ రడంప
సంశయింపంగవలవ ది ♦ క్ష్వాకువంశ్య! ౨౧౪

తే॥ కోటిశతకోటికోటిర ♦ క్షోబలములు, గలుగువాఁ డసదృశుఁడు లం ♦ కావిభుండు
వాని నెదిరింప నొడ్లకు ♦ వశము గా ద, టంచుఁ దెలిపెను వాలి నే ♦ నడుగుటయును.

క॥ ఆతం డెఱుఁగు నతని నతఁ, డాతని నెఱుఁగు మును సీత ♦ హరియించె నన
న్నాతలఁపునఁ గల సందియుఁ, మాతఁడు వివరింపఁ దెలిసి ♦ యంటి గుణాఢ్యా!

క॥ నానాప్రదేశములఁ గల, సేనల రావింపఁ బనిచె ♦ సిద్ధార్థుండై
రానున్నవాఁడు హరిపతి, గాని మఱవఁబోఁడు కార్య ♦ గతిమహితాత్మా! ౨౧౭

క॥ ఈతఁడు వారలు నైనఙ్, సీతాసతి వార్తఁ దెలిసి ♦ చేర్పఁగ లంకం
బా తగలింపఁగఁ జాలుదు, రాతతబలుఁ డసుర దర్ప ♦ మడఁతు రధీశా! ౨౧౮

క॥ అద్దేవి రామచంద్రుసి, యొద్దను రోహిణియ పోలె ♦ నొలయంగల దీ
పొద్దు చన దనుజ కండలు, గ్రద్దలు కాకులు భుజించు ♦ గతి చొప్పడఁగఙ్.

ఆ॥ మాటగుఱికి నుంత ♦ మసలితి ననుచుఁ దో
నెనయరారు కపు లి ♦ దేమి యనుచుఁ
దలఁచుచున్నవాఁడు ♦ తా మున్నె నేఁడు లో
నొదిఁగినాఁడు నీదు ♦ యొజ కతఁడు. ౨౨౦

క॥ రావయ్యా రఘునందన!, సేవకజన మెనయు మేలి ♦ సిరి గనుమయ్యా!
నీవంటిదొరకు స్వీయుస, శీవర్గము నరయ నెరవు ♦ కృత్య మటయ్యా! ౨౨౧

ఆ॥ అని హరీంద్రు దార ♦ యాహ్వాన మొనరింప, లోని కరిగ సద్వి♦లోకనుం డ
తం డధీశునాన ♦ తవిలి ససంభ్రముఁ, జేయఁ గడవ రామి♦దో యజాక్షి!

—♦ కోపముతో లక్ష్మణుఁడు సుగ్రీవునిఁ జేరి రామశాసన మెఱిఁగించుట ♦—

సీ॥ పనిమెచ్చు గల క్రొళ్ళ ♦ పసిఁడిమంచముమీఁది, మెత్తని సెజ్జపై ♦ మేను సేర్చి
మణిభూషణద్యుతు ♦ ల్మలసి యొక్కటి మించు, దివ్యాకృతిస్ఫూర్తిఁ ♦ దేజరిల్లి
యందఱుఁ దారలే♦యనఁ గొమ ల్బలసి కొ, ల్వఁగఁ జందురుని లీలఁ♦బడయుఁజాలి
రుమ రాజ్యరమ నా ని ♦ రూఢానురాగగా, బాహోపగీరంభ ♦ పదవి నునిచి
యమ్మహేంద్రుఁ బోల ♦ నరిదుర్జయుఁడు విభ
వోజ్జ్వలుండు నగుచు ♦ నుష్ణకిరణు
వలని పుట్టు దలఁప ♦ వలసిన యట్లున్న
యాహరీంద్రుఁ జూచె ♦ నర్కకులుఁడు. ౨౩

ఆ॥ కనలు పెచ్చువెరుగఁ♦గనులఁ గెంపు దలిర్పఁ, గాలసర్ప మెదిరి♦గాసి పఱుప
నొడువు గోరి ప్రాంచు♦నోజ రోజుచు నుండె, నలసుమిత్ర నోము♦ఫల మపర్ణ!

క॥ భ్రాతృహితరతు నతనిఁ గని, యాతల్పము డిగ్గ నుఱికె ♦ నగచరపతి ని
ర్యాత లయి రట్లు యువతులుఁ, జేతోజాతాశుగముల♦చెలువునఁ జెలువా!

క॥ చేతులు పిసికికొనుచు నుప, యాతతఁ గనువానిఁ గాంచి ♦ యాతతరోషో
పేతుఁడు లక్ష్మణుఁ డాక్షణ, మాతంకం బెడలి పలికె ♦ నసదృశవిభవా! ౨౪

సీ॥ ప్రతిన వట్టితి గాదె ♦ ప్లవగమండలనాథ!, తలఁచెదే రామునే ♦ స్తంబు మదిని
నెడలెనే యెడ నుండి♦యింద్రసంభవశల్య, మమరునే సౌఖ్య మ♦త్యాయతముగ
రారాపు లేదుగా ♦ రాజ్యాంత్రములయం, దొదవదుగా భేద ♦ మువిదలందుఁ
జెల్లునే పానగో ♦ ష్ఠీప్రసంగము నిచ్చ, లాహారనిద్రలం ♦ దాస యున్నె
పలికి బొంకఁ డొకప్పుఁ జే♦పట్టి విడఁడు, నెనరునెఱిఁగలఁ డితఁ డన♦నెగడి యింద్రి
యముల గెలిచి విశుద్ధస♦త్త్వాభిజనత, నొప్పువాఁ డగు రా జన♦నుర్విలోన.

మ॥ ఘనకాలం బని యద్దు పెట్టుకొని ప్ర ♦ క్రంగామిను ల్గొల్వ నె
మ్మన ముప్పొంగఁ జెలంగు నీనుడి దెస ♦ న్మందూకపుంగొంతు పా
మని లో నెన్నఁగఁబోఁడు త్వత్సఖుఁడు గా ♦ ఢా నన్న నీయన్న చే
సిన త ప్పింతకు మిన్న యైనది యొకో ♦ చేచేతఁ జంపింపఁగన్. ౨౫

తే॥ అడరి యశ్వాన్నృతమున గ ♦ వాన్నృతమున
నూటి వేయింటి వరుసన ♦ గీటడంచుఁ

దన్నుఁ దనవారి నెల్లఁ ♦ దడవి చంపుఁ
బురుషుఁ డొకపూరుషాన్వితం ♦ బునకు మొనసి. ౨౨౯

ఆ॥ బ్రహ్మ దెలిపె మున్ను♦బ్రాహ్మణుఁ జంపిన, యేనిఁ గల్లు ద్రావ♦నేనిఁ జౌర్య
మొనరఁ జేసెనేని♦యును గల్లు నిష్కృతి, గతి కృతఘ్ను దెనకె♦కలుగ దనుచు.

ఆ॥ తిట్టనేల నిన్ను♦దీవింపనేల యి, ప్రేమి గడచె నింత♦మొదరు వడఁగ
వాలిఁ గెడపి నట్టి♦వరశర మున్నది, వానితోడి పొత్తు♦వలయునేని. ౨౩౧

చ॥ సమయ మెఱింగి రాజునికి ♦ చాలెను జాలెదయేని నింక నీ
సమయుట నెంచి యైనఁ జని ♦ సంయమివందితు రాము వేఁడి యా
యమ నెమకంగఁ దోడ్పడఁగ ♦ నయ్యెడు కర్జమున న్మెలంగు మి
ట్లమరిన కోర్కికై మసలు ♦ దా కనెదా పరలోకసౌఖ్యముల్. ౨౩౨

క॥ అని మోమోట మెడలి ప, ల్కిన సిగ్గున ముట్టమునిఁగి♦కిశవిభుం డే
మనియుం బలుకంజాలక, వినమ్రుఁడై యొండు కడను♦వీక్షించు నెడన్. ౨౩౩

ఆ॥ కోర్కు లెల్లఁ దీర్చు ♦ కొని వచ్చి యసువుల
నొసఁగ నైన నెంచి ♦ యున్నవాఁడు
గాని యసదు తలఁపు ♦ గాదంచుఁ గ్రమ్మఱఁ
దార దెలుపఁ దాల్మిఁ ♦ దవులకున్న. ౨౩౪

తే॥ మొనసి యిట్లనెఁ గరువలి ♦ ముద్దులాఁడు
నమ్మియుండిన బంటుపై ♦ నాకినియుట
తగునె సౌమిత్రి! యిట్టింటి ♦ తవులు వీఁడు
వల నరయ కింత తెగుఁబడ ♦ వాసి సెడదె.  ౨౩౫

—♦ హనుమంతుఁడు లక్ష్మణునితో సుగ్రీవుశక్తి నెఱుక సేయుట. ♦—

క॥ నీకన్నఁ బదిమడుఁగు లా, శ్రీకరు రఘురాము నెడఁదఁ ♦ జేర్చి ప్రపత్తిం
బ్రాఁకెడువాఁడ యీతని, బ్రాకృతునిఁగఁ జూడ వలను♦పడునె కుమారా!

తే॥ ప్రొద్దు తేజునఁ బుట్టువా♦పొరసినాడు, సకలశాస్త్రంబు లొక్కటఁ♦జదివినాడు
పలయు తీర్థంబు లెల్ల సే♦వించినాడు, మాఱులేనిఁ బీరము సిరి♦మలసినాడు.

క॥ అన్నకుఁ దనమెడఁ గలిగిన, యన్నెఱి నటు లోఁబడంగ♦నయ్యె వరమునం
దన్ను మిగిలెఁ గా కీతనిఁ, గన్నెత్తి కనంగ నొందు♦కలఁడె రఘువరా! ౨౩౬

క॥ పెక్కిడుములఁ బడి నేఁటికి, దక్కిన యిమ్మనికి సుఖము♦తవులున నగు నా
చొక్కున నించుక తడసెను, దక్కొరు లీతని వశిత్వ♦దశ కగువారే.

తే॥ కోటికోటులువాహినుల♦గూర్పఁ బనిచె, నేఁట రేపట వత్తురు♦నియతి వెలయ
నితని యానతిఁ గడచితా♦బ్రతుకఁ డొండు, వానరుల మంచుఁ బుట్టిన♦వారిలోన.

కం॥ రాఁడొడరి రిపుడె కపులి, మ్మేదిని వడకంగఁ దాల్మి ♦ మేకొని కను మా
మీఁదట నేమనియెదొయిఁకా, జోదు రఘూద్వహున కనిన ♦ సూక్తి మఱచునే.

తే॥ అనుచు విస్పష్టముగఁ బల్కు ♦ ననిలతనయు
మినుకు లాలించి వీడె సౌ ♦ మిత్రి యలుక
సుప్రసన్నుం డతనిఁ జూచు ♦ చూడ్కి నలుకఁ
బాసెఁ దడిపుట్టముం బోలె ♦ భానుజుండు. ౨౮౨

కం॥ గళమునఁ గల పూదండలు, పెళపెళ మని త్రోయఁ ద్రెంచి♦పృథుబలుఁ డంతన్
విలసన్ముఖుఁడై రామునిఁ, దలఁపున నిడి మ్రొక్కి పలికెఁ♦దగ లక్ష్మణుతోన్.

కం॥ తెలివి వెలయించు దేవుని, చెలిమి ఘటిల్లియును రిత్త ♦ సిరికై యిమ్మైఁ
గలవరము నొందు నాబోం, ట్లలఁతిపడరె యెందునేని ♦ నవశత కతనన్.

—♦ లక్ష్మణపరిబోధితుండై సుగ్రీవుఁడు రామకార్యము సాధింపఁబూనుట ♦—

సీ॥ అన్న! సౌమిత్రి! నీ ♦ యలఘూపదేశమ్మె, పాపె నావరణమ్ముఁ ♦ బట్టెడల్చి
మేకొంటిఁ దెలివిమై♦మే నింక రాముని, యదియ కా మెలఁగెద♦నహరహంబుఁ
దా విల్లు దాల్చిన♦ధర వడంకఁగ నెంత, లేదు చెల్లింతవాఁ♦డింద్రజుండు
భువనాధినాయకు♦పొందు చేకూరంగఁ, గీరితి సిరి నన్నుఁ♦గోరు టరుదె

యమ్మహాత్ముని సేవ సే ♦ యంగ నయ్యెఁ
గలుగు బల్గములతోడ ని ♦ క్కలిమితోడఁ
గాక యాతండు కనువిచ్చి ♦ కాంచి నంత
నసురమండలి యవశీర్ణ ♦ మై పొలియదె. ౨౮౫

కం॥ అనుయాత్రం బొనరించెద, దనుజుల మర్దింప నరుగు ♦ దైవలలామం
బున కే నిదె యనుజీవులు, మునుకొనిచను దేర నాదు ♦ ముచ్చట దీఱన్.

ఉ॥ నేర మొకింత గల్గినను ♦ నేర్చిన నేరక యున్న నెట్టనన్
శ్రీరఘునాథరత్న మటు ♦ చిన్నవిభుండవు నీవునుండ నా
గోరము లెల్లఁ బాపుచు వి ♦ కుంఠతఁ గూర్పఁ దలంపరే నను
స్కారమె చాలు దాసు డెనఁ ♦ గల్గిన తప్పెడలించు నయ్యెడన్. ౨౮౭

కం॥ అని పలికిన నరుసము స్మిత, మును మునుకొని నెనరుతోడ ♦ ముప్పిరిగొని చూ
డ్కిని భరసి మెఱయ నిట్లను, ఘనుఁ డాసౌమిత్రి మేన ♦ కాగర్భమణీ!

—♦కోప ముడిగి లక్ష్మణుఁడు రామకార్యప్రవర్తకుఁ డైన సుగ్రీవు మెచ్చుట ♦—

సీ॥ నాసోదరుండు స ♦ నాథుఁ డయ్యెను నేఁడు, వానరనాథ! నీ ♦ వలనికూర్మి
సద్గుణౌఘమ్ములు ♦ సంశ్రయించెను మున్నె, వినయమ్ము తోడుగా ♦ వెదకి నిన్నుఁ
గాకున్న వలచునే ♦ కల్యాణి కపిరాజ్య. లక్ష్మి తానై సోప ♦ లాలనముగఁ
ద్వత్సహాయంబునఁ ♦ దడవి రాక్షసకుల, మడఁగింతు మిఁక సంది ♦ యమ్ము లేదు
ధర్మము గృతంబు నెఱిఁగి య♦ర్థమునఁ దలఁక
కుండు నీ విట్లు నొడువంగ ♦ నొప్పుఁ గాదె
చెలిమి కిరువుర నేర్చి కూ ♦ ర్చిన విరించిఁ
బ్రొద్దు గలయంతవట్టునుఁ ♦ బొగడవలదె. ౨౮౯

క॥ ఓపి యిటు లనఁగ నెవ్వం, డోపును రామునకు నీకు ♦ నొప్పున కాకి
శ్లేషపట్ల క్షమకు శాంతికిఁ, గాఁపుర మిచ్చో టనంగఁ ♦ గాదనఁ దరమే. ౨౯౦

తే॥ మఱచి నొడివితి నానుడి ♦ మఱువు మన్న!
యన్న దశ లెంచి వ్యగ్రుఁడ ♦ నైతి నన్న!
యమ్మహాత్ముని సేవింప ♦ నరుగుదాంటె
నేర్పుమెయి యత్న మిపుడె పొ♦నర్పు మన్న! ౨౯౧

క॥ అని యనుశయమున రాముని, యనుజన్ముఁడు నొడువ రవిజుఁ♦డనుమోదముతో
ననుసంగత మా ధృతి మతి, ననుమానము వీడి పలికె ♦ ననుమనిత్రోడన్.

—♦ సుగ్రీవుఁడు సీతాన్వేషణమునకై హనుమంతునిసలన వానరుల రప్పించుట. ♦—

తే॥ గాలి మనసును మీఱిన ♦ గతిఁ గ్రమించు
వారిఁ బనుపుము త్రొల్లింటి ♦ హారి పోక
తెఱఁగు లారసి తత్తత్ప్ర ♦ దేశగతులఁ
గపులఁ ద్వర పెట్టి తఱుమ సం ♦ గరము నెఱయ. ౨౯౩

ఆ॥ ఇచ్చ వచ్చి నట్టు♦లిడుము వారికిఁ బారి, తోషికములఁ దుష్టి♦తోఁ దనర్చి
నేఁడె వార్తఁ దెచ్చు♦ నెఱయ కల్గిన రాజ, గౌరవంబు లెల్లఁ♦గాంతు రనుము.

ఆ॥ కుంకు మెట్టు పొడువు♦గుబ్బలి తఱిగట్టు, గుండ్లఱేఁడు పసిఁడి♦కొండ వెండి
తిప్ప మున్నుగలుగు♦తీరొందు చోటుల, నెఱయు కపిబలముల♦ నెమకవలయు.

క॥ పదిదినములలో నెవ రి, య్యదనునఁ దోతెంచువారి♦నందఁగలియరో
విదితు లయి వారు శ్రుతి కను, పదమే జముప్రోలి కనుపఁ♦బడువా రనుమీ.

క॥ అని పతి శాసించిన విని, హనుమంతుడు సంతసము దానుక♦నవిచి ననుచు భ
క్తిని దనరి తగిన చారుల, ననుపమ వేగమున వార♦లరిగిరి గిరిజా. ౨౫౭

—♦ ఎల్లవానరులు రామకార్యార్థమై కిష్కింధ కేతెంచుట. ♦—

తే॥ ఎదురుపడువారిఁ బొం డంచు ♦ నింతలంత
ఉన్నవారినిఁ దఱుముచు ♦ నున్నచోట్ల
నున్నవారల నఱుముచు ♦ నూహ సేయు
నంతలోఁ గనఁగాంచి రా ♦ శాంతములను. ౨౫౯

ఆ॥ అంజనాస్తరాజ♦తాదుల్రిల హిమగిరి, వింజముమునను నుండు♦వీరవరులు
మూఁడు పదియు కోట్లు♦ముక్కోటి శతకోటి, వేయుకోటి కోట్లు♦వెడలి రపుడు.

క॥ క్షీరోదధి వేలాగతు, లారూఢత వెడలి వచ్చి♦రందఱు కపులున్
వారిని లెక్కించెదు పని, వారిజభవుఁ డెఱుఁగు నేమొ♦వారిజనయనా! ౨౬౦

ఉ॥ మున్ను హిమాద్రి నైశ్వర మ ♦ మోఘము జన్నము వేల్పులుబ్బఁగా
నన్న పురాసు లాకసము ♦ నంటెను దద్రిసంభవంబులై
యున్నవి రస్యమూలఫల ♦ ముత్తము లా తగువు ల్మహౌషధుల్
దిన్నను మాసతృప్తి నెటి ♦ దీప్తి నొసంగఁగ నా గుణాంచితిన్. ౨౬౧

క॥ త్వరపెట్టఁ జనిన చరు ల, గ్గిరిఫలమూలములఁ గొంచు♦గిరికొని రా నై
రరిభంజను లెల్లదెస, ల్పరికించి యమోఘకార్య♦పరులై యొప్పన్. ౨౬౩

ఆ॥ ఎల్లచోట్లనుండి♦యేతెంచి రిదె నీదు, శాసనంబు మిత్తి♦శాసనంబ
కాదె యొండు గడవఁ♦గాఁ గలఁడే యంచు, మ్రొక్కి కొన్క లిడిరి♦మోదమలర.

ఉ॥ వారి బహూకరించి కపి ♦ వల్లభుఁ డంపి నిరస్తతంద్రుఁడై
పారముఁ గంటి సంసృతికిఁ ♦ బాత్రుఁడ నైతిని రామదేవునిం
జేరి నమస్కరింప ధృతి ♦ సేకొని తత్కలన న్మెలంగ నే
వారును రారు నాకు సరి ♦ వా రని యిమ్మహనీయసంపదన్. ౨౬౫

క॥ అని యుబ్బుచు లక్ష్మణుఁ గను, గొని తెలిపి న నన్న! యింకఁ♦గోసలనాథుం
గనఁ బోవుద మన మే లని, యనుచరులం బిలిచి యాన♦మానతి సేయన్.

ఆ॥ మించు లోకటఁ గదిసి ♦ మిఱుమిట్లు గొను నట్లు
రత్నకాంతు లెడలు ♦ గర్విమ్మి మెఱయఁ
బుష్పకం బొకండు ♦ పూన్కిమైఁ గొని తెచ్చి
యుబ్బ మీఱ శౌర్రిల ♦ నునుచుటయును. ౨౬౭

—♦ లక్ష్మణునిఁ బుష్పకముపై నెక్కించుకొని సుగ్రీవుఁడు సపరివారుఁడై రాముని జేరుట. ♦—

ఆ॥ అంతిపురి జనమ్ము ♦ నామంత్రిణము సేసి
యేగుదెంచి కాంచి ♦ యెలమి మించి
యన్న! రఘుకుమార! ♦ యధిరోహణముఁ గూర్పు
మన్న నాతఁ డలరి ♦ యటు లొనర్ప. ౨౬౯

సీ॥ నిండు వెన్నెల గాయు♦ నెఱికిఁ జాలిన మేలి, శ్వేతాతపత్రంబు♦ చెలువు మిగుల
పింజామరల పేరి♦ వెరవున నిరువంక, లెనసి యశఃపూర♦ మేగుదేర
శస్త్రపాణులు హారి♦శతములు తనుఁజుట్టి, యలఘుప్రతాప మి♦య్యది యనంగ
శంఖభేరీముఖ♦స్వనములు చెలరేఁగి, యాశాకరుల గుండె♦లవియఁజేయఁ
బాయఁజాలమిఁ దోడ్తోన♦పరఁగినట్టి, రాజ్యలక్ష్మి విలాసస్ఫు♦రణలు సూప
మొనసి లక్ష్మణుతో యాన♦మునఁ దనర్చి, రాముఁ గనవచ్చె రవిజుఁ డ♦రాళకేశి!

క॥ ఇనజుఁడా యినుఁడో యీతం, డను వివరము దెలియనీని♦యాస్ఫురితంబుల్
కనువారి కనులు గప్పఁగ, ననితరసామాన్యలీల♦నతఁ డేతెంచెన్. ౨౭౦

ఆ॥ ఆనఁ గదిసి తఱుమ♦న్నైన యాత్వరతోనె. వానరౌఘ మపుడె♦వచ్చి చేరెఁ
దోన గంగ మొనయఁ♦దోతెంచు నల భగీ, రథునిఁ బోల్ప ననిచె♦రవిసుతుండు.

తే॥ తేరు డిగి వచ్చి రామునిఁ♦జేరఁ గదిసి, పాదముల పట్టున సుమిత్ర♦పట్టితోడ
వ్రాలి మ్రొక్క నతఁడు వారి♦లీలఁదివిచి, యెత్తి కూర్చుండ నియమించె♦నింతనంత.

క॥ స్ఫుటపంకజ మగు మానస, తటాక మన మొనయఁ బాఱు♦తత్సైన్యంబున్
బటుసారబలు నతనిఁ గని, విటపిచరాధిపునితోడ♦విభుఁ డిట్లనియెన్. ౨౭౩

—♦ శ్రీరాముఁడు సుగ్రీవునకు సుహృద్ధర్మ మెఱిఁగించుట. ♦—

తే॥ ధర్మ మర్థము కామంబుఁ ♦ దఱి భుజించు
నతఁడె ధన్యాత్ముఁ డవి వీడి ♦ యర్థిఁ గామ
మొకఁడె కొనువాఁడు చెట్టుపై ♦ నుండి నిద్ర
సేసి పడువాఁ డనం దగుఁ ♦ జెలిమికాఁడ! ౨౭౪

ఆ॥ మిత్రసంగ్రహం బ♦మిత్రదూషణమును, జేయనేర్చు నతని♦సిరి భజించు
వాఁడు ధర్మయుక్తి♦వఱలి సువర్గంబుఁ, గాంచ నర్హుఁ డగును♦గంజహితజ. ౨౭౫

—♦ సుగ్రీవుఁడు శ్రీరామచంద్రునకు తన కృతజ్ఞత నెఱిఁగించుట.♦—

క॥ తఱి నరుదెంచితి నాయ, క్కటఁ దీర్పఁగ నిన్నుఁబోలఁ♦గలఁ డెవ్వఁ డన
న్నెఱి గాంచి హరీంద్రుఁడు ధృతి, వఱలఁగ నిట్లనె సురేంద్ర♦వందితచరణా!

తే॥ పరఁగ స్థితి కీర్తియును గపి♦ప్రాజ్యరాజ్య, రమయుఁ గడఁగి భవత్ప్రసా♦దమునఁ జేసి
యే నవియు గొని సేవించు♦చున్నయజ్ఞ, హవ్య మిందుఁ బ్రీణఁ గొనఁ గడు♦నట్లు గాదె.

క॥ ఉదరంభరి గాఁడే మే, లొదవించిన ఘనుని కర్జ ♦ మూహింపక సం
పద వలనె చూచికొనన, కృతఘ్నుఁడే నినిన గృధ్ర♦కాకియుఁ దినునే. ౨౮

సీ॥ వచ్చుచున్నారదె ♦ వానరవీరులు, నేల యీనిన భంగి ♦ నింగిముట్టి
గంతులు వైచుచు ♦ ఘనకాయబలసత్త్వ, లఱిమి యెద రెంతకు ♦ నైనఁ జాలి
కోటికోటులు శత ♦ కోటికోటులు నసం, ఖ్యాతులు ననఁగ ని ♦ ఖ్యాతు లైన
వారు గంధర్వదే ♦ వప్రసూతులు దశ, శతసహస్రాయుతా ♦ సంఖ్యహస్తి
శక్తియుక్తు లరుణ ♦ శ్యామ వర్ణవర్ణ
రాసితాంగు లుదయ ♦ మస్త మను న
గములు కులధరములు ♦ హిమహేమగిరులు ము
న్నలుగు నెలవులందు ♦ నిలుతు రధిప ! ౨౯

తే॥ ఉన్నవారును నింక రా ♦ నున్నవారు, నెన్నఁబోరు పగుల రుద్రుఁ ♦ డన్నఁ బోరు
మున్నె విడలేరు సరిబంటు♦మన్నె లేరు, కొన్ని పనినారు నినుఁ గొల్వఁ♦బన్నివారు.

వ॥ అని యిట్లు భానుసూనుండు రవికులకల్పప్రసూనంబునకు విన్నవించు నత్తఱి నల్లనం బొడకట్టిన కెంధూళి పెను పొంది యెల్ల దిగంతరము లావరింపుచు నెగసి యాకాశంబు నిరవకాశంబు గావింప సశైలవనస్థల యగు నచల సంచలింప నుష్ణాంశుప్రభల నిగుడనీయక యునికి నెల్లెడ రజస్తమఃప్రభావంబె భావాతీతం బై యావిర్భవించెను తెఱంగు దోఁప సాగరంబులం బొడమి యాశుగప్రేరణంబున నదీకందరంబులం బ్రవేశించి యచ్చోటులం బెరిగిన యదభ్రంబగు శబ్దం బభ్రతలంబు శబ్దైకగుణవిభ్రాణం బనిపింప నిలింపులు గుంపులుగొని విమానంబు లెక్కి కనవచ్చు సంపద పొంపిరివోవుటకుఁ దార్కాణగా నాసీరసీమం దోఁచి యేచిన మహాతేజంబు స్వారాజకీర్తిం బెరసి నెమ్మొలయనూనచ్ఛాయలకుం దోడు నీడ లగు భూషణద్యుతులతో నైక్యం బంది బ్రహ్మాండకర్పరం బండఁగొని వింతమండలంబుల సృజియింప నిం పలరారు కౌతుకంబులకు సహజాతంబు లగు సముత్సాహంబులతో నేత్రపు తెఱ వెడలి వచ్చిన యద్భుతనాటకపాత్రలవిధం బున సవిధంబునకుఁ జనుదెంచు దండనాథుల వెనుద్రొక్కి పఱతెంచి నలుదెసలు గ్రమ్ము నయ్యపారవానరసేనావార పారావారంబు చక్కిఁ గవ్వారు చక్కఁ గనుంగొనుచుండ నాదేయులుఁ బార్వతీయులు సాముద్రిలు వనచారులు ననం బరఁగు నవ్వనచరులు దరుణారుణారుణాంగులును శశివిశదులునుఁ బద్మకేసర

సవర్ణులును గాలాంజనాకారులును ధూమ్రాకృతులును గర్బురచ్ఛాయాంచితులును సింహాసంహననసముద్ద్యోతులును నై యొప్పారుచుండి రందుం బదివేలకోట్ల బలగంబులతో శతవలియు దశసాహస్రకోటిసంఖ్యా వదనన్యసామాన్యజన్యసైన్యంబులతోఁ దారాజనకుఁ డగు సుషేణుండును సహస్రకోటి మహావీరులతో హరీశ్వరశ్వాశురుండును ననేకకోటిసహస్రానీకంబులతోఁ గేసరియును నేకకోటిసహస్రబలవర్గంబులతో నసదృక్షుం డగు గవాక్షుండును రెండుకోట్ల యెలుంగుసేనుంగులతో ధూమ్రుండును గొండలంబోని మూఁడు కోటులు దండిమగలంగొని పనసుండును బదికోటులు ప్రబలదళంబులతో లీలావానరఖేలుం డగు నీలుండును నేనుకోట్ల ఘనయోధులతో గవయుండును కోటిసహస్రవలీముఖసేనాముఖసమ్ముఖుండై దరీముఖుండును గోటికోటిసహస్రవీరపరివృతు లై మైందద్వివిదులును మూఁడుకోట్ల శాఖామృగమత్తగజంబులతో గజుండును గోటీదశకాచ్ఛభల్లమల్లసంఘంబులతో మహాబలవంతుం డగు జాంబవంతుండును నూరుకోట్ల శూరవరేణ్యులతో రుమణ్వంతుండును శతసహస్రకోటి కపికోటిపరివృతుం డై బలసూదననిభుం డగు గంధమాదనుండును శంకుశతంబుఁ బద్మసహస్రంబు నప్రమేయ బలంబునగుబల పరివర్గంబుతోఁ గుమారరా జగు సంగదుండును నేనుహరివీరకోటులతోఁ దారుండును బదునొకండుకోట్లు గొమ్మమెకమ్ములతో ననూనుం డగు నింద్రజానుండును శతసహస్రాయుత సంఖ్యాకసైన్య సంరంభజృంభితుం డై రంభుండునుఁ గోటిద వ్యయామేయబలబలనిచయసముపేతుం డై దుర్నిరీక్ష్యముఖుం డగు దుర్ముఖుండును కామవైరిశిఖరిశిఖరాకారు లుద్దామవిక్రమసారు లతిఘోరులు నగు వానరవీరులు కోటిసహస్రంబులు బలసి కొలువఁ బ్రజ్ఞావంతుం డగు హనూమంతుండును శతసహస్రకోటీశతసంఖ్యాకసేనాకలితుం డై యనలసన్నిభుం డగు నలుండును బదికోటులుచ్ఛటకపిభటులు చుట్టిరా గాజమాతులుం డతులుండు విలసన్ముఖకమలుండు నగు దధిముఖుండును శరభుండును గుముదుండును వహ్నియు రంహుండును వినతుండును మున్నగు యూథాధినాథు లసంఖ్యాతహరివాహినులతోడం దోతెంచి యుగాంతవేలాతివేలాభీల జలార్ణవస్వరూపంబు నిరూపించుచుండి రయ్యవసరంబున. ౨౮౧

లయగ్రాహి.

ఒండొరుల గెంటుచునఖండరభసంబెసఁగ, మెండుకొనివృక్షములగండశిలలంద్రో
యుం డలరు నవ్వనికిరం డెలయు నియ్యల ని, లుం డొలసి యానతిఁ గొనుం

[డొకఁడుమాత్రి

గండడంతు మింక దను♦జుం డెదిరెనేని బల, మండ సెడిపాటి నొడ♦యండెడద మెచ్చక్
ఖండు వది జానకిఁ గ♦నుం డధిపుఁ జేర్ప మొన, యుం డవల మేకొనుఁడు♦నిండు
[మది నుండక్. ౨౧౨

కం॥ అని గంతులు వైచుచు ను, బ్బునఁ బాడలుచు రామదేవుఁ♦బొగడుచుఁ దత్కీ
ర్తినిఁ గీర్తించుచు నప్పా, వను లగచరు లొప్పి గచల♦వంశాభరణా! ౨౧౩

సీ॥ రవిజుండు మ మ్మేలు♦రా జయ్యెఁ దొలిపుట్టు, పు న్నెంబిపో యని♦ మెన్నువారు
శ్రీరాము సేవించు♦సిరి మాకుఁ గలుగ న, య్యసుర యంత లొనర్చె♦న నడువారు
నెంతచక్కని దారి♦లీయన్న దమ్ములు, నోగులువారే యంచు♦నొడువువారు
జాల మింకేల ప్ర♦స్థానముహూర్తంబు, నేఁడె కా యని హా యు♦నెఱయువారు
నగము లగలింతుమో దిక్కు ♦ లప్పళింతు
మో బయలు మింగుదుమొ యా న ♦ ముద్రములఁ గ
లంచి వైతుమొ యేది మా ♦ లా వెఱింగి
చెప్పఁ గలయది యండ్రు వి ♦ శేషవిదుషి! ౨౧౪

ఉ॥ ఆర్పులు నింగి ముట్ట రయ ♦ మంతకు నంతగ దర్ప మొప్పఁగా
నేర్పులు మీఱ సంతసము ♦ నెక్కొన నుత్సహనం బెలర్ప నా
త్మార్పణముం బొనర్చితిమి ♦ హాయిగ రాముని కింకఁ బోరిలో
నూర్పులు వుత్తు రెట్టు లరి ♦ యోధు లటందురు వారు శ్రీమతీ! ౨౧౫

శా॥ లీలావానరమూర్తు లాఘనులు లే ♦ లెం డంచు నా యోధనో
ద్వేలౌత్సుక్యము నం దనర్చి దొరకు ♦ న్వేవే నమస్కారముల్
వాలాయమ్ము పొనర్చి నిల్వఁ బనిచె ♦ న్వాఁ డెల్లయూథంబులన్
వీ లొప్ప న్విడియింపఁ దత్పతుల ను ♦ ర్వీభృత్కులోత్తంసమా! ౨౧౬

ఆ॥ రాముఁ జేరి ప్లవగ ♦ రాజు రానగువారు, వచ్చినారు మిమ్ము♦నచ్చినారు
స్వార్థ మైనఁ బ్రాణ♦మైన మీయవె యంచుఁ, దలఁచినారు వేఱు♦దారిఁ బోరు.

మ॥ బలసంపన్నులు కామరూపులు జగ ♦ త్ప్రఖ్యాతు లాశాంతము
ల్గలయం ద్రొక్కుడు రొక్కమాత్ర రిపులం ♦ గాఱెంతుర్ సేవింతుర్ ప
ద్దలఁ దా రింతుల నొడ్లఁ దల్లులుగ స ♦ ద్భావంబునం గాంతు రే
మలక ల్గాంచఁగఁబోరు వీరు బహుసం ♦ మాను ల్నరేంద్రాగ్రిణీ! ౨౧౭

కం॥ జితకాశు లసంకాశులు, తతప్రకాశులు వనాద్రి♦తలవిని వేశుల్
స్మృతసకలాశు లనాశులు, కృతి కగుదురు నీకు నిట్టి♦కీశు లధీశా! ౨౧౮

క॥ నీయాన నిన్నుఁ గొలుతురు, నాయానకు నిందఱును వి♦నమ్రులు గాను మ
య్యా! యానయమున భక్తవి, ధేయా! నను నమ్మి పిరి♦ధృతిఁ గనుమయ్యా!

క॥ ఏకాంతభక్తు లిందఱు, నీకై చేసాచినారు♦నెఱిఁ గాంచి కృపన్
గైకొను మన రాముఁడు ముద, మాకృతిఁ గొని ననఁగఁ దనరి♦యాకృతి కనియెన్

—♦ సుగ్రీవుఁడు రాముని మన్ననవడసి సీతాదేవిని వెదకుటకై కపివీరులను బనుచుట. ♦—

తే॥ అమ్మహేంద్రుండు వర్షించె ♦ ననఁ బ్రకాశ
మొసఁగె రవి యన నాహ్లాద ♦ మొనరఁ గూర్చెఁ
జంద్రుఁ డన గంధవహుఁడు ని ♦ స్తంద్రుఁ డగుచు
వీఁచె నన నబ్బురంబె వి ♦ వేకమహిత! ౨౯౨

ఆ॥ ఆత్మనాశనమున♦కసుర యమ్మెయి కృత్య, మాచరించెఁ గాక♦యనఘ! నీదు
సాయ మిట్టు లొదవ♦సమయింపనే వానిఁ, బట్టి యొక్క మాత్ర♦బలముతోడ.

క॥ రా ర మ్మిట్టు లిది గైకొను, మే రింక స్నేహ సాటి♦యిలలో ననుచున్
జేరం దివిచి హరీంద్రుని, గారవ మొప్పారఁ దనదు♦కౌఁగిటఁ జేర్చెన్. ౨౯౪

శా॥ ఆనందాశ్రుపరీతనేత్రుఁ డయి నె ♦ య్యంబార నర్కాత్మజుం
డే నీబంటున కాదె యింతవలెనే ♦ యీవృత్తికే సుప్రస
న్నా! నానేరము లెన్న కీ విటు లన ♦ న్నాకల్మియే కల్మి గా
దే నిత్యాభ్యుదయంబె కంటెఁ గొఱ లిం♦కేనాఁటికిం గల్గునే. ౨౯౫

క॥ ఈమన్ననయే చాలును, రామా! కృతి కాన యిడుము♦రభస మొసఁగ నే
మామెయి మెలఁగెద మింకిట, నామయ మని లేదు తథ్య♦మా నుడి యనినన్.

ఆ॥ పోలునటు లొనర్పు ♦ పొమ్ము నీ కేఁ దెల్ప
వలెనె తొలుత సీత ♦ వార్తఁ దెలిసి
యవలఁ గర్జ మొనర ♦ నగు తెఱఁ గూహించు
వార మనఁగఁ బొంగి ♦ వల నెఱింగి. ౨౯౭

—♦ వినతాదులఁ దూర్పున కనుచుట ♦—

క॥ వినతుఁ డను సైన్యనాథుని, వినతుని గిరినిభు నతారి ♦ వీరుని రా ర
మ్మని తరణిజుఁడు పిలిచి య, య్యనితరసామాన్యుతోడ ♦ నప్పు డిట్లనియెన్.

తే॥ సోమసూర్యాత్మజులు మహా ♦ శూరు లైన
కపివరేణ్యులు తోడుగాఁ ♦ గదలి చనుము

తూర్పుదెస కార్య మొకంగఁ ♦ దొలుత నీవు
పదులు వేనూర్లు బలములు ♦ బలసి కొలువ. ౨౯౯

క॥ ఎం దున్నయదియొ జానకి, యెం దాదుర్ణయుఁడు సాధ్వి ♦ నెమ్మెయి నిడెనో
ముం దరసి వార్తఁ దెలిపెడు, పొందిక నీయది యటంచుఁ ♦ బొమ్మనఁ గంటిన్.

చ॥ గిరివనదుర్గభూములఁ బ్రి ♦ కృష్ణనదీనదసత్సరోంబు ని
ర్ఝరతటకందరంబులను ♦ జాహ్నవి కౌశికి భానుజాత యా
సరయువు గల్గు చోటులను ♦ సన్నుత భూసుత నుంచెనేని నా
సరణి నెఱింగి రావలయుఁ ♦ జయ్యన మీ రనిలప్రచారు లై. 30౧

క॥ గిరి యామున మను దానిన్, సరస్వతిని శోణసింధు ♦ సంజ్ఞనదములన్
సరవిఁ గని కాలమహి న, వ్వరుస నచలకాననాఢ్య ♦ వలయు నరయఁగన్.

వ॥ మఱియును బ్రహ్మమాలవిదేహమాళవ కాశీకోసలమాగధ మహాగ్రామపుండ్ర వంగాదిదేశంబులును గోశకారపురంబును రజతాకరభూమియు సముద్రావగాఢంబు లైన పట్టణంబులును బరికించి యవ్వలనికిం జని యాయతంబయిన మందరకోటి నాశ్రయించి యున్న కర్ణప్రావరణులును నోష్ఠకర్ణకులు ఘోరులు లోహముఖులు జవనులు నేకపాదకులు నక్షయులు బలవంతులు పురుషాదకులు కర్ణచూడులు హేమాంగులు ప్రియదర్శనులు నామమీనాశనులు నగు కిరాతులు ద్వీపవాసులు నంతర్జలచరులు నై పురుషవ్యాఘ్రు లనం బరఁగుచుఁ గొండలకుఁ బ్రాఁకి దుముకుచు నీటిపైఁ దేలాడుచు నుండుదు రవ్వారల నివాసంబు లెల్ల విచారింపం దగినయవియ సదంపడి సువర్ణరూప్యకరత్న నిధులొప్ప సప్తరాజ్యోపశోభితం బగు యవద్వీపంబు శోధించి సురాసురసేవితం బగుచు శృంగోచ్ఛ్రాయంబున దివంబు స్పృశించు శిశిరగిరిం గాంచి తదీయాతతప్రపాతవనదుర్గంబుల నెమకి రక్తజలంబు నతివేగంబు నగాధంబు నగు శోణంబు దాఁటి సముద్రపారముం బెరసి యచ్చోటుల నెల్ల నారయవలయుఁ దరంగానిలోద్ధతం బగు నాసాగరంబున మహాకాయు లగు నసురులు చిరకాల బుభుక్షితు లై నలువ వనుప జలాంతరంతరీపంబులు తమకు వాసంబులుగా నొడ్డ ఛాయాగ్రహణంబునం బట్టి తినుచుండుదురు మహోహారగనిషేవితంబును గాలమేఘప్రతిమంబును నగు నయ్యర్ణవంబు మెలఁకువతోన కడచి చనంజను నటఁ బోవ రక్తజలభీమం బగు లోహితపారావారంబు బృహత్కూటశాల్మలియు నగపడు నచ్చోటునం గైలాసనిభంబును వివిధరత్నాలంకృతంబును విశ్వకర్మనిర్మితంబును నైన వైనతేయనికేతనం బొండు శోభిల్లుచుండు నద్దానిం గనుంగొనినఁ గన్నుల కలిమి ఫలవంతం బగు. 303

శా॥ మందేహాఖ్యులు రక్కసు ల్గిరినిభు ♦ ల్మాయావు లచ్చోటికిన్
ముం దా కొండతల న్మెలంగుదురు భా ♦ నుం గాంచి యబ్ధి న్మునుం
గం దేలం దమంకిపుఁ ద్రి తద్ఘృణుల వీ ♦ క న్బ్రహ్మ తేజంబు ధా
కం దప్తాత్ములు నయ్యు వీడ రెదుర ♦ న్గాక్షించుచు న్నిచ్చలున్. ౩౦౪

సీ॥ సితమేఘసదృశంబు♦క్షీరోద మను నబ్ధి, వీచి ముక్తాహార♦విలసితంబు
దుర్ధర్ష మవలఁ గాం♦తురు తదంతరమునఁ, వెలిగొండ ఋషభాఖ్య♦వెలయునదియు
భవ్యగంధసుమాఢ్య♦దివ్యరాజతవృక్ష, వేల్లితంబును మహా♦విస్తృతంబు
నందు సుదర్శనం♦బను సరోవర ముండుఁ, గలధౌతమయపద్మ♦కలిత మగుచు

రాజహంసాస్పదము దాని ♦ రమణ నెఱయ
నంగనలఁ గూడి విహరింతు ♦ రహరహంబు
నమరగంధర్వకిన్నర ♦ యక్షముఖ్యు
లలవి గా దప్పొలము చెల్వ ♦ మరసి పొగడ. ౩౦౫

వ॥ ఆపాలకడలిం గడచి సర్వభూతభయావహం బగు జలోదం బను మహాసాగరంబుఁ గనుంగొని యెదురందుం దత్త్వోపసమ్మిళితం బగు తేజంబు బడబాముఖంబున వెలువడి సచరాచరప్రపంచంబు గ్రసియింపం జాలి విలసిల్లు నద్దానిం గని ప్రబలజలసత్త్వంబులు ఘోషిల్లు నన్నులివు కర్ణకఠోరం బై యుండు. నమ్మున్నీటికి నుత్తరం బై త్రయోదశయోజనాయామవిశాలం బగు ప్రదేశంబున జాతరూపశిలామయం బగు పసిండికొండ యొక్కండు చూపట్టఁగలదు దాని శిఖరంబున వెన్నెలతేని వెలుంగు నలంతిసేయు నెమ్మేని మెఱుంగును దమ్మితేకులంబోని కనుంగవలును రతనాల తళుకులం దులకించు వేయి పడిగెలును నీలం బగు చేలంబును దనరారు భూభారవహనదక్షుండును సర్వభూతనమస్కృతుండును ననంతప్రభాఖ్యుండును నగు ననంతుండు సమాసీనుం డై యుండు నమ్మహామహుని కట్టెదురం ద్రిశీర్షంబును వేదికాంచితంబు నగు హిరణ్మయకేతుతాలంబు దేవనిర్మితం బై యొప్పారు నచ్చోటు వాసి చనిన హేమమయంబు శ్రీమంతం బునగు నుదయాచలంబు కాన్పించు నమ్మేటిగుబ్బలికోటి జాతరూపవేదికావిరాజమానయుఁ గాంచనవృక్షలతాసమంచితయు శతయోజనాయతయు నై భానుమండలికైన యనం దగి యుండుఁ దన్మధ్యప్రదేశంబున యోజనవిస్తారంబు దశయోజనోచ్ఛ్రితంబు నగు పసిండిశృంగంబు సౌమనసంబు నాఁ బొసంగు విష్ణుండు త్రివిక్రమాకృతిం గైకొనిననాఁడు దానిపై మొదలిదైన పదం బిడి కొండొక యడుంగు మేరుకూటంబున నానిచె జంబూద్వీపంబున నుత్తరపు దెసం బరిక్రమించి యమ్మ

హాశిఖరంబు లంఘించి దివాకరబింబంబు దృగ్గోచరం బగు నప్పుణ్యస్థలంబున వైఖానసులు వాలఖిల్యులు నను మహర్షులు తపోనిష్ఠకలిమి సూర్యప్రకాశులై తేజరిల్లుచుండుదురు. ౩౦౭

తే॥ ఈసుదర్శన మద్దాని ♦ కెదుర నుండు
నేది దృక్కను దేజంబు ♦ నెల్లవార
కప్పాడుపుఁగొండ రుచులతో ♦ నర్కదీప్త
లోలయఁ బ్రాక్సంధ్య రక్తమై ♦ వెలయుచుండు. ౩౦౮

క॥ జగతికి జగములకును దా, నగుఁ బూర్వద్వార మనఁగ♦నటు భానునక
ప్పొడగిన యుదయంబుఁ గావున, నగరిపుదిశ కయ్యెఁ బూర్వ♦నా నెగ డొందన్.

చ॥ అటఁ జనరాదు ప్రాకృతుల ♦ కవ్వల నెల్లఁ దమోవృతంబ యె
ట్లెటొ చరియింతురే వేల్పులు క ♦ డింది వెలుంగులఁ జంద్రసూర్యు ల
చ్చోటు వెలయింప నేర రనఁ ♦ జూడఁగ నెట్లగు మీకుఁ గాన నా
దట మఱలంగ నౌ సతియు ♦ దంత మెఱింగినయంతఁ దెల్పఁగన్. ౩౦౯

ఉ॥ ఆయుదయాచలంబునఁ జి ♦ రాయురుపేతులు మీరు గాంచి యా
చాయఁ దదీయశృంగవన ♦ సారసషండగుహాంతరంబులన్
బాయక యారయం గని ప్ర ♦ భావతి భూసుత యున్కి యమ్మహా
మాయికు జాడయుం దెలిసి ♦ మాకెఱిఁగింపుఁడు సత్వరంబుగన్. ౩౧౦

క॥ ఆవలనున నెడనెడఁ గల, తావులఁ బరికించి త్రోవ♦తల నొకఁడేనిన్
ద్రోవ కరసి రండొక నెల, మీ వెరవున కిడిన గడువు♦ మీకొనుఁ డింకన్. ౩౧౧

క॥ అని వారికిఁ బయనం బిడి, వినతుని నం దధికృతునిఁగ♦ వెలయించి యతం
డనితరులఁ గపుల నొండెడ, కనుపందగువారి నెడఁద♦నారసి యంతన్. ౩౧౨

వ॥ నలనీలసుషేణాత్రిశరగుల్మశరారి విజయగజగవయగవాక్ష గంధమాదనోల్కాముఖమైందద్వివిదాసంగ హనూమజ్జాంబవత్ప్రముఖులం గనుంగొని యమ్మేటి మగల నంగదసంగతులం బొనరించి యెల్లవారును విన నిట్లనియె.

—♦ సుగ్రీవుఁడు హనుమదాదులకు దక్షిణదిఙ్మార్గంబుఁ జెప్పుట. ♦—

ఆ॥ దక్షిణంపుదెసకుఁ ♦ దరలి మీర లపార
బలము బలసి కొలువఁ ♦ జలము మీఱ
నరిగి జనకజాత ♦ నరయుఁ డయ్యెడ గల్గు
వివిధ విధము లేను ♦ వినుచువాఁడ. ౩౧౩

ఆ॥ వేయుఁ దలలు గలుగు ♦ వీఁజప్పు శేష గో
దావరిని మహాప్రభావఁ గృష్ణ
వరద మేఖలాఖ్య ♦ వరుస నుత్కలఁ గాంచు
వారు మీఱు త్రోవ ♦ వల నెఱింగి. ౩౧౭

వ॥ తదుపాంతంబుల దశార్ణనగరంబుల నశ్వవంతిని నవంతిని విదర్భర్క్షకమాహిషక విషయంబులను వంగకళింగకౌశిక దేశంబులను దండకారణ్యంబునుం గనుంగొని యాంధ్రపుండ్రచోళపాండ్యకేరళాదిరాష్ట్రవిశేషంబులం బరికించి సచందనవనోద్దేశంబును నానాధాతుపుంజరంజితంబును జిత్రవిచిత్రపుష్పకాననశిఖరాంచితంబును శ్రీమంతంబు నగు నయోముఖం బను పర్వతోత్తమం బారసి ప్రసన్నసలిలపూరయు దివ్యమంగళమూర్తియు నప్సరస్సేవితయు నగు నబ్ధిదేవేరిం గావేరిం గాంచి కన్నులపండు వొనరించి మలయనగాధిత్యకాస్థలసమాసీనుండును భానుమండలప్రకాశుండును లోపాముద్రాసనాథుండు నైన యగస్త్యమునినాథు సందర్శించి ప్రసాదసుముఖుం డగు నమ్మహాత్ముని యనుజ్ఞ వడసి గ్రాహజుష్టయు దివ్యచందనోపశోభితయు ద్వీపశాలినియు నై కాంతుఁ జేరం జను కాంత యట్టులు దన్వంతునిం గవియం బాఱు తామ్రపర్ణీనదిం గడచి చని ముక్తామణివిభూషితంబును హిరణ్మయంబు నగు పాండ్యకటకకవాటంబు లంఘించి సముద్రతీరంబు దరియం జొచ్చి యచ్చోటున నెల్లరుం గూడి కార్యనిర్ణయం బొనరింప నయ్యెదరు. ౩౧౮

సీ॥ పొట్టఁ బెట్టెను దండి ♦ పొలదిండి నెవఁ డట్టి, తబిసి మున్నీటితోఁ ♦ దార్చె దేని
నరసె బంగరుగుండ్ల ♦ నమరి రత్నాకరు, లోఁ జొచ్చి యెది వాని ♦ లోఁతు పాతు
చిత్రనానాగమ ♦ శ్రీమల్లతాంచిత, మనఁగ నెయ్యది ఖ్యాతి ♦ నందె జగతి
దేవసంభవు లెల్లఁ ♦ దివిరి యచ్చరలతో, భావింతు రెద్దాని ♦ సేవనమ్ము
నఖిలసిద్ధుల కెయ్యది ♦ యాటపట్టు
పొందు నెద్దానిఁ బ్రీతిపర్వ ♦ మందు నిందుఁ
డమ్మహేంద్రాద్రిఁ గన నెంచి ♦ యరయఁ గాంచి
ధన్యు లౌదురు ప్లవగమూ ♦ ర్ధన్యులార ! ౩౧౯

క॥ అక్కులగిరిఁ దిరిగి యవ్వా, గ్దిక్కున సంద్రంబు దాఁటి ♦ తేఁకువ మెయి నా
రక్కసుల యంతరీపము, చక్కఁ గనుంగొనఁగవలయు ♦ సంయమ మొప్పన్.

తే॥ అదియు శతయోజనాయతం ♦ బైన యమ్మ
హాబ్ధిఁ గడవంగ నాతియు ♦ మై యగమ్య

మై మహోజ్జ్వల మై లంక ♦ యనెడు రాజ
ధాని నడిచక్కి నలువొందఁ ♦ దనరుచుండు. ౩౧౯

ఉ॥ ఆయది పధ్యుఁ డైన దను ♦ జాధిపు వాసము దాన నేయెడన్
శ్రీయుత భూజఁ దాఁచెనొకో ♦ చేరి కనుంగొన నా ప్రియత్నముం
బాయక యుద్ధరాత్ముఁ డని ♦ వార్యుఁడు వార్త యెఱింగి మీరు రాఁ
జేయఁగఁ బోలు కర్జ మట ♦ సిద్ధ్య నపేత మొనర్పఁగా నగున్. ౩౨౦

ఆ॥ అబ్ధిఁ గడచు నెడ నె♦యంగారకాభిఖ్య, చాయ నొడిసి మ్రింగు♦ సత్త్విఁ బోల
నెంతవారి నైన ♦ నెఱిఁగి రక్కసి వాతఁ, బడక తలఁగ వేగ ♦ పడఁగవలయు.

వ॥ అమ్మెయి నారక్కసులలేని ద్వీపమ్మున నెల్లెడలుం గలయం బరికించి నిరస్త సంశయుల రై యాపట శతయోజనవిస్తీర్ణం బగు సముద్రంబు నిస్తరించి సిద్ధచారణసంసేవితంబును జంద్రసూర్యాంశుప్రతీకాశప్రకాశంబును లక్ష్మీస్తవంతంబు నగు పుష్పితకాఖ్యం బగు క్ష్మాధరంబుఁ గనుంగొని యెద రయ్యది విపులంబు లగు శృంగంబుల నంబరం బుల్లేఖించుచుండు నం దొకకాంచన శిఖరంబు దివాకరుండును గొండొక్క రాజతకూటంబు నిశాకరుండును సేవించుచుండుదు రమ్మహీధ్రమ్మును గృతఘ్నులును నృశంసులును నాస్తికులును సందర్శింపనేరరు దానికి సభక్త్యన్మేషమ్ముగా సాష్టాంగదండప్రణామం బాచరించి యప్పర్వతస్థలిం బుణ్యమూర్తి విదేహరాజనందన నరయం దగు పదంపడి దుర్ధర్షుల రై పదునాలుగు యోజనంబులు దుర్విగాహం బగు నధ్వం బతిగాహించి సూర్యవంతం బను శైలోత్తమంబుఁ గని యద్దాని నతిక్రమించి యరిగి సర్వకామసర్వర్తు సుమఫలవృక్షమనోహరంబును విద్యుత్ప్రకాశవిలసితంబు నగు వైద్యుతం బను నహార్యవర్యంబు నాలోకించి వరార్ఘ్యస్థలమూలంబులు భుజియించి మధురమధురసంబులు గ్రోలి యవ్వలం జని నయనమనోజ్ఞం బగు కుంజరధరాధరంబు సందర్శించి యయ్యెడ యోజనవిస్తారంబును దశయోజనోచ్ఛ్రితంబును గాంచనరత్నప్రభావిభాసితంబును విశ్వకర్మనిర్మితంబు నగు నగస్త్యభవనంబు వీక్షింపం గని విశాలకక్ష్యయు దుర్ధర్షయు సర్వతఃపరిరక్షయు మహాపన్నగసంరక్షితయు నగు భోగవతీపురిం బెరయఁగాంతు రప్పాతాళస్వర్గంబు వాసుకిపాలనంబున వాసి కెక్కినయది యద్దేశంబున జనకనందిని యుదంతం బారసి తదనంతరంబులు సుసంవృతంబులు నగు కొన్ని జనపదంబులు విమర్శించి కడచి ఋషభపర్వతంబుం గాంచి నేత్రపర్వం బొనఁగూర్చికొని యెదరు మఱియు నందు గోశీర్షకపద్మకహరిశ్యామాఖ్యక చందనతరువనం బొక్కండె యనికాక తృణంబ యేని నగ్నిప్రభం బై విలసిల్లుచుండు, ౩౨౧

క॥ ఘోంకారులు పోఁచెద, రారూఢి నొప్పిహితాఖ్యు ♦ లగు గంధర్వుల్
సారపరిభావ నవ్వనిఁ, బూరిపుడకయేని నొడ్లు ♦ వారయకయుండన్. ౩౨౩

వ॥ శైలూషుండును గ్రామణియు శిగ్రువు శుభ్రుండును బభ్రువు నని వేర్వేఱం బిలువంబడు నవ్వారలేవురును సూర్యసంకాశులై ప్రకాశించుచుండుదురు.

తే॥ అది పృథివ్యంత మచ్చోట ♦ నమరియుందు
రమరపురిఁ జూఱఁగొన్నయ ♦ య్యతిసుకృతులు
తపనసోమాగ్నితనులు దు ♦ ర్ధర్షు లగుచు
వారిఁ గనువారుఁ బుణ్యులై ♦ వఱలఁగలరు. ౩౨౪

ఆ॥ మీర లంతవఱకె ♦ మెలఁగనేర్తురు దాని, కవలఁ బోల దొడ్డ ♦ కడు గిడంగ
జముని రాజధాని ♦ సంయమనీపురి, ఘోడి దైన జగము ♦ దొరయ నునికి.

క॥ ఆపితృలోక మతీతమో, వ్యాపృత మటుగాన విడువ ♦ నగు నచ్చోటు మీ
రోపి వెదకుఁ డీలోపల, నేపట్టుననుఁ దలఁగ కింద ♦ ఱేకసుతమునన్. ౩౨౫

తే॥ ఒక్క నెల కిట రా నయి ♦ యుజ్జ్వలుఁ డయి
కంటి సీత నటన్న యా ♦ ఘనుఁడు నాకుఁ
బ్రాణభూతుం డతండె మ ♦ త్ప్రాభవంబు
నన్నుఁ బోలంగ నేలఁగ ♦ ననుచువాఁడు. ౩౨౬

ఉ॥ మీరలు సత్కులోద్భవులు ♦ మీరసహాయు లమిత్రనాశకుల్
మేరకు మీఱు పౌరుషము ♦ మేకొన నొదు రపారసత్త్వచి
త్పారగుణోదయాంచితు ల ♦ దభ్రయశోర్ధులు మా కనన్యులే
తీరున నేని రాముకృతి ♦ తీర్చిన నన్నుఁ గృతార్థుఁ జేయుఁడీ. ౩౨౭

— ♦ సుగ్రీవుఁడు సుషేణాదులకుఁ బ్రత్యఙ్మార్గంబుపదేశించుట. ♦ —

ఆ॥ అనుచుఁ బయన మట్టు ♦ లవ్వారికిం దెల్పి, తపనసుతుఁడు మామ ♦ తార తండ్రి
యగుసుషేణుఁ గనికృ ♦ తాంజలియై యిట్టు, లనెఁ బ్రసక్తితోడి ♦ వినయ మొలయ.

తే॥ నీవు నీతోడివారు స ♦ న్నియతులరు మ, రీచిసుతులు సముద్యన్మ ♦ రీచు లర్చి
రున్నతులు మతివీర్యసం ♦ పన్నులు నగు, వారు నగువారు గరుడుని ♦ వలని జవము.

వ॥ మారీచఋషిపుత్రార్చిష్మదర్చిర్మాలాదిప్రథితసంజ్ఞలం దనరారు నీశౌర్యధుర్యులకుం దోడునీడుగా ద్విశతసహస్రసంఖ్యాకు లగు నగచరవీరులునుం బలసిరాఁ గడపటిదెస కరిగి సీతాన్వేషణనిమిత్తంబునం బ్రవర్తింపవలయు నప్పథంబున

గల యశేషవిశేషంబు లేను వివరించువాఁడ సావధానులరై వినుండు తొలుదొల్త సురాష్ట్రబాహ్లీకశూరభీమాది తత్తజ్జనపదరాష్ట్రదుర్గపురరాజధానులను బున్నాగవకులోద్దాలక కేతకప్రముఖవనషండంబులను శీతలసలిలోపేతలు శివాకృతులుఁ బ్రత్యక్ప్రవాహలు నగు నదులను దావసారణ్యంబులను శోధించుచుం జని సర్వతఃపర్వతజాలావృత మై దుర్గ మైన ప్రతీచీదిశం గల యంతవట్టును భూజాత యుదంతం బరయుంజను నమ్మెయిం దిమితిమింగిలనక్రకులజలంబు నక్షోభ్యంబు నగు పశ్చిమసాగరంబు వీక్షించి తద్వేలాతటనివిష్టకేతకతమాల నారికేళముఖ్యవనగిరిదరీ దుర్గకాంతారంబులఁ గలయం జొచ్చి పరికించి మురచీపత్తనజటీపురాంగలోపావంత్యాదిపుటభేదనంబులను సింధుసాగరసంగస్థలంబునుఁ దత్ప్రత్యం బై శృంగశతమహాద్రుమధాతురాగమణిరత్నసమేధితంబు నైన హేమగిరి యను గిరిరాజముం గనుంగొనంగలరు. ౩౩౨

క॥ ఱెక్కలు గలిగిన సింగము, లక్కొండ నెసంగు చఱియ♦లందుండి వెసన్
జిక్కం గొని చను గూండ్లకుఁ, జక్కఁగ గజమత్స్యముఖ్య♦జంతువ్రజమున్. ౩౩౩

వ॥ అట్టి కులాయంబులు గల ప్రస్థంబులను దృప్తతృప్తంబులుఁ దోయదనిస్వనంబులునగు మాతంగంబులు విహరించు మేటి కూటంబులను దివంబు స్పృశించి కాంచనమయంబును జిత్రపాదపంబును నై యున్న కొండొక్క శృంగంబును గామరూపధరు లగు మీర లొక్కింతయుఁ దిక్కకుండ నెల్ల యెడయుం బరికించి యబ్ధిమధ్యగతయు గాంచనియు శతయోజనాయతోత్సేధయు దుర్దర్శయు నగు పారియాత్రికపర్వతకోటిం గనుంగొనుఁడు. ౩౩౪

ఉ॥ ఇర్వదినాల్గు కోట్లు వసి ♦ యింతురు తరస్వులు వహ్నికల్పు లీ
యుర్వర నొక్కటం గమియ ♦ నోపి దురంతులు కామరూపతా
ఖర్వపరాక్రమక్రముల♦ఖండులు ఘోరులు నైన మేటి గం
ధర్వులు వారలం దొడరి ♦ దర్పము సూపఁగఁ బోల దెమ్మెయిన్. ౩౩౫

క॥ అవ్వారి యాసఁ గొన కటు, లవ్వారిఁగ నుంచు ఫలము♦ఖార్థములు గొనన్
నెవ్వగలు మీఱు వారలు, జివ్వ దురాసదులు గానఁ♦జెప్పితి మీకున్. ౩౩౬

క॥ అచ్చోటు వారి దనుకొని, యచ్చపుఁ గపిధర్మమున నె♦యనువర్తింపన్
బొచ్చె మొనయఁ బోవరు మీ, రిచ్చ నిడిన కర్జ మరసి♦యేగుఁడు పిదపన్.

తే॥ వజ్రసంస్థానవైదూర్య ♦ వర్ణవివిధ
తరులతాకీర్ణ మై యొక్క ♦ గిరి తనర్చు

నదియు వజ్రాఖ్య శతయోజ ♦ నాయతి నెఱి
గల దచట నేర్చి యరయ నా ♦ క్ష్మాతనూజ. ౩౩౮

ఆ॥ సంద్ర మొక్క పాలు♦చన దాఁట నచ్చోటఁ, జక్రవంత మనెడు♦శైల ముండు
దానఁ జక్ర మొండు♦ధాత్రాజ్ఞ నిర్మించె, వేయి ధార లొప్ప♦విశ్వకర్మ. ౩౩౯

క॥ పంచజను హయగ్రీవు వ, ధించి తపశ్శక్తి శౌరి♦తేఁకువఁ గొనెఁ ద
త్పాంచజనజన్యశంఖం, బంచిత మగు చక్రమును ని♦జాయుధములుగన్. ౩౪౦

వ॥ అబ్బురం బొదవించు నమ్మేటి గుబ్బలి చఱియలు విశాలగుహలుం బరికించి కాంచి పదంపడి యవ్వారుణాలయంబు నఱువదియోజనంబులు గడచి చని సువర్ణశృంగంబు శ్రీమంతంబు నగు వరాహశైల మధిగమించి యచ్చోటు వాసి సువర్ణమయం బగు ప్రాగ్జ్యోతిషపురంబు డం బరయంగల రద్దాని దుష్టుం డగు నరకాసురుం డేలుచుండు నవ్వాల నెల్ల వీక్షించి యవ్వలనికిం జని సర్వతస్సౌవర్ణం బగు మేఘవంతం బను పర్వతేంద్రంబు గాంచెదువా రయ్యెడ మత్తమాతంగసింహవ్యాఘ్రవరాహంబులు గర్జిల్లెడు వలాహకంబుల నెదిర్చి ప్రతిగర్జ లిడుచుండు సంతతోద్ధారప్రస్రవణధారాశతం బగు నప్పాలంబునఁ బొలదిండిమూఁక లత్తోఁ బాకాసురుం గెడపి పాకశాసనుండు సురేంద్రరాజ్యాభిషిక్తుం డయ్యె.

క॥ కాంచెద రఱువదివేల, భ్యంచితములు నైన గిరుల♦నటఁ జని యవియు
న్మించుఁ దరుణార్కమండలిఁ, గాంచనతరువనశిలాప్ర♦కాండద్యుతులన్. ౩౪౨

వ॥ పర్వతోత్తమం బగు నుత్తరమేరువును దన్మధ్యావగాఢం బయ్యె. నద్దాని కాదిత్యుండు మున్ను ప్రసన్నుం డై నీవును నిన్నుఁ బెరయం గనిన యున్నగవరంబులును నీయందు నివసించు దేవదానవగంధర్వులును నాయనుగ్రహంబున కలిమిఁ గాంచనప్రభాంచితులై యొప్పారుచుండుదు రెల్లదివౌకసులును నీయంద నిలిచి పశ్చిమసంధ్యోపాసనాక్రమంబు నిర్వర్తింతు రయ్యాది నాకుం బ్రీతికరం బని వరప్రదానంబు సేసెఁ దత్ప్రభావంబున నయ్యాహార్యవర్యంబుఁ దోడిమెట్టులును బూజితంబు లయ్యె నర్ధముహూర్తకాలంబున దశయోజనసహస్రాధ్వాతిలంఘనం బొనరింపుచు దివాకరుండు మేరుశిఖరప్రాంతంబున సురర్షిపూజితుండై యస్తగిరికిం జనుచుండు. ౩౪౩

సీ॥ ఆక్రింకుమెట్టున♦కమ్మేరువునకు నం, తరమున దశశిర♦స్త్రాల మొకఁడు
చిత్రవేదికతోడ♦శ్రీమంతమును జాత, రూపమయంబు నై♦రూఢిఁ దనరుఁ
గల్పించె మును విశ్వ♦కర్మ యస్త్రాద్రిశృం, గమున సూర్యప్రకా♦శ మగుచుండ
వరుణపురము మణి♦ప్రాసాదతోరణ, వల్లీతరువితాన♦వల్గుపక్షి

కూజితాంచితంబు♦గోమాతృకాఢ్యంబు, నగుచు వెలయు దాని♦నగ్గిరినాథుఁ
డేలు లోకతిమిర♦మెడలఁ జేయుచు భానుఁ, డగ్గిరీంద్రి మెనయు♦నహరహమ్ము.

ఆ॥ సవితృనిభుఁడు మేరు♦సావర్ణి యను ముని, పుణ్యమూర్తి తపము♦పొలుపుగలఁడు
ధరణిజాత వృత్త♦మరయంగ నగు నమ్మ, హాత్ము నతఁడు నిచ్చ♦లచట నుండు.

ఆ॥ అంతవఱకె మీర♦లరుగ నౌదురు కల, చోటు లెల్ల నెఱుకి♦సొలయు కొక్క
నెలకు నిచటు సేర♦నేర్చితి రేని మా, మన్నన గ్గొనంగ♦మలయువారు. 328

క॥ మామాయ సారబలుఁ డు, ద్దాముఁ డతని నుడికి మీరు ♦ తలఁగక సులఁగం
గా మనుచుఁ జూడ్కి తెప్పల, నేమము దనుపార నిట్టి ♦ నెఱి మది నిడుఁడీ !

తే॥ ఏను దెలుపని దిద్దియు ♦ నెలయు నేని, గర్జమునకు విరుద్ధంబు ♦ గాకయుండ
మీమదిఁ దలంచి నెఱపంగ♦మీక చెల్లు, వాసి గనుఁ డీకృతినిఁ గపి♦వర్యులార !

క॥ అని వారికిఁ బయనం బటు, లొనఁగూర్చి దినేంద్రతనయుఁ♦డురుసత్త్వబలుం
డనితరసదృశుఁడు శతవలి, యను మేటిం గాంచి యిట్టు♦లనె ననుపమి తా !

—♦ సుగ్రీవుఁడు శతవలిముఖుల కుదగ్దిశామార్గంబు వివరించుట ♦—

ఆ॥ నిన్నుఁ బోలువారు♦నినుఁ గొల్చుచును నూఱు, వేలు రాఁగ వెడలి♦లీలమెయి ను
దీచి దిశకుఁ బోయి♦తేఁకువ ధరణిజ, వార్తఁ దెమ్ము వన్నె♦వాసి గొమ్ము. 330

క॥ వైవస్వతసుతు లనఘులు, తావకమంత్రులును నీదు ♦ తిరమున వారల్
భావింత్రు నిన్ననసిరా, నే వినిచెద నవ్వథమున ♦ నెలవున దెలుపుల్. 331

మ॥ వనదుర్గంబులు శైలము ల్నదులు దు ♦ ర్వారప్రపాతస్థలుల్
ఘనరాష్ట్రోపసదంబులుం బురవర ♦ గ్రామాగ్రహారంబులున్
గని యెచ్చోటున నేని భూమిసుత యు ♦ క్కల్యాణి వృత్తాంతమున్
గొని రానై యథమర్ణభావమున నా ♦ కోల్పోక వారింపుమీ ! 332

వ॥ శుభోదర్కం బగు నీప్రస్థానంబున మ్లేచ్ఛపుళిందశూరసేనప్రస్థలభరతకురుమద్ర
కాంభోజయవనశకారట్టకబాహ్లికర్షికపౌరవటంకణచీనపరమచీననీహారదరదాది
దేశంబు లన్వేషించుచుం జని హిమవత్పర్వతంబు సందర్శించి లోధ్రపద్మక
దేవదారు వనషండంబులం బరికించి దేవగంధర్వసేవితం బగు సోమాశ్రమంబుఁ
గాంచి మహాప్రస్థం బగు కాళశైలం బధిగమించి తద్గుహాంతరము లెల్లం బరిశో
ధించి హేమగర్భం బగు సుదర్శన ధరణీధరంబుం గని దేవసఖనగోత్తమం
బాలోకించి యపర్వతనదీనదకాసారంబున వృక్షగుల్మంబు సత్త్వవర్జితంబు శత

యోజనవిస్తీర్ణంబు నగు దుర్గమమరుదేశం బతిలంఘించి రోమహర్షణకాంతారంబుఁ గడచి చంద్రప్రకాశం బగు కైలాసగిరివరోద్దేశంబు సేరి యరుసంపు వెల్లి నోలలాడుదురు. ౩౨౩

సీ॥ రాణివాసముతోడి♦రహి నెక్కటిగ నీల, కంఠుఁ డేనెలవునఁ♦గదలకుండు
దిక్పాలకుల దివ్య♦దేశంబు నాఁ జనుఁ, బ్రణిహితాశంస యే♦ప్రమథభూమి
సురశిల్పికల్పిత♦శుద్ధజాంబూనద, శ్రీక యెచ్చో నొప్పు♦శ్రీదు నగరి
యెద్దాని పొలిమేర♦నెసఁగు స్వర్ణాంభోజ, యప్సరస్సేవిత♦హంససరసి

అప్పొలము సర్వసిద్ధుల ♦ కాస్పదమ్ముఁ
దార్క్ష్యఁ గని కనుఁగొని తోఁవ ♦ దొఱసి సీత
తెఱ వరసి కొంచు నెఱసి మీఁ ♦ తెలివి మీఱఁ
గ్రౌంచగిరిఁ గాంచ నొఁ దదు ♦ పాంచలమున. ౩౨౪

క॥ అంచలకును భార్గవరా, మాంచితకీర్తికిని ద్వార♦మన నై తగునా
క్రౌంచము బిలము సుదుర్గమ, మెంచి ప్రవేశించి యసము♦నెనయం గనుఁడీ.

ఆ॥ దేవరూపు లఖిల♦దేవతార్చితులు మ, హాత్ము లగు మహర్షు♦లర్కదీప్తు
లగుచుఁ దనరుచుందు♦రందు నగ్గిరిసంస్థ, లప్రమత్తవృత్తి♦నరయువలయు. ౩౨౫

ఆ॥ కామశైల మెనసి♦యామానన మెఱింగి, యట మయస్వయంకృ♦తాఢ్య చిత్ర
భవన తురగవదన♦సువదనావాస మై, నాకగిరి తటముల♦నలువు గాంచి. ౩౨౬

ఉ॥ ఆనెలవు ల్దురాసదము ♦ లారసి యోరఁ బ్రసిద్ధసిద్ధవై
ఖానసవాలఖిల్యముని ♦ కల్పక కల్పితపావనాహ్వయం
బై నలువొందు సిద్ధపద ♦ మాశ్రమము న్గని యమ్మహాత్ములక్
గానఁగఁ గల్గు పున్నెమునఁ ♦ గల్మషము ల్పడలంగ శుద్ధులై. ౩౨౭

తే॥ మహితు లహ్వారిఁ జేరి నమస్కరించి, క్ష్మాత్మజ వృత్తాంత మరసి వై♦ఖానసాఖ్య
సరసిఁ గాంచనసరసిజ♦చ్ఛన్నఁ గాంచి, తరుణహంసద్యుతుల హంస♦తతుల నెంచి.

వ॥ ఉల్లసిల్లుదు రాసరోవరంబుఁ జేరి సార్వభౌమసంజ్ఞితం బగు కుబేరుని యాపవాహ్యగజరాజంబు కరేణుకలఁ గూడి విహరించుచుండు. మహనీయం బగు నాకాసారంబు గడచి యచంద్రదివాకరంబును ననక్షత్రగణంబును నజీమూతంబు నగు నాకసంబు పుడమితోడం గూడ నెక్కటిగా ననేకభానుకిరణస్ఫురణాలంబోలె నచ్చోటునం దపశ్చరణంబునం బొసంగు స్వయంప్రభులగు తపస్సిద్ధుల యాప్రతీకాశప్రకాశంబులం బ్రకాశించుచుండు. నద్దేశంబు సందర్శించి చని యుత్తర

యగు శైలోదానదిం గాంచెద రద్దాని యుభయతీరంబులం గల వేణువిశేషంబులు తెరువరుల నెన్నిక గల పుణ్యంబున కలిమి నమ్మహాతటిని యవ్వలగట్టునం జేర్చుచుండు నాశిలానిమ్నగ నుత్తరించి స్వర్గసుకృతలభ్యంబు లగు నుత్తరకురుభూములం గాంచెద రచ్చటి సరిజ్జలంబు లింద్రనీలనిభంబై దూర్వపలాశంబులు సౌవర్ణపద్మంబులు నగు పద్మినీవిశేషంబుల నొప్పారుచుండు తరుణాదిత్యసదృశంబులు హిరణ్మయంబులు నగు రక్తోత్పలవనంబులవలనను గాంచనకేసరంబులుమహార్హమణిమయపత్రంబులుఁ జిత్రంబులు నగు నీలోత్పలవనంబులవలనను సన్నీలప్రభల జలాశయంబు లెల్లభాసిల్లుచుండు నసదృశంబు లగు ముక్తాఫలంబులును నమూల్యమణిరత్నంబులును హైమశర్కరాసముత్కరంబులును నప్పదంబులంగల నదీనదంబుల పులినతలంబులై యలరారుచున్నయవి హుతాశనసమప్రభంబులగు శైలోత్తమంబు లన్నియుఁ బసిఁడికొండలే రత్నసానువులే యనోకహంబు లిన్ని యన్ని యనరాని వన్నియుం దనరారి కన్నవారి కెల్లం గన్నులపండు వొనఁగూర్చు నిత్యపుష్పఫలంబులును విచిత్రపత్రరథాంచితంబులును దివ్యగంధరసస్పర్శంబులునై సర్వాభీష్టదాయిత్వం బెడబాయకుండు నందుఁ గొన్ని స్త్రీజనానుకూలంబులగు క్షౌమవిశేషంబులను మఱికొన్ని పురుషయోగ్యంబు లగు సూక్ష్మాంశుకంబులను వెండియుం గొన్ని యుభయోచితంబు లగు నవరత్నఖచితాభరణంబులను గొండొకకొన్ని యాస్తరణవంతంబు లగు మహార్హశయనంబులను నింకం గొన్ని మనోహరంబు లగు చిత్రమాల్యానులేపంబులను దదన్యంబు లగు కొన్ని యనుపమానరసాయనంబులను దద్భిన్నంబు లగు కొన్నియమృతోపమ భక్ష్యభోజ్యంబులను సమకూర్చుచుండు లోకవిలక్షణసలక్షణ రూపయౌవనలావణ్యలక్షితలును సద్గుణసంపన్నలుం గాని స్త్రీ లమ్మహనీయస్థలంబున లేరు వల్లకీసల్లలిత మధురగానంబును వాదిత్రవిశేషనాదకలనంబును సర్వభూతశ్రుతిమనోజ్ఞంబులు గా నెల్లకాలంబు నుల్లసిల్లుచుండు భానుతేజోవిరాజమాను లగుచు సిద్ధగంధర్వకిన్నరపన్నగవిద్యాధరప్రభృతులు స్వీయసుకృతసంసిద్ధి కతన నాసిద్ధక్షేత్రంబునఁ దమ యంగనలుఁ దారును విహరించుచుండుదురు నిచ్చలు నచ్చోటునం గలయది సంతోషమే యన్యోన్యప్రేమయే కాని యొండొకండు దోసంబు కానిపింపం బోవదు వేయేల తత్పుణ్యభూమియందలి శ్రీమిళితంబు లగు సర్వగుణంబులు దినదినప్రవర్ధమానంబు లగుచుండు నప్పాలం బంతయుఁ గడచి చనిన నుత్తరపయోనిధి గనుపట్టుఁ దన్మధ్యప్రదేశంబున సోమగిరి యను గిరిరాజం బుండు నది మహారజతమూర్తియు జీవరత్నవిరాజితంబు నై తేజంబునం బెన లాక్రమించి ధామనిధి యయ్యెడ లేఁ డను కొఱంత యొక్కింతయు నొల్లతలంపులం బొడకట్ట

నీయఁబోదు ధర్మవిశేషంబున స్వర్లోకగతు లగు వారును బ్రహ్మలోకనివాసు లగువారును నద్దానిం గనుఁగొను కాంక్ష నరుదెంచు చుండుదురు. విశ్వమయుండగు భగవంతుండు నగు శంభుం డొక్కటి యయ్యు నేకాదశాత్మకత్వంబు వెలయ బ్రహ్మబ్రహ్మర్షిపరివృతుం డయి యన్నివాసంబున వసియించియుండు నాగోత్రోత్తమం బన్యదుర్గంబు గాన నదృష్టప్రాప్యం బయ్యె దానిం గడచి పోవ సర్వభూతంబులు నసమర్థంబుల యట్లగుటం జేసి. ౩౬౦

క॥ ఆవల నరసి మఱల నౌ, నావల నరుగంగఁ బోలఁ ♦ దది భాస్కర తే
జోవిరతను మర్యాదం, బేవెరవున నిట్టిఁ డనుచు ♦ నెఱుఁగం జనమిన్. ౩౬౧

తే॥ అన్న నా తెల్పినవియు మీ ♦ రరయఁగలిగి
నవియు నెంచి విచారించి ♦ యనువుఁ గాంచి
యవనిజావృత్త మెమ్మెయి ♦ నైన గడువు
కడచనకమున్నె యెఱిఁగించి ♦ కనుఁడు ఘనత. ౩౬౨

వ॥ అని శతవలికి నతనితోడివారికిం దెలిపి పయనం బనుపుపఱిచి తమకుం బాలువడిన దెసలకుం జన నుత్సహించుచున్న యమ్మేటిమగల నెల్లరం గలయం గనుంగొని.

—♦ సుగ్రీవుఁ డందఱకు నాన సేయుట. ♦—

శా॥ ఆయుష్మంతులు మీరు మాకు హితు లు ♦ ద్యత్కీర్తు లిప్పట్టునన్
సాయంబై వ్యవసాయము న్నెఱ సము ♦ త్సాహంబు సంధిల్లవే
వే యవ్వార్త లెఱుంగఁ జేయఁ గనుఁడా ♦ వేయేల యమ్మేలునన్
శ్రీయం బందఁగ రాని దందికొన నౌ ♦ జితౌన్యఖ్యవారిధిస్థితిన్. ౩౬౪

క॥ గర్వంబున మసలఁగ నై, యుర్వీసుత వార్తఁ దెలుప ♦ నోప కొదుఁగు న
య్యర్వాచీనులు దండ్యులు, సర్వము మీకెఱుకపఱచు ♦ సరళి నొడివితిన్. ౩౬౫

సీ॥ ఇది సర్వభూతంబు ♦ లెనసి సేవింప నౌ, పరవస్తు విద్దానఁ ♦ బరఁగు ధర్మ
మెఱిఁగి భావించిన ♦ నెల్లలోకంబులు, సంతుష్టిఁ గాంచును ♦ స్వర్గు లెలమి
మెచ్చి సన్మానింతురి ♦ మే లొడ్ల కొనరించు, వారి జీవితము భ ♦ వ్యం బనంగ
మన కుపకారి యై ♦ మనుచు నియ్యోడయునిఁ, గొలిచిన నింకిటఁ ♦ గొఱఁత లున్నె

త్వరపడుఁడు శ్రీయ మొనఁగూడు ♦ తఱి ఘటిల్లె
నన్ను ఋణముక్తుఁ జేయుఁడు ♦ నాదు చనవు
వడయుఁడు నిజప్రభావము ♦ ల్వెలనుపడఁగ
జనకసుతవార్తఁ గొని తేరఁ ♦ జాలి కపులు. ౩౬౬

క॥ పయనము శుభ మగు మీమీ, నయమును బౌరుషముఁ జెల్లు♦నాకసములుఁ దో
డయి ప్రోత్తురు సత్కీర్తి నె, నయంగలరు పొందు కూర్మి♦నా దెస నెగడన్.

క॥ అని సుగ్రీవుఁడు శాసిం, చిన సుబ్బున నెల్లవారుఁ♦జెలఁగుచు మే ల్మే
లని రేకగ్రీవముగా, వనితామణి వారి మేల్మి♦వశమే పొగడన్. ౩౧౯

సీ॥ సీత నిప్పుడె కాంచు♦సిరిగాంతు మనువార, లసుర బీర మదెంత♦య నెడువారు
నే నెక్కటియ చాల♦నే వాని కనువారు, భూమి వ్రచ్చు దలంపుఁ♦బూనువారు
నింగి గెంటుద మంచు♦నెఱియఁ జూచెడువారుఁ, దరులు గిరు ల్గూల్పఁ♦దరలువారు
తొలుదొల్త నబ్ధిఁ బూ♦డ్తుమ కాక యనువారు, నా లంకఁ గాల్పంగ♦న నెడువారు
క్ష్వేళ లొనరించువారు హా♦సించువారు, గుప్పిగంతులు వైవ మే♦కొ నెడువారు
యోజనాయతదూరమీ♦యోజఁగడతు, మని యెగయఁబోవువారు నై♦రి గజవాసు.

క॥ సుగ్రీవుఁడు వాఁ డని నెఱికిం, ద క్కెడువాఁ డనియు నట్టి♦తరుచరవరులం
దొక్కఁడు నేనియు మందున, కక్కడ నెమకంగఁ దోఁప♦డబలామణిరో! ౩౨౦

ఆ॥ వెల్లివిరిసె నిట్టి ♦ వెరవున నరుసంపు, సందడిమనఁగఁ దనరఁ ♦ జాలి వనచ
రాలి యోలిఁ దర లె♦మేలి యోలిమి సిరిఁ, గ్రోలి సౌరయువతి♦పాలివినుత!

క॥ శ్రీలకుఁ దానక మానం, దాలయ మఘుహారి హారి ♦ హారిచరితంబా
వేల నతివేలరుచులకుఁ, బాలై యుప్పొంగెఁ బ్రథిత ♦ భావరసజ్ఞా! ౩౨౧

ఆ॥ అనుచు విభుఁడు పలుక♦నంగనామణియు ను, ప్పొంగి దేవ దేవ!♦పోల్పఁ గలదె
యొండు నీదు నుడికి♦నుద్యోగ మామీఁద, నెట్లు చెల్లెఁ దెలుపు♦మొలమి ననిన.

ఉ॥ అంగదముఖ్యభూషణస ♦ మంచితవేషవిశేషచిత్ప్రభా
వాంగణలోకభాసనవి ♦ భాసురసంవిదితానుభావ! స
ర్వాంగలసత్ప్రచారనయ ♦ హాపితదుర్వ్యవసాయమత్తతా
సంగతభక్తమాఢ్యగుణ ♦ శాలిమహాభ్యుదయప్రబోధనా! ౩౨౪

క॥ ఆప్తవచఃప్రామాణ్యా, వాప్తిదృఢీకరణనిపుణ ♦ హారివిభావ
ర్యాప్తస్వదర్శనాఖ్యా, ప్రాప్తవ్యా! సంప్రణీత ♦ పరమైశ్వర్యా! ౩౨౫

పృథ్వీ॥ చరాచరరమాగవే ♦ షణవిధానసంపేషణ
త్వరాయితజనేక్షణో ♦ ద్వహనపాండితీమండితా!
చిరంతననిజాశ్రియ ♦ స్థిరకలాసముల్లాసత
త్పరావరపరావర ♦ త్వమహితాత్మతత్త్వాంచితా! ౩౧౬

గద్య॥ ఇది శ్రీమదుమామహేశ్వరచరణనలిననిత్య సేవాసమాసాదితానవద్య కవితా యోగహృద్యమహితాత్రేయగోత్రపవిత్రహనుమత్సుధీతనయ విదితనయ లక్ష్మ్యంబా గర్భశుక్తిముక్తాఫలాయమాన వేంకటప్ప కవీంద్రాభిధాన ప్రణీతంబైన శ్రీరామ కథామృతంబను మహాప్రబంధంబునం గిష్కింధాకాండంబునఁ ద్వితీయాశ్వాసము.

శ్రీ శివాయగురవే నమః

# శ్రీరామకథామృతము

## కిష్కింధాకాండము.

---o---

### తృతీయాశ్వాసము.

---o---



సంపాదననిపుణక
లాసముచితదృగ్విశేష ♦ లాలితయోగ
వ్యాసంగపరాయణజన
తాసన్నిధికరణలక్షి ♦ తా ! పరమాత్మా. ౧

తే॥ అవధరింపుము చలిమిట్ట ♦ యనుఁగుఁబట్టి
యమ్మెయిని వేఁడ నిట్లనె ♦ నభవుఁ డలరి
వెలఁది విను మట్టు లాహరి ♦ విభుఁడు సకల
కపులఁ దరలించి హనుమ నె ♦ క్కటిఁ దలంచి. ౨

క॥ అతఁ డర్థసాధనంబున, నుతికెక్కినవాఁ డగుటయు ♦ నూత్నోల్లాస
స్థితిఁ దనరుటయుం గని తన, మతిఁ దలపోసికొని నగరి ♦ మంబుగఁ బలికెఁ. 3

—♦ సుగ్రీవుఁడు హనుమంతుని బ్రత్యేకముగా స్తుతిపూర్వకముగ నియమించుట. ♦—

సీ॥ ఈరేడుజగముల♦నెనసిన వారల, యలవు లీ వరయని♦యవియ కావు
దేశకాలానువృ♦త్తి వినీతిఁ బొండితి, వరశక్తి నినుఁ బోలు♦వారు లేరు
జవమున నెగడు లా♦ఘవమున విక్రాంతి, సీతండ్రి మారుతు♦నెఱికిఁ గలవు
మన్నున మిన్నున♦మున్నీటనేనియు, గతినిరోధం బొందు♦గలుగఁబోదు

పుత్రికన్నను శుశ్రూష ♦ వు కడు ననుచు
ననుచు రవి తన తేజు నీ ♦ యందు యునిచె
నెట్లు దేర్చెదొ నన్ను నీ ♦ యినకులీను
సీత వార్త యెఱింగించి ♦ సిరి ఘటించి. ౪

క॥ అసము గొను మయ్య యది కై, వస మగు నీ కెందునేని♦వర్ధిష్ణుకలా
భ్యసన మసీదృశము మఱి, పరిసారమున నసదృశుఁడవు♦పవమానసుతా. ౫

—♦ శ్రీరాముఁడు హనుమంతునకు ముద్రిక నొసంగుట. ♦—

క॥ అను నెడ రాముఁడు తనమది, ననూదితం బైన యంత♦లయ్యానతనయుం
డనువుపడ నేర్చి నొడువుట, కనుమోదితుఁ డై వినిశ్చి♦తార్థుం డగుచున్. ౬

క॥ హనుమనిఁ గని మునుపటిక, న్నను మనమునఁ జనవుఁ బెనిచి♦ననిచినకూర్మిం
బెనఁగొని మొనకొను నుడి ని, ట్లనె నదె కద వాని భాగ్య♦మగరాజసుతా! ౭

తే॥ అన్న! నీయందె నాయాశ ♦ యధిపుఁ డక్లై
తలఁచెఁ దానునుఁ గాన నీ ♦ తలనె నిలిచె
సీతఁ గనుఁగొని యవ్వార్తఁ ♦ జేర్చి మమ్ముఁ
బ్రాభవమ్ము భరింప నా ♦ పనిభరమ్ము. ౮

ఆ॥ నిన్నుఁ దొలుతఁ గన్న ♦ నెఱి స్మరించి త్వదీయ
మగు పరిభావ మెంచి ♦ యచలభావ
కలన నిచట నిలిచి ♦ కాంక్షింతు నీరాక
నీవ నేర్తు కార్య ♦ నిర్ణయంబు. ౯

క॥ అని మఱియు నేఁ గృతార్థుఁడ, నని యానెఱపోరిడ నిజప♦దాంకిత మై శ్రీఁ
దనరారు నంగుళీయక, మనుపద మాతని కొసంగి♦యనె నిట్లు సఖీ! ౧౦

తే॥ ఈయభిజ్ఞాన మొసఁగితి♦వేని నిన్ను, నావలనివాఁడ వని నమ్మి♦నయ మెఱింగి
యొండు దలఁపక భాషించు♦నుత్పలాక్షి!, వత్సలత్వంబు తనుపార♦వనచరేంద్ర!

తే॥ నీకు శుభ మగు నేవేళ ♦ నెగడు మన్న!
యనుచు మఱికొన్ని బోధించి ♦ యరుగు మన్న
నమ్మహాముద్రిక గ్రహించి ♦ యవధరించి
కనులఁ దత్పాదకమలయు ♦ గ్మము గదించి. ౧౨

చ॥ అరుసముపాలవెల్లి నిల ♦ నై వల నైన పరిస త్తి నమ్మహా
పురుషుని యానతిం గొని వ్రి ♦ ఫుల్లముఖాబ్జుఁడు నాఁడు వాహినీ

వరహారిమధ్యభాగమున ♦ వాఁడు ప్రకాశిలె ఋక్షమండలీ
పరిగతుఁడైన చంద్రుగతి ♦ భావిఫలోదయలక్ష్మితోత్తముఁడై. ౧౩

క॥ గర్జిల్లుచు ధృతిమెయిఁ జనె, నిర్జితపరిపంథి యయ్యె♦నిలజుఁ డగస్త్యో
పార్జిత మగు కడ గుఱియిడి, నిర్జరరిపు నలఁప వీర♦నివహాన్వితుఁడై. ౧౪

క॥ తక్కిన దెసలకు నమ్మెయి, నుక్కుతునుక లరిగి రెల్ల♦యుర్వరఁ దారై
తక్కఁగొనిరి ముల్లోకము, లొక్కటఁ దెరలింపఁ జాలి♦యుర్విధ్రసుతా! ౧౫

క॥ అంద అరుగ నానందము, కందము శ్రీరాముఁ డెలమిఁ♦గని యెట్లు సఖా
పొందఁ గలిగె భూమండల, మందుఁ గలుగు చోటు లెల్ల♦నగు వివరింపన్. ౧౬

తే॥ అనిన సుగ్రీవుఁ డిట్లనె ♦ నన్న! నాఁటి
వైరమున నన్న తఱుమంగ ♦ వలను దప్పి
వలను లన్నియుఁ దిరుగంగ ♦ వలసె దానఁ
దీర్ఘయాత్రావిశేషసు ♦ స్థితి ఘటిల్లె. ౧౭

క॥ పడరాని పాటు లటు పా, ల్పడినం దేశాటనంబె♦పర్యవసిత మై
పుడమిఁ గల చోటు లెల్లం, బడిబడి కాన్పింపఁ జేసె♦ఫల మదె కాఁగన్. ౧౮

తే॥ నాల్గు దిక్కులఁ గలుగు వ ♦ నముల గములు
పుణ్యభూములు నగములు ♦ పూజ్యమాన
నదనదీసాగరసరోఘ ♦ నప్రపాత
ములును నాచూడ కున్నవి ♦ మొవయ వెందు. ౧౯

క॥ ఒక్కొకదెస కాతఁడు కై, పెక్కి తఱుముచుండఁ గంటి♦నేండ్లుం బూండ్లుం
దక్కఁగొనుచు జగమెల్లం, జక్కఁగ నాచక్రవాళ♦శైలము గాఁగన్. ౨౦

వ॥ అదియునుఁ బంచాశత్కోటియోజనవిస్తీర్ణం బగు భూమండలంబు నెల్ల నలాత
చక్రంబున యంతవట్టు తెఱంగు కాన్పింపఁ జుట్టునుఁ జుట్టి యున్నయది. ౨౧

శా॥ ఎందుం జూచిన నేన మై తిరుగుచో ♦ నేం డ్లెన్నియో పోవ నా
కుం దెల్పెం బవమానసూతి ధృతికిం ♦ గోల్పోక యిం కేటికిన్
మం దొక్కండు ఘటిల్లె మానినుడి ని ♦ మ్మాతంగభూమ్యద్రి ల
మ్మందుం డెన్నఁడుఁ ద్రొక్కఁ డిందు నివసిం ♦ పంబోలు నం చాదృతిన్. ౨౨

క॥ అప్పలుకున మేలిమి గని, యప్పర్వతగుహ వసింప♦నయ్యెను దమ కా
తెప్పరమునఁ గనఁ గాంచితి, నిప్పృథివిం గలుగు చోటు♦లెల్ల రఘువరా! ౨౩

క॥ మేలయ్యెను గడఁగి త్వదీ, యాలంబన మొదవినంత♦ననుపమ మది కా
దా లయకాలుఁడె కనె నీ, చే లయ మొకరుండు నిన్నుఁ♦జెనయంగలఁడే. ౨౪

క॥ అని మేలము కైవడి నిజ, మనువాదించుచు గుణోది♦తాన్యోన్యసమృ
ద్ధిని మెచ్చుకొనుచు ముదమున, దినకులుఁ డినజుండు నుండి♦ రేణాంకముఖీ! ౨౭

—♦ పూర్వపశ్చిమోత్తరదిక్కుల కేగిన కపివీరులు తిరిగి సుగ్రీవుం జేరుట. ♦—

శా॥ ఆశంస ల్దగ నట్టు లేగిన ప్లవం ♦ గాధీశు లుద్దేశము
ల్ప్రాశస్త్యంబున మించ దేవిఁ గనఁగాఁ ♦ బ్రాప్తించు నేనాఁటి కం
చా శాచక్రము లందఁ గాంచి రధివ ♦ న్యాభూమిభృత్కందరా
దేశప్రాజ్యసరస్సరిత్సరిదిన ♦ ద్వీపాంతసంలక్షులై. ౨౮

ఆ॥ ఎల్ల పవళు లెల్ల♦యెడల సంశోధింప, నరిగి నట్టివార♦లంద యొకట
రేలఁ జేరఁ గాంచి♦మే లొం డరసికొంచు, వేఁగుఁబోకఁ గడఁగి♦వెడలుచుండ్రి.

తే॥ ఫలము లేవేళ నిడఁగల♦పాదపములు, గలుగుచోటులఁ దేసియా♦లోలయు నెడల
నధివసింతురు నిశల న♦ట్లధిశయించి, యలము నధ్వపరిశ్రమ♦మపనయింతురు.

ఉ॥ ఇమ్మెయి మూఁడుదిక్కులకు ♦ నేగిన వారు వితస్తిమాత్ర పూ
నిమ్మను వీడ కెల్లఁ గని ♦ యేలిక యిడ్డ దురంత మంతరం
బమ్మిగిఁ బాఱనీక తతి ♦ యయ్యె నటంచు నిరీక్షసేయు క
న్దమ్ములవారి నాదొరలఁ ♦ దద్దయుఁ గాంచి నమస్కరించిరన్. ౨౯

క॥ ఏమేమి వార్త లని రఘు, రామునితో నెలమితోడ♦రవిజుం డడుగన్
సామంతు లమ్మహాకపు, లీమెయిఁ బలుకంగఁ దొడరి♦రిభరాడ్గమనా! ౩౦

తే॥ త్రొక్కిచూడనిచో టని ♦ తొలుత లేదు
భావమున కంద కెదియునా ♦ పైనిఁ బోదు
కానకే కంటి మొంజెడ ♦ త్మజ లేమి
యద్దెసనె యామె యునికియు ♦ నరసి యరసి. ౩౧

క॥ ఏయెడ కాయమఁ గొనిచనె, నాయసురుఁడు లంక దక్షి♦ణాశనె యుంటన్
వాయుసుతముఖ్యు లటఁజని, రాయె నదృష్టంబు వారి♦దను మేల్మి గనన్. ౩౨

ఆ॥ హనుమ యొకఁడె యసుర ♦ నడపనేనియుఁ జాలు
నెఱియుఁ గర్జమునను ♦ నెఱపనోపు
నింక సంశయింప ♦ నేల వానిది జయ
లక్ష్మి నేర్చి కూర్చు ♦ లాలనంబు. ౩౩

క॥ మే లగు నని వా రన హరి, పాలకుఁ డయ్యర్థమున నె♦పరఁగు హితోక్తుల్
జాలుకొన నెఱికిఁ బొల్పడు, నాలలి రాము నెలయించె♦నగకులభూపా! ౩౪

—♦ హనుమదాదులు దక్షిణపు దిక్కున సీతను వెదకుట. ♦—

తే॥ అంతఁ దారాంగదులతోడ ♦ నట్లు వెడలి
కడమ కపివీరు లమ్మెయిఁ ♦ గదిసిరాఁగ
హనుమఁడు చరించె దా దక్షి ♦ ణాశయందు
నరుణకిరణస్ఫురణపూర్తి ♦ యనువుపడఁగ. ౩౫

క॥ వింజమునకుఁ దొలుతం జని, యంజెడు నొం డనక తిరిగి♦రగచరు లాభూ
మిం జెనయు గుహాగహనని, కుంజమ్ములు బీరువోవఁ♦గూడ దటంచున్. ౩౬

క॥ ఫలమూలసముపలబ్ధికి, నలరుచుఁ బతిశాసనమున♦కలుకుచు సీతా
జలజాక్షి జాడ నరయుచుఁ, గలికి! దా రెనసి రొండు♦కాననభూమిన్. ౩౭

సీ॥ లే వెందు ఫలసుమా ♦ ళీలోలమృదులీల, పతగాళిరుచిరము ♦ ల్పాదపములు
కానరా వెచట సు ♦ ఖస్వైరసంచార, మేదురసారము ♦ ల్మృగగణములు
చూడఁ జొప్పడవ యె ♦ చ్చోఁ బవనాధూత, నవమంజరీసమా ♦ నతలు లతలు
పొడసూప వేయెడ ♦ ఫుల్లాబ్జకాసార, హంసావళీరిరం ♦ సారవములు
ముక్కుపచ్చ లారని తన♦ముద్దు పట్టి, యెడ సె నని కుందుపడుఁడు ము♦నీశ్వరుండు
తిట్టి నట్టులై యైన యా♦చెట్ట పొలము, కోనఁ జొరసిరి కపివరు♦లుక్క వలయాక్షి!

క॥ నీ రసియేని నొకం డా, హారం బని యేని లేని ♦ యానిర్భాగ్యం
బౌ రిత్త కానఁ గడచి మ, హారణ్యములందుఁ జొచ్చి ♦ యరసిరి తరుణీ. ౩౯

క॥ తడవు తడవి యటఁజని వా, రడవులు గిరిగుహలు పొదలు ♦ న ల్లెనయుచు నే
యెడనేని జనకనందిని, యడపొడఁగనఁ జాల రై ర ♦ గాత్మజ! వింటే. ౪౦

చ॥ బడలిక యింత దోచినను ♦ బ ట్టెడలం జనకుంట వారలొం
డెడఁ జని కాంచి రొక్క గుహ ♦ నిత్థుఁ బలాశనుఁ గ్రూరకర్ము నే
ర్పడ గిరిఁ బోలు వాఁ డడరి ♦ పాల్పడినా రెటఁబోదు రంచు రాఁ
గెడపెఁ దలాభిఘాతమునఁ ♦ గీశవిభుండు తదంగసంగతిన్. ౪౧

తే॥ అంగదునిచేత నాతఁ డ ♦ ట్టడుపు గాంచి
నోట నెత్తురువాఁక రా ♦ గీటడఁగినఁ
దత్ప్రదేశంబు లన్నియుఁ ♦ దడవి వెదకి
యొండు గుహ సొచ్చి రటు సము ♦ ద్దండు లగుచు. ౪౨

తే॥ అదియు బరికించి వేసారి ♦ యచటు వాసి
యొక మహావృక్షమూలంబు ♦ నొలసి సొలసి

యున్నవారలఁ గని యుత్తమో ♦ త్తముండు
బలికె యువరాజు సముచిత ♦ భాషితముల.

—♦ అంగదుఁడు కపివీరులకు నీతి బోధించుట ♦—

చ॥ తిరిగితి మెల్ల దేశములుఁ♦దీ రొకయింతయుఁ గానరాదు తె
ప్పరము హరీంద్రు నాజ్ఞ గుణ ♦ భద్రుఁడు రాముఁ భజింపఁ బోవు న
త్తెరు నరయంగఁ బోలు నది ♦ తేఁకువ పొల్పడకున్నఁ జెల్ల ది
గ్గిరి గుహలంద పోకడఁ జెఁ ♦ గీర్తిత మా తతి యెల్లఁ బొల్లుగన్. ౪౪

తే॥ సౌమనస్యంబు దాక్ష్యంబు♦సంతసంబు, తాలిమియు లేక కర్జంబు♦తఱియరాదు
కాదు కా దన మే లెందుఁ♦గలుగఁబోదు, తీవరంబు ఘటించు సు♦స్థితికి వాదు.

క॥ అలఁత యన నలసతయు నన, నలజడిఁ బడుఁగాని పార ♦ మందంగనఁ జే
వలనునఁ గృతి మేకొనె నా, యెలమిన తీ, ర్పనయకున్న ♦ నిటు నటుఁ జేఁడడే.

ఆ॥ కాదు కంటి మన్న ♦ గహన మిప్పాల నెల్ల
మఱలఁ గాంచి యొందు ♦ మలఁచువలయు
నరసి తెలుపుఁ డనిన ♦ నల్లన నిట్లనె
మత మెఱింగి గంద ♦ మాదనుండు. ౪౬

తే॥ పిన్నదొర తెల్పినది మేలి ♦ పెద్దమాట
తరణిసుతుఁ డన్నచో నెల్ల ♦ భరమునాక
యరయువలయు లెం డు సుఖుల ♦ కాససేయఁ
గీర్తి పొల్పడఁబోవ దీ ♦ కీలు గనుఁడు. ౪౭

మ॥ అనిన న్మే లని యాతనిం బొగడి య ♦ య్యర్థంబు గై కొంచు వే
చని వింధ్యాద్రి యపాక్ప్రతీచికల వం ♦ చ ల్గాంచికొంచు న్మహా
వనము ల్ప్రస్రవణంబులున్ గుహ లగ ♦ ప్రస్థంబులుం గాంచి కా
ననిచో టం చనరామి వీడి యెదుట ♦ న్గన్పట్టు నప్పట్టునన్. ౪౯

ఆ॥ కొమరు మీఱు వెండి ♦ కొండ యొక్కఁడు కోద్రి
వనము సప్తపర్ణ ♦ వనము మున్ను
కలుగు నవియు నెల్ల ♦ గాలించి యాలించు
దిక్కు లేమి నెదిరి ♦ దిక్కు గదిసి. ౫౦

తే॥ తిరిగి వచ్చుచు బడలిక ♦ దీర్చుకొనుచు
నొండొరుల వెత లారసి ♦ యుదిలపడుచుఁ

గపివిభుం డిడ్డ కాలంబుఁ ♦ గడుప నైరి
కాని వింధ్యాద్రిఁ దుదిముట్టఁ ♦ గాన రైరి. ౫౧

క॥ ఆదెస కెల్ల నదియకా, నాదియు నంతంబు దోఁప♦కటు దెల్లాడం
గా దానవశిల్పికృతికిఁ, బ్రోఁది యయిన ఋక్షబిలము♦పొల మగపడియెన్. ౫౨

ఉ॥ అచ్చోటు వారు గన్గొని తృ ♦ షార్దితు లై కడు డస్సి యుంట వే
చొచ్చి లతావృతం బగుచుఁ ♦ జొప్పడకుండియుఁ జొప్ప లేర్పడన్
మెచ్చగు నగ్గుహాముఖము ♦ మెల్లనఁ జేరి కలంకపాటుతో
నిచ్చ తలంక ని ట్లనుచు ♦ నెంచిరి బాలకురంగలోచనా! ౫౩

మ॥ ఇది పాతాళమునా దురాసదము దు ♦ ర్వీక్షంబు నై యప్రవే
శదశం దుర్మదు మానసంబునకు ల ♦ క్ష్యం బయ్యెడున్ దీన నా
నది యేరక్కసియో పిశాచగణమో ♦ వ్యాలౌఘమో యింత దోఁ
పదు కా దంచుఁ జొరంగ నేది యెటు లా ♦ పైఁ బొల్పడం జాలునో. ౫౪

మ॥ అని శంకాకులితాత్ములై తెరలు నా ♦ హార్యప్లుతహార్యక్షులం
గని శంస ల్గనినారు కారె యిటు ప ♦ ల్కం బోలునే మీకు మీ
రనిశం బొడ్లను మేత్తురే భయము డా ♦ యంజూచునే మిమ్ము వా
రని శమ్మే కొనఁగోరుఁ డింక నెదల ♦ న్రామస్వనామస్మృతిన్. ౫౫

క॥ చొచ్చెదమకాక యొం డెది, వచ్చిన వ్రిచ్చెదమకాక ♦ వల నరయక యి
ట్లిచ్చట నిలుతుమె యాదట, మెచ్చఁగ నేరం డె విధి స ♦ మీహిత మసదే.

సీ॥ ఒక్కింత బడలిక♦యొదవె నేనియు నది, యోరంతప్రొద్దుఁ దా♦నుండఁగలదె
నేపళంబునకల్మి♦నెగడుచున్నవి చూడుఁ, డిచ్చోటునం గల♦యెల్లమ్రాఁకు
లల్లవె హంసాదు♦లరుగుదెంచెడు సార్ద్రి, పక్షము ల్బిసముఖ♦భాసితములు
ముప్పోకలం బోవ♦మొనకొనియెడు గుహా, సొచ్చి వెల్వడు గాడ్పు♦సురభిళత్వ
మిం దోకఁడు మేలి వాపిక♦యేని నమృత. సారసంగత మైన కా♦సారమేనిఁ
గలిగియుండక తీరదు♦కాన లోని, కేగి యెల్ల విచారింత♦మేకమతిని. ౫౬

ఆ॥ అనుచు బోధసేయు♦హనుమని నుడుల మే, లరసి చొచ్చి రాగు♦హాంతరంబు
హరివరేణ్యు లది మ♦హాతిమిరం బచంద్రార్క మప్రతర్క్య♦మగుచు నుండ.

తే॥ త్రోఁచికొనిపోవు ప్లవగుల ♦ యాఁచికొనెడు
ధూర్తతకు సింహశరభశా ♦ ర్దూలములును

దలఁగి చనెఁ బ్రాణహానికిఁ ♦ దలఁకి యనిన
నెందుఁ జొరలేరు వారు రా ♦ కేందువదన! ౫౯

తే॥ అంధకారంబు కన్నుల♦నలమి రోమ, హర్షణంబొదవింప భ♦యంబు చాయఁ
బొక యొండొరులకు వీఁక♦బొసఁగఁ జేయఁ, జాలి పరువిడి రవ్వారు♦సారసాక్షి!

ఆ॥ తమ్మి క్షుధయుఁ దృషయుఁ ♦ దవిలి వేఁపఁగ నైన
నధిపు నాన వెనుచు ♦ నాన యొకఁడె
కన్ను కాలు వాయు ♦ గతి తేజు బీరమ్ము
ననువు పలుప వార ♦ లరిగి రబల! ౬౦

క॥ తీవఁ గాని తివిచినట్టులు, భావాకర్షణ మొనర్చుఁ♦బట్టెడల దిఁకే
త్రోవఁ జననీదు జనతఁ, దైవము తనమతము నెఱయఁ♦దరుణీమణిరో! ౬౨

క॥ యోజన మమ్మెయి జవమున, యోజనఁ గడవంగఁ గాంచి ♦ రుత్తము లన వా
రే జీవితాశ యను నది, యాజతనం దనరకునికి ♦ నధిరాజపదా! ౬౩

ఉ॥ అంతకుఁ జాలదా జనక ♦ జాధిపుఁ గూర్చిన మేలిభక్తి య
త్యంతసమృద్ధి యింక నగు ♦ నంచు వచించుచుఁ దోఁచె నాగుహా
భ్యంతరదేశముం బెరయు ♦ నయ్యెడ నొక్క ప్రకాశ మొయ్యనన్
ధ్వాంతము వోవఁ దన్మతులు ♦ భ్రాంతతకుం జన వీఁదలంపఁగన్. ౬౪

ఉ॥ కాంచిరి వార లందు మణి ♦ కాంచనసంచిత మౌ వనంబు స్వ
భ్యంచిత మౌ పురంబు మహి ♦ తాంబుజినీనివహాంబు డంబు రో
మాంచితగాత్రులైరి నయ ♦ నాంచలము ల్వికసించె మించె నా
చంచలభావవృత్తియు వి ♦ చారము దోఁచెయుచు నెమ్మనంబునన్. ౬౫

తే॥ అచటి లేఁదలిరులు పస ♦ రాకు లాకు
జొంపములు పూలుఁ బండ్లును ♦ జోద్యముగను
నమ్మెయిని రతనాలె స్కం ♦ ధాదికములు
హోఁతబంగరుపని మెచ్చు ♦ పుట్టు గనులె. ౬౬

తే॥ హాటకాత్మకములు నయ్యు♦నాటలాడు, మహితమృగపక్షిగణములు♦మాన్యలీల
లబ్బురముతోడి మెలఁకువ♦నరుస మెదల, వారి కొదవించె సంఫుల్ల♦వారిజాక్షి!

సీ॥ ఇవిమాఁకు లని యెంచి♦యెటు గాంచిన సువర్ణ, శాఖాప్రతానసం♦స్థానఘృణులె
యివి తీవె లని సుంత♦యెనయఁ జూచినయంత, వైద్యుతద్యుతిలతా♦వైభవములె

యిప పండ్లె యనుచుఁ బో♦యెదురఁబో రసపూర్ణ, హేమకుంభీజృంభి♦తేష్టరుచులె
యివి పూవు లని డాయ♦నెలయుచోఁ దచ్ఛాయ, సౌరకాననసార♦సౌరభములె

ఇవ్వి తేనెసోన ♦ లే యని దఱియంగ
నమృతసింధుయుగస ♦ మాగమములె
యివియుఁ బుష్పాదుల ర ♦ హించు తిన్నె లటంచుఁ
జూడఁ గనకగిరుల ♦ వేడబములె. ౧౮

తే॥ హేమవైడూర్యగారుత్మ ♦ తేంద్రనీల, పద్మరాగోపకల్పిత ♦ ల్పద్మినులును
దాదృశోజ్జ్వలజలజంతు♦తతులు హంస, లచటి సరసుల సారస్య♦మనువచించు.

సీ॥ సురుచిరపుణ్యారా♦సులె కాక సురలరా, నెఱయింప మేడలు♦నేర్చి యున్నె
తపమున సిరి మట్టు♦తారాక్షణ గా కిట్టు, లష్టాంగపదయోగ♦మనువుపడునె
యైశ్వర్యమున కల్మి♦యలరించు నెఱి మేల్మి, గాక సర్వాతీత♦కళ లమరునె
యాత్మసిద్ధివికాస♦మని గాక యొకభాస, మానందవిస్ఫూర్తి♦యై తనరునె

యనుచుఁ జూపఱు లగ్గింప ♦ నగుచు నగుచు
ముప్పాలమ్ముల నగరుల ♦ మురిపెములను
ననుచు నచ్చోటు గాంచి మే ♦ లనిరి ఱిచ్చ
పడిరి పెరసిరి వనచరు ♦ ల్భావలలిత! ౨౦

క॥ ఒకమణిమందిర మనుపమ, మకలంకముఁ గాంచి చేర♦నరిగిరి వారల్
ప్రకటం బయ్యెను స్వక మగు, సుకృతం బిమ్మెయి నటంచు♦సూనృతమూర్తీ!

తే॥ వేదికలు చాంది నీలు ని ♦ వేశనములు, గోపురద్వారకక్ష్యలు ♦ కూటకోటు
లందముననేని వెలనేని♦నందరాక, వైజయంతంబునం బోలె♦వఱలుచుండె. ౨౨

చ॥ అచటఁ దనర్పు మేలి శయ ♦ నాసనయానము లట్టు లుండ శ్రీ
రుచిరశుచిత్వరస్యరస ♦ రూఢము లౌ ఫలభక్ష్యభోజ్యపా
నచయవిశేషము ల్మహిత ♦ నందనచందనముఖ్యపాదపో
పచయమిళత్పరీమళవి ♦ పాకములుం దము ముంచి తేల్పఁగన్. ౨౩

ఆ॥ దఱియఁ జొచ్చి వారు ♦ తాపసీమణి నొక్క, దివ్యమూర్తిఁ గాంచి♦తేజరిల్లు
తెఱవు నెంచి వెరపు♦వెఱపునఁ దెరలంగ, నిట్టనిలువఁ బడిరి♦నీరజాక్షి! ౨౪

క॥ వారలఁ గని యాయోగిని, వారక యిటరాఁ దలంచు♦వల నెటు మీ రె
వ్వారు వనుప నేపని కే, నేరిమి మొనకొంటి రనుడు♦నెరి లే దనుడున్. ౨౫